# ఆంధ్రప్రబంధము

## అవతరణ వికాసములు

ఆచార్య కాకర్ల వెంకటరామనరసింహం, ఎం.ఏ., పిహెచ్.డి.




1965

ఆంధ్ర యూనివర్సిటీ ప్రెస్

వాల్తేరు

# ఆంధ్రప్రబంధము
# అవతరణ వికాసములు



ఆచార్య కాకర్ల వెంకటరామనరసింహం, ఎం. ఏ., పిహెచ్. డి.



1965

ఆంధ్ర యూనివర్సిటీ ప్రెస్
వాల్తేరు

౭. దిగన్త విశ్రాన్త విశాల కీర్తే
ర్విపశ్చితో విశ్వకవేర్మహర్షేః
ఆశీర్బలం రక్షతు సర్వదా త్వాం
మనీషిణం కావ్యకలా ప్రవీణమ్.

౮. తిరస్కృతా దుర్జన దుర్విదగ్ధైః
మృతేతి గీర్వాణ సరస్వతీ యా
యుష్మత్కరాలమ్బన సంప్రహృష్టా
వాగ్దేవతా తుష్యతు సానవద్యా.

౯. స్వాతన్త్ర్య సంపాదన బద్ధ దీక్షం
దీక్షా సమాసాదిత శుభ్ర కీర్తిమ్
కీర్తిప్రభా పూరిత దిగ్విభాగం
శ్రేయాంసి వృణ్వన్తు నిరన్తరం త్వామ్.

—ఇతి రచయితా

# కృతజ్ఞత

నా పరిశోధన వ్యాసంగమునకు పర్యవేక్షణ వహించి, పరిశోధనకు వలయు సాధనసంపత్తి నేఁటివలె సమృద్ధిగాలేని యానాఁడు (1941—44) తమ ప్రతిభాప్రాభవముతోఁ జేయూఁతనిచ్చి, తెలుఁగులో మొట్టమొదటి పి హెచ్. డి. పట్టము పొందఁజేసిన అస్మద్గురువర్యులు ఆచార్య శ్రీ పింగళి లక్ష్మీకాంతముగారికి . . .

ఇరువది సంవత్సరములక్రితము రచింపఁబడి, యింతవఱకు ముద్రణావకాశము లేకుండనున్న నా పరిశోధన గ్రంథమునకు ఈనాఁడు తదవకాశము కలిగించి, మ్రోడువారిన హృదయమున వేయివసంతములు విరియఁజేసిన, ఆంధ్రవిశ్వకళాపరిషదుపాధ్యక్షులు డాక్టర్ ఏ. యల్. నారాయణగారికి...

అడిగిన వెంటనే కృతి స్వీకృతిని దయతో అంగీకరించిన విద్వన్నేతృమణులు డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారికి . . .

ముద్రణకు ఆర్థికసౌకర్యము చేకూర్చిన విశ్వవిద్యాలయనిధి ప్రదాన సంఘమునకు . . .

సత్వరముగ ముద్రణ సదుపాయము ఘటించిన ఆంధ్రవిశ్వకళాపరిషన్ముద్రాలయ పర్యవేక్షకులు, మన్మిత్రులు శ్రీ బి. ముత్తుస్వామిగారికి . . .

సమగ్రసుందరముగ ముద్రణవిధానము సంతరించిన తన్ముద్రాలయోద్యోగి శ్రీ యమ్. ఆర్. బి. నరసింహారావుకు, తదితరులకు . . .

ముద్రణపరిశీలనమున శ్రద్ధాసక్తులతో సహకరించిన శిష్యసహవ్రతుఁడు శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తికి . . .

# విషయ సూచిక


| | | పుట |
|---|---|---|
| 1. | ఉపోద్ఘాతము | ix |
| 2. | ప్రబంధ నిర్వచనము | 3 |
| 3. | భారతాదులయందలి ప్రబంధచ్ఛాయలు | 14 |
| 4. | శ్రీనాథయుగము — తల్లక్షణములు | 20 |
| 5. | శ్రీనాథయుగము — సందిగ్ధ ప్రబంధములు | 23 |
| 6. | ప్రబంధములు — పాత్ర చిత్రణము | 34 |
| 7. | ప్రబంధములు — వర్ణనలు | 78 |
| 8. | ప్రబంధములు — రసము | 94 |
| 9. | కథాకల్పనము | 112 |
| 10. | ప్రబంధ శైలి | 120 |
| 11. | ప్రబంధకవులు — చారిత్రక విషయములు | 126 |
| 12. | రాయల దిగ్విజయములు | 145 |
| 13. | ఆముక్తమాల్యదా కర్తృత్వము | 156 |
| 14. | స్వారోచిషమనుసంభవము — అల్లసాని పెద్దన | 163 |
| 15. | నంది తిమ్మన — పారిజాతాపహరణము | 168 |
| 16. | పారిజాతాపహరణ రచనాకాలము | 171 |
| 17. | మాదయగారి మల్లన — రాజశేఖర చరిత్రము | 179 |
| 18. | ధూర్జటి | 187 |
| 19. | అయ్యలరాజు రామభద్రకవి | 194 |
| 20. | తెనాలి రామకృష్ణకవి | 198 |

పుట

21. పింగళి సూరన 205
22. రామరాజభూషణుఁడు 209
23. కందుకూరి రుద్రయ 216
24. చింతలపూడి ఎల్లనార్యుఁడు (రాధామాధవకవి) 217
25. సంకుసాల నృసింహకవి 219
26. సారంగు తమ్మయ 221
27. ఎడపాటి ఎఱ్ఱన 223
28. తఱిగొండ ధర్మన 224
29. ఉదాహృత గ్రంథములు 227

# ఉపోద్ఘాతము

ప్రబంధమొక ప్రక్రియాభేదము. మనుచరిత్ర, వసుచరిత్ర మొదలైన గ్రంథములు ప్రబంధములని ప్రసిద్ధిఁ గాంచియున్నవి. ఆంధ్ర వాఙ్మయ నిర్మాతలలోఁ గొందఱు ప్రబంధయుగమని వేఱుగా నొక యుగ విభాగమును గావించియున్నారు. ప్రాచీనాలంకారికులు, తెనుఁగు కవులు, లాక్షణికులు మాత్రము ప్రబంధ శబ్దమును సర్వ గ్రంథ సామాన్యవాచిగానే ప్రయోగించియున్నారు. ఆంధ్ర గ్రంథములను సమగ్రముగాఁ బరిశీలించినచోఁ బురాణ ధోరణి, ప్రబంధ ధోరణి వేఱుగాఁ గనిపించును. ప్రబంధములనఁబడిన గ్రంథములలో నేకనాయకాశ్రయత్వముతోపాటు వస్త్వైక్యము, నపరిహార్యముగ నుండును. అంతేకాదు. అవి పురాణాంతర్గతాఖ్యానములను నిమిత్త మాత్రములుగా గ్రహించి, యా యస్థిపంజరములను మాంసలములుగ, సర్వావయవ సుందరములుగఁ జేసిన స్వతంత్ర చిత్రములు. వర్ణనా బాహుళ్యము, శృంగార రస ప్రాధాన్యము, ఆలంకారికశైలి వీనియందు విశేషము. ఈ లక్షణములు కొన్ని ప్రబంధములయందుఁ గానరాకున్నను యుగ ప్రాధాన్యమునుబట్టి, రచనా ధోరణిఁ బట్టియు నవియుఁ బ్రబంధములే యగుచున్నవి.

ప్రబంధావతరణము హఠాత్సంభూతముకాదు. భారత రచనయందుఁ గూడ నీ ప్రబంధచ్ఛాయలు గానవచ్చుచున్నవి. భారతమున వ్యక్తావ్యక్తముగను, ఎఱ్ఱనలో నంకురముగను, సోమునిలో మొలకఁగను బొడసూపిన ప్రబంధలత శ్రీనాథుని కాలమునఁ గొనలు సాగి చిగిర్చి మాఱాకు వైచినది. అది శ్రీకృష్ణదేవరాయల కాలమున పుష్పఫల సమన్వితమైనది. శ్రీనాథుని యుగమునకుఁ బూర్వముకూడ నన్నెచోడుని కుమార సంభవమువంటి కొన్ని గ్రంథములు ప్రబంధలక్షణములు పెక్కింటిని గలిగియున్నవి. కాని యట్టివి బహు విరళప్రచారమును గలిగినవై యున్నవి. వస్తు విస్తృతిని బట్టియు నవి ప్రబంధ లక్ష్యమునకు దూరములగుచున్నవి.

తెనుఁగు ప్రబంధము గద్య పద్య కథన సంవాద వర్ణనాది వివిధ ప్రక్రియల నేకత్ర రాశీభూతముగఁ జేసిన సంపూర్ణమూర్తి.

మహాకవి ప్రతిభకుఁ గల ముఖ్యలక్షణములలో నొకటి పాత్ర నిర్మాణ కౌశలము. సజీవపాత్ర నిర్మాణ కౌశలము సామాన్య కవులందఱకును నందుబాటులో నుండునది కాదు. ఇది ప్రబంధ కవులందఱకును గలదని చెప్పఁజాలము. పెద్దనార్యుని మనుచరిత్రమున వరూధినీ ప్రవరులు, తిమ్మన పారిజాతాపహరణమున సత్యభామ, ధూర్జటి కాళహస్తి మహాత్మ్యమున తిన్నఁడు,

తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యమున నిగమశర్మయక్క, పింగళి సూరన కళాపూర్ణోదయమున కలభాషిణీ మణికంధరులు, సుగాత్రీ శాలీనులు, సుముఖాసత్తి మణిస్తంభులు, ప్రభావతీ ప్రద్యుమ్నమున శుచిముఖి, శ్రీకృష్ణదేవ రాయల ఆముక్తమాల్యదలో మాలదాసరి, చింతలపూడి ఎల్లనార్యుని రాధా మాధవమున రాధ, ఎడపాటి ఎఱ్ఱన శృంగారమల్హణ చరిత్రమున ధనదత్తుఁడు, శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమున చంద్రమతీ హరిశ్చంద్రులు, కాలకౌశికుఁడు, చేమకూర వేంకటకవి విజయవిలాసమున ఉలూచి, సుభద్ర—సజీవ పాత్రలు. వీనిలో నెంతయో తరతమ భేదముకలదు. ప్రబంధకవుల ప్రత్యేకత పాత్రనిర్మాణ నైపుణియందే కాననగును.

ప్రబంధ కవితకు వర్ణన లొక ముఖ్యాంగము. తుదకీ వర్ణనలే మితిమీరి ప్రబంధ రచనకొక కళంకము నాపాదించినవి. కాని రాయల కాలమున వెలసిన ప్రబంధములుమాత్రము యథోచిత వర్ణనా విలసితములై యున్నవనవచ్చును. మనుచరిత్రాది మహా ప్రబంధములయందుఁ గల వర్ణనలు కథాగతికి సాహాయ్యకము లగుచున్నవి. అత్యల్పమైన యితివృత్తమును బెంచి వసుచరిత్రవంటి ప్రౌఢ ప్రబంధము వ్రాసిన రామరాజభూషణుని వర్ణనా ప్రతిభకు లోక మచ్చెరువు నందినది. మహాకవి ధూర్జటియుఁదన కాళహస్తి మాహాత్మ్యమున యథోచితములు, హృద్యములునగు వర్ణనలఁ జేసియున్నాఁడు. తెనాలి రామకృష్ణుఁడు అతి మనోహరములగు ప్రకృతి వర్ణనములఁ జేసినాఁడు. అవియుఁ గథాగతితోఁ బొందికపొసఁగి యున్నవి. వర్ణనా విషయమున ముక్కుతిమ్మన యింకొక నూతన మార్గమును ద్రొక్కినాఁడు. ప్రబంధ కవులలోఁ గేవల వర్ణనా ప్రియులగు కవులును గలరు. అట్టివారిలో నంకుసాల నృసింహకవి యొక్కఁడు. ఆతని కవికర్ణరసాయనమునందు మనోజ్ఞములగు వర్ణన లనేకములు కలవు. వర్ణ నౌచిత్యమునకు, వర్ణనా సార్థక్యమునకు పింగళి సూరనార్యునిఁజెప్పి మఱి యొక యాంధ్రకవిని బేర్కొనవలయును. ఈతఁడు ప్రార్థనలకై చేయు వర్ణనల యందుఁగూడఁ గథాగతిని సూచించుచునేయుండును. క్షీణయుగమందలి యే కొలఁదిమంది కవులో తప్పఁ దక్కిన యాంధ్ర ప్రబంధకర్తలందఱు నౌచిత్యమును బాటించియే వర్ణనలఁ గావించియున్నారు.

ఇఁక రసము. మనుచరిత్రమున ప్రవర వరూధినీ ఘట్టమున శృంగార మాభాసరూపమును బొందియున్నది, శాంత శృంగారముల సంఘర్షణమున శాంతమే జయించినది. రసవిషయికమైన చర్చ చేయునపు డుదాహరణముగాఁ గైకొనఁదగిన గ్రంథము వసుచరిత్ర. అది శృంగారరస ప్రధానము. కళాపూర్ణోదయము శృంగారరస ప్రాయమేకాని యందలి శృంగారము విషాదరేఖా శబలితమై యుండును. శృంగార రసాధిదేవత నర్తకివలె బహురూపముల

సూరనకు సాక్షాత్కరించినది. విప్రనారాయణ చరిత్ర, శృంగార మల్హణ చరిత్ర, వైజయంతీ విలాసములయందు మాత్రము కొంత హాస్యరస పోషణము జరిగినది. ప్రబంధకవులకుఁ గరుణరసముపై మనసు పోలేదని చెప్పవచ్చును. ఇందులకపవాదము శంకరకవి, కంకంటి పాపరాజు మాత్రమే.

ప్రబంధములన్నియు నొక్కజాతికిఁ జెందినవి కావు. కొన్ని పౌరాణికములుఁ గొన్ని చారిత్రకములుఁ గొన్ని సాంఘికములుఁ గొన్ని కల్పితములునై యున్నవి. మను వసు చరిత్రాదులు పౌరాణికములు. కుమార ధూర్జటి వ్రాసిన కృష్ణరాయవిజయము, అందుగుల వెంకయ్య రామరాజీయము, దిట్టకవి నారాయణకవి రంగరాయచరిత్ర మొదలైనవి చారిత్రకములు. కందుకూరి రుద్రయ వ్రాసిన నిరంకుశోపాఖ్యానము సాంఘిక ప్రబంధము. కళాపూర్ణోదయము కల్పిత ప్రబంధమనవచ్చును.

ప్రబంధములకొక ప్రత్యేక శైలి కలదు. ఆంధ్ర వాఙ్మయమున తొలి నుండి శైలి విషయమున రెండు మార్గములు చూపట్టుచున్నవి. ఒకటి శయ్యా సౌభాగ్యముతోఁ గూడినది. రెండవది భావగాంభీర్యము ప్రధానమైనది. ఇందు మొదటిదానికి నన్నయ, రెండవదానికి తిక్కన ఆచార్యులు. శయ్యాసౌభాగ్యమునకై పాటుపడిన యాంధ్రకవులలోఁ బ్రబంధకవులు ముఖ్యులు. ఈ విషయమున వారికి సర్వజ్ఞుఁడగు నాచనసోమనాథుఁడును, గవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడును మార్గదర్శకులు. శ్రీనాథునివలెనే పెద్దనయుఁ బ్రౌఢసమాసప్రియుఁడు. అట్లయ్యు నచ్చటచ్చటఁ బ్రసాదగుణమును బోషించి యున్నాఁడు. ప్రబంధ కవులకు సంవాదాత్మకమైన శైలిని జూపినవాఁడు పెద్దనయే ప్రబంధశైలి రామరాజభూషణుని కవితయందుఁ బరమావధి నందినది. వచన రచనయందుఁ బ్రబంధ కవులందఱును శబ్దాలంకార ప్రౌఢిమను జూపియున్నారు. ప్రబంధ కవులందఱును శయ్యా విషయమునఁ గడు నిపుణులే యనవచ్చును.

ప్రబంధ రచనమే ప్రముఖమైన కాలము ప్రబంధయుగము. ప్రబంధ రచనకు దోహద మొసఁగుటయేగాక స్వయముగ నొక మహా ప్రబంధమును రచించిన విజయనగరాధీశ్వరుఁడు, సాహితీ సమరాంగణ సార్వభౌముఁడు, శ్రీకృష్ణదేవరాయలు యుగకర్త. శ్రీకృష్ణదేవరాయ లాంధ్రుఁడా? కర్ణాటుఁడా? యనునదొక సమస్య. కృష్ణదేవరాయలు తుళుజాతికి సంబంధించిన వాఁడగును. మఱొకవిధముగ రాయలాంధ్రుఁడే యని చెప్పవచ్చును. రాయలతల్లి నాగమాంబ భోగకాంతయను నొక కింవదంతి కలదు. కాని నాగలాంబ, రాయల తండ్రి నరసనాయకుఁ డగ్నిసాక్షిగ వివాహమాడిన భార్యయని శాసనములనుబట్టి స్పష్టమగుచున్నది. రాయల జన్మదిన విషయమునఁగూడ వాదోపవాదములు కలవు. రాయల జన్మకాలము 1487 ప్రాంతమనియే నిర్ణయింపనగును. ఇఁక

శ్రీకృష్ణదేవరాయల కెందఱు భార్యలు? అందు గజపతితనయ యెవరు? అను ప్రశ్నలును వివాదగ్రస్త విషయములే. మనుచరిత్రాముక్తమాల్యదా పారిజాతాపహరణములందలి రాయల దేవేరుల ప్రసక్తులీ ప్రశ్నలకు సమాధానముఁ గోరును. బహు విషయములనుబట్టి రాయలకు — తిరుమలదేవి, చిన్నాదేవి, అన్నపూర్ణ — ముప్వురు భార్యలని చెప్పవచ్చును. ఇందన్నపూర్ణయే ప్రతాపరుద్ర గజపతి పుత్రిక.

ఇఁక రాయల దిగ్విజయములు. ఇంతకంటె బహువాద బంధురములు; ప్రయోజన సహితములును. రాయల రాజ్యస్వీకారమునకుఁ బట్టాభిషేకమునకు మధ్యకాలమున మొదటి రాయచూరు యుద్ధము, పట్టాభిషేకానంతరము ఉమ్మత్తూరు దండయాత్ర, తదనంతరము రెండవ రాయచూరు యుద్ధము జరిగినట్లు చెప్పవచ్చును. ఈ యుద్ధము తరువాత బహమనీసుల్తాను మహమ్మదు ఖాను గుల్‌బర్గ చెఱనుండి విడిపించి బీదరు సింహాసనమున సుప్రతిష్ఠితునిఁజేసి శ్రీకృష్ణదేవరాయలు 'యవన రాజ్యస్థాపనాచార్యుఁ' డయ్యెను. 1514 లో ఉదయగిరి, 1515 లో కొండవీడు జయించెను. కొండవీటి విజయానంతరము రాయ లమరావతికేఁగి తులాపురుషదానము గావించెను. తరువాత శ్రీశైలమున కేఁగెను. ఆ తరువాత బెజవాడకు వచ్చి, యటనుండి కొండపల్లి కేఁగి యా దుర్గమును సాధించెను. అటుపై వరుసగా ననేక దుర్గములు రాయల వశమైనవి. ఆ తరువాత రాయలు రాజమహేంద్రవరమును జయించి అటనుండి సింహాద్రి కేఁగి పొట్నూరికడ విజయస్తంభమును స్థాపించెను. కటక విజయము 1517 వ సంవత్సరాంతమునకు సంపూర్తి యాయెననియు, గజపతికిని రాయలకును సంధి జరిగెననియుఁ జెప్పవచ్చును. 1520 వ సంవత్సరమున మూడవ రాయచూరు యుద్ధము జరిగినది. ఈ దిగ్విజయ వివరములు ప్రబంధ రచనా కాలములకు ప్రాతిపదికలు.

ఆముక్తమాల్యద శ్రీకృష్ణదేవరాయల కృతమేయని పండిత విమర్శకు లనేకు లంగీకరించి యున్నారు. కాని కొందఱు హేత్వాభాసములను జూపి, పెద్దనార్యకృతమని వాదించుచున్నారు. పెక్కు కారణములనుబట్టి యా వాదము నిలువదు. మనుచరిత్రాముక్తమాల్యద లనేక హేతువులనుబట్టి యేక కర్తృకము లగుటయే యసంభవము. ఆముక్తమాల్యద రాయలకృతమే.

పెద్దన జన్మ స్థలమును గూర్చి భిన్నాభిప్రాయములు గలవు. కడప మండలములోని కోకటాగ్రహార సమీప గ్రామమే పెద్దన జన్మస్థలమను వాదము సమంజసమైనది. రాయలతోడి సంబంధము గలిగినది మొదలు పెద్దన జీవితము సర్వదా ధన్యమైనదని చెప్పవచ్చును. రాయల యాస్థానమునందలి యష్టదిగ్గజ ములలో తిమ్మన యొకఁడు. తిమ్మన పారిజాతాపహరణ రచనాకాలము

1516—17 సంవత్సరములకుఁ బూర్వమనియు, పెద్దన మనుచరిత్ర రచనాకాలము 1517—20 సంవత్సరముల మధ్యకాలమనియుఁ జెప్పవచ్చును. ఈ రెండు కృతులును కృష్ణదేవరాయాంకితములే. రాయల యాస్థానకవి యయ్యు మాదయ గారి మల్లన్న రాజశేఖర చరిత్రను తిమ్మరసు మహాప్రధాని యల్లుఁడు, మేనల్లుఁడు నగు నాదెండ్ల అప్పయమంత్రి కంకితమిచ్చెను. రాజశేఖర చరిత్ర రాయల కొండవీటి విజయమునకు పూర్వమే రచింపఁబడెనని చెప్పకతప్పదు. మహాకవి ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యమును శ్రీ కాళహస్తీశ్వరునికే యంకితము గావించెను. ధూర్జటి గ్రంథమునకు స్కాందపురాణమునందలి వైష్ణవఖండమున వేంకటాచల మాహాత్మ్యమను భాగమున ముప్పది మొదలు ముప్పదియైదవ యధ్యాయము వఱకుఁగల కాళహస్తి మాహాత్మ్య కథ — షడధ్యాయ కథయే-- మూలము. అని చెప్పి ఆంధ్రీకరణముకాదు. స్వతంత్రమైన ప్రబంధమే. అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయము గొబ్బూరి నరసరాజున కంకితముఁ గావింపఁబడినది. అది సదాశివ రాయల రాజ్యకాలమున రచింపఁబడినది. ఇఁక తెనాలి రామలింగకవి, రామకృష్ణకవియొకరే. రామలింగఁడుగా రచించిన ఉద్భటారాధ్య చరిత్ర ఊరదేచమంత్రి కంకితము గావింపఁబడినది. దేచమంత్రి రాయల రాజ్యకాలమువాఁడు. వైష్ణవమును స్వీకరించి రామకృష్ణుఁడై రచించినది పాండురంగ మాహాత్మ్యము. దీనిని విరూరి వేదాద్రి మంత్రికిఁ గృతి యిచ్చెను. తరువాత రచించిన ఘటికాచల మాహాత్మ్యమునకు కృత్యాది వ్రాయలేదు. ఆతని మనుమఁడు ఖాండోజీ యను వాని కంకిత మిచ్చెను.

రాయల యాస్థానము నలంకరించిన యష్టదిగ్గజములలో పింగళి సూరన యొకఁడగుట సంశయాస్పదము. ఈతని రాఘవ పాండవీయము దైవాంకితము. ఆ దైవము ఆకువీటి యందలి శ్రీ విరూపాక్షస్వామి. కాని కృతి ప్రేరకుఁడు పెద వేంకటాద్రి విభుఁడు. సూరన రచించిన మహాప్రబంధము కళాపూర్ణో దయము. నంద్యాల ప్రభువగు కృష్ణమరాజునకు గ్రంథ మంకితము చేయఁ బడినది. ప్రభావతీ ప్రద్యుమ్నమును సూరన తండ్రికే యంకితమిచ్చెను. భట్టుమూర్తి అష్టదిగ్గజములలో నొకఁడగుటకూడ నిరవకాశము. మూర్తికవియే రామరాజ భూషణుఁడు. రుద్రకవి రాయల యాస్థానమున నుండెననుటకుఁగూడ సరియైన యాధారములేదు. రాయల యాస్థానమున లేకపోయినను రాయలను మెప్పించి రాధామాధవనామ మందినవాఁడు చింతలపూఁడి ఎల్లనార్యుఁడు. ఈతని రాధామాధవము మదన గోపాలస్వామి కంకితము. తారక బ్రహ్మ రాజీయము రామాంకితము. కృతిప్రేరకుఁడు అచ్యుతరాయల కొలువులోని నంజయ్య తిమ్మరుసు. విష్ణుమాయా నాటకము సీతఁడు వ్రాయలేదని చెప్పుటయే సంభావ్యముగా నున్నది. సంకుసాల నృసింహకవికి రాయల యాస్థానమునఁ

ప్రవేశము కలుగకుండఁ జేసిరను గాథనిజమైనను, గాకున్నను, రాజాస్థాన ప్రవేశ సందర్భమున నీతనికిఁ గొంత నిరాకృతి కలిగియుండునని యూహింపవచ్చును. ఇఁక సారంగు తమ్మయ, ఎడపాటి ఎఱ్ఱన, తఱిగొండ ధర్మన్న రాయల సమకాలికులు మాత్రమే కాఁగలరు.

మొత్తముమీఁద శ్రీకృష్ణదేవరాయల కాలమునందు, తదనంతర కాలమునందు ప్రబంధ ప్రక్రియ వైభవోపేతముగ వర్ధిల్లినది. అర్వాచీన కాలమునందీ ప్రక్రియ కొనసాగినను స్వతంత్రత కొఱవడి భావదాస్యము మితిమీఱినది. క్షీణదక్షిణాంధ్ర యుగములందు అతివేల శబ్దప్రాధాన్యము, అనుచిత శృంగార లౌల్యము పెచ్చుపెఱిఁగి ప్రబంధ గౌరవము సడలినది. ఆధునిక యుగమున మఱలఁ గొంత స్వతంత్రతాగుణము భాసించినది. ఏమైనను రాయల యుగమునందలి ప్రబంధములే సర్వగుణ సంశోభితములై యున్నవని చెప్పవచ్చును.

సంగ్రహముగ ప్రబంధ స్వరూపమిది.

సిరిపురం క్వార్టర్స్
వాల్తేరు
15—6—65

కె. వి. ఆర్. నరసింహం, ఎం.ఏ., పి హెచ్. డి.
ప్రొఫెసర్ & హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్ ఆఫ్ తెలుఁగు
ఆంధ్ర యూనివర్సిటీ

# ప్రబంధ నిర్వచనము

ఆంధ్ర వాఙ్మయమునఁ బ్రబంధశాఖకుఁ బ్రబల ప్రచారముగలదు. ఆంధ్ర లోకము ప్రబంధము నొక విశిష్ట వాఙ్మయ శాఖగా నంగీకరించియున్నది. ఆంధ్ర వాఙ్మయ నిర్మాతలలోఁ గొందఱు 'ప్రబంధ యుగము' అని వేఱుగా నొక యుగ విభాగమును గావించియున్నారు. మను వసు చరిత్రాది గ్రంథములు వాఙ్మయ ప్రపంచమునఁ బ్రబంధములని ప్రసిద్ధి గాంచియున్నవి. ఇట్లాంధ్ర లోకమునకును వాఙ్మయమునకును సుపరిచితమైయున్న యీ ప్రబంధ శబ్దము అర్వాచీనమా ? ప్రాచీనమా ? సంస్కృతాలంకారికు లీ శబ్దమును వాడి యుండిరా ? ఉన్నచో నే యర్థమున వాడియుండిరి ? ఆ యర్థము సర్వా లంకారిక సమ్మతమా ? లేక యందు భిన్నభిన్న మతములు గలవా ? ఉన్నచో నా మతములెన్ని ? ఆంధ్రాలంకారికు లా యర్థమునే గ్రహించిరా ? లేక యన్య మతము నెద్దానినైన నవలంబించియున్నారా ? ఇంతకుఁ దెనుఁగునఁ బ్రబంధ కవు లనఁబడు వారీ యర్థములలో దేనినైన స్వీకరించి గ్రంథములు వ్రాసిరా ? లేక యీ మతములలో నెద్దానిని గ్రహింపక కేవల స్వతంత్ర ప్రక్రియ నవలం బించిరా ? ఇఁకఁ బ్రబంధ మనఁగా నెట్టిది ? నిజముగా నిదియొక విశిష్ట ప్రక్రియయా ? లేక యొక ప్రక్రియాంతర్భాగమా ? అనునిట్టి ప్రశ్నలు పుంఖాను పుంఖముగ బయలుదేఱుచున్నవి. వీనికి సరియగు సమాధానములిచ్చి యాంధ్ర ప్రబంధ స్వరూప స్వభావముల నిర్ణయముఁ గావింపవలయును. మున్ముందు సంస్కృతాలంకారికుల నుపలక్షింతము.

సంస్కృతమున దండ్యాదు లనేకములగు కావ్య భేదములను జూపి యున్నారు. వాని నన్నిటిని సేకరించి ధ్వన్యాలోకకారు డీ విధమున నిరూపించి యున్నాఁడు :

> యతః కావ్యస్య ప్రభేదాః — ముక్తకమ్ సంస్కృత ప్రాకృతాపభ్రంశ నిబద్ధమ్. సందానితక విశేషక కాలాపక కులకానిపర్యాయబన్ధః పరికథా సకలకథా ఖణ్డకథే సర్గబన్ధోఽభినేయార్థ మాఖ్యాయికా కథేత్యేవ మాదయః.

> ముక్తకము — ఇది సంస్కృత నిబద్ధము, ప్రాకృత నిబద్ధము, అపభ్రంశ నిబద్ధము అని మూఁడు విధములుగానున్నది. సందానితకము, విశేష కము, కాలాపకము, కులకము, పర్యాయబంధము, పరికథ, ఖండకథ, సకలకథ, సర్గబంధము, అభినేయార్థము, ఆఖ్యాయిక, కథ మొదలగునవి.

ఈ కావ్య భేదములలో నెచ్చటను ప్రబంధశబ్దిమే కానరాదు. కాని యీతఁడిచ్చిన నిర్వచనములలోమాత్ర మొకటి రెండు మాటలు ప్రబంధ శబ్దము గానవచ్చుచున్నది.

పర్యాయబన్ధః ఖణ్డకావ్య స్వరూపః
సమాప్తాయామప్యవాన్తర క్రియా
యాం వసన్తాద్యేకతమ వర్ణనీయ
వస్తువర్ణనాత్మకః ప్రబన్ధః.

ఆఖ్యాయికా క్వాచిత్కవక్త్రా పరవక్త్రా
దిచ్ఛన్దస్క ఉచ్ఛ్వాసా శ్వాసాభి
దవిభాగ భాగే గద్య ప్రచురః ప్రబన్ధః.

కథా సజ్జన దుర్జన వృత్తాన్త వర్ణన పరః
క్వాచిత్కార్యా వక్త్రా పరవక్త్ర యుక్త ఆశ్వా
సాది శూన్యో గద్యమయః ప్రబన్ధః.

ఇటఁ గావ్యభేదములన్నియుఁ జెప్పఁబడినవి. ఉదాహృత కావ్యభేదములలో నెచ్చటను ప్రబంధ శబ్దోచ్చారణమైనను లేదు. సరికదా పర్యాయబంధమును నాఖ్యాయికను గథనుగూడఁ బ్రబంధ నామముననే పేర్కొనియున్నాఁడు. వస్తు భేదమువలన నా మూఁడిటిని ప్రత్యేక కావ్య భేదములుగా నంగీకరించి వానిని ప్రబంధములని యేక నామమునఁ బేర్కొని యుండుటచే నీ ప్రబంధ శబ్దము సర్వగ్రంథ సామాన్యవాచియా యను సందేహము కలుగుచున్నది. ఇఁక నీ ప్రబంధ శబ్దము సంస్కృతాలంకారికులచే నెచ్చటెచ్చట నే యే యర్థములలో వాడఁబడియున్నదో యించుక గమనింతము—

సాహిత్య దర్పణకారుఁడు :

> నను తర్హి ప్రబన్ధాన్తర్వర్తినాం కేషాంచిన్నీరసానాం పద్యానాం కావ్యత్వం నస్యాదితిచేన్న. రసవత్పర్యాన్తరత నీరసపదానామివ పద్య రసేన, ప్రబన్ధరసేనైవ తేషాం రసవత్తాఙ్గీకారాత్. —సా. ద. ప్ర. ప. పుట 20.
>
> ప్రబంధములయందలి కొన్ని నీరసములగు పద్యములకుఁ గావ్యత్వము లేదనినచో నది సరికాదు. రసవత్పద్యాంతర్గత నీరస పదములకుఁ బద్యరసమువలెనే, ప్రబంధ రసమువలననే వాని (ఆ నీరస పద్యముల) రసవత్త యంగీకరింపఁబడినది.

ఇందు విశ్వనాథుఁడుఁ గావ్య ప్రబంధశబ్దములను సమానార్థకములుగా వాడియున్నాఁడు. కావ్యత్వము లేదనుట సరికాదని చెప్పుచు నది ప్రబంధ రసముచేతనే సిద్ధించుచున్నదనుటవలనఁ ప్రబంధ కావ్యముల కొక్కచే

యర్థమును భావించి యున్నాఁడనుట నిశ్చయము. ఈతఁడే యితిహాసమగు భారతమును, మహాకావ్యమగు రామాయణమునుగూడఁ బ్రబంధములని వ్యవహరించియున్నాఁడు. శ్రవ్యములగు వీనినేగాక దృశ్యములగు మాలతీమాధవ రత్నావల్యాదులనుగూడఁ బ్రబంధ నామముననే వ్యవహరించియున్నాఁడు.

కరుణరసస్య దుఃఖహేతుత్వే కరుణరస ప్రధాన రామాయణాది ప్రబన్ధానామపి దుఃఖహేతుతా ప్రసజ్జస్స్యాత్.

వర్ణరచనయో రుదాహరిష్యతే – ప్రబన్ధేయథా – మహాభారతే శాన్తః, రామాయణే కరుణః, మాలతీమాధవ రత్నావల్యాదౌ శృఙ్గారః, ఏవమన్యత్ర. —పుట 238.

ఇట్లే యభిజ్ఞాన శాకుంతలమునకు వ్యాఖ్య వ్రాయుచు శ్రీనివాసాచార్యులు కాళిదాస నామా మహాకవిః నాటకా న్తమ్ కవిత్వ మితిధియా నాటకరూప ప్రబన్ధం నిర్మిత్సుః

అని బాహాటముగా నాటకమును బ్రబంధముగాఁ బరిగణించియున్నాఁడు.

ఇట్లే జయదేవుఁడు తన ప్రసన్న రాఘవమునందు

నాట్యప్రబన్ధ మతి మఞ్జుల సంవిధానమ్

అని నాటకమును ప్రబంధముగాఁ వ్యవహరించియున్నాఁడు. ఇట్లు దృశ్య శ్రవ్య కావ్యములను బ్రబంధములనుటయేగాక కొందఱాలంకారికులు తమ యలంకార గ్రంథములనుగూడఁ బ్రబంధములనియే నుడివియున్నారు. చూ.

శ్రీ చన్ద్రశేఖర మహాకవి చన్ద్రసూను
శ్శ్రీ విశ్వనాథ కవిరాజకృతం ప్రబన్ధమ్
సాహిత్య దర్పణ మముం సుధియో విలోక్య
సాహిత్య తత్త్వ మఖిలం సుఖమేవవిత్త.

—విశ్వనాథ కవిరాజు, సా. ద.

ప్రతాపరుద్ర దేవస్య
కీర్తిమాశ్రిత్య నిర్మితః,
అలఙ్కార ప్రబన్ధోఽయం
సన్తః కర్ణోత్సవోఽస్తు వః. —ప్రతాపరుద్రీయము.

ఇఁక రాజశేఖరుఁడును దన కావ్యమీమాంసయందుఁ బ్రబంధ శబ్దము నెన్నియోసార్లు వాడియున్నాఁడు. కావ్యము ముక్తక ప్రబంధ భేదమున రెండు విధములని రాజశేఖరుని యభిప్రాయము :

సపునర్ద్వివిధా – ముక్తక ప్రబన్ధ విషయత్వేన.

—చూ. కా. మీ. నవమాధ్యాయము.

బరోడా గ్రంథమాలలోఁ బ్రకటితమైన కావ్యమీమాంసయందు సంపాదకు లీ విషయమున నొక విపులవ్యాఖ్య వ్రాసియున్నారు.

For the sub-divisions of Kavya, see Dhvanyaloka (ధ్వన్యాలోకములోని కావ్యభేదములు ముందే యుదాహరింపఁబడినవి). Ancient writers on Alankaras such as Bhamaha and Vamana divide Kavyas into two either as అనిబద్ధ (Anibaddha) and నిబద్ధ (Nibaddha) or as ముక్తక (Muktaka) and ప్రబన్ధ (Prabandha) respectively. See Bhamaha 1–18 and Vamana 1-3-27. Dandin however mentions several kinds of Kavyas as Muktaka etc., but he does not attempt to define them as those do not possess any appreciable difference from the Sargabandha. See Kayvadarsa 1–13. The Anibaddha or Muktaka is only illustrated by Bhamaha thus :

అనిబద్ధం పునర్గాథా శ్లోకమాత్రాది తత్పునః. —1–30.

Abhinavagupta, in his commentary on Dhvani (3–7), however gives a definition of Muktaka thus in the following words :

ముక్తకమన్యేన నాలిఙ్గితమ్
తస్య సంజ్ఞాయాఙ్కనే తేన స్వతన్త్రతయా,
పరిసమాప్త నిరాకాఙ్క్షార్థమపి ప్రబన్ధ
మధ్యవర్తి ముక్తక మిత్యుచ్యతే.

The same idea is also expressed by Rajasekhara when he says

ముక్తకేతి వృత్తశ్శుద్ధః.

ఈ పై నుదాహరింపఁబడినవానినిబట్టి ముక్తక మనగా ననిబద్ధ కావ్యమనియుఁ బ్రబంధ మనగా నిబద్ధ కావ్యమనియుఁ బ్రాచీనాలంకారికుల యభిప్రాయ మని యూహింపవచ్చును. భామహుఁడు, వామనుఁడు, రాజశేఖరుఁడు మొదలగు ప్రసిద్ధ లాక్షణికులందఱు నీ మతమునే యంగీకరించియున్నారు. కావున ముక్తక మను కావ్యభేదము తప్పఁ దక్కిన దృశ్య శ్రవ్య కావ్యములన్నియుఁ బ్రాచీనాలంకారిక మతమునఁ బ్రబంధములే.

తెనుఁగు లాక్షణికులును బ్రబంధములనియుఁ జాటు ప్రబంధములనియు నిరుతెఱగుల కావ్యభేదములను నిరూపించియున్నారు. చూడుఁడు :
అప్పకవీయము—పద్య. 27, 29, 30 :

అట్టి కావ్యంబు ద్వివిధమై యతిశయిల్లుఁ
బరువడిఁ బ్రబంధ చాటు ప్రబంధములన
సర్గముల సంస్కృతమున నాశ్వాసములను
దెనుఁగునఁ బ్రబంధమనునది తనరుఁగృష్ణ!

కనుఁగొన సంఖ్యాబద్ధం
బున సంఖ్యాకంబు నాఁగ భువి నిరుదెఱఁగై
తనరారుఁ బూర్వ కవిమత
మున నా చాటు ప్రబంధములు జలజాక్షా!

నాల్గిదెగల యుదాహరణములు ముక్త
కాది పంచదశమును సంఖ్యాన్వితములు
గద్య రగడ ద్విపద దండకములు మంజ
రులును సంఖ్యారహిత చాటువులు నృసింహ!

ఇట్లే ముక్తకాదులును జాటువులని విన్నకోట పెద్దనయును జెప్పినాఁడు.

ఇటువలె ముక్తకాది
స్ఫుటతర చాటు ప్రబంధముల లక్షణముల్
పటుమతి నెఱుఁగుట సుయశో
ఘటనంబులకెల్లఁ గుదురు కవినృపతులకున్.

—కావ్యా. చూ. చతుర్థోల్లాసము.

తెనుఁగు కవులును లాక్షణికులును జెప్పిన యీ చాటు ప్రబంధములే
న సంస్కృతాలంకారికులచే నిరూపింపఁబడిన ముక్తకాదులు.

ఇఁక ముక్తకమనఁగా ననిబద్ధ కావ్యమనియు, బ్రబంధమనఁగా నిబద్ధ
మనియుఁ జెప్పఁబడియున్నదికదా! అయినచో ననిబద్ధకావ్య మనఁగా
? నిబద్ధకావ్య మనఁగానేమి?

ఇందలి మొదటి ప్రశ్నకు సమాధానముగా నాలంకారికు లీ క్రిందివిధమున
ఏంచియున్నారు:

ముక్తకమన్య పద్యాసంబద్ధం
స్వాతన్త్ర్యేణార్థ బోధన క్షమమేవముక్తకమ్. —ధ్వన్యాలోకము.
ముక్తకం శ్లోక ఏవైక శ్చమత్కార క్షమస్సతామ్. —అగ్నిపురాణము.

పూర్వోత్తర పద్యముల సంబంధము నపేక్షింపక స్వతంత్రముగా నొక
మును జూప సామర్థ్యముగలది ముక్తకమని మీదివాని తాత్పర్యము.
కమను నామమువలననే యీ యర్థము స్ఫురించుచున్నది. అనిబద్ధ ముక్తక

పదములు సమానార్థకములేయని చెప్పవచ్చును. నిబద్ధ కావ్యము దీనికిఁ గేవలము వ్యతిరిక్తముగా నుండుననియుఁ జెప్పనగును. పూసలలో దారమువలె నిబద్ధ కావ్యమునందలి సకల పద్యములకు సంబంధముఁ గలిగించు నితివృత్త మొకటి యుండును. ఇందుఁ బూర్వాపూర్వ పద్యము లుత్తరోత్తర పద్యములకుఁ దోవఁ జూపుచుండును. దీనినే యాలంకారికులు సంధిసామగ్రియని యందురు. ఈ సంధిసామగ్రికాని, యితివృత్తముగాని ముక్తకమున నుండుట కవకాశము లేదు.

ఇఁక నీ ప్రబంధ శబ్దమును దెనుఁగు కవులు వాడిన విధము—

1. తిక్కన సోమయాజి :

అనిరచనా కౌతుకమున
మనమలరఁగ నీ ప్రబంధ మండలి కధినా
థునిగా నే పురుషుని జే
ర్కొనువాఁడనొ యను తలంపుగూరిన మదితోన్.

వ॥ అని పూని యీ దృశంబులగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించుటయు నొక్క యారాధన విశేషంబగుటంజేసి.

—వి. ప. 1–31.

2. కేతన :

తత్ప్రబంధ ముఖ మండనంబుగా నమ్మహాత్ము వంశావతారంబు వర్ణించెద. —దశకుమారచరిత్ర.

3. ఎఱ్ఱాప్రెగడ :

అని యమ్మహీనాయకుఁ గృతినాయకత్వంబున కభిముఖంబుగా నొనర్చి జగదర్చితంబగు ప్రబంధంబు నిర్మింప నుపక్రమించితి.

—హరివంశము.

శ్రీ నృసింహావతారంబను పురాణంబుఁ దెనుంగుబాసఁ బ్రకటింపవలయు నమ్మహాప్రబంధంబునకు. —నృసింహ పురాణము.

4. మంచన :

.... .... .... కర్ణసౌ
ఖ్యావహమై ప్రబంధ రచనాశ్రయ మయ్యెడు మార్గమూతగన్.

—కేయూరబాహు చరిత్ర.

5. క్రీడాభిరామము :

గణనకెక్కిన దశరూపకములయందు
వివిధ రసభావభావన వీథిలెస్స
ఏ కవీంద్రుఁడు రచియించె నీ ప్రబంధ
మనుచు మీరానతిచ్చెదరయిన వినుఁడు.

6. శ్రీనాథుఁడు :

నవరస భావానుబంధ బంధురంబుగా నొక్క ప్రబంధంబు నిర్మింపఁ దలఁచి. —శృంగార నైషధము.

నాకుఁ గృపసేయు మొక ప్రబంధంబు నీవు
కవిత గుణగణ్య ! శ్రీనాథ కవివరేణ్య ! —భీమేశ్వర పురాణము.

బాల సఖుఁడవు శైవ ప్రబంధ మొకటి
యవధరింపుము నా పేర నంకితముగ. —హరవిలాసము.

7. నందిమల్లన, ఘంటసింగయ :

వ॥ అని నాయక ప్రశంసయు మధ్యమాధమోత్తమ కవిత్వంబుల తారతమ్యంబులు నభివర్ణించి యుత్తమమార్గంబుననే తత్ప్రబంధంబు రచియింప నుద్యుక్తులమై. —వరాహ పురాణము.

8. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు :

అని ప్రబంధంబుఁ జెప్ప నుద్యోగించు సమయంబున.
—జైమిని భారతము.

కథ ప్రసిద్ధము మిగుల శృంగారవతియుఁ
బరిగణింపంగ శ్రీ మహాభారతమునఁ
గథితమైన శకుంతలాఖ్యాన భంగి
నది ప్రబంధంబుఁ జేయు ప్రఖ్యాతినంద. —శృంగార శాకుంతలము.

ఇట్లుదాహరణము లెన్నియేని జూపవచ్చును. కాని ప్రస్తుతాంశమును సమర్థింప నింతకు మిక్కిలి యనావశ్యకము. తిక్కనార్యుఁడు తాను రచించిన పదునేను పర్వముల భారతమును ప్రబంధమండలియనియే పేర్కొనినాఁడు. ఎఱ్ఱాప్రెగడ పురాణమగు హరివంశమునుగూడఁ బ్రబంధమనియే వ్యవహరించెను. శ్రీనాథుఁడు తన గ్రంథముల నన్నిటిని బ్రబంధములనుటయేకాక వీథియగు క్రీడాభిరామముగూడఁ బ్రబంధమని చెప్పుచు

యతిగూడన్ ద్విపద ప్రబంధమున వీరానీకముంబాడె

అని పలనాటివీరుల చరిత్రమునుగూడఁ బ్రబంధనామముననే వ్యవహరించెను. పినవీరనయుఁ దన గ్రంథములను బ్రబంధములనియే వ్యవహరించెను. కావున శతకములు మొదలగు ననిబద్ధ కావ్యములు తక్క తక్కిన యాంధ్ర గ్రంథము లన్నియుఁ బ్రబంధములే యనవచ్చును. ఆంధ్ర గ్రంథములే యననేల? సంస్కృతాంధ్రములందు రచింపఁబడిన శ్రవ్య దృశ్య కావ్యములును నలంకార గ్రంథములును బ్రబంధములే యనుటలో విప్రతిపత్తిలేదు.

ఇఁకఁ దెనుఁగు లాక్షణికు లీప్రబంధ శబ్దమునుగూర్చి యేమి వచియించిరో యించుక పరిశీలింతము—

తెనుఁగు లాక్షణికులలో బహుగ్రంథ పరిశోధకుఁడని పేర్వడసిన యప్పకవి కావ్యభేదముల నుదాహరించుచు

రస సుప్రశస్తిచేఁ బొసఁగును బద్యంబు
పద్యరాశినిగూర్పఁబడును గావ్య
మట్టి కావ్యంబు ద్వివిధమై యతిశయిల్లుఁ
బరువడిఁ బ్రబంధ చాటు ప్రబంధములన
సర్గముల సంస్కృతమున నాశ్వాసములను
దెనుఁగునఁ బ్రబంధ మనునది తనరుఁ గృష్ణ!

అప్పకవి యిందుఁ బ్రబంధము లనియుఁ జాటు ప్రబంధము లనియు రెండు తెగల కావ్యములను వచించినాఁడు. ఇందుఁ బ్రబంధ మనఁగా సంస్కృతమున దండ్యాదులచేఁ జెప్పఁబడిన సర్గబంధమేయనుట కీక్రింద నాతఁడిచ్చిన ప్రబంధ లక్షణములు తార్కాణము:

పురమును ఋతుషట్కమును బ్రయాణంబును
    శైలంబు వేటయు సాగరంబు
మౌనీంద్ర పుణ్యాశ్రమంబును మంత్రంబు
    ద్యూతంబు పిదప నద్భుతరణంబు
విజయంబు మద్యపానజ వికారంబును
    వనవిహారంబును వారికేళి
కన్యాంగ సౌందర్య కథనంబు హిమకరా
    భ్యుదయంబు విప్రలంభోదితంబు
పద్మ మిత్రోదయంబును బరిణయంబు
సురతమును దౌహృదంబును సుతజననము
ననఁగ 'నిరువదిరెండు' వర్ణనలుగూర్చి
చెప్పవలయుఁ బ్రబంధంబు శ్రీనివాస!

విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణియందుఁ గావ్యమును సష్టాదశ వర్ణనాత్మకముగా నిరూపించినాఁడు :

అట్లు కవికృతమైన కావ్యత్రయంబు
గద్య పద్య విమిశ్ర సంపాద్యమండ్రు
నగర ముఖ్యాష్ట దశవర్ణనముల చేతఁ
బరగు నదియును భవ్య ప్రబంధ మనఁగ.

పుర వారాశి మహీధరర్తు శశిభృత్పూషోద యోద్యాన పు
ష్కర కేళీ మధుపాన మోహన వియోగ క్షేమయాన స్వయం
వర పుత్రోత్సవ మంత్ర ద్యూత రణదోర్వైక్రాంతి సంకీర్తనా
కర మష్టాదశ వర్ణనాత్మకము తత్కావ్యంబు భవ్యంబిలన్.

—కా. చూ. తృతీయోల్లాసము, 91, 92.

నరసభూపాలీయకారుఁడును నష్టాదశ వర్ణనలనే చెప్పియున్నాఁడు.

ఇంకఁ గావ్య ప్రభేదంబు లేర్పరింతు
పరుస నష్టాదశ విశిష్ట వర్ణనములు
గలుగపలయు మహాకావ్య తిలకమునకు
నెలమిఁ దన్నామధేయంబు లెట్టివనిన.

పురసింధు నగర్త్వివన శశి
సరసీవన మధురతి ప్రసంగ వరహముల్
పరిణయ తనయోదయ నయ
విరచన యాత్రాజి దౌత్య విభువర్ణనముల్.

ఇందునొక కొన్ని కడమైన నెంచిచూడ
నదియు నవని మహాకావ్య మనఁగఁ బరఁగు
మఱియు క్షుద్ర ప్రబంధ నిర్మాణ మర్మ
లక్షణము లేర్పరించెద లలిత ఫణితి. —నర.భూ.ద్వి.ఆ.ప. 165—167.

తెనుఁగు లాక్షణికుల యభిప్రాయములం దేమియు విశిష్టత లేదనియు నివి కేవల సంస్కృతానుకారులనియు నీ లక్షణములఁ జదివినవారికిఁ దెలియకపోదు.

ఇట్లు ప్రబంధ పదము భారతాది సర్వగ్రంథ వాచకమయ్యు నిటీవల నొక ప్రత్యేక కావ్య భేదముగా నాంధ్రులచేఁ బరిగణింపఁ బడుచున్నది. మఱియుఁ దెనుఁగువారిలోఁ జాలమందికిఁ బ్రబంధ మనఁగా నాంధ్రగ్రంథమనియే యభిప్రాయము. శ్రీనాథకృత శృంగార నైషధమును బ్రబంధమని వ్యవహరించుచు దానికే మూలమగు శ్రీహర్షుని నైషధమును గావ్యమనియే యందురు. ఇట్టి వ్యవహారము తెలుఁగువారిలో నెట్లు రూఢమైనదో చెప్పఁజాలము.

ఆంధ్ర గ్రంథములను సమగ్రముగాఁ బరిశీలించినచో నొక విశేషము కానుపించును. ఆంధ్ర కవులలోఁ గొందఱు కథాకథనమునందే దృష్టిని నిల్పిరి. కొందఱు కథాకథనముకంటె కవితాశిల్పమునే విశేషముగా నాదరించిరి. కథాకథనమునందు దృష్టిని నిల్పి వ్రాసిన వ్రాఁతను బురాణధోరణి యనియుఁ గవితా శిల్పమునందు దృష్టిని నిల్పి వ్రాసిన వ్రాఁతను బ్రబంధధోరణి యనియు స్థూలముగా వ్యపదేశింపవచ్చును. స్థూలముగా ననఁగాఁ బురాణధోరణియందుఁ గవితాశిల్పము లేదనికాని ప్రబంధధోరణియందుఁ గథాకథనదృష్టి లేదనికాని యభిప్రాయ పడరాదని భావము. ఈ గుణము లొండొంటి నాశ్రయించియే తఱచు వాఙ్మయమునఁ గాన్పించును. ఈ ప్రబంధధోరణి నధికముగా నాశ్రయించినవారు ప్రబంధ కవులనియుఁ బురాణధోరణి నధికముగా నాశ్రయించినవారు పురాణ కవులనియు స్థూలనిర్దేశము.

ప్రబంధ గుణము లేవి ?

ప్రబంధ లక్షణములను సాకల్యముగ నిరూపించిన యాంధ్ర లాక్షణికు లరుదని చెప్పవచ్చును. ఇఁకఁ బ్రబంధ లక్షణములఁ దెలిసికొనవలయునన్నచోఁ బ్రబంధ నామమున వెలువడిన గ్రంథములను సమగ్రముగఁ బరిశీలించి వానిలోని సామాన్య లక్షణములను గ్రోడీకరింపవలయును. ఆంధ్ర వాఙ్మయవేత్తలచేఁ బ్రబంధ యుగమని పేర్కొనఁబడిన రాయలకాలమున వెలసిన గ్రంథము లీ విషయ నిర్ణయమునకు మిక్కిలిగా నుపయోగించును. ఏలయనఁగా నవి యన్నియు నొక్క కాలమున నొక్క స్థలమున నివసించినవారిచే వ్రాయఁ బడినవి. రాయలయుగమునకుఁ బూర్వము నిట్టి గ్రంథములు గలవు గాని యవి విరళములు. అదియునుంగాక రాయలయుగమున వెలసిన ప్రబంధములకును వీనికిని గొన్నియెడల భేదము కన్పట్టును. వానినిఁగూర్చి తరువాత విపులముగాఁ జర్చింపఁబడును. ప్రస్తుతాంశమగు ప్రబంధ గుణముల నీ రీతిగా నిర్వచింప నగును :

> ప్రబంధములకేక నాయకాశ్రయత్వముతోపాటు వస్త్వైక్యమును నపరిహార్యమైన ధర్మము.

ప్రబంధమున కాలంబనములు నాయికానాయకులు. నాయకుఁడు సాధారణముగా ధీరోదాత్తుఁడు. నాయిక స్వీయ. వస్త్వైక్యమనఁగాఁ బ్రబంధ వస్తు భాగములు కార్య కారణ సంబంధముగలిగి యొకదానితోనొకటి పొందిపొసఁగి యుండవలయును. ఆ ప్రబంధ శరీర నిర్మాణమునందేయంగ మెచ్చట నెంత యుండవలయునో యంతే యుండవలయుఁగాని యొక్క యవయవము సర్వావయవములను దిగఁద్రోచి తానై పైకిఁ జూపట్టరాదు.

పూర్వయుగములలోని సందిగ్ధ ప్రబంధములు సంస్కృత పురాణములను గావ్యములను నాశ్రయించిన కథలుగాఁ గానీప్రబంధములు పురాణాంతర్గతాఖ్యానములను నిమిత్తమాత్రములుగా గ్రహించి యా యస్థిపంజరములను మాంసలములుగ సర్వావయవ సుందరములుగఁజేసిన స్వతంత్ర చిత్రములు.

ఒక చిన్నకథను సర్వాంగసుందరముగఁ బెంచి వ్రాయుటకు వర్ణనలు ముఖ్యములు. ఈ వర్ణనలు ప్రబంధములందు సాధారణముగా రెండు తెఱఁగుల నుండును.

1. వస్తు బహిరాకార వర్ణనము. 2. వస్తుగుణ వర్ణనము.

ఈ వస్తు వర్ణనములో సజీవ ప్రకృతి వర్ణనము, నిర్జీవ ప్రకృతి వర్ణనము గలిసియుండును. సజీవ ప్రకృతిలో మరల మానవ ప్రకృతి వర్ణనము, మానవేతర ప్రకృతి వర్ణనము నుండవచ్చును. వస్తుగుణవర్ణన మనఁగాఁ దత్త్వ విచారము చేసి తన్మనోగతి వివిధ భావ పరివర్తనములను వ్యక్తముచేయుట.

ప్రబంధమునకు శృంగారము జీవగఱ్ఱ. మిగిలిన రసములు గౌణములు. రసముతోపాటు తదుద్దీపన విభావములగు నుద్యానవన విహారాదులు, చంద్రాద్యుపాలంభనములు, విరహవేదనలు, శిశిరోపచారములు నన్నిగాని కొన్నిగాని యుండుననియే తలఁపనగును.

శృంగార రస ప్రాధాన్యముతోపాటాలంకారికమయినరీతి వీరికిఁ బ్రాణము. శైలివిషయమున సర్వ ప్రబంధ సామాన్యములగు కొన్ని లక్షణములు గలవు :

1. సీసపద్యమునఁ బ్రతిపాద సమతాపాదనము (Balance).
2. సీసమున సమాంతర రచనారీతి (Parallel structure).
3. ప్రతిపాదమునను నభిప్రాయ మంతమగుట (End – Stop lines).
4. అనుప్రాస గుంభితమయిన వచనరచన.

ఈ తారతమ్య నిరూపణ సారమేమనఁగాఁ గథైక్యమును నష్టాదశ వర్ణనలునుగలిగి, శృంగార రస ప్రధానమై, యర్థాతిశాయియైన శబ్దమును గ్రహించి, యాలంకారిక సాంకేతికములకు విధేయమై, యనతి విస్తృతి గల యితివృత్తముతో భాషాంతరీకరణముగాక, స్వతంత్ర రచనయేయైన తెనుఁగు కావ్యము ప్రబంధము.

పైనివివరించిన లక్షణములు కొన్ని ప్రబంధములయందుఁ గానరాకున్నను నాయా యుగధర్మ ప్రాధాన్యముఁబట్టియు, రచనాధోరణిఁబట్టియు నవియుఁ బ్రబంధ నామముననే వ్యవహరింపఁబడుచున్నవి.

# భారతాదులయందలి ప్రబంధచ్ఛాయలు

ప్రబంధశాఖకుఁ బ్రారంభ మేదియన్న యంశము నిటఁ జర్చింతము. ఈ ప్రబంధావతరణము హఠాత్సంభవమని తలఁపరాదు. ఇది క్రమ పరిణామము మీఁదనే సంభవించినది. భారత రచనయందుఁగూడ నీ ప్రబంధ చ్ఛాయలు గానవచ్చుచున్నవి.

సాధారణముగాఁ బురాణములను దెనిఁగించు కవులకుఁ గథాకథనము నందున్నదృష్టి కవితాశిల్పము నందుండదు. తిక్కనార్యుఁడుమాత్రముభయ ప్రయోజనముల సాధింపనెంచి తాను రచించిన భారత భాగమునఁ గళాదృష్టిని జూపియున్నాఁడు. ప్రబంధమార్గ ప్రవణత్వ మాయన రచించిన నిర్వచనోత్తర రామాయణమునందును, భారతమునందునుగూడఁ గాననగును. నిర్వచనోత్తర రామాయణము కరుణరస ప్రధానమగు నొక ప్రబంధమనియే చెప్పవచ్చును. ముందరి ప్రబంధ కవులకు మార్గమును జూపుచున్నాఁడో యనునట్లు, తిక్కనార్యుఁడు శృంగారమునుగూడ నీ గ్రంథమున యథోచితముగఁ జొన్పి యున్నాఁడు. సీతారాముల వనవిహారము నాధారముగాఁగొని యాతఁడు చూపిన శృంగార రసపోషణ నైపుణ్యము వర్ణనాతీతము.

భారతమున నీ ప్రబంధ ధోరణి కుదాహరణముగఁ దద్రచిత కీచకవధా ఘట్టమును గ్రహింపనగును. ఇందు భీముఁడు నాయకుఁడు. ద్రౌపది నాయిక. ఆలంకారికులు భీముని ధీరోద్ధతునిగా నంగీకరించిరి. తిక్కనమాత్రము భీముని ధీరోదాత్తునిగ నిరూపించెను. కవిబ్రహ్మ సృజించిన భీమునియందు బలదర్ప ములతోపాటు వినీతత్వమును, యుద్ధోద్రేకముతోపాటు యుద్ధ నైపుణ్యమును యుథోచితముగా మిశితముల్తైయున్నవి. భీముని యుత్తమ నాయకత్వమును ద్రౌపదీముఖమునఁ గుండలీంద్రుఁ డిట్లు వ్యక్తముచేసియున్నాఁడు :

కొలువులోపల నిన్నఁ గోపముల్లెత్తినఁ
దలకక నిలిచిన ధైర్యమహిమ
నేఁడిందుఁ జనుదెంచి నిర్వికారతఁ బ్రజ
కన్నులు గప్పిన గౌరవంబు
మనవారిలోన నొక్కనినైనఁ బిల్వ కు
త్సాహంబు సేసిన సాహసంబు
లోక దుర్జయుఁడగు నీ కీచకునిని బ్రే
ల్మిడి రూపుమాపిన కడిమి సొంపు

చూడఁ దలపోయ మెచ్చ సంస్తుతియొనర్ప
నాతరంబ నీ యుత్తమ నాయకత్వ
మెఱిఁగి నినుఁ గొనియాడ నే నెంతదాన
మహిత విస్మయానంద నిర్మగ్ననైతి.

ధీరోదాత్త నాయకుని కుండవలసిన ధైర్యసాహసములు, నుత్సాహ శక్తియు నిందుఁ బ్రస్తుతింపఁబడినవి.

వస్త్వైక్యమును ధర్మముకూడ నిందు సాధింపఁబడినది. భీముని విక్రమ ప్రదర్శనము, ద్రౌపదీ పరాభవము, కీచక వధ యను నీ మూడింటినిమాత్రమే ప్రధాన వస్తువులుగాఁ దీసికొని కవిబ్రహ్మ యీ కథకు వస్త్వైక్యమును సమకూర్చినాఁడు.

సూర్యోదయాది వర్ణనలు, చంద్రాద్యుపాలంభనములు దీనికిఁ బ్రబంధత్వమును సంపాదించినవి.

ఇందలి పద్యభాగములను, రచనారీతులను దరువాతి ప్రబంధకవులు చాలవఱకు ననుకరించినారు. చూ.

కుసుమ బాణుని బాణముల్ గూడ నైదు
గరఁగి నేరిమి వాటించి కరుపుగట్టి
పోసి చేసి చైతన్య సంపుటము దగ ఘ
టించిరో కాక యిట్టి చేడియలు గలరె!

నెత్తమ్మిరేకుల మెత్తందనము దెచ్చి
  యచ్చునఁ బెట్టినట్లందమొంది
చక్రవాకంబుల చందంబు గొనివచ్చి
  కుప్పలు చేసినట్లొప్పు మెఱసి
చందురు సునుఁగాంతి కందేర్చికూర్చి బా
  గునకుఁ దెచ్చినయట్లు గొమరు మిగిలి
యళికులంబుల కప్పు గలయంతయును బుచ్చి
  నాఱు వోసినభంగి నవకమెక్కి
యంఘ్రి తలములుఁ గుచములు నాననంబుఁ
గచ భరంబును నిట్లున్న రుచిరమూర్తి
యనుపమాన భోగములకు నాస్పదంబు
కాదె యీ తివ్వి లేటికిఁ గమలపదన.

లీల నా ముందట నాలేమ యొలసినఁ
జూడ్కికిఁ జొచ్చిన చూఱగాదె !
కనువిచ్చి నన్ను నాతనుమధ్య సూచినఁ
దనువున కమృత సేచనముగాదె !
చిఱునవ్వు బెరయ నచ్చెలువ నాతోడఁ బ
ల్కినఁ జెవులకు రసాయనముగాదె !
యెలమి నమ్మెలత నన్నెలయింపఁ దివిరిన
నెడఁద కానందంబు నిక్కగాదె !

యానితంబిని మక్కువ ననఁగి పెనఁగి
యింపు పొంపరివోవ నన్నేలికొనఁగఁ
దలఁచి పొందిన నది జన్మఫలముగాదె !
యనుచు వలరాజు బాఱికి నగ్గమయ్యె.

మనోవృత్తి వివరణ కౌశలము ప్రబంధ కవులకొక ముఖ్యలక్షణము దీనినే వస్తుగుణ వర్ణన మనియు నందురు.

పాత్రల బహిరాకార చేష్టలతోపాటు తదీయ హృదయ గతాభిప్రాయము లనుగూడ వ్యక్తముచేయుటయే మనోవృత్తి వివరణ కౌశల మనబడును.

ఈ లక్షణము తిక్కయజ్వ మహాభారతమునందుఁ బలుతావులఁ గాన నగును. కవిబ్రహ్మకుఁగల యీ గుణము నవలంబించుటయేకాక దానికి మెఱుఁగుపెట్టిన కవి పింగళి సూరన.

ద్రౌపదిని బ్రప్రథమమునఁ జూచినప్పుడు కీచకునకుఁ గలిగిన మోహావేశము, కీచకునిచే ద్రౌపది పరాభవింపఁబడినప్పుడు భీమునకుఁ గలిగిన కోపోద్రేకము, మదిరారసమును దెమ్మని సుదేష్ణ ద్రౌపదిని గీచకు నింటికిఁ బంపునెడ ద్రౌపదికిఁగలిగిన హృదయావేదన మున్నగు నిట్టి ఘట్టములందు గవిబ్రహ్మ చూపిన మనోవృత్తి వివరణ కౌశల మత్యద్భుతము.

ఇట్లు తిక్కన కవితయందు బీజప్రాయముగనున్న ప్రబంధ ధోరణి యెఱ్ఱనకవితయందు నవలెత్తినది.

ఈతనివలనఁ బ్రబంధకవులు నేర్చికొననదియు నీతనికిఁ బ్రబంధ పరమేశ్వర బిరుదమును సార్థకము గావించునదియు వర్ణనాప్రాబల్యము. కథతో వర్ణనలను మేళగించి వ్రాయుట యను ప్రబంధ రచనారీతికి మార్గదర్శకుఁడీతఁడే యనవచ్చును.

ఇతిహాసమగు భారతమునందును, ఖిలపురాణమగు హరివంశము నందును, నృసింహ పురాణమునందును నీతని యీ రచనాధర్మ మొక్కలాగుననే యున్నది. హరివంశమందలి యుషానిరుద్ధుల కథ మొదలగు కొన్ని యుపాఖ్యానములు చిన్నప్రబంధములా యనఁదగినంత రమ్యముగా వ్రాయఁబడినవి. భారతమునందలి సావిత్ర్యుపాఖ్యానముగూడ నిట్టిదే. ఇఁక నృసింహ పురాణము లోని పెక్కుభాగములు స్వకపోల కల్పితములే యనవచ్చును. ప్రహ్లాదుని కథ నిమిత్తమాత్రముగాఁ గైకొని దానితో స్వకీయ వర్ణనా ప్రాగల్భ్యమును, భావ చమత్కృతిని మేళగించి, కథను సర్వాంగసుందరముగా భక్తిభావ బంధురముగఁ గావించినాఁడు.

ప్రబంధకవుల కందఱకు నితివృత్తము నిమిత్తమాత్రమే యనుటకు నృసింహ పురాణ మొక దృష్టాంతము. కావుననే ప్రబంధ మొక స్వతంత్ర చిత్రణముగఁ బరిగణింపఁబడినది.

ప్రకృతి వర్ణనలు చేయుటలో నీతఁడగ్రగణ్యుఁడు. వర్ణనల కొఱకీతఁడు కథావేగమునుగూడఁ గుంచించును. కథాగతిని నిలిపి, వర్ణనలు సాగించుట ప్రబంధ కవులలోఁ జాలమందికి మిక్కిలి యలవాటు. దీనికి మార్గదర్శకుఁడు ప్రబంధపరమేశ్వరుఁడే యనవచ్చును.

సోమన యన్నినో వర్ణనాప్రాశస్త్యమునందేకాక, వక్రోక్తినైపుణ్యము నందుఁగూడఁ బ్రబంధ కవులకు మార్గదర్శకుఁడైనాఁడు. ప్రబంధ కవులలో విపులముగాఁ గానవచ్చు ననుప్రాస గుంఫిత వచన రచనయును జిత్రకవిత్వమును నీతని గ్రంథమునఁ దఱచుగాఁ గాననగును. అచ్చతెనుఁగు పద్యములు నిరోష్ఠ్యములు, నీతనియందే తొలుదొల్తఁ గానవచ్చుచున్నవి. తరువాత వెలసిన యయాతి చరిత్రాది ప్రబంధముల కిట్టి కృతులయందే బీజములు నాటఁబడినవి. ద్విత్రిచతుష్ప్రాస పద్యములనుగూడ నీతఁడు చెప్పినాఁడు. దీర్ఘసమాస గుంభిత రచనావిశేషమునకును సోమనయే మార్గదర్శకుఁడు. మృగయా వినోద వర్ణనా సందర్భమునఁ బినవీరనయు నీతని కప్పుపడినాఁడేమోయని తోఁచుచున్నది. హంసడిభకోపాఖ్యానమున నీతఁడు వర్ణించిన మృగయావినోదము తరువాతి ప్రబంధ కవులందఱకు మార్గదర్శకమే యనవచ్చును. అందీతఁడు మిక్కిలి చమత్కారావహములును వినూత్నములు నగు నలంకారములను బ్రయోగించి యున్నాఁడు. ఊర్వశీ-నరకాసుర సంభాషణము నొక మిషగాఁ గైకొని యీతఁడు చూపిన వక్రోక్తినైపుణ్య మద్భుతావహము.

ప్రబంధశయ్యకు మార్గదర్శకుఁడు శ్రీనాథుఁడు. ఆంధ్రకవితారంభమైన నాఁటినుండియు నేఁటివఱకును శయ్యావిషయమున నాంధ్రకవుల దృక్పథము

భిన్నమార్గములఁ బోయినది. కొందఱర్థచమత్కృతికంటె శయ్యాసౌభాగ్యమునే యధికముగా నాదరించిరి. కొందఱు శయ్యాసౌభాగ్యముకంటే భావగాంభీర్యము నకే యెక్కుడు ప్రాధాన్యమిచ్చిరి.

మొదటివారికి నల్లిక జిగిబిగియున్నచో నర్థగాంభీర్య మొకవేళ సడలినను గణనీయము గాదు. రెండవ తెగవారికి భావగాంభీర్యమున్నచోఁ బదసంవిధాన మున నించుక లోపము గాన్పించినను లెక్కలోనికి రాదు.

మొదటి తెగకు వాగనుశాసనుఁడును, రెండవ తెగకుఁ గవిబ్రహ్మయును నాచార్యులు. నన్నయభట్టారకునిచే నాదరింపఁబడిన యీ శయ్యాసౌభాగ్యమును నాచన సోమనాథుఁడు పోషించినాఁడు. శ్రీనాథుఁడు దానికి మెఱుగులు వెట్టి ఘంటాపథము గావించినాఁడు.

శయ్యాసౌభాగ్యమునందు శ్రీనాథున కాసక్తి మెండనుట కనేకోదాహర ణములను జూపవచ్చును. మచ్చున కొక్కటి :

ఆకాశాంచల వీథులన్నిగిడె సంధ్యారాగ రేఖావళుల్
పాకో న్ముద్రిత పారిభద్ర పటలీ పాండిత్య వైతండి కో
త్సేక స్ఫూర్జిత చండతాండవ రయోద్రేకార భట్యుద్భట
శ్రీకంఠ స్థిరకంఠ కోమల జటాశ్రేణిన్ విడంబించుచున్.

శ్రవణమాత్రముననే సంతసమును గలిగించు సంస్కృతాంధ్రపద సమ్మిశ్రిత రచనాప్రాగల్భ్యము శ్రీనాథునకు మిక్కుటముగాఁ గలదు. చూడుఁడు :

నలినసంభవు వాహనము వారువంబులు
        కులము సాములు మాకుఁ గువలయాక్షి
చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు
        భోజనంబులు మాకుఁ బువ్వుఁబోఁడి !

మఱపునఁ బడకుండ మనసున హత్తియుండు పదరచనము శ్రీనాథుని కవనమునందే కాననగును. కవిసార్వభౌముని యడుగుజాడలనే నడచిన ప్రబంధకవు లనేకులు గలరు. అందును బిల్లలమఱ్ఱి పినవీరనయుఁ దెనాలి రామకృష్ణుఁడును నల్లసాని పెద్దనయు నీతని పదసంవిధాన నైపుణ్యమును గారక ప్రయోగవైచిత్రిని సీసపద్య రచనారీతులను బలుతావుల ననుకరించిరి. సమపాద విన్యాసములఁ బొలుపారు నీతని సీసపద్యముల నచ్చు గుద్దినట్లనుక రించిన ప్రబంధకవు లనేకులు గలరు. అవి యన్నియు నిట నుదాహరింప నతి విస్తరము ననావశ్యకము నగును.

సంస్కృత శ్లోకములఁ దెనిఁగించుటలోఁగూడఁ బ్రబంధ కవులకు శ్రీనాథుఁడే మార్గదర్శకుఁడు. సంస్కృత కావ్యమును బ్రప్రథమమునఁ దెనిఁగించిన కవి శ్రీనాథుఁడు. ఈతఁడు నైషధము నాంధ్రీకరించుటయేగాక, కాశీఖండమునందలి సూర్యరథ వర్ణనాసందర్భమున మయూరుని శ్లోకములను గూడ నాంధ్రీకరించియున్నాఁడు. ఈ యాంధ్రీకరణ విషయమునఁ గవిరాజు వేసిన మార్గముననే పినవీరనాదులుపోయిరి.

# శ్రీనాథయుగము - తల్లక్షణములు

ఆంధ్ర వాఙ్మయమున శ్రీనాథయుగమునకుఁగల ప్రాధాన్యము మఱి యే యుగమునకును లేదు. ప్రబంధయుగమునకు శ్రీనాథయుగము ప్రస్తావనవంటిది. తెనుఁగున నీ యుగమున కీ లక్షణమని యపవాదము లేకుండ నిర్దేశించుట చాల కష్టము. భాషాంతరీకరణ యుగమున స్వతంత్ర గ్రంథములు పుట్టుట, స్వతంత్రముల మధ్య ననువాదములు పుట్టుట, పురాణయుగమునఁ బ్రబంధ రచనయుఁ బ్రబంధకాలమునఁ బురాణ రచనయు మొదలగు నన్యోన్య గుణ సంక్రమణ మాదికాలమునుండి నేఁటివఱకు సాగుచునేయున్నది. కావుననే యుగమునుగూర్చియైనను మనముచేయు నిర్ధారణము స్థూల రూపముగనే యుండును.

ఆంధ్ర వాఙ్మయమున శ్రీనాథయుగమును సంధియుగమని కొందఱందురు. ఆంగ్లమునందలి Age of Transition అను పదమునకు సరియైన తెనుఁగుగాఁ గల్పింపఁబడిన పేరిది. ఒక యర్థమున నిది సంధియుగమను మాటయు సత్యమేకాని యాంగ్లమునందలి Age of Transition వంటిది మాత్ర మిదికాదు.

కొన్ని యుత్తమ లక్షణములతోఁ గొంతకాల మొక మహాయుగమున నడచిన యనంతరము మఱికొంతకాలమునకు మఱికొన్ని యుత్తమ లక్షణములతో నింకొక మహాయుగము ప్రారంభము కానుండఁగా నారెండింటికి నడుమఁ జెప్పఁదగిన స్వతంత్ర లక్షణము లేవియునులేక యవ్యవస్థితముఁగా నప్రధానముఁగా నున్న కాలవ్యవధికి నాంగ్లమున Age of Transition అని పేరు.

శ్రీనాథయుగము మన వాఙ్మయ చరిత్రలో నప్రధానము గాదుకదా మీఁదు మిక్కిలి ప్రధానమైనది. కావున దీనిని బైయర్థమున సంధియుగ మనరాదు.

ఈ యుగము ప్రబంధయుగమునకుఁ బ్రస్తావనవంటిదని చెప్పితిమికదా! పురాణ పరిణతమైన యాంధ్ర రచన ప్రబంధములవంకకు మరలుటయేకాక, ఆ ప్రక్రియకుఁదగిన యొరవడియంతయు నీ యుగముననే యేర్పడినది. కనుక నీ ఘట్టమును బురాణ ప్రబంధములను సంపాదించి సంధించిన చోటుగాఁ జెప్పుకొనవచ్చును. ఈ యర్థమున శ్రీనాథయుగము సంధియుగమే.

ఈ యుగమునఁ బురాణములును బుట్టినవి. వానియందుఁగూడఁ బ్రబంధావయవములైన రసోత్కర్షయు, వర్ణనాబాహుళ్యమును, నలంకార ప్రియత్వమును నెలకొనియున్నవి. కాశీఖండ భీమఖండములు క్షేత్రమహాత్మ్యము

లయ్యె ననుపైనచోట్లఁ బ్రబంధ పథమునే త్రొక్కినవి. విష్ణుపురాణ వరాహ పురాణ కర్తలు తత్తదుత్తరార్థములయందుఁ బురాణ ఫక్కికకుఁ జూపిన యనాదరణమునుబట్టి పూర్వాభిరుచి వారియందును జాలవఱకుఁ దగ్గినదనియే చెప్పవచ్చును. అటు తగ్గిన రుచి యిటు ప్రబంధరూపమున హెచ్చుట సహజమే కాని యస్వాభావికము కాదుగదా!

ఈ ప్రబంధ రచనకు శృంగారనైషధ రచనారూపమున శ్రీనాథుఁడు మార్గదర్శకుఁడైనాఁడు. అంతకంటెను స్వతంత్ర ప్రక్రియ నవలంబించినవాడు పినవీరన. తరువాతఁ బెద్దనాదులు కేవల ప్రబంధములనే రచించిరి.

భారతమున వ్యక్తావ్యక్తముఁగను, ఎఱ్ఱనలో నంకురముగను, సోమునిలో మొలకఁగను బొడసూపిన ప్రబంధలత శ్రీనాథుని కాలమునఁ గొనలు సాగి చిగిర్చి మాఱాకు వైచినది. ఇది రాయల కాలమునఁ బుష్పఫల సమన్విత మయ్యెను.

ఇంత దోహద ప్రాధాన్యముగల యీ యుగమును నిరర్థక సంధి యుగముగాఁ బరిగణించుట పొసఁగదు. ఈ యుగమునందలి కవులందఱును కొలఁదిఁగనో గొప్పగనో ప్రబంధ వృక్షము పెఱుగుటకు దోహద ప్రక్రియలు గావించినవారే.

లోకములోఁ బ్రజ లుబుసుపోకకై చెప్పుకొను చిత్రవిచిత్ర కథలన్నియు నొక్కమాఱుగ నీ కాలముననే కావ్యరూపమును దాల్చినవి. బేతాళపంచవింశతి, విక్రమార్క చరిత్ర, పంచతంత్రము, భోజరాజీయము మొదలగు రచనలు ప్రజల యభిరుచులలోని మార్పులను మఱికొంత సూచించుచున్నవి.

ఈ కాలమందలి కవులలో రమణీయమైన శయ్యకై యత్నించినవారు కొందఱును, మధురమైన యర్థమునకై యత్నించినవారు కొందఱును గలరు. జక్కనయుఁ గొంతవఱకుఁ బినవీరనయు మొదటి వర్గములోఁ బ్రధానులు. మహానుభావుఁడైన పోతనలోఁగూడ నచ్చటచ్చట నీగుణములు ప్రతిబింబింపక పోలేదు. అనంతామాత్యుఁడును, గౌరనయు రెండవ వర్గమునఁ బ్రధానులు. యుగకర్తయగు శ్రీనాథునిలో శబ్దార్థములు రెండును సమప్రాధాన్యమున కుదిరి నవి. ఆ యుగమున నాతనిశైలి సర్వాతిశాయి యగుట కదియే హేతువు.

ఈ యుగమునకుఁ బ్రారంభదశలోఁ గొండవీడును, రాచకొండయును, మధ్యకాలమున రాజమహేంద్రవరమును, దుదకు విజయనగర రాజ్యములోని యుదయగిరియును, నంతమునఁ గేవల విజయనగరమును సాహిత్యపీఠము లైనవి.

నాచన సోముఁడు బుక్క దేవరాయల యాస్థానమున నడుగిడెనుగాని యానాఁడాంధ్రకావ్య పదమయ్యెడ సుస్థిరము కాలేదు. మఱి ప్రౌఢదేవరాయల కొలువునఁ గనకాభిషేకమునాఁడు శ్రీనాథుఁడు పలికిన మంగళాచరణము మనోహరమై తద్రాజ్యలక్ష్మితోపాటుగా నాంధ్రసరస్వతియు విజయనగరముననే సుస్థిరముగా నెలకొనుటకుఁ గారణమైనది.

ఈ యుగాదిని శ్రీనాథునితో నాయాస్థానమునఁ బ్రవేశించిన యాంధ్ర వాణి యుగాంతమునాటికి నంది మల్లయ్య, ఘంట సింగయలచే నచ్చట సుప్రతిష్ఠితమయ్యెను. అచ్చటచ్చటఁ జెదరువాటుగా నితరేతర కవులున్నను, బేరుగలవారెవ్వరు నీ యుగాంతమున విజయనగర సంబంధులుగానే కానవచ్చు చున్నారు.

# శ్రీనాథయుగము - సందిగ్ధ ప్రబంధములు

శ్రీనాథయుగమునఁ బుట్టిన కొన్ని గ్రంథములు ప్రబంధములా యను సందేహమును గలిగించునవియై యున్నవి. అనఁగా వీనికిని రాయలయుగమునఁ బుట్టినవానికి ననేకాంశములందు భేదము కన్పట్టుచుండును. అట్టివానిలోఁ గొన్నిటి నిట నుదాహరించి వానికిని రాయలయుగమునాఁటి ప్రబంధములకును గల భేదమును బరిశీలింతము.

మఱియు శ్రీనాథయుగమునకుఁ బూర్వముకూడ నన్నెచోడుని కుమారసంభవమువంటి కొన్ని గ్రంథములు ప్రబంధ లక్షణములు పెక్కిటిని గలిగి యున్నవి. కాని యట్టివి బహువిరళ ప్రచారమును కలిగినవై యున్నవి. వస్తువిస్తృతినిబట్టియు నవి ప్రబంధ లక్ష్యమునకు దూరములగుచున్నవి.

ఇఁక శ్రీనాథుని యుగమునందలి సందిగ్ధ ప్రబంధములఁగూర్చి యొకింత చర్చించి రాయలయుగమునం దావిర్భవించిన కేవల ప్రబంధములను పరిశీలింతము.

## జక్కన - అనంతామాత్యుఁడు

వీరిరువురు నొక్కకాలమున నొక్కదేశముననే యుండిరి. సమకాలికులైన యీ కవులిరువురు సదృశగుణోపేతులైన యిరువురు చక్రవర్తులను నాయకులుగా గ్రహించి రెండుత్తమ కావ్యముల నొక్కకాలమున రచించుట మఱచిపోరాని వింత. ఇందొకరి రచన యింకొకరికిఁ బ్రోత్సాహమయ్యెనో లేక వాని సమకాలికత్వము యాదృచ్ఛికమో నిర్ణయింపఁ జాలము. అదియుఁ గాక సదృశ వస్తు రచనఁ జేసిన యే యిరువురు కవులకును వీరికున్నంత భేదము లేదు.

విక్రమార్కుఁడును, భోజుఁడును నార్యచక్రవర్తులలో విద్యాపోషణకును వదాన్యతకును సాహసౌదార్యములకును బేరుగన్నవారు. వారి పేరులమీఁద ననేక చిత్రవిచిత్ర కథలు లోకమున నల్లుకొనియున్నవి. అట్టికథలే వీరి కావ్యములకు మూలములు.

శిల్ప సామర్థ్యమునం దనంతుఁడును, శబ్ద విన్యాస నైపుణియందు జక్కనయుఁ బేరువడసినవారు. భావనాపూర్వకమైన ప్రజ్ఞయం దనంతుఁడు మేటి. ఊహాపూర్వకములైన వర్ణనలు చేయుటలో జక్కన నిపుణుఁడు.

ఇట్లనుటచే జక్కనకు భావనాబలము లేదనికాని యనంతునకు రచనా నైపుణ్యము లేదనికాని చెప్పుటకాదు. శయ్యాసౌభాగ్య సంపాదనమునం దనంతునకు శక్తిలేదనియు భావనాప్రాగల్భ్యమునందు జక్కనకు నిష్ఠ తక్కువయనియు దీని యర్థము.

వర్ణించినదానినే మరల వర్ణించినను జక్కన జక్కన క్రొంగ్రొత్త పోకడలనే చూపఁగలఁడు. పునరుక్తిదోషము నంటనీఁడు. ప్రతిపద్యము నందును బదముల కూర్పుత్తరోత్తర రమ్యతను దాల్చియుండునుగాని విసువు పుట్టింపదు. ఆతని కవితాదృష్టి యింతకుమించి పోదు. సజీవపాత్ర నిర్మాణము నందలి నైపుణి జక్కన కలవడలేదు. ఆతని కావ్యమున నెన్నియో కథలు చెప్పఁబడినవికాని యొక్కదానియందును బ్రాణప్రతిష్ఠగల పాత్ర లేదు.

ఇఁక ననంతుఁడన్ననో, యే పిట్టకథ చెప్పినను దిక్కన భారతములోని యుపాఖ్యానములవలె సంపూర్ణములగు కావ్యములుగాఁ దీర్చిదిద్దుటేకాక యందలి ప్రతిజీవిని నాటకమునందలి పాత్రలవోలె మన మనోరంగమునఁ దాండవింపఁ జేయును. గోవ్యాఘ్ర సంవాదములోని గోవు, మదన రేఖాచరిత్రములోని క్షత్రియకాంత, మూషకకథలోని యెలుక యిందుల కుదాహరణములు. ఈ చిత్రము లాంధ్రకవి శిల్పనిర్మాణమున నుత్తమ చిత్రములుగాఁ జెప్పుకొనఁ దగినవి. ప్రకృతి దృశ్యములను వర్ణించునప్పుడుకూడ ననంతుఁడు భౌతికాంశము కంటె నంతస్సారమునందే దృష్టిని నిల్పి తన మనోనయనమును బరిభ్రమింపఁ జేయును.

అనంతుని కైతకు గౌరవముదెచ్చిన యింకొకవిషయ మాతని నైతిక దీక్ష. నీతినిబద్ధమైన మానసికబలము శారీరకబలముకంటె శక్తిమంతమనియు నా శక్తి క్రూరరాక్షసులను బరమ సాధువులుగను, ఘోరవ్యాఘ్రములను గో తుల్యములగను జేయఁగలదని యాతఁడు గావించిన ధర్మప్రతిపాదనము. ఒక కన్ను నీతివంకను, వేఱొక కన్ను శిల్పమువంకను నిల్పి రెంటిని నాకర్షించి తత్సమ్మేళనముచేఁ బరస్పర సుందరములుగ వెలుగునట్లుచేసిన యాతని శిల్పము

Artistic beauty does not differ from moral beauty

అను సిద్ధాంతమునకుఁ బరమలక్ష్యముగా నున్నది.

విక్రమార్క చరిత్రలోని కథలన్నియు నా చక్రవర్తి సాహసకృత్యము లను దెలుపునవియై యున్నవి. వీనిలోఁ గొన్ని ద్వాత్రింశత్సాలభంజికల కథల లోనివి. అందులేనివియుఁ గొన్ని యిందుఁగలవు. విక్రమార్కుని జననము నకుఁ గారకుఁడైన చంద్రశర్మ వృత్తాంతముతో నీ గ్రంథ మారంభమైనది. దీనికి సరియైన సంస్కృతమూలాల మున్నట్లు తోపదు.

భోజరాజీయమునకుఁగూడ సంస్కృతమూలము కానరాదు. ఇందా మహారాజునకు సంబంధించిన కథాంశమే చాలతక్కువ. ఆయన పాండిత్యముఁ గూర్చియుఁ గవితాదరణముఁగూర్చియు లోకమున వినఁబడు కథలేవియు నిందు లేవు. సర్పటి యనునొక యోగసిద్ధునకును భోజునకుఁ గలిగిన సమావేశము నాధారముగాఁ జేసికొని బయలుదేరిన యనేకోపాఖ్యానముల కీ గ్రంథము పుట్టి నిల్లు. ఈ యుపాఖ్యానములలోఁ గొన్ని నేఁటి మన కథానికలను బోలియుండును. మఱికొన్ని పంచతంత్రాదులయందలి పిట్టకథలను బోలియుండును. ఇట్టి పిట్ట కథలను వ్రాయునప్పుడుగూడ ననంతుఁడు తన శిల్పచాతుర్యమును వెలయించి యున్నాఁడు.

మానవపాత్ర నిర్మాణమువంటి జంతుపాత్ర నిర్మాణము చాల దుర్ఘటమైన విషయము. వాని యింగితము నెఱుఁగుట కతినిశిత భావన యుండవలయును. అట్టి ఘట్టములలోఁగూడ ననంతుని భావన స్వచ్ఛతామహనీయమై యున్నది.

జక్కన బహువర్ణనాప్రియుఁడు. ఆంధ్ర వాఙ్మయమున నతి దీర్ఘవర్ణనలు జేసిన కవులలో నీతఁడే ప్రప్రథముఁడుగాఁ గన్పట్టుచున్నాఁడు. మధురాపురిని ముప్పదియేడు పద్యములలో వర్ణించియుఁ దనియక దానికొక వచనమునుగూడ నతికినాఁడు. అవకాశము లభించినపుడెల్లఁ దనివితీర స్త్రీవర్ణనలఁ గావించి ప్రబంధయుగమునకు మార్గదర్శకుఁడైనాఁడు. సుమారరువది పద్యములలో జలక్రీడా వనవిహారాదుల వర్ణించి ప్రబంధములందలి వర్ణనాప్రాధాన్యము నుగ్గడించినాఁడు. గ్రంథమునందనేక కథలున్నవికాన నిట్టి వర్ణన లావశ్యకము లయ్యెనని చెప్పుట సరికాదు.

ఇట్టి గ్రంథమేయగు భోజరాజీయమున నిన్నివర్ణనలు కానరావు.

## గౌరన : హరిశ్చంద్రోపాఖ్యానము - నవనాథ చరిత్ర

ఆంధ్ర ద్విపదగ్రంథకర్తలలో విసుగుదల పుట్టింపనట్లు కావ్యనిర్వ హణముచేసిన వారియందీతఁ డగ్రగణ్యుఁడు. ద్విపదకును లోకవ్యవహార సిద్ధమగు భాషకునుగల సంబంధము నీతఁడు మఱచినవాఁడుకాఁడు. అనావశ్య కములైన వర్ణనలచే నీతఁడు కథను గుంఠితము చేయలేదు. సూటియైన కథ, సులభమైన శైలి విసుగుపుట్టింపని రచన యనునవి యీతని కవిత్వములోని ముఖ్య ధర్మములు.

కొలఁదిపాటి శబ్దసామగ్రితో వేషమును చిత్రమునందువలె తీర్చిదిద్దగల సామర్థ్య మీతనికి స్వతస్సిద్ధము. చిత్రకారులకు నొరవడిపెట్టఁదగిన చిత్రములు

హరిశ్చంద్రోపాఖ్యానమునఁ జాలఁగలవు. సామాన్యముగా హరిశ్చంద్రకథ కరుణరసాత్మకమైనది. ఈతనిచే నది హాస్యబీభత్స రసాత్మకముగా మాఱినది.

ఈతని రెండవ గ్రంథము నవనాథోపాఖ్యానము. ఇది శివపరమైన గ్రంథము. హరిశ్చంద్రోపాఖ్యానమునకిది తీసికట్టనవచ్చును. సారంగధరుని చరితమిందు వర్ణింపఁబడియున్నది. ఇది తెలుఁగువారి సారంగధర కథకు విలక్షణముగాఁ గన్పట్టును. ఇందలి సారంగధరుఁడు రాజమహేంద్రవర వాస్తవ్యుఁడుగాక మహారాష్ట్రమునందలి కుంతలదేశమునకుఁ జెందినవాఁడై యున్నాఁడు.

## పిల్లలమఱ్ఱి పినవీరన : శృంగార శాకుంతలము - జైమినిభారతము

ఈతఁడు రచించిన గ్రంథములలో నేఁడు మనకు లభించిన వీరెండు కావ్యములే.

### శృంగార శాకుంతలము

శృంగార శాకుంతలమునకు భారతములోని శకుంతలోపాఖ్యానమును, కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలమును మూలములైయున్నవి—ఈ విషయము గ్రంథమందే కలదు :

భారతప్రోక్త కథ మూలకారణముగఁ
గాళిదాసుని నాటక క్రమము కొంత
తావకోక్తికి నభినవ శ్రీ వహింప.

కాళిదాసుని నాటకములోని విప్రలంభాత్మకమైన యుత్తరార్థము నీతఁడు గైకొనలేదు. భారతమునందువలెనే పుత్త్రసహితయైన శకుంతలకు రాజాస్థాన ప్రవేశమును గల్గించెను. పూర్వార్థమున ఋషుల ప్రార్థనము, రాజునాశ్రమ ప్రవేశము జలసేచనావసరమున శకుంతల రాజునకుఁ గానవచ్చుట, కులపతి సోమతీర్థమున కేగుట, అనసూయా ప్రియంవదల ఘటనా కౌశలము, అంగుళీయక ప్రదానము లోనగు రసవదంశములు కాళిదాసుని నాటకమునుండి భిక్ష గైకొనినవే. ఆపైకథాపరిణామము మాత్రము భారతానుకారి యగుచున్నది.

సూత్రప్రాయముగాఁ జెప్పవలసి వచ్చినచోఁ గథావికాసము నాటకానుకారియనియుఁ దత్పరిణామము భారతానుకారి యనియుఁ జెప్పవచ్చును. ఈ రెంటింటికి నడుమ నీతఁడు స్వయముగాఁ గల్పించిన ఘట్టములు గొన్నికలవు.

తావకోక్తికి నభినవ శ్రీ వహింప అన్నకృతిపతిమాట వానివల్లనే సార్థకమైనది. కథాప్రధానమైన భారతమున నీషన్నిర్దిష్టములైనట్టియుఁ బ్రదర్శనప్రధాన

మైన నాటకమున స్థానము లేనట్టియుఁ గొన్ని యంశములను ప్రకరణానుగుణ ములుగ నీకవి వర్ణించెను. ప్రబంధమైన యీ కృతికి నావర్ణన లుచితములుగనే యున్నవి. చూడుఁడు :

హస్తినాపుర వర్ణనము, మృగయావర్ణనము, రాక్షస వధ మొదలగునవి. అన్నిటికంటెను ముఖ్యమైన స్వతంత్ర కల్పనము శకుంతలా జనన వృత్తాంత కథనము.

భారతమున శకుంతలయే తన జననవృత్తాంతమును దుష్యంతునితోఁ జెప్పును. అది యంత యుచితముగాదని కాళిదాసాకథను జెలికత్తెలనోట వినయ లజ్జాన్వితముగ నొకటిరెండు పల్కులచే సూచించెను. ఎట్లయినను నాకథ స్త్రీజనోక్తమగుట కంగీకరింపక పినవీరన దానిని గణ్వశిష్యునిచేఁ జెప్పించెను. ఈతని సంకల్పము మంచిదేయైనను నీకల్పనయందును దోషములేకపోలేదు. కామ వికారమన నెట్టిదో యెఱుఁగని ముగ్ధుఁడైన మునిబాలకుఁడు మేనకా విశ్వామిత్రుల పచ్చిశృంగారకథను మఱింతపచ్చిగాఁ జెప్పుట ముల్లుతీసి కొఱ్ఱు డచినట్లున్నది.

కాళిదాసు తన నాటకమున మానవప్రకృతికిని మానవేతర ప్రకృతికిని ఋష్యాశ్రమమున సాధించిన యభిన్నసాజాత్యమును బినవీరనయుఁ జక్కగాఁ బాటించెను. కాని యాశ్రమమునకు మూలాధారమై దివ్యతేజోరాశియైన కణ్వ పాత్ర మీ ప్రబంధమునఁ గొంచెము కలుషితమైనది. నాటకమున జ్యోతిర్మయమై వెలుఁగు నాపాత్ర మిందు మసకమసకగా నున్నది. కాళిదాసు తన నాటకమున వ్యంగ్యముగా ఋష్యాశ్రమమునకును రాజాస్థానములకుఁ గల తారతమ్యమును బూర్వోత్తర భాగములలో నెంతయో సున్నితముగఁ బ్రదర్శించియున్నాఁడు. ప్రాణుల పరస్పర సంయోగమున కాశ్రమములు స్థానములగుచో వాని వియో గమునకు రాజాస్థానము లునికిపట్టులనియు సకలుష చిత్తవృత్తికిని నిర్మల ప్రణయమునకును నాశ్రమములు నెలవగుచోఁ గాపట్యమునకును జిత్తాందోళనము నకును రాజాస్థానములు నిలయములనియుఁ గాళిదాసుఁడు తన నాటకమున సూచించి యున్నాఁడు. మఱియుఁ గేవల కామప్రేరితమైన దాంపత్యము పవిత్రము కాదనియు నా కామమనుతాపరూప తపోబల శోధితమైన దివ్య స్వరూపమును దాల్చినప్పుడే లోకపావన మగుననియు నప్పుడది రూపసౌంద ర్యములనే యపేక్షింపదనియును గాళిదాసుఁడు బోధించెను. శకుంతలా వృత్తాంతమున నంతర్భూతములైయున్న యీ జీవిత మహాదర్శములను నాటక రూపమునఁ బ్రదర్శించు నుద్దేశముతోనే భారతకథకు భిన్నమైన ప్రణాళికను నాయన కల్పించెను. కాళిదాసుని యీ కథాకల్పనయే లేనిచో శకుంతలా వృత్తాంతమునకంత పూజ్యతయేలేదు. ఇదియు భారతములోని యనేకోపాఖ్యాన

ములలో నొక్కటియై యుండెడిది. నాటక రచనానంతరమే యీ కథ లోకముచే శిరసావహింపఁబడిన దనవచ్చును. వీరన భారతానుసారిగాఁ గథను ముగించుటచే నాతని ప్రబంధమునకుఁగూడ నీ మాహాత్మ్యము లోపించుట సంభవించినది.

శాకుంతలమునుండి గ్రహించిన సందర్భములో నెడనెడఁ గాళిదాసుని శ్లోకములను గొన్నిటిని పినవీరన చక్కఁగాఁ దెనిఁగించెను. ఆ యాంధ్రీకరణము సర్వథా నైషదాంధ్రీకరణమును బోలియున్నది. నాటక రూపముననే శాకుంతల మంతయు నీకవి తెనిఁగించినచోఁ దెనుఁగున నాటకము లేని కొఱంత చిరకాలముక్రిందటనే తీరి యుండెడిది.

## జైమిని భారతము

శాకుంతలమునకంటె నీ గ్రంథమున శబ్దరచన చాల వన్నెలు తీరినది. ఈ కావ్య ప్రసిద్ధికి హేతువిదియే యనవచ్చును. జైమిని భారతమం దశ్వమేధ పర్వము మాత్రమే కలదు. దీనికిని భారతాశ్వమేధ పర్వమునకును నీషత్తును బొత్తులేదు. వ్యాసుని పంపున ధర్మరాజశ్వమేధమును జేయుట యనునదిమాత్రమే రెంటను గల సమానార్థము. అర్జునుఁడు సంచరించిన దేశములయు నోడించిన రాజులయు పేర్లలో రెండింటికిని నెంతయో వ్యత్యాసము గలదు. వ్యాసుని యశ్వమేధ పర్వమునఁ దత్త్వయోగవిద్యలనుగూర్చిన ప్రసంగము చాలఁగలదు. జైమిని భారతమున నావాసనయేలేదు. ఇందుఁ గుశలవోపాఖ్యానము, చంద్రహాసోపాఖ్యానము మున్నగు చక్కని యుపాఖ్యానములు గలవు. వ్యాసభారతమున శ్రీకృష్ణుఁడొక మహాపురుషుఁడుగమాత్రమే చిత్రింపఁబడినాఁడు. జైమిని భారతమున నతఁడొక యవతార పురుషుఁడుగఁ జిత్రింపఁబడెను. వైష్ణవమైన భక్తి కిందుఁ బ్రధానస్థానము గలదు. వ్యాసుని యశ్వమేధ పర్వమునఁ బాండవులు మహావీరులుగఁ గార్యశూరులుగఁ బ్రదర్శింపఁబడిరి. ఇందు వారు శ్రీకృష్ణునను ఛాయామాత్రులై యుండిరి.

## దగ్గుబల్లి దుగ్గన : నాసికేతోపాఖ్యానము

ఇదియొక శాంతరస ప్రధానమైన గ్రంథము. దీనికి మూలము కఠోపనిషత్తునందును భారతమునందును గలదు. సంస్కృతమున నిదియొక కావ్యముగా కూడనున్నది. దుగ్గన యీ కావ్యమునే తెనిఁగించి యుండును. కథావస్తువు చాల సద్భుతావహమైనది. ఆ కథను నిమిత్తముగాఁ జేసికొని దుగ్గన కర్మజ్ఞాన సంబంధమగు తాత్త్విక మీమాంసను విపులముగాఁ బెంచి యీ గ్రంథమును వ్రాసినాఁడు. ప్రబంధ సామాన్యములగు నతివర్ణనలు లేక శాంత రస ప్రధానమైన యిది శాంతి పంచకమునందలి యుత్తమోపాఖ్యానమును దలఁపించుచుండును.

దుగ్గన శ్రీనాథునకు బావమఱఁది యగుటయే గాక ప్రత్యక్ష శిష్యుఁడు గూడనైయున్నాఁడు. కాని యీ యిరువురు కవులకు నెందును బోలిక లేదు. భావ ప్రపంచమునఁగాని శబ్ద ప్రపంచమునఁగాని శ్రీనాథ శిష్యత్వ మీతని యందుఁ గానరాదు. శ్రీనాథునిది రాగరంజితమైన స్వభావము. కావుననే యాయన రచన శృంగార రసోల్బణముగా నుండును.

జటిలతా తరంగితమగు నాతని శైలియు నా స్వభావఫలమే యనవచ్చును. దుగ్గనది శాంత స్వభావమని యాతఁడెత్తికొనిన యితివృత్తము వలననే తెలియుచున్నది. ఈ గ్రంథమునందలి నిరాడంబరమైన శైలియు నా యితివృత్తమునకును నాతని స్వభావమునకును దగియున్నది.

నాసికేతోపాఖ్యానము నందలి కథ సామాన్యముగఁ బ్రబంధములందుండు కథవంటిది కాదు. సాధారణముగఁ బ్రబంధములన్నియు శృంగార రస ప్రధానములు. ఇది శాంతరస ప్రధానము. ఇందలి నాయకుఁడు కఠోర బ్రహ్మచర్య వ్రత పరిపాలనమునందుఁ గడుంగడు మక్కువ గలవాఁడు. నాయిక కామవికారమెట్టిదో యెఱుఁగని ముద్దరాలు. నాయకుఁడు ఘోర తపస్వి; అరణ్యవాసి. నాయిక రాజగు రఘుమహారాజు కూఁతురు; అసూర్యంపశ్య యగు నంతఃపుర కన్యక. వీరిరువురును వారివారి నియమము లొకింతయుఁ జలింపకుండఁగనే పరిణయఫలమనఁదగు పుత్త్రిభాగ్యమును బొందిరి. పుత్త్రోదయానంతరమును భార్యాభర్తలొండొరుల నెఱుఁగరు. తుదకుఁ బుత్త్రుఁడే తల్లిదండ్రుల నొండొరుల కెఱిఁగించెను.

పూసలలో దారము పోల్కిఁ బ్రబంధమందంతటఁ బ్రధానమైయున్న శాంతరసమునకు భంగము కలుగకుండఁ గథాకథనము నందలి యాధ్యాత్మికము చెడకుండ నీ కథాసంవిధానమును గవి యెట్లు నిర్వహించి యున్నాఁడో చూడుఁడు :

బ్రహ్మ మానసపుత్త్రుఁడగు నుద్దాలకమహర్షి యాశ్రమ వర్ణనముతోఁ గథా ప్రారంభమగును. నిత్య బ్రహ్మచర్య వ్రతమునమున్న యుద్దాలకుని కడకుఁ బిప్పలాదుఁడను ఋషి వచ్చి యాసంయమిని వివాహమాడుమని యుపదేశించును. పిదపఁ గమలగర్భుఁడును నట్లే యుపదేశించును. మొండి పట్టుదల గల యుద్దాలకుఁడే యిరువురి మాటలను బాటింపక యథారీతిని దపమాచరించుకొనుచుండును. ఈ భాగమంతయును నిసర్గ మధురములును నిర్మల వైరాగ్య జనకములునగు వర్ణనలతో నిండియున్నది. నిర్మల ప్రశాంత వాతావరణ మిందుఁ దాండవించుచున్నది.

ఇఁక నాయికా విషయము. ఇందే దుగ్గనకవి యుచితజ్ఞత గోచరించును. భూమండలము నంతయు నేకచ్ఛత్త్రాధిపత్యముగ నేలుచున్న రఘుమహారాజు

కూతురు నాయిక. ఇచ్ఛామాత్రమున సమస్తభోగములు నామె పాదములపై వ్రాలఁగలవు. నిరంతర వినోదాసక్తయై యుండఁదగిన యా రాకుమారి నీ కవి యెంత విపరీతముగా వర్ణించినాఁడో చూడుఁడు :

అనుదివసంబును నతిభక్తిఁ దల్లిఁదం
డ్రులకు నన్నలకు శుశ్రూష సేయు
నతివృద్ధలైన బ్రాహ్మణ పురంధ్రుల తోడ
ధర్మకథాగోష్ఠిఁ దగిలియుండు
సంతతంబును భాగ్య సౌభాగ్యదములనఁ
బొలిచిన వ్రతములు సలుపుచుండుఁ
బెద్దలు తనకుఁ జెప్పిన బుద్ధి తప్పక
విమల సదాచార విధులొనర్చుఁ
దాలిమియుఁ జిత్తశుద్ధియు ధర్మమతియు
దయయు దాక్షిణ్యమును సావధానతయును
వినయమును బంధుహితమును వెరవుఁ దగవుఁ
గలిగి చంద్రవతీ కన్యకాలలామ.

అన్నయును దల్లిదండ్రులు
మన్ననఁ దనుగారవింప మహనీయములై
యెన్నిక కెక్కిన గుణముల
వన్నియఁ గలిగించె చంద్రవతి కులమునకున్.

ఆ చంద్రవతి వివేకము
నాచారము గౌరవంబు నడకువయును నా
లోచింప నెందుఁ గానము
భూచక్రములోని రాజపుత్రికల యెడన్.

మున్ముందామె జీవితమునఁ గలుగఁబోవు విపరీతములకును నీవర్ణనలకును నెంతటి కార్యకారణ సంబంధముగలదో యోజింపుఁడు. నేఁడు తులలేని భోగభాగ్యముల నోలలాడుచు నొడలెఱుంగక వినోదకేళీవిభ్రమములఁ జంచలయై చరించు రాజపుత్రి రేపు కఠోరవ్రతముల నాచరించుచుఁ గానలఁబడి త్రిమ్మరు ఘోరతపస్వికి ధర్మపత్ని కాఁగలదా? అందులకుఁ దగిన గుణము లీనాఁడే యుండవలయును. ఋషిపత్నికాఁబోవు నంగనకు సౌందర్యముతోఁగాని విలాస విభ్రమములతోఁగాని పనిలేదు. వృద్ధజనసేవయు, వైదికాచార నిష్ఠయు నామెకు వన్నెదెచ్చునవియై యుండును. ఈ రహస్యము నుచితజ్ఞుఁడగు నీమహాకవి మఱువలేదు. విపరీత వర్ణనాసక్తిచేఁ గావ్యగౌరవమును జెడఁగొట్టలేదు.

ధీరోదాత్తుఁడగు రఘుమహారాజు ప్రవర్తనయు నిందు మనోహరముగా వర్ణింపఁబడినది. రసోచిత వర్ణనావిషయమున దుగ్గననుజెప్పి యింకొకరిని బేర్కొ నవలయును.

## నంది మల్లయ - ఘంట సింగయ

వీరీయుగమునఁ దుదివారైనను వాఙ్మయమునఁ జాల ప్రాముఖ్యముగల స్థానము నాక్రమించినవారు. ప్రబోధ చంద్రోదయము, వరాహ పురాణమునను రెండు గ్రంథములు వీరు వ్రాసిరి.

ప్రబోధ చంద్రోదయ మాధ్యాత్మిక కావ్యము. సంస్కృతమునఁ గృష్ణ మిశ్రుఁడు వ్రాసిన ప్రబోధ చంద్రోదయ నాటకము దీనికి మూలము. ఇందున్న పాత్రములన్నియు రూపమును దాల్చిన భావములే. ఇది యద్వైత పరమైన గ్రంథము. దీని మూలమును జూచి వేదాంతదేశికుఁడను కవి విశిష్టాద్వైత పరముగా 'సంకల్ప సూర్యోదయము'ను నాటకమును వ్రాసెను. జైనులుగూడ నిట్టి నాటకము లొకటిరెండు వ్రాసినట్లు వారి గ్రంథములలో నుదాహరణములు గలవు. కృష్ణమిశ్రునకుఁ బూర్వమే సంస్కృతములో నిట్టి నాటకమును బౌద్ధమత పరముగా నశ్వఘోషుఁడు వ్రాసినట్లు నిదర్శనములు గలవు.

ప్రబోధచంద్రోదయ గ్రంథము తెనుఁగున నొక యనుపమాన ప్రబంధ మైనది. విద్ధసాలభంజికలోను, శృంగార శాకుంతలమునందును బ్రాకృత సంస్కృత నాటకానుకరణము మాత్రమే యున్నదికాని యిందువలె సంపూ ర్ణాంధ్రీకరణము లేదు.

సంస్కృతమున నీ నాటకము భారత నిర్మాణ ప్రణాళిక ననుసరించి వ్రాయఁబడినది. అమార్గచరులైన దుర్యోధనాదుల పక్షము నవలంబించి సన్మార్గ గాములైన పాండవులను వేఱుచేసిన ధృతరాష్ట్రునిభంగి మహామోహాదులనెడు నొక సంతానవర్గమును జేరఁదీసి, మనస్సు వివేకాదులనెడు రెండవ వర్గమును బరిహరించును. దుర్యోధనునకు దుశ్శాసనాదులును వైదికేతరులును దోడైనట్లే మహామోహునకుఁ గామక్రోధాదులును జార్వాకాది నాస్తికులును దోడౌదురు. ధర్మజునకుఁ దమ్ములవలె వివేకునకు యమనియమాదులు సాహాయ్యము గావింతురు. కృష్ణునివలె విష్ణుభక్తి రక్షణముచేయును. భూరాజ్యమునకై కౌరవ పాండవులకు జరిగినయుద్ధమువలెనే మానసిక రాజ్యాక్రమణమునకై యీ యిరు తెగల వారికి ఘోరయుద్ధము జరుగును. భారతమునందు బాండవులవలెనే యిందు వివేకాదులు జయమందుదురు. పుత్త్రనాశనమున ఖిన్నుఁడగు ధృతరాష్ట్రు నకు వ్యాసునివలెనే మహామోహాదుల నాశనమువలన ఖేదించుచున్న మనస్సు

నకు వైయాసికీవిద్య (బ్రహ్మవిద్య) జ్ఞానోపదేశముచేసి శాంతి చేకూర్చును. భారతమునఁ బరమార్థమునఁగల యుపనిషదర్థ ప్రతిపాదనముపలెనే యిందును బరమాంకమున నుపనిషద్దేవీ ప్రవేశము గలదు. ఆ యుపనిషద్దేవీ వివేకుల సంయోగమునం జనించిన పుత్త్రుఁడే ప్రబోధచంద్రుఁడు. కావున నీ నాటకము నకు మహామోహాదుల విజృంభణము బీజముగాను, జ్ఞానోదయమును నిర్వహణముగాను జెప్పవచ్చును.

ఈ నాటకమును దెనిఁగించుటలో నీకవులు కథాసూత్రమునుగాని, శ్లోక క్రమమునుగాని యెచ్చటను మార్చలేదు. ప్రబంధమున కావశ్యకములగు నొకటి రెండు వర్ణనలుమాత్రము స్వతంత్రములుగాఁ గన్పట్టును. ఇందలి చిదానంద నగరీవర్ణనము పైవానిలో నొకటి. యుద్ధప్రకరణములోఁ జేయఁబడిన సూర్యాస్త మయాది వర్ణనములును మూలమున లేనివే. సంవాదాత్మకమైన నాటకమును గథనాత్మకమైన ప్రబంధముగాఁ దెనిఁగించుట మిక్కిలి దుర్ఘటకార్యము. ఇట్టి కావ్యనిర్వహణమున వీరు కృతకృత్యులనియే చెప్పవచ్చును. అందందుఁ జేసిన సంధివచనములు లోనగు నలంతిమార్పులు తప్పఁ జెప్పఁదగిన మూలాతిక్రమణ మేమాత్రము నిందులేదు. శ్లోకముల యాంధ్రీకరణము శ్రీనాథ పినవీరనల మార్గముననే పోయినది. అనఁగా వారివలెనే వీరును మూలమును జేపట్టి యాత్మీ యమును జేసికొని దానికి వన్నెపెట్టి క్రొత్తవస్తువుగాఁ బ్రదర్శించిరన్నమాట.

కాల ప్రభావమునుబట్టి యీ నాటకము ప్రబంధముగాఁ దెనిఁగింపఁ బడినది.

ఆనాఁడు మనదేశమున నాటకములాడు నాచారము లేదేమోయన్నచో నతిప్రాచీనములగు యక్షగానము లా సందియమును దీర్చుచున్నవి. కాని యీ మార్గ నాటకములు యక్షగానములవలె వీథులలోఁ బ్రదర్శింపఁ దగినవికావు. వీనికి సర్వోపస్కార సంపన్నములైన రంగస్థలము లుండవలయును. అట్టివి రాజపోషణమునఁగాని యానాఁడు నిర్మింపఁబడవు. అట్టి రాజాదరణము లేనినాఁడు, ప్రదర్శనార్థమై నాటకములను దెనిఁగించుట నిరర్థకమని కవులును భావించియుండిన నుండవచ్చును. ప్రదర్శనార్థమైగాక సాహితీపరముగనే నాటకములను దెనిఁగించినచో నప్పుడు శ్రవ్యకావ్యములుగనే యేల తెనిఁగింప రాదని వారి యూహయై యుండును.

పండితరంజకమగు రంగనిర్మాణమేయుండి యా రంగములు రాజాదరణ పాత్రములే యైయుండినచో నాటకములు ప్రబంధములుగా మాఱుట తటస్థింపదు. వాని యభావముచేతనే మన పూర్వులు నాటకదర్శన కుతూహలమును శ్రవ్య కావ్య శ్రవణముచేతనే తీర్చుకొనుచుండిరి.

అదియనుగాక తెనుఁగు ప్రబంధమొక వింతనిర్మాణము. నానాఁటికిఁ దెనుఁగు కవుల దృక్పథము ప్రబంధోన్ముఖమగుచున్నది.

సంస్కృతమునఁ గావ్యవిశేషములగు చంపువులుదక్క గద్యకావ్యములు వేఱుగను, పద్యకావ్యములు వేఱుగను, గథనాత్మకములగు శ్రవ్యకావ్యములు వేఱుగను, సంవాదాత్మకములగు దృశ్యకావ్యములు వేఱుగను నున్నవి.

తెనుఁగు ప్రబంధము గద్య పద్య కథన సంవాద వర్ణనాది వివిధ ప్రక్రియల నేకత్ర రాశీభూతముగఁ జేసిన సంపూర్ణమూర్తి. ఈ ప్రబంధమే మనకుఁ బ్రత్యేకముగ గద్యకావ్యములులేని లోటును దీర్చినది. కళాపూర్ణోదయమువంటి నవలలు నీప్రబంధముననే యిమిడియున్నవి.

ఇట్టి వైలక్షణ్యముగల సరస్వతీమూర్తి భారతదేశ భాషలలో నింకెందును లేదు. మనవారీ హేతువుచేతనే ప్రబంధ కవులను మహాకవులుగ పరిగణించిరి. ఇది కవితాశక్తుల నన్నిటిని నొరసిచూచు స్థానమని వారి యభిప్రాయము.

# ప్రబంధములు - పాత్రచిత్రణము

మహాకవి ప్రతిభకుఁగల ముఖ్యలక్షణములలో నొకటి పాత్రనిర్మాణ కౌశలము.

సజీవపాత్ర నిర్మాణకౌశలము సామాన్యకవుల కందఱకును నందుబాటులో నుండునది కాదు. పురాణ కవులకును, ప్రబంధ కవులకును గల ముఖ్యభేద మీపాత్రనిర్మాణ నైపుణియందే కానవగును. పురాణకవులు సాధారణముగాఁ బాత్రల యింగితాకార చేష్టాదులను వ్యక్తముచేయుటలోఁ దటస్థభావమును వహింతురు. కథాకథనము, ధర్మస్థాపనము మొదలగు విషయములే వారి కాదరణీయములై యుండును. ఈ రెంటికిని సామరస్యమును గుదిర్చిన తిక్కనవంటి మహాకవులు కొలఁదిమంది మాత్ర మేగలరు. అట్టియెడ నమ్మహాకవులును బ్రబంధధోరణి నాశ్రయించిరనియే చెప్పనొప్పును.

సజీవపాత్ర నిర్మాణ మనఁగానేమి ?

పాత్రలు కొఱడుపాఱి కొయ్యబొమ్మలవలెనుండక చైతన్య సహితములై యుండవలయును. సచేతనత్వమునకు ముఖ్యలక్షణము వైవిధ్యము. అనఁగా నే రెండు పాత్రలును నొక తీరున నుండకుండుట. ప్రపంచమున మనుజుని బోలిన మనుజులున్నను నన్నిలక్షణములయందును వారికి నేకీభావముండుట దుర్లభము. ఎద్దియైనను వైలక్షణ్యము వారియందు గోచరించియే తీరును. బాహ్యజగత్తు కావ్యజగత్తునందుఁ బ్రతిబింబించునుగాన విశ్వ నిర్మాతయగు బ్రహ్మకుఁ గావ్య నిర్మాతయగు కవి ప్రతిద్వంద్వి యగుచున్నాఁడు. కావున బ్రహ్మ సృష్టియందుఁ గన్పట్టు వైవిధ్యము కవిబ్రహ్మ సృష్టియందును గన్పట్ట వలయును. 'అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః' అను నాలంకారిక వచన మీవిషయమునే బోధించుచున్నది. ఈ వ్యక్తి వైవిధ్యమే లేకున్నచోఁ బాత్రలు నిశ్చేతనములై పోతఁబోసిన బొమ్మలపగిది నుండును. అట్టి పాత్ర నిర్మాణము మహాకవి ప్రతిభకుఁ దార్కాణము కాదు.

సజీవపాత్ర నిర్మాణకౌశలము ప్రబంధ కవుల కందఱకును గలదని చెప్పఁజాలము. గతానుగతికముగా రచించిన కవులనేకులు గలరు. కాని సజీవ పాత్ర నిర్మాణము నద్వితీయముగా నిర్వహించిన మహాకవులును గలరు. అట్టి వారిలో నొక్కఁడల్లసాని పెద్దనార్యుఁడు.

పెద్దనార్యుని మనుచరిత్రము శాంతశృంగారములు సంగమించిన తీర్థమని చెప్పవచ్చును. సహజ శృంగారప్రియమైన చిత్తము శాంతోన్ముఖమైనపుడు

రచింపఁబడిన గ్రంథమిదియని యిందలి ప్రతిపద్యమును జెప్పకచెప్పుచున్నది. మహాకవి పోతన భక్తి శృంగారములను జోడించెను. పెద్దనార్యుఁడు శాంత శృంగారములను నేర్పుతోఁ గలిపెను.

ఈ గ్రంథమున మొదటి మూఁడాశ్వాసములయందును నద్వితీయ శిల్ప సామర్థ్యము చూపఁబడినది. అయ్యెడఁ దాండవించు రెండు పాత్రములును (ప్రవరుఁడు-వరూధిని) బెద్దనగారి పాత్రనిర్మాణసిద్ధికి సంభాషణ చాతుర్యము నకు బుద్ధివిన్యాసమునకు విరోధిరసముల సంఘర్షణకు లక్ష్యీభూతములుగా నున్నవి.

అట్టి శక్తితో సృజించిన పాత్రలు కావుననే ప్రవరుఁడును వరూధినియు నేఁటికిని సజీవులైయున్నట్లు భావుకుల మనోనయనములకు గోచరించుచున్నారు. జితేంద్రియత్వమునకు శుకమహర్షిని బేర్కొనుటమాని యాంధ్రులు మనుచరిత్ర పుట్టినదాదిగాఁ బ్రవరుని జెప్పుకొనుచున్నారు. అట్లే వలపుఁ బ్రయోగమునకు రంభను మఱచి వరూధినిని బేర్కొనుచున్నారు. ఈ పాత్రముల సజీవతకును నాంధ్రుల మనఃప్రపంచమున నవి కల్పించిన పరివర్తనమునకును నిదియే తార్కాణము. తిక్కన సృజించిన భారత పురుషులకుఁ బిమ్మట నాంధ్రులతో నింత సన్నిహితత్వముగల పాత్రలను సృజించిన మహాకవి లేనేలేఁడు.

ఈ నిర్మాణమున కావశ్యకమైన తత్తత్పాత్రల యింగిత పరిజ్ఞానమును తదుచితమైన సంవాదసరణియు నాటకీయమైన తటస్థపద్ధతియుఁ గృతహస్తుఁ డైన పెద్దనకుఁ జక్కగా నలవడినవి. ఈ రెండు పాత్రలును కేవల విరుద్ధము లైన రెండు రసముల నాశ్రయించి యున్నవి. కవి యీ రెంటియందు నేదెనకు మ్రొగ్గక యిరుపంకలను సమదృష్టినే పెట్టి యీ రెండు రసములను సమాన గాంభీర్యముగల ప్రవాహముగనే నడిపెను.

మనుచరిత్రమును జదివినవారెవ్వరును వేశ్యయనికాని శ్రోత్రియునకు వ్రతభంగము చేయనెంచిన వలపుకత్తె యనికాని వరూధినిని నిరసింపరు. మీదుమిక్కిలి యామె యనురాగము విఫలమైనదని చింతించెదరు. అట్లయ్యు నామెవలలోఁ బడక ధీరుఁడై తప్పించుకొనిన ప్రవరుని దలంచి భక్తిపూర్వక నమస్కారమును గావింతురు. ఇది కవిలోని సమభావమునకు ఫలము.

ఉత్తరార్థమునఁ బద్యరచనాసౌందర్యము, కథాకథన చాతుర్యము మున్నగు నితర గుణములు గలవేకాని పాత్రచిత్రణమని చెప్పఁదగినది లేదు. ఆ కథాభాగమును నట్టిది కోరదు.

అద్వితీయ సౌందర్యమునకును నమేయ వైరాగ్యమునకును నాటపట్టైన వాఁడు ప్రవరుఁడు. వివిధాధ్వర నిర్మల ధర్మ కర్మ దీక్షాపరతంత్రుఁ డనియు ననారతాధ్యాపన తత్పరుఁడనియు నాతఁడు కవిచే వర్ణింపఁబడినాఁడు.

వాని చక్కఁదనము వైరాగ్యమునఁజేసి
కాంక్ష సేయు జారకామినులకుఁ
బూచిన సంపెంగ పొలుపు మధుకరాంగనకుఁ
బోలె భోగబాహ్యమయ్యె.

అని కవియే మెలమెల్లగ వచించి ముమ్ముందు జరుగనున్న కథాప్రణాళికకు బీజస్థాపనముఁ గావించినాఁడు. ప్రాతఃకాలముననే వామనస్తుతి పరత్వమున లేచి వరణాతరంగిణీయం దఘమర్షణ మంత్రములు పఠించుచు మున్కలిడుట, సంధ్యాద్యనుష్ఠానములను నిర్వర్తించుకొని సమిత్కుశకుసుమ ఫలాదులను గొని బ్రహ్మచారులు వెంటనంటి వచ్చుచుండగాఁ గృహంబునకు మరలుట, నిత్యాగ్నిహోత్రమును నిరతాన్నప్రదానమును గావించుట ప్రవరునకు దిన కృత్యములు. ప్రవరుఁడప్రతిగృహీత. కుల శీల శమ దమాదులయందుఁ బతి యడుగుజాడలనే నడచునది యాతని యిల్లాలు. అర్ధరాత్రంబున నతిథు లేతెంచినను పలయు భోజ్యము లామె యవ్వారిగాఁగ వడ్డించునఁట.

అహర్నిశలయందును నతిథిసేవాతత్పరుఁడైయున్న ప్రవరు నింటికొకనాఁ డొక సిద్ధుఁడువచ్చి తీర్థయాత్రాచరణమునం దాసక్తుఁడైయున్న ప్రవరుని పాదము లకు సిద్ధౌషధము నొకదానింబూసి యథేచ్ఛఁ జనినాఁడు. ఆ యౌషధ ప్రభావ మునఁ బ్రవరుఁడు హిమవన్నగమున కేగినాఁడు. చూడవలసిన తావులన్నియుఁ జూచి యింటికేగ నుద్దేశింపఁగా సిద్ధుఁడొసఁగిన పాదలేపనము కరఁగిపోయినది. విచారపరీత చేతస్కుఁడైన ప్రవరుఁడు విధివశమున వరూధినియను స్వర్వేశ్య వసించియున్న స్థలమున కేగెను.

ఇట వరూధినీవర్ణన మత్యద్భుతముగాఁ గావింపఁబడినది. అద్వితీయ రూప లావణ్యయగు నయ్యచ్చరలేమ మకరాంక శశాంక మనోజ్ఞమూర్తియగు ప్రవరుని నేకాంతమున జూచినంతనే కామించినది. మహీసురాన్వయంబెక్కడ నీతనూవిభవమెక్కడ నను నాశ్చర్యమామెకుఁ గలిగినది. నునుసిగ్గు దొంతరలు క్రమ్ముకొని రాఁగా నొక్క పోకనునుబోదియఁ జేరి విలోకన ప్రభావీచికలఁ దదీయ పదవీకలశాంబుధి వెల్లిఁగొల్పినది.

ప్రవరుఁడు వరూధినిని సమీపించినాఁడు. మదనవేదనకు లోనయి తత్తరపాటుతోడఁ దన త్రోవకడ్డముగా నిలిచిన యయ్యంగనామణినిఁ జూచి విభ్రాంతుఁడై యాతఁడిట్లు పల్కినాఁడు :

ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ యొంటి చరించెదోట లే
కివ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవఁ దప్పితిన్
గ్రొవ్వున నిన్నగాగ్రమునకున్ జనుదెంచి పురంబుజేర నిం
కెవ్విధిఁగాంతుఁ జెప్పఁగదవే తెరువెద్ది శుభంబు నీకగున్.

ఇది ప్రవరుని తొలిపలుకు. ఒంటిగా నివ్వనభూమిఁ జరించు నీ వెవ్వతెవని యాతని ప్రశ్న. నేను బ్రాహ్మణుఁడను గ్రొవ్వి యిన్నగాగ్రమునకుఁ జనుదెంచి త్రోవతప్పితిని. తెరు వెఱింగింపుమని ప్రార్థన. శుభంబు నీకగునని యాశీర్వాదము.

ఈ పద్యమున శుద్ధశ్రోత్రియునకుఁగల నిరాడంబర చిత్తవృత్తియు, నిష్కల్మషమైన వాగ్ధోరణియు నతి మనోజ్ఞముగా జిత్రింపఁబడినవి. క్రొవ్వి యిన్నగాగ్రమున కేతెంచితినని తన్నుదాను నిందించుకొనుటయు శుద్ధశ్రోత్రియ లక్షణమే. నిష్కపటమైన యీ ధోరణి నాలించి నిలింప వేశ్యయు నొక్కింత నవ్వి నర్మగర్భముగా నిట్లు ప్రత్యుత్తర మిచ్చినది :

ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరి వేఁడెదు భూసురేంద్ర ! యే
కాంతమునందునున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించుటా
గింతియెకాక నీ వెఱుఁగవే మునువచ్చిన త్రోవచొప్పు నీ
కింత భయంబులేకడుగ నెల్లిదమైతిమి మాటలేటికిన్.

శుద్ధసత్త్వమూర్తియగు ప్రవరునకీ సమాధానమునందలి యంతరార్థము గోచరింపలేదు. నీ వెవ్వతెవన్న ప్రశ్నకు సమాధానముగా వరూధిని యీ క్రింది ప్రత్యుత్తర మిచ్చినది :

చిన్నివెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ
 బొడమిన చెలువ తోఁబుట్టు మాకు
రహిపుట్టఁ జంత్రగాత్రముల రాల్గరఁగించు
 విమల గాంధర్వంబు విద్య మాకు
నసవిల్తు శాస్త్రంపు మిసుకులావర్తించు
 పని వెన్నతోడఁ బెట్టినది మాకు
హయమేధ రాజసూయములనఁ బేర్వడ్డ
 సవన తంత్రంబు లుంకువలు మాకుఁ
గనకనగసీమఁ గల్పవృక్షములనీడఁ
బచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకుఁ
బద్మసంభవ వైకుంఠ భర్గ సభలు
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర !

ఈ యుపన్యాసమంతయుఁ దెరువెఱుంగక పరితపించుచున్న ప్రవరునకు వ్యర్థప్రలాపమువలెఁ దోఁచినది. కుందనమువంటి మేను మధ్యందిన మర్త్తాండాహతిఁ గందిపోయెనేయని వాపోపుచు నస్మద్గృహము పావనముచేసి బడలిక వాయఁగాఁ జనుమనిన వరూధినికి, భక్తియ చాలును, నగరమార్గంబుఁ జూపి పుణ్యమునఁ బొమ్మని ప్రవరుఁడు సమాధాన మిచ్చినాఁడు. భూసుర కైతవ కుసుమ శరాసన యని వరూధినిచేసిన సంబోధనమునందలి భావము ప్రవరునకు రుచింపలేదు. నీవుచేసిన 'సపర్యలు మాకువచ్చె నిందుండఁగ రాదు పోవలయు నూరికి నిప్పుడేను రాకుండ నొకండు వచ్చి మఱియొండునె భక్తియెచాలు'నని మాయలేని మాటలుపల్కి కరుణింపు నాపయినని దీనుఁడై ప్రార్థించినాఁడు.

ఏనిక నిల్లుసేరుటకు నెద్ది యుపాయము మీ మహత్త్వముల్
మానిని దివ్యముల్ మదిఁదలంచిన నెందును మీ కసాధ్యముల్
గానము గాన తల్లి! ప్రజలన్ నముఁగూర్పుమటన్న లేత న
వ్వాననసీమఁ దోఁప ధవళాయతలోచన వాని కిట్లనున్.

ఈ పద్యమునందుఁ బ్రవరుని యమాయకత్వమును నాతురతయుఁ బ్రస్ఫుటములైయున్నవి. 'తల్లి'యన్న సంబుద్ధి వరూధినికి వజ్రపుఁబోటువలె నుండి యుండును. ఈ యమాయకునితో నర్మోక్తులాడుటవలనఁ బ్రయోజనము లేదని తెలిసికొని 'నిక్కము దాపనేల ధరణీసురనందన! యింక నీపయిం జిక్కె మనంబు నాకు' అని స్పష్టముగాఁ దనకోర్కె నెఱింగించినది.

'వ్రతులై దినములు గడపెడు విప్రులఁ జనునే కామింప మది విచారము వలదే' యని యాబ్రాహ్మణుఁడామె కోర్కెను నిరసించి పల్కినాఁడు. ఇఁక యుక్తులపై యుక్తులు ప్రబలినవి.

'కుంభగత ప్రదీపకళికా శ్రీదోఁప నెందెందుఁ బోకెందే నింద్రియముల్ సుఖంబుగను నాయింపే పరబ్రహ్మ మానందోబ్రహ్మయటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా' యని యామె కుతర్కముఁ గావింపఁగాఁ బ్రవరుఁడు సిగ్గును వెగటును బొడమ నిస్పృహతఁ దెలుపునొక చిఱునవ్వు నవ్వినాఁడఁట. ఈ యొక్కమాటలోఁ బ్రవరుని యంతర్మూర్తిని బ్రత్యక్షము గావించినాఁడు పెద్దన. 'ఈ పాండిత్యము నీకుఁదక్క మఱియెందేఁ గంటిమే' యని తిరస్కరించి 'యిఁక నేలా తర్కముల్' అని యుదాసీనుఁడైనాఁడు ప్రవరుఁడు. 'చెప్పకుమిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపైఁ దేనియల్'అని తుదిమాట నిష్కర్షగాఁ జెప్పినాఁడు. 'నాకరణుల్ దర్భలు నగ్నులున్ బ్రియములైనట్లన్యముల్ గావు' అని తన యైహికేచ్ఛావిముఖత్వమును బ్రవరుఁడు ప్రస్ఫుటము గావించినాఁడు.

ఇట్లు స్థిరనిశ్చయుఁడై యున్న బ్రాహ్మణునిపైఁ దన శృంగారాస్త్రము లేమియుఁ బనిచేయలేదని వరూధిని గ్రహించినది. ఇంకనొక్క యస్త్రము మాత్రము మిగిలియున్నది. 'అనునయాలాపాతి దీనాస్యయై' వెతలం బెట్టకుమింక సన్ననుచు నీవీ బంధమూడఁ గౌగిలించినది. కాని యా యస్త్రముకూడ నిట నిష్ప్రయోజనమే యైనది. 'హా శ్రీహరీ యని బ్రాహ్మణుఁ డోరమోమిడి తదీయాంసద్వయంబంటి పొమ్మంచుం ద్రోచి'నాఁడు. 'కలంచు నే సతుల మాయల్ ధీరచిత్తంబులన్' అని కవియొక నిట్టూర్పు విడిచినాఁడు. అట్లు త్రోపువడి వరూధిని ఘనలజ్జా పరవశయైనది. వేదన నెపంబిడి కలస్వ నంబున నేడ్చినది. పరాశరాదుల కామకేళీ పరతంత్రత్వము నుదాహరించి వారి కంటె నీ మహత్త్వంబు ఘనమేయని వాదించినది. కాని యేమిప్రయోజనము? ప్రవరుఁడిట్టి మాటలకు బ్రత్యుత్తర మిచ్చువాఁడుకాఁడు. మీదుమిక్కిలి యవ్వన జగంధి మేని జవ్వాదివసన గదంబించు నొడలు గడిగికొని వార్చి ప్రవరుఁడు పరిశుద్ధుఁడైనాఁడుఁట. ఇట్టిదికదా నిగ్రహము!

మనుచరిత్రమునందలి పాత్రనిర్మాణ కౌశలమంతయు నీ రెండు పాత్రల నాశ్రయించియే యున్నది. తృతీయాశ్వాసమునందలి వరూధిని చరిత్రము కడుంగడు విషాదపూరితము. ఆమె జవ్వన మడవికాచిన వెన్నెల యైనది. ఆమెవలపు నిష్ఫలమైనది. తన యమర్త్యభావమే తనకు రోఁతఁగాఁ దోచినది. కాంతుఁడవజ్ఞ చేసినంతనే కాయము వాయఁగల మర్త్యభామినులెంత తపముఁ జేసి జనియించిరో యని యామె నిట్టూర్పులు నిగిడ్చినది. ఈ వలపుపిచ్చిలో మాయాప్రవరుని మాయలకు లోనైనది. స్వారోచిషమనుసంభవమున కాది కారణమైన యయ్యచ్చర పేరైనను దృతీయాశ్వాసానంతరము స్మరింప కుండుట మఱియు శోచనీయమైన విషయము. ఇంతకును వరూధినీ వృత్తాంతము విషాదరేఖా శబలితము.

పెద్దన తన గ్రంథమునం దంతటను బురుషుని యౌన్నత్యమునే చూపి యాడుదానిననదగా నిరూపించి యామె పురుషుని బ్రేమభిక్ష వేడుచున్నట్లు చిత్రించినాఁడు. ఈ విషయమున నీతనికిఁ బ్రతిద్వంద్వియై నిలిచినవాఁడు ముక్కు తిమ్మన మహాకవి. ఈతఁడు సృజించినపాత్ర ఖండితనాయికయగు సత్యభామ. ప్రవరుఁడు వలపులకాణాచియగు వరూధినినిఁ బొమ్మంచు తిరస్కరించినాఁడు. సత్యభామ లతాంతాయుధుఁ గన్నతండ్రి శిరమును వామపాదమునన్ దొలఁగఁ ద్రోచినది. మనుచరిత్రమునఁ బురుషునకు విజయము సంభవించినది. ఇట స్త్రీలోకము విజయదుందుభి మ్రోగించినది. మహాకవి తిమ్మనార్యుఁడు మాన క్రోధ వివశయైన సత్యభామ నొక యాటబొమ్మవోలె నాడించినాఁడు.

మనము తొలుదొల్త సత్యభామను నగరిపొంత నొక శృంగారవనములో దర్శింతుము. దిద్దితీర్చిన పూఁబేనియ మేటికాలువదరిని జెంగల్వపుప్పొళ్లు నించిన చంద్రోపలవేదిపై నాయమ తన చెలిమికత్తియతో సరసగోష్ఠిం దేలుచు వనజాతాయతనేత్రుఁడైన శౌరిగుణములను వర్ణించుచుఁ గాలయాపనము చేయుచుండును. కాలయాపనము చేయుచున్నదే కాని సత్యభామబుద్ధిమాత్రము సంశయగ్రస్తమై యున్నది. అళికులారావములుగాని, కిసలయాకుల కోకిల కాకు కాకలీ కలకల నాదములుగాని యాయమ మనంబున కింపు నింపలేదు. కమ్మని తమ్మి కొలంకులనుండి వీతెంచు తెమ్మెరలును నాహ్లాదజనకములు గాకుండెను. కారణమేమి ? అంతలోనే దక్షిణాంసచూచుక నయన ప్రకంపము సంభవించినది. అమ్మానవతి హృదయమును నీ యపశకునములచే సంశయాకులితమైనది. కాని తనకుఁ గలుఁగఁబోవు మహాపద యెట్టిదైయుండునో యామె నిర్ణయింప లేకుండెను. ప్రాణనాథుఁడొండొక చపలాక్షినిగూడి తన్నొల్లని చెయిదము లేమియైనఁజేసి యుండునేమోయని యామెకు సంశయ ముదయించినది. ఇంత కంటె మహాపద యయ్యిందువదన కుండదుకదా !

ఇంతలోనే నెచ్చెలి వచ్చినది. కనుగవ నెఱసంజ వాడమగాఁ బారిజాత ప్రసూన వృత్తాంతమంతయుఁ జెప్పినది. అమరైకయోగ్యము, నతిసౌఖ్యకరము, ననితరసులభమునైన యా దివ్యకుసుమమును గొప్పులోఁ దాల్చుటయేతడవుగ సానఁబట్టిన మకరాంకుశస్త్రముగతిఁ దేజరిల్లినదనియు నా కుసుమధారణము వలన నామెకు మహామహిమ హెచ్చుటచే గద్దియమీదనెక్కి ముల్లోకములుఁ దానె యేలుగతి నున్నదనియుఁ దోడి కామినీలోకము మచ్చరంబును మదిలోనఁ దొఱంగి యామెను భయభక్తులతో భజింపుచున్నారనియు నా వాక్యముల సారాంశము. ఇంతేకాక సత్యభామకుఁ గోప మతిశయించుటకై యీ క్రింది రీతి నా చెలికత్తియ వచించినది :

ఎంతకులేఁడు నారదమునీంద్రుఁడు శౌరివినంగ రుక్మిణీ
కాంతవినంగ నేను వినఁగాఁ బలికెన్ బతిఁగూర్చుదాన నా
యంతటివారు లేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీగుచున్
వంతునవచ్చు సత్యగరువంబికఁ జెల్లదటంచు మానినీ !

మానినీ ! యను సంబోధన సాభిప్రాయము.

ఆ రణభోజనుమతకము
లా రుక్మిణి నటనలా మురాంతకు చెయ్వుల్
చేరి కనుంగొనుచో నె
వ్వారికిఁ గోపంబురాదు ? వారిజనేత్రా !

అగ్నికి వాయువు తోడైనది. సత్యభామ కిది సైరింపరాని యపచారము. మొదల నద్దివ్యకుసుమంబు వెన్నుఁడు రుక్మిణికిచ్చుటయే యోర్వరాని పని. అంతతోఁబోక తమ్ముఁగూర్చి కలహభోజనుఁడాడు మాటలనుగూడ శౌరి సైరించుటయా? అదియు సపత్నిముందఱ. మాన మప్రతిహతవేగమున విజృంభించినది. ఈర్ష్యాసూయ లా క్రోధాగ్నికి వీవనలు వీచినవి. ఇంకేమున్నది? ఇచ్చటి సత్యభామా స్వరూపమును గవి యెంత మనోహరముగఁ జిత్రించినాఁడో చూడుఁడు :

అనవిని వ్రేటువడ్డ యురగాంగనయుంబలె నేయివోయ భ
గ్గనదరికొన్న భీషణ హుతాశనకీల యనంగ లేచి హె
చ్చిన కనుదోయి కెంపు తనచెక్కుల గుంకుమ పత్రభంగ సం
జనిత నవీనకాంతి వెదఁజల్లఁగ గద్గద ఖిన్నకంఠియై.

అసూహ్యమగు నవమానము దుర్భరమగు నావేదనము సత్యభామ మనస్సును మొదలంటఁ గలంచివైచినవి. కాని కౌతుకముమాత్రము పని చేయుచునే యున్నది. తన్నుఁగూర్చి రుక్మిణీసతి యేమైన నన్నదేమోయన్న సందియమామెను మిక్కుటముగ బాధించుచున్నది. 'రుక్మిణీసతి'యని సత్యభామ నోటఁ బలికించిన కవిప్రతిభ యనన్య సామాన్యముకదా! చెలికత్తె చెప్పిన వాక్యము నాలించినంతనే సత్యభామకుఁ బట్టరాని యాశ్చర్యము కల్గినది. నిజముగా నిట్టిది జరిగెనాయను సందేహము క్షణమాత్రమామె మనస్సునఁ బొడసూపినది. అప్పటి యామె మనఃపరివర్తనమును ముక్కుతిమ్మనార్యుఁ డీ క్రింది విధమున వ్యక్తముచేసి యున్నాఁడు :

ఏమేమీ! కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా?
యా మాటల్చెవియొగ్గి తా వినియెనా? యా గోపికావల్లభుం
డేమేమాడెను రుక్మిణీసతియు? నీ వింకేటికిం దాఁచెదే!
నీ మోమాటలుమాని నీరజముఖీ! నిక్కంబెఱింగింపవే.

అతుల మహానుభావమని యవ్విరిఁ దానొక పెద్దసేసి య
చ్యుతునకు నిచ్చకంబొదవ నూడిదయిచ్చిన నిచ్చెఁగాక తా
నతఁడు ప్రియంబుగల్గునెడ కర్పణచేసినఁ జెసెఁగాక యా
మతకరి వేలుపుందపసి మమ్ముఁ దలంపఁగనేల యచ్చటన్.

ఈ పద్యములలోని ప్రతిపదము సన్వర్థమనియే చెప్పవలెను. 'ఒక'యను పదమువలన సత్యభామ కవ్విరిపైఁగల యలక్ష్యభావము సూచింపఁబడినది. రుక్మిణి యను పేరుచెప్పక ప్రియముగల్గునెడకని చెప్పుటచే సత్యభామకు సవతియగు రుక్మిణిపైఁగల యసూయ సూచింపఁబడినది. అప్పట్టున రుక్మిణి

పేరుచ్చరించుటకూడ సత్యభామకనిష్టమగు కార్యమే. ఇది నారీజన సహజమగు గుణము. మఱియు సత్యభామవంటి మానవతికెంతయుఁ దగియున్నది. నన్ననుటకు బదులు మమ్మని చెప్పియుండుటచే స్వాభిమానాతిశయము సూచింపఁబడినది. తరువాతఁ గవి సత్యభామకుఁగల కోపకారణమంతయు నీక్రింది పద్యములలో వ్యక్తముచేసి యున్నాఁడు :

పలుదెఱగు ముళ్లమాటలఁ
గలహామె కళ్యాణమని జగంబుల వెంటన్
మెలఁగెడు మౌనికి సహజము
వలదని వారింపవలదె వల్లభుఁ డతనిన్.

మునియేమిసేయు రుక్మిణి
గౌనఁ గారణమేమి ధూర్తగోపాలుఁడు సే
సిన చెయిదమేమి చెప్పుదు
మనమెరియదె ప్రాణమైన మగఁడిట్లయినన్.

కలహాభోజనుఁడైన నారదుఁ డట్టిమాటలాడుటలో సత్యభామ కాశ్చర్య కరమగు నంశమేమియును లేదు. కాని యాతఁడట్టి మాటలను సపత్నియెదుట నాడుచుండఁగా వల్లభుఁ డూరకుండుటయా ? మగఁడే యిట్లయిన నింక నాసతిని మన్నించువారెవరు ? ఇంతకును మగవారందఱు నట్టివారేయని యామె సిద్ధాంతము. ధూర్తగోపాలుఁ డనుటచేఁ బనులమేవరికి నుత్తమ గుణము లుండునా యని సత్యభామ యభిప్రాయము. ఆమె తనభర్తను ప్రాణతుల్యముగఁ బ్రేమించినది. నిజమాలోచింపఁగాఁ బ్రాణమైన మగఁడిట్లగుట విచారకారణమే. ఒకని దుండగ మందఱకు నుపద్రవకారణమైనట్లు సత్యభామాక్రోధము మగజాతి నందఱను విసరికొట్టినది :

పరికింపరు తమజాడలు
తరుణుల తగులములు నమ్మఁదగదంద్రుమదిన్
శరదంబుద చలచిత్తులు
పురుషులెపో వారినమ్మఁ బోలునె చెలియా !

ఇంతలో నీర్ష్యాసూయలకుఁ జేఁదోడువాదోడుగా నభిమానము తలసూపి నది. ఇట్టి తిరస్కృతినందిన తానెట్లు సపత్నులయెదుటఁ దలయెత్తి తిరుగఁ గలదు ? మగఁడు తనగీచినగీటు దాటఁడను గర్వము తనకీనాఁటి కడఁగి పోయినదని సపత్నులు మనసునందైన ననుకొనరా ? ఇప్పటి సత్యభామా చిత్తవృత్తి నీక్రింది పద్యములలోఁ గడుంగడు మనోహరముగాఁ జిత్రించి యున్నాఁడు :

ఇన్నిదినంబులు న్సవతులిందఱలోఁ గడు గారవంబునన్
గన్నియ నన్ను వల్లభుఁడుఁ గన్నులఁ గప్పుకొనంగనుండి యా
పన్నియు వాసియుం దఱిగి వారు ననుందలలెత్తి చూడఁగా
సన్నల జాయలం బలుక సైఁతునె ప్రాణము లెంతతీపొకో!

నా మొగమాటకై పలసి నాటకముల్ఘటియించి రుక్మిణీ
కామినిమీఁదటంగలుగు గౌరవముం గృపయుం బ్రియంబు దా
నేమియుఁ గాననీక యిట నిన్నిదినంబులు నన్నుఁ దేల్చెనో
తామరసాక్షి! మెచ్చవలదా మురదానవభేది కృత్యముల్.

ఓ చెలి! శౌరికిచ్చెనఁట యొక్క లతాంతముదెచ్చి నారదుం
డా చపలాక్షి కిచ్చెనఁట యాతఁడు నవ్విరి యిట్టిమాట లా
హా! చెవులన్వినంబడియుఁ బ్రాణము దాల్చెద మేన నింతఁగా
నోచితి నింక నెట్టివి కనుంగొన నెమ్మెయినున్నదాననో!

సత్యభామకు స్వాభిమానము మెండు. 'నారదుఁ డొక్కలతాంతము శౌరి కీయఁగా నది యాతఁడు రుక్మిణి కొసఁగినాఁడు' అను నీవాక్యము వినియు జీవించియుండుట హేయమని యామె నిశ్చయము. ఇన్నిదినములు నీపై నధికాను రాగముగల కృష్ణుఁడింతలో నిట్లు మాఱుటకుఁ గారణమేమి? యని యందురా యది పట్టి నటన. మున్నుగూడ నా రుక్మిణియే కృష్ణునకుఁ బ్రియతమ. నాపైఁ జూపిన ప్రేమయంతయు నా ధూర్తగోపాలుని కపటనాటకము. ఇది యామె వాదము. కష్టసుఖములు కావడికుండలుకదా! ఇంతమాత్రముననే రుక్మిణి యంత మురియనగునా?

పూనుకొని మేలుఁగీళ్లకు
లోనయి విహరించువారి లోక మెఱుఁగదో!
యా నరకాసుర దమనుఁడు
దా నెఱుఁగఁడొ భోజకన్య తా నెఱుఁగదొకో!

నరకాసుర దమనుఁ డనుటచే నరకాసుర వధయందలి సత్యభామా సాహాయ్యము సూచితము. కాని యిదియంతయు నొక్కపెట్టు. విరిధరించిన యా భోజకన్యను సపత్నులందఱు గారవమున నుజ్జగించి భజించుట యొక్క పెట్టు. ఇంతలోఁ దనయెడఁ బతి మున్నుచూపిన ప్రేమ జ్ఞప్తికివచ్చినది. ఇది యాడువారికి సహజగుణము. వారేవిషయమునైనను ద్రవ్వి తలకెత్తక విడువరు. మేలుగీడులలో నెద్దివచ్చినను వాని పూర్వాపరములన్నియుఁ బూసగ్రుచ్చినట్లు వారికి జ్ఞప్తికి వచ్చును. మానక్రోధ వివశయైయున్న సత్యభామకు మున్ను కృష్ణుఁడును దానును సలిపిన వనవిహారములు నడపిన యుత్సవములు ననుభ

వించిన కేళీవినోదములు జ్ఞప్తికి వచ్చినవి. కలలోనైనను నవ్వులకైనను దన మాట నాతఁడు జవదాఁట వెఱచుననియు నెట్టిపదార్థంబు నామెయెదుటఁ బెట్టక మున్న యెవ్వారికి నొసంగఁడనియుఁ జెలులామెతో నేమి కొండెములు చెప్పి పోదురోయని వారికి లంచము లిచ్చుననియుఁ దోడిచేడియలు వంతులకామెతో నిలువఁగా నయ్యది యాతఁడు సైరింపఁ జాలఁడనియుఁ గపటమెఱుఁగని మమతలతోఁ గలసిమెలసి యిన్నినాళ్లుంటిమనియు సత్యభామ తన చెలిమికత్తెకడ వచించినది.

ముక్కు తిమ్మనార్యుఁడు సత్యభామా స్వభావోన్మీలనము గావించుటలోఁ గడుజాగరూకత వహించినాఁడు. మానక్రోధవివశయయ్యు నీర్ష్యాసూయలచేఁ గలంచఁబడియు సత్యభామ మహాపతివ్రత. ఆమె పతినిఁ బ్రాణతుల్యముగఁ బ్రేమించినది. తానెట్లు పతిని బ్రేమించుచున్నదో పతియుఁ దన్నట్లే ప్రేమింప వలయునని యామె యాశయము. ఆమెకుఁగల ప్రేమప్రభావమే యామె యీర్ష్యా సూయలకు గారణముగాని మఱెట్టి దురాలోచనములునుగావు. ఆమెకుఁ బతి యెడఁగల ప్రేమను కవి యీ తీరున వ్యక్తముచేసియున్నాఁడు :

పతిప్రాణసదృశబంధువు
పతిదైవం బేడుగడయుఁ బతిసతులకు న
ప్పతియ కడుమేరఁ దప్పిన
గతి కులకాంతలకు వేఱు గలదే చెపుమా !

ధనమిచ్చి పుచ్చుకొన్నను
మనమున నోర్వంగవచ్చు మగఁడింతులకున్
జనవిచ్చి పుచ్చుకొన్నను
మనవచ్చునె యింక నేటిమాటలు సెపుమా !

ఇంతతో సత్యభామా స్వభావోన్మీలనమునందలి యొక ప్రకరణము సమాప్త మైనది. ఇందుఁ దిమ్మనార్యుఁడు చూపిన మనోవృత్తి వివరణకౌశల మద్భుతము.

సత్యభామ సుందర సుకుమార శరీర. పతివ్రతలలో నగ్రగణ్య ప్రేమ స్వరూపిణి. కాని యా ప్రేమ సాపేక్షము. అందువలననే యీర్ష్యాసూయలకుఁ దావలమైనది. ప్రప్రథమమునఁ దనచెలికత్తె పారిజాతకుసుమ వృత్తాంతమును జెప్పఁగనే యామె హృదయమును గ్రోధాశ్చర్యములు రెండు నొక్కసారియే పెనగొన్నవి. తన్ను నిందించుటచేఁ గ్రోధము నిట్టిది జరిగెనా యను నాశ్చర్యము. అందులకే 'యేమే మీ కలహాశనుండచటికై యేతెంచి యిట్లాడెనా యా మాటల్ చెవియొగ్గి తా వినియెనా యా గోపికా వల్లభుండు' అని యామె ప్రశ్నించినది.

ఈ క్రోధాశ్చర్య సందేహములకుఁ దోడభిమాన మవతరించినది. ఎవరికో యేదో మగఁడిచ్చినాఁడన్నంత మాత్రమున నింతగాఁ జిందులు ద్రొక్కుటకుఁ దానేమి చులకన మానిసియా? అట్లుగాదు. అభిమాన కారణము వేఱు. మతకరివేలుపుందపసి తమ్ముఁ దలంచుటయే యపచారము. వానిని జెవియొగ్గి తన ప్రాణవల్లభుఁడు వినుట మహాపచారము. ఇట్లవమానితయై హేయపుంబ్రతుకు బ్రతుకుటకంటె మరణించుటయే మేలుకదా! ఇట్లు వగల మిగులఁ బొగులుచుఁ గ్రోధాగారమున నామె ప్రవేశించినది.

తొలుతఁ గ్రోధము, పిదప నాశ్చర్యసందేహములు, తుదకు దుఃఖము సత్యభామామనోవృత్తి పరిణామమునందలి సోపానములు.

సత్యభామా స్వభావోన్మీలనమునందలి రెండవయంతరు వామె క్రోధాగార ప్రవేశముతో నారంభమగును.

అని వగల మిగులఁ బొగులుచు
జనితామర్షమునఁ గోపసదనంబునకున్
జనియెను లతాంగి హరిచం
దన కోటరమునకు నాగతరుణియుఁ బోలెన్.

క్రోధవివశయైయున్న సత్యభామ సురగాంగనతోఁ బోల్చుటెంతయు నుచితమై మనోజ్ఞముగా నున్నది. ఇప్పట్టున నామె స్వరూపమును గవి యిట్లు వర్ణించినాఁడు :

మాసినచీరఁ గట్టికొని మౌనముతోడ నిరస్తభూషయై
వాసెన కట్టుఁగట్టి నిడువాలిక గస్తురిపట్టుపెట్టి లో
గాసిలి చీఁకటింటికడ కంకటిపై జలదాంత చంద్రరే
ఖా సదృశాంగియై పొరలె గాఢమనోజ విషాదవేదనన్.

బిసరుహ పత్రలోచనకుఁ బెల్లగు మోహము సంఘటిల్లె పె
క్కసమగు నెవ్వగల్పొడమెఁ గంపముపుట్టెఁ జెమర్చె మేను మా
నసమున విన్నబాటొదవె నాపెఁ గడుం బరితాపవేదనల్
మసకపుఁ బాముకాటుగతి మచ్చర మన్విష మగ్గలింపఁగన్.

వెడవెడఁ గన్నుమూయుఁ గనువిచ్చు నగుం దలయూచుఁ బాన్పుపైఁ
బడు నుసురంచు లేచుఁ దడబాటును దత్తరముం జలంబులో
నడరఁగఁ గోపవేగమున నగ్గలమైన మనోజబాధలం
బడి మదహస్తి హస్తగత పద్మినియుంబలె సొంపు పెంపఱన్.

పై పద్యములలో సత్యభామా బహిరంతర్మూర్తులు వర్ణింపఁబడినవి. ఈ పద్యములలో సత్యభామను గవి మూఁడింటితో నుపమించినాఁడు :

1. హరిచందన కోటరమున కేగు నాగతరుణి
2. జలదాంత చంద్రరేఖ
3. మదహస్తి హస్తగతపద్మిని.

ఈ యుపమానములవలన మనకప్పటి సత్యభామా స్వరూపస్వభావములు తేట తెల్లము కాఁగలవు.

నాగతరుణితో నామెను సరిపోల్చుటచే నామె క్రోధవివశయై యున్న దనియు, నామె సుందర సుకుమారదేహ మా క్రోధతాపమును సహింపలేకున్న దనియు ధ్వనించును. మఱియు నాగతరుణి హరిచందన కోటరమునకుఁ దాపోపశమనార్థ మేగును. ఇట సత్యభామయుఁ దాపోపశమనార్థమే క్రోధాగారమున కేగినది. తాపశమనార్థమై క్రోధాగారమున కేగనేల? శైత్యోపచారములు చేసికొనరాదా యనరాదు. ఇది క్రోధతాపముగాని విరహతాపము గాదు. విరహతాపమునకే శైత్యోపచారాదులు తగును. క్రోధతాపము పత్యను నయాదులచేమాత్రమే శమించును. తన్నిమిత్తము క్రోధాగార ప్రవేశమే తగును.

'జలదాంత చంద్రరేఖా సదృశాంగియై' యనుటవలన నామె దీనభావము ధ్వనించుచున్నది.

'మదహస్తి హస్తగత పద్మిని' యనుటచే నామె శరీరముతోపాటు హృదయమును జిందరవందరయై చీకాకు నొందియున్నదని ధ్వనించుచున్నది.

ఇట్లు తిమ్మనార్యుఁడు సత్యభామాపాత్ర చిత్రణమునందుఁ గృతకృత్యుఁ డైనాఁడు. సత్యభామా మానక్రోధవివశత్వమునకుఁ బరమావధి యామె తన పతి నెడమకాలఁ దన్నుటతోఁ గల్గుచున్నది. కేతనపటాంచల చంచలమైన తాల్మితోఁ గృష్ణుఁడు సత్యభామా గృహమున కేతెంచుట తాళవృంతమును గొని తన ప్రియురాలికి వీచుట తన్నువడియు బుజ్జగించి ప్రతిమాలుకొనుట మొదలగు శ్రీకృష్ణుని చేష్ట లన్నియు నానాటిఁ పురుషుల రసికత్వమున కుదాహరణములై యున్నవి.

భరతశాస్త్రము ననుసరించి ఖండితనాయికాపాత్రము నభినయించు నటుడీ కావ్యపద్యములనే మాతృకలుగాఁ బెట్టుకొని తన యవయవ విన్యాసమును దిద్దుకొనవచ్చును. సత్యభామాకలాప ప్రదర్శనమునందుఁ గూచిపూడి వారు చూపున దీరహస్యమే. పెద్దనవలెఁ దిమ్మకవియుఁ బాత్రచిత్రణమునఁ గృతహస్తుఁడైన శిల్పి. సూక్ష్మాతిసూక్ష్మ వివరములతోఁ బాత్రల మనోధర్మములను నిదానించి చూచుటలో నొకవేళఁ బెద్దనయు నీయనకుఁ జాలకపోవచ్చును. పెద్దన కావ్యములో నాటకధర్మ ప్రాధాన్య మెక్కువ. భావానుగుణముఁగాఁ బదములఁ బ్రయోగించుటలో నీతఁడు మేటి యనవచ్చును.

ముక్కు తిమ్మనార్యు ముద్దు పల్కులు తక్కిన కవులకుఁ దక్కనవికావు.

పెద్దనగారి మనుచరిత్రముతోను, తిమ్మనగారి పారిజాతాపహరణముతోను నించుమించు సమాన వయస్సుగలది ధూర్జటికవికృత కాళహస్తి మాహాత్మ్యము.

ఈ గ్రంథము శివపారమ్యమును బోధించు క్షేత్రమాహాత్మ్యమేయయ్యు ఇందమ్మహాకవి తన నానాశాస్త్ర పరిజ్ఞానముతోపాటు పాత్రనిర్మాణ కౌశలమును గూడఁ జూపియున్నాఁడు. ఈ గ్రంథమునందలి నాలుగాశ్వాసములలోఁ దిన్నని కథయు వేశ్యకన్యా వృత్తాంతమును నతిలోక రమణీయములై యున్నవి. కవికిఁగల లోకవృత్తపరిజ్ఞానము నిందే సువ్యక్తమైనది.

కవి మహానగరవాసియయ్యు మహాటవీ మధ్యగతులైన కిరాతజనుల జీవితములను భావనచేతనేకాక ప్రత్యక్షముఁగాఁగూడఁ జూచి, తాను చూచిన దానిని జూచినట్లుగాఁ జిత్రించినాఁడు.

తిన్నని కథలో నీయన సృజించిన యాటవికబృందము స్వచ్ఛతా సంశోభితమై కావ్యమునకంతకు వన్నెపెట్టుచున్నది. నిరాడంబరులైన యా కిరాతుల యాచారవ్యవహారములును, వారుతాల్చు నగలును, దినెడు తిండియును, బండించు పంటలును, గొలుచు దేవతలును నిందుఁ దేటతెల్లము గావింపఁ బడినవి.

అట్లే వేశ్యాకుటుంబ వర్ణనమునందును భావనామాత్రమున నెఱుఁగరాని రహస్యములెన్నియో వర్ణింపఁబడినవి. ఈయన వర్ణనములన్నియు ననుభవ పూర్వకములేగాని పుస్తకములనుండి పుడికిపుచ్చుకొనినవి కావు.

ధూర్జటి నిర్మించిన పాత్రములలోఁ దిన్ననిపాత్ర యగ్రగణ్యమని చెప్ప వచ్చును. పుట్టుపుచే నాటవికుఁడయ్యుఁ దిన్నఁడు వీరమాహేశ్వరులలో నుత్త ముఁడుగాఁ బరిగణింపఁ దగినవాఁడు. శివభక్తి యితని కాజన్మసిద్ధము. ఈ యంశమును మహాకవి యీ క్రింది పద్యమున సూచించినాఁడు :

శివభక్తిరహితమై చెడియె జగంబని
 నవ్వినట్లొయ్యన నవ్వసాగె
ధృతి మోహబంధంబుఁ దెగఁదన్నుగతి ముద్దు
 టడుగులెత్తి విదుల్చుకొనఁ దొడఁగె
భవపరాఙ్ముఖుఁడైన పగిది సత్త్వముఁగూడి
 పొత్తులఁ బాన్పుపైఁ బొరలఁబడియె
శ్రేయోమహారాజ్య సింహాసనంబున
 నుండు చందమునఁ గూర్చుండఁ దొడఁగెఁ

చదవియాడె వసుంధరా స్థలమునందు
విశ్వపతి తత్త్వమను మణి వెదకురీతిఁ
దర్పకారి జగత్పూర్ణుఁ దాకుభీతి
నడుగు వెట్టెడుగతిఁ దప్పటడుగు వెట్టె.

తిన్ననికిఁ గులాచారానుగుణముఁగ విలువిద్య యబ్బినది. మృగయా వినోదమనిన యాతనికిఁ బ్రీతిమెండు. వేటాడి యలసి పరుండియున్న తిన్ననికి స్వప్నమున సదాశివుఁడు సాక్షాత్కరించి యనతిదూరమున మొగలేటిదరిఁ గొండదండ శిలావటమూలమున శివలింగము కలదనిచెప్పి యంతర్ధానమైనాఁడు. తిన్నఁడు మేల్కనినంతనే యేకలము నొక్కదానిని జూచి దాని వెంటనంటి చనుచు నొకచో నయ్యది యదృశ్యముకాఁగా నచ్చోట దివ్యలింగమును గాంచి దిగ్భ్రాంతుఁడైనాఁడు. అప్పటి యాతని సంతోషాతిశయమును దన్మయత్వమును గవి యీ తీరున వర్ణించినాఁడు:

కాంచి రోమాంచకంచు కోదంచితాంగుఁడగుచు నానంద బాష్పంబు లతిశయిల్ల నమ్మహాలింగమునకు సాష్టాంగనతులు సేసి ముకుళిత హస్తుఁడైఁ చేరఁబోయి.

తరువాతఁ దిన్నని యమాయకత్వమును, శివభక్తి తత్పరత్త్వమును, వీరమాహేశ్వర దీక్షాదక్షత్వమును కవి యీ క్రింది పద్యములలో నతిమనోహరముఁగాఁ జిత్రించియున్నాఁడు:

ఓ సామీ! యిటువంటి కొండదరిలో నొంటిం బులుల్ సింగముల్
గాసింబెట్టెడు కుట్రనట్టడవిలో గజ్జువ్వి క్రీనీడ నే
యాసం గట్టితి వేటగడ్డనిలు? నీ వాకొన్నచోఁ గూడు నీ
ళ్లే సుట్టంబులు దెచ్చిపెట్టెదరు? నీకిందేటికే లింగమా!
కొండలఁ గానలందిరిగి క్రొవ్విన పందుల లేళ్ల దుప్పులన్
జెండిన పెక్కుచందములఁ జిన్నకపెద్దక గారుకమ్మగా
వండుదు రట్ల పిట్టలను వండుదురిచ్చట నుండనేల? నా
కొండొకటాననీక యుడుమూరికి రాగదవయ్య లింగమా!
ఓ లింగమ! విను నివ్వరి
ప్రాలును నొడిపిళ్లి గునుకుఁ బ్రాలును వెదురుం
బ్రాలును, నవరపు మెకముల
పాలును గలవచట నీకుఁ బాయసమునకున్.
పుట్టతేనియ పెఱతేనె పుట్టజున్ను
తొట్టితేనియ గలవందుఁ దోఁచితోఁచి
కాలి దులదులనై పిడివోలెరాలు
నట్టి నింజెల్లు గలవు నీ కారగింప.

ఇల్లో ముంగిలియో యనుంగుఁ జెలులో యీడైనచుట్టంబులో
యిల్లాలో కొడుకో తరింపవశమే యేపోడుములేక మా
పల్లెం గోరినవెల్లనుం గలవు తెప్పల్గాగ నీకిచ్చెదన్
జెల్లంబో యిట నొంటినుండ కటు విచ్చేయంగదే లింగమా!
నను మన్నించెదవేని నీ విపుడురా నావెంట, రాకుండినన్
నినునేఁబాసి చనంగనోప నిచటన్నీతోడిదే లోకమై
మనువాడం గనువాడ నీకరుణ నీ మౌనంబు చిత్తంబు వ
చ్చినచో మానుదుగాని నిన్నిపుడు కష్టింబెట్ట నా కేటికిన్.

ఈ పద్యములలోఁ దిన్నని యావేదనమేకాక యాతని యావేదనమునకుఁ గారణమైన భక్తియు నత్యద్భుతముగాఁ బ్రదర్శింపఁబడినది.

వీరమాహేశ్వరులలో నొక విశేషము గలదు. భగవంతునిపై వారికిఁగల భక్తికిఁ బ్రతిఫలాపేక్ష యేమియునుండదు. అది స్వతస్సిద్ధము. ఈశ్వరుఁడపవర్గ ప్రదాత యనియు నాతనిఁ గొల్చినవారికి మోక్షము కరతలామలకమనియు నెఱింగి వాని నపేక్షించి వా రీశ్వరుని గొల్చువారు కారు. ఈశ్వరునివలన వా రెద్దియు నభిలషింపకపోవుట యటుండఁగా వారే యీశ్వరుఁ డాకలిగొన్నాఁ డనియు నొంటినున్నాఁడనియు వాపోవుదురు. కన్నబిడ్డలపైఁ దల్లికిఁగల వాత్సల్యమెట్టిదో వారికి భగవంతునిపైఁగల భక్తియు నట్టిదే. నిరాడంబరమును నిశ్చలమును నవ్యాజమునునగు వారిభక్తికిఁ బరమేశ్వరుఁడు వశుఁడగుటలో నాశ్చర్య మేమియును లేదు.

పరమేశ్వరునికంట నెత్తురు కారుచుండఁగాఁ దిన్నఁడు చూచి సహింప లేకపోయినాఁడు. 'కంటికింకఁ గంటికంటె మందుగలదె యుక్కంటికి' నని యనుకొని తనగ్రుడ్డు పెకలించి యా లింగముకంటికిఁ దగిలించినాఁడు. కాని పరమేశ్వరుని పరీక్ష యింకను ముగియలేదు. రెండవకంటఁగూడఁ గీలాలము వొఱఁగుచున్నది. అట్లయిన రెండవకన్ను నిచ్చెదనని తిన్నఁడు స్థిరనిశ్చయుఁ డైనాఁడు. చెప్పుఁగాల నిటలాక్షుని కన్గొనఁ దన్నిపట్టి యొక సునిశిత బాణముతోఁ దనగ్రుడ్డును బెకలింప నుద్యుక్తుఁడైనాఁడు. హరుఁడానంద పరవశుఁడై తిన్నని తీవ్రతకన్న మున్నగ నయ్యాశుగమును జేతఁబట్టి నిలునిలు మను నెలుంగు సెలంగ నాతనిమ్రోల సాక్షాత్కరించినాఁడు.

ఈ కథను జదివి చూడవలయునేగాని యిట్టిదని చెప్పనలవిగాదు. ఆంధ్ర ప్రబంధ వాఙ్మయమున నిట్టినిర్మాణ మదృష్టపూర్వమనియే చెప్పవచ్చును. శివకవు లిట్టి కథలను బెక్కు వ్రాసినను నందిట్టి యసాధారణ రచనాచమత్కృతి కాన రాదు. శాంభవంబైన తేజము కన్నులు మిఱుమిట్లు గొల్పునట్లిందుఁ జిత్రింపఁ బడియున్నది. పాత్రోచితములైన భావములును, భావమునకుచితమైన భాషయు నిందుఁ బొందుపఱుపఁబడి యున్నది.

ఇట్టి చమత్కారమునే ధూర్జటి చతుర్థాశ్వాసమునందలి వారవనితా కథా కథన సందర్భమునను జూపియున్నాఁడు.

ఇందు మాణిక్యవల్లియను వేశ్యమాత శివభక్తి పారవశ్యలగు తనకూతుల నంగజాగమకోవిదలఁ జేయుటకై పడినపాట్లు చెప్పశక్యముకాదు. ఆమె కొక్కోక కళావిలాసములకుంగల యర్థమును జోలపాటలుగాఁ బాడినది. సరసతకల్మి వావివరుస లేమియును లేవను సిద్ధాంతమును వారి కెఱుకపఱుప నింటిగోడలపైఁ దారాశశాంకులు, నహల్యాసంక్రందనులు, మేనకావిశ్వామిత్రులు మొదలగు రత్యుద్దీపకములైన చిత్తరువుల వ్రాయించినది. చతుర్జాతి వయోవసజాతుల బంధవైభవమును జతుర్జాతి పురుషులనుగూడఁ జిత్తరువుల వ్రాయించినది. కామసిద్ధాంతములఁ బ్రోవు సేసినది. గానయంత్రములఁ జేకూర్చినది. శారికా కీరాదులైన పిట్టలఁ బెంచినది. లాస్యాగమముల బోధించినది. కాని యేమి ప్రయోజనము? తల్లికొక పిచ్చియైనఁ గూతుల కింకొక పిచ్చి. తల్లి భోగాను రక్తిని బోధింప వారికి భోగవిరక్తి పొడసూపినది; పార్వతీపతి పదభక్తి పైకొన్నది. వీరి విరక్తివలనఁ దల్లికెంతటి విసువు గలిగినదో కవి యీ క్రింది పద్యమున నెంత చమత్కారావహముగఁ జెప్పినాఁడో చూడుఁడు:

రసికులు మీ గానరసమాన వచ్చిరి
        పాడరే శివభక్తి పాడుగాను
జాణలు మీ విలాసముఁ జూడవచ్చిరి
        చూడరే శివభక్తి చూఱవోను
పల్లవుల్ మీతోడ భాషింప వచ్చిరి
        పలుకరే శివభక్తి పాఱిపోను
పార్థివుల్ సకల సంపదలీయ వచ్చిరి
        పిలువరే శివభక్తి పెంపు చెడను
ధనము గలిగిన జంగమార్చన మొనర్ప
శివున కఖిలోపచారముల్ సేయవచ్చు
వనజముఖులార! నాసరివారిలోన
సిరుల మెఱయుచుఁ దలమెత్తి తిరుగవచ్చు.

తల్లిబోధలు కూతులకు రుచించినవికావు. తుదకు వారు తమ స్థిరనిశ్చయము నామె కిట్లు వెలిపుచ్చినారు:

మణిమంత్రౌషధశక్తిచే విటులఁ బ్రేమగ్రస్తులంజేసి త
న్మణి భూషాదులు పుచ్చుకోఁగొలుపదమ్మా! బుద్ధి, రుద్రాక్షమే
మణి పంచాక్షరిమంత్ర మౌషధము భస్మం బాత్మనాథుండు ద
క్షిణ కైలాసవిభుండు భక్తి తమకున్ శ్రీవాద మింకేటికిన్.

ఈ వాక్యము లాలించినంతనే వేశ్యమాత దుఃఖమునకు మేరలేదు.

తన సొమ్మంతయు వమ్మైనది. తనచేసిన చేతలా వృథాప్రయాసము లైనవి. తుదకుఁ దన గారాబు కూఁతులా సన్యాసినులైరి. ఆమె విలాపమును గవి యీ క్రింది పద్యమున నతిమనోహరముఁగఁ జెప్పియున్నాఁడు:

ఏ నెఱజాణలైనఁ గమలేక్షణల న్మణిమంత్రతంత్ర వి
ద్యానవచాతురీమహిమ నైనను మందులనైన నీశ్వర
జ్ఞానము మాన్పి కామసుఖసక్తులఁ జేసిరయేని, యిత్తుఁగా
నైనను బుచ్చుకోక కమలాస్యల కన్నెఱికంబు వారికిన్.

ఇంకను వేశ్యలు కాళహస్తీశ్వరుఁ గాననేగుట, దొంగలు వారిసొమ్ముల నపహరింప యత్నించుట, పరమశివుఁడు జంగమ రూపమున నవియెల్ల వారించుట, తుదకు వేశ్యలు లింగైక్యమునందుట మున్నగు కథాభాగమంతయు నత్యద్భుతముగా వర్ణితమైనది. వేశ్యాపుత్రికల సౌశీల్యమును వారి పరమేశ్వర భక్తిని గవి వేనోళ్ళఁ బొగడినాఁడు.

క్షేత్రమాహాత్మ్యమునే వ్రాసినను బ్రబంధ కవులలో నొక్కఁనిగాఁ బేర్కొనఁ దగినవాఁడు తెనాలి రామకృష్ణుఁడు. ఈతని పాత్రనిర్మాణ చాతుర్యమును కథా కథన కౌశలమును రసపోషణ సామర్థ్యమును తెలిసికొనవలయునన్నచోఁ బాండురంగ మాహాత్మ్యమునందలి నిగమశర్మోపాఖ్యానమును జదువవలయును. గుణనిధ్యాదులు నిగమశర్మకంటెను బ్రాచీనులు కొందఱు గలరు. కాని నిగమ శర్మ యక్కనుబోలినవా రాంధ్రవాఙ్మయమునసనే లేరనిన నతిశయోక్తి కానేరదు. నిరంకుశుని తల్లి యీయమకొక క్షుద్రానుకరణము. నిగమశర్మ యక్కయని యీమెను బేర్కొనవలయునేగాని యీమె పేరేమియో చెప్పినాఁడుకాఁడు మహాకవి. తీర్చిదిద్దిన యీతని శిల్పచాతుర్యమంతయు నీరెండుపాత్రలయందును గేంద్రీకరింపఁబడియున్నది.

వేశ్యాసంసర్గము కతన దేహగేహములను బాడుచేసికొనుచున్న తమ్ముని శిక్షించి సన్మార్గాభిముఖుని గావింప నీతొయ్యలి తనమగనిని బిడ్డలను వెంట నిడికొని పంచయోజనమాత్ర దూరంబగు తనయూరినుండి మాతృభవనమునకు వచ్చినది. వచ్చినదే తడవుగఁ గొడుకు చెడునడతకు మంచముపట్టియున్న తల్లిదండ్రులను, మధురవచన రచనోపచారముల నామె సేదఁదేర్చినది. నష్టా వశిష్టమగు మూలవిత్తము గుప్తముగావించినది. అతిథి సంతర్పణంబుల నేర్పునఁ బచరింపించుచు, దాసదాసీజనముల యథోచిత వ్యాపారముల నియ మించుచు, బూజుపట్టిన పుస్తకభాండాగారమును యాచకాగ్ని బాధలవలనం బాచిప్రోచుచు, విగళిత సన్నాహంబగుఁ గేహంబు యథాపూర్వ నిర్వహణ మనోహరంబుఁ గావించినది.

ఇంతలో నొక్కదినమునఁ జుక్కతెగి పడినవడువున నెక్కడనుండియో నిజానుజుఁడు వచ్చిపడినాఁడు. వచ్చి సంకోచించుచు నమస్కరించి నిలిచిన యనుఁగుఁదమ్ముని నామె సీమంతపుఁ బెండ్లికొడుకవు గమ్మని నర్మగర్భంబుగా దీవించినది. మరల మోహావేశంబున నచ్చోటువాసి చనఁబోవు తమ్ముని వినయ సౌహార్ద మార్దవ మధురంబులగు తేటమాటల నింటనిలుచునటుల చేసినది. చిఱుత మేనల్లునిఁ జేతికిచ్చి బావబంతి నారగింపుమని బలవంతము చేసినది. తత్క్షత్రంబునకు నేత్రసంజ్ఞఁ గావించి యామెచేఁ దమ్ముని పాదములు గడిగించినది. కనుగీటినంతలోనె షడ్రసోపేతములగు మృష్టాన్నభోజనమిడి తుష్టుని గావించి నది. ఆకంఠముగ మధురాన్నముల నారగించి వార్చి, తాంబూల చర్వణముఁ గావించుచుఁ దిన్నెపయిఁ జిఱునగవొప్పగఁ గూరుచున్న తమ్మునిగాంచి తన సంతాన మొకవంక సందడి చేయుచుండఁగా నాతని చెంతఁజేరి 'చేటికానీత పీఠికాసన యగుచుఁ బద్మకర్ణికఁ గొలువున్న పద్మవోలెఁ గుడివలన నింత యోఁఱఁగాఁ గొమరుమెఱసి బిడ్డ చనుద్రావ నబ్బిసరుహాక్షి' తమ్మునితో నిష్టగోష్ఠి నుపక్రమించినది.

ఈ వర్ణన మెంత మధురముగా నున్నది! దేహ గేహములయందలి యభిమానము వీడి, సంసారమునందాశలేక సంచరించు తమ్ముని సన్మార్గాభిముఖుఁ గావింప నేతెంచిన యయ్యంగన నెంత యుదారముగాఁ జిత్రించినాఁడో మహాకవి చూడుఁడు. కులాంగనా సౌశీల్యము, సౌహార్దము నామెయందు మూర్తీభవించి యున్నవి. పిల్లలగన్నతల్లిగదా! సంతానమునందలి యాసచే నైనఁ దమ్ముఁడు సన్మార్గగామి యగునేమోయని యామె యాశయము. మఱియు నామెయందుఁ బ్రౌఢతనముగూడఁ గలదు. వేశ్యాజన విలాసవిభ్రమ కళావంచి తుఁడగు వానికి మంచిత్రోవలఁ గఱపవలయునన్నచోఁ బ్రౌఢతన మావశ్యకమే యగును. చూచియుఁజూడకమున్నె శ్రీరంగనీతులు ప్రారంభించిన నయ్యంగనా లోలుఁడొక నిముసమైనను నంట నిలువఁడు. కావుననే ముందొక్క పలుకైన నీవిషయమై తమ్మునితో నామె పలుకలేదు. ఒరులఁ బలుకనీలేదు. మజ్జనభోజ నాదుల నాతని సంతుష్టుఁ గావించి యాతఁడు సేదఁదేఱిన యనంతరము తన సోదె నామె యారంభించినది. ఆ యారంభముగూడ నెంత చమత్కారావహముగ నున్నదో చూడుఁడు:

ప్రారంభించిన వేదపాఠమునకుం బ్రత్యూహమౌనంచునో
చేరా తమ్ముఁడ! నన్నుఁ జూడఁ జనుదే వెన్నాళ్ళనోయుండి చ
క్షూరా జీవయుగంబు వాఁచె నినుఁగన్గోకున్కి మీ బావయున్
నీ రాకల్ మదిఁగోరుఁ జంద్రుపొడుపున్ నీరాకరంబుంబలెన్.

ఇది యామె తొలిపలుకు. ఎంత చమత్కారావహము! ఎంత నర్మ గర్భితము! కాని యీ డొంకతిరుగుడు మాటలవలన నప్పుడింకఁ బ్రయోజనము

లేదు. ముక్కుకుసూటిగ మొగమువాచునట్లు చీవాట్లు వేయవలయును. దారితప్పి చరించు తమ్ముని దగు మనుష్యులలోఁ దలయెత్తుకొనఁగలవానిగ నొనర్ప వలయును. ఇందులకై యామె తనశక్తి సామర్థ్యముల నన్నిటిని వినియోగించి నది. ఆతని వంశౌన్నత్యము నుగ్గడించినది. అగ్నిసాక్షిగఁ బెండిలియైన యిల్లాలి నొల్లకుండుట మహాపాతకమని దూషించినది.

శీల మఖిలంబు నిది పిల్లిశీలమనుచుఁ
జదువు లివియెల్లఁ జిల్కల చదువులనుచుఁ
దోడివారలు నవ్వనా తోడ ! యేల
బేలవైతివి యీ గుణంబేల నీకు ?

అని మందలించినది. నోరులేని పసిబిడ్డల నీ తమ్ముగుట్టల కన్యాయముఁ గావించి కులధ్వంస మొనరింప నీవంటివాని కర్మముకాదని తెలియఁబలికినది. వారవనితల వలపుల నమ్మి మోసపోకుమని యుద్బోధించినది. నీకుఁగావలసిన హారికౌస్తుభ రత్నమునైనఁ దెచ్చి యిచ్చెదనని ప్రతిజ్ఞచేసినది. కామవికారమగ్గలమైన వేవురు విప్రకన్యకలఁ బెండిలియాడుమని యుపదేశించినది. అయ్యయో ! సహోదరుని యజ్ఞమునఁ బూజ్యురాలనై వేది నలంకరింతునని వేవురిలోపల నాడుకొను చుందును. నా యాసలన్నియు నడియాసలైనవేయని వాపోయినది. వేయేల ! నయముఁ బ్రియముఁ గదుర నెన్నిరీతులఁ జెప్పవలయునో యన్నిరీతులఁ జెప్పినది.

అక్క చెప్పిన సద్బుద్ధి నా బడుగన్నపాన కాంక్ష నాదరించినాఁడు. రాజా లయమునకు రాకపోకలు మరల సాగించినాఁడు. మాసిన చదువుల మఱలఁ జదివినాఁడు. కులవధూరత్నము నాదరించి, గురుజనమును సంభావించి యతిథి జనముల నర్చించి తేనెపూసిన కత్తియగు నాధాత్రీసురుఁడింటనున్న వారలనెల్ల వంచించి తిరిగినాఁడు. కాని వారవనితా సందర్శనోత్సుకత మేరమీఱఁగా నొక్కనాటిరాత్రి యింటిలోనివారందఱు గాఢనిద్రాపరవశులై యుండఁగా నా ధూర్తుఁడు 'మాతృభూషలు, నత్తికామండనములు, నిజయువతి దాల్చుసొమ్ములు' నపహరించి యిల్లువీడి మహారణ్యమునఁ బడిపోయినాఁడు.

ఇంతతో నిగమశర్మ యక్కగారినిగూర్చి మనకుఁ దెలిసిన వృత్తాంతము ముగియును. పంచక్రోశ దూరముననున్న తన యిల్లును వాకిలియును వీడి, తమ్ముని సంసారమును జక్కఁజేసి తన తల్లిదండ్రుల నూరార్పవచ్చిన యా దొడ్డ యిల్లాలు క్రొత్తగాఁ జేయించుకొన్న తన ముక్కరపోయినదని దుర్వార దుఃఖమునకు లోనైనదఁట ! మహాకవి యిది హాస్యమున కనియెనా ? యలవోకగా ననియెనా ?

ఇఁక మిగిలిన నిగమశర్మకథ యవాచ్యములగు మహాపాపములకుఁ దావలమైయున్నది. బంధుద్రోహమునేకాక మిత్రద్రోహమునుగూడ నా ధూర్తుఁ డాచరించినాఁడు. తన్ను మహాపదనుండి రక్షించి, చావనున్నవానికి సకలోప చారములు గావించి తన్ను బరమాప్తునిగా, దేశికోత్తమునిగా దైవముగా భావించి మన్నించిన మిత్రునిభార్య నపహరింప నీయధముఁడు సందియమంద లేదు. అనంతరమొక నిషాదింగూడి యామెవలన బిడ్డలంగని, కామపురుషార్థ సిద్ధియే పరమార్థముగా భావించి యా బ్రాహ్మణబ్రువుఁడు సంచరించినాఁడు. ఈ నీచాతినీచునకుఁ గాపుచేసిన పరిచర్యలఁ జూడుఁడు :

పితృ పరిత్యాగవర్ధిత కిల్బిషమువోవ
　　నెత్తుకై వడి వ్రేళ్ల నెత్తు రొత్తి
కూర్కు ప్రాణముల మేల్కొలుపు చాడ్పున గంట్లు
　　శాకినీ కాండంబు సరణి చూచి
సమయంబు గాదని శమనుదూతలఁ ద్రోయ
　　జాడమై నాటు శస్త్రముల పెటికి
పతయాళువగు బొంది పడకుండుటకు గంద్ర
　　పురులిచ్చుగతిఁ జాలఁ బొత్తులునిచి
వట్టికూడును వేనీళ్ళు పెట్టి యొట్టి
గలుగు వీద్యంబు లిప్పించి వలఁతియైన
వెజ్జు నెచరించి యరయించె విప్రసుతుని
కంట వత్తిడుకొని సైరికప్రభుండు.

కట్టుకొనిన యిల్లాలిని గన్న తల్లిదండ్రులను మహార్తిముంచినందులకుఁ బ్రాణరక్షణము గావించిన మిత్రుని భార్యతోడనే సరసాలాపములు సాగించి నందులకు బ్రాహ్మణత్వమును వీడి నిషాదింగూడి మాంసాశన మాచరించినందు లకు ఫలముఁగా శ్రీనృసింహుఁ డాతనికి దివ్యవైకుంఠపదవి నొసఁగినాఁడఁట. దేవునిలీలలఁ దెలిసికొన మనుష్యమాత్రులకు సాధ్యమా? ఇంతకు సత్పురుషులకే సాయుజ్యము సంభవించునని చెప్పినచో నింక క్షేత్రమాహాత్మ్య మేమున్నది?

పాండురంగ మాహాత్మ్యము స్థలపురాణ మగుటచే నిందు రామకృష్ణుఁడు తన పాత్రనిర్మాణకౌశలమును బరిపూర్ణముగాఁ బ్రదర్శించుట కవకాశము లేకపోయినది.

సజీవపాత్ర నిర్మాణమునందుఁ బ్రబంధకవులలో నగ్రగణ్యుఁడు పింగళి సూరనార్యుఁడు. పాత్రల చిత్తవృత్తులను బ్రదర్శించుటలో నీతఁడు తిక్కనకు సాటి యనఁదగినవాఁడు.

పాత్ర రచనావిధానమును బరోక్షమనియుఁ బ్రత్యక్షమనియు రెండు విధములుగా విభజింపవచ్చును. ఇందుఁ బరోక్షపద్ధతిని నాటకకర్తలుఁ బ్రత్యక్ష పద్ధతిని నాఖ్యానకకవులు ననుసరింతురు. పరోక్షపద్ధతి యనఁగాఁ బాత్రల మనోభావములను బాత్రలముఖముననే పలికించుట. ప్రత్యక్షపద్ధతి యనఁగాఁ గవి దనంతటఁదానే పాత్రలనుగూర్చియు వాని యింగితాకారచేష్టాదులనుగూర్చియుఁ బలుకుట. సూరనార్యుఁడు నాటకముల వ్రాయకున్నను బాత్రనిర్మాణమునందు మాత్రము నాటకకవిగానే పేర్కొనఁదగినవాఁడు. అందును మనోధర్మవేత్తృత లేనివారికిఁ బ్రగాఢములు దురూహ్యములు నగు నాతని పాత్రల చిత్తవృత్తుల గమ్యములుగా నుండును. ఇందులకు నిదర్శనముగా నీ క్రింది యుదాహరణములఁ జూడఁదగును:

మణికంధరుని వలచినట్లు కనఁబడిన కలభాషిణి నలకూబరుని పొందాసించుటకుఁగల హేతువెద్దియో నిరూపింపవలయునన్నచోఁ బ్రణయప్రపంచమునఁగల యొక ధర్మరహస్యమును గుర్తెఱుంగవలయును. కామ్యవస్తువు దుర్లభమైనప్పుడు తదాభాసమేనియుఁ గొంతవఱకు నాత్మను దనుపుననది ప్రణయప్రకృతి ధర్మము. ఈ ధర్మము తెలియనప్పుడు కలభాషిణి చరిత్రము దూష్యముగనే కన్పట్టును. ఆపాటి మనసు చలించుటయు ధర్మశాస్త్రానుసారముగ వ్యభిచారమేయయ్యు నది ప్రకృతి సిద్ధమగుటచేఁ బరిహరింపరాని యొక హృదయధర్మముగా గణనీయమైనది. ఎట్టి ధైర్యము కలవారికైన నొక్కొక్కయవస్థలో హృదయదౌర్బల్యము తటస్థించుటయు దాని ప్రభావమున వారు కీలుబొమ్మలవలె వర్తించి తుదకు వివేకముగలిగి నిర్వేదము నొందుటయుఁ గావ్యప్రపంచముననే కాక లౌకిక ప్రపంచమునను గలదు. కలభాషిణిలో నీ ఛాయాభిలాషయు హృదయదౌర్బల్యము నేకమై యామూర్తిని లోకులకు దురవగాహము చేసినవి. సుగాత్రీ శాలీనుల స్వభావముల గుర్తెఱుంగవలయునన్న సహజసౌందర్యమునకును నిరాడంబర చిత్తవృత్తికిని బింబప్రతిబింబ భావము కలదనెడి ధర్మమును ముందు గ్రహింపవలయును. ఈ ప్రణయ సూత్రమే యీ కథకు మూలము.

చూడఁజూడ నీయన స్త్రీపాత్రములు పురుషపాత్రములకంటే మేల్తరములని గోచరించును. ఇట్లనుటచే నాపురుషుల రేఖలుగాని రంగులుగాని చెడినవని తలంపరాదు. ఈయన స్త్రీపాత్రలలో షేక్స్పియరు సృజించిన స్త్రీపాత్రలవలెనే ప్రేమమూర్తులు గొన్ని ప్రజ్ఞామూర్తులు కొన్ని కలవు. కలభాషిణి సుగాత్రి మున్నగువారు ప్రేమమూర్తులు. శుచిముఖి, రాగవల్లరి మున్నగువారు ప్రజ్ఞామూర్తులు.

ప్రతియోగి సంఘటనముచే (By contrast) బాత్రల స్వభావమునుగాని రూపమునుగాని ప్రతిభాసింపఁజేయుట శిల్పధర్మములలో నుత్తమమైన ధర్మము. ఈ రెండు కావ్యములలో (కళా. పూ., ప్ర. ప్ర.) నీ ప్రతియోగి సన్నివేశమే పెక్కుచోట్ల శోభ నాపాదించుచున్నది. కలభాషిణికి—రంభకు, మణికంధరునకు—నలకూబరునకు, నారదునకుఁ—దుంబురునకు, శుచిముఖికి—రాగవల్లరికి నీ ప్రతియోగి సంఘటనము కల్పింపఁబడినది. రూపచిత్రణమునందును నీ ధర్మముల నాయన మఱువలేదు. వృద్ధురాలగు సుముఖాసత్తి రూపమొక పద్యమునను పునర్యౌవన ప్రాప్తమైన యామెరూప మింకొొక పద్యమునను శయ్యాగృహమునం దలంకృతమైన సుగాత్రీరూప మొక పద్యమునను నిరలంకృతమై పూఁదోటలోఁ బనులుచేయు నామెరూప మింకొకపద్యమునను మణిస్తంభుని చేఁజిక్కి చకితమై యున్న కలభాషిణిరూప మొకపద్యమునను నాతని చేయిజారిపడినప్పటి యామె రూప మింకొక పద్యమునను వర్ణించి యవస్థాభేదములనుబట్టి యాయా రూపములుపొందు మార్పులను సూరనార్యుఁడు సూచించినాఁడు.

ఇంతవఱకు నిమ్మహాకవి పాత్రరచనావిధానమునందలి మూలసూత్రములను బరిశీలించియున్నాము. ఇఁక నొక్కొక్క పాత్రను దీసికొని యా పాత్రను జిత్రించుటలోఁ గవి చూపిన ప్రజ్ఞాకౌశలమును బరిశీలింతము:

సూరనార్యుని పాత్రరచనా నైపుణికి నికషోపలమువంటిది కళాపూర్ణోదయము. ఏతత్కథావిధానమునం దంతటను దేజస్వినియై యొప్పుచున్నది కలభాషిణి. కవియు నీ పాత్రనిర్మాణమునందే తన యావచ్ఛక్తిని వినియోగించియున్నట్లు గ్రంథము నామూలాగ్రముగాఁ బఠించినవారికిఁ దోఁపకపోదు. కళాపూర్ణుఁడును దేజస్వియేయయ్యు నాయనతేజము మానవదుర్నిరీక్ష్యమైయున్నది. ఆతఁడు దివ్యుఁడా మానవుఁడా యను సందియ ముదయించునంతటి మాహాత్మ్య మాతనియందుఁ జూపట్టును. కలభాషిణియందు మానవసహజములేకాక స్త్రీజనోచితములునునగు గుణగణములన్నియును గలవు.

తొలిజన్మమునఁ గలభాషిణి బ్రహ్మలోకమునందలి పెంపుడుచిలుక. సరస్వతీశాపవశమున నది భూలోకమునఁ బుట్టవలసివచ్చెను. అంతట ద్వారకానగరమున నొక వేశ్యాగృహమునఁ గలభాషిణి యనుపేర నా చిలుక జనించెను.

కలభాషిణి నృత్తగీతాదులయం దసమాన పాండిత్యమును గణించెను. యౌవన సౌందర్యముల కాటపట్టయిన యామె యవ్వీటి విటజనముల హృదయములఁ గలంచుచుండెను. శ్రీకృష్ణుని కొలువుకూటముకూడ నామెకుఁ జిరపరిచితమయియేయుండెను. శ్రీకృష్ణుని యనుగ్రహమునం జాంబవతీలలామ కలభాషిణిని వీణావాదనప్రౌఢను గావించెను. యువతియు సౌందర్యవతియునేగాక యామె నిరుపమాన బుద్ధిమతియునై యుండెను. ఆమె యేకసంథాగ్రాహి.

మణికంధరునిచే నొక్కమాఱే చదువఁబడిన దండకము నామె నారదునియొద్ద నప్పగించి తన యనుపమానమగు జ్ఞాపకశక్తికి నిలింప మౌనియు నివ్వెఱఁ గందునట్లు కావించెను.

మేధాసంపదకుఁ తోడునీడయైన వాఙ్నైపుణ్యము నామెకుఁ గలదు. ద్వారవతిలోని యుద్యానవనములో రంభానలకూబరులనుగూర్చి యామె నారదుని బ్రశ్నించునప్పుడే యామె వాక్చమత్కృతి మనకు సువ్యక్తమగును. కలహ భోజనుఁ డామె నలకూబరుని గాంక్షించు చున్నదనియును రంభకుఁ బ్రతి ద్వంద్విగా నిలువఁదగిన గుణగణము లీమెయందుఁ గలవనియును నెఱింగియే రంభాగర్వభంగమును మనసులో నిడికొని కలభాషిణికి కామరూపసిద్ధి నొసంగినాఁడు.

కలభాషిణి మనోరథసిద్ధికిఁ గొంత మార్గము గోచరించినది. ఇంతలోనే యామె కాపాలికుని (మణిస్తంభుని) మాయావాగురులలోఁ దగుల్కొనినది. కాని మృగేంద్రవాహనా ప్రభావమున విగతజీవ కాలేదు. ఇంతటి విషమపరి స్థితులయందుఁగూడ నామె నలకూబరుని గామించుచునే యున్నది. మాయా నలకూబరుని జూచి నలకూబరుఁడను భ్రాంతిచే నారదవరప్రభావమున రంభా రూపధారిణియై యాతనిగూడినది. కాని యంతమున నామెఁ గూడినవాఁడు నలకూబరుఁడుకాక, యామెవలెనే మాయారూపమును ధరించిన మణికంధరుఁ డైనాఁడు.

అప్పుడామెపడిన పశ్చాత్తాపమునకు మేరలేదు. కాని యా పశ్చాత్తాప మెందులకు ? ఒకవంక మణికంధరునియందు వలపునిలిపియు నింకొకవంక నలకూబరుని గామించు నామె హృదయమామెకే దురవగాహమైనది. తన్నుఁ గూడినవాఁడు తనచిన్ననాఁటి నేస్తకాఁడగు మణికంధరుఁడేయని తెలిసినప్పు డామె యానందము మిన్నుముట్టినది. కాని యేమిప్రయోజనము ? వలపు ఫలింపనున్నతఱి నిరువురును దుర్వారశాపోపహతులైరి. అప్పటి కలభాషిణీ హృదయావేదనము నూహింపవలయునేకాని మాటలలోఁ జిత్రింపనలవికానిది. కవి దాని నీక్రింది రీతిని బొందుపఱచియున్నాఁడు :

శ్రీయుతమైన దివ్యమణి చేతికినబ్బఁగఁ భారమైచి త
చ్ఛాయ యొకింతయున్కిఁ గని చాలఁ గృశించితి గాజుపూసకై
నా యవివేక మేమనుకొనం ? దుదఁ దన్మణి యబ్బెనన్న న
త్యాయత తత్సమాగమ సుఖాప్తికి నోఁచమి నెంచి కుందెదన్.
ఇట్టిమాట లిప్పుడేనాడు కొనుటయు
ననుచితంబు 'వారవనితపలుకు
లిచ్చకంబు' లనక యెవ్వరు నమ్మెద
రదియుఁగాక దృష్ట మన్యవాంఛ.

మణికంధరుని యనులాపవాక్యములుకూడ నామెకు దుఃఖోపశమనమును గలిగింపలేకపోయినవి. ఆమె మనసు మాఱిపోయినది. యౌవనసుఖాసక్తియుఁ దదన్వేషణానురక్తియు నంతరించినవి. దైవోపహతయు దుఃఖోపహతయు నగు నామెయందిట్టి మనఃపరివర్తనము కలుగుట సహజమే. వనితాలోకమునకుఁ బాతివ్రత్యముకంటే పరమంబైనసిద్ధి వేఱొండులేదని యామెకప్పుడు తోఁచినది. ఈ హృదయపరివర్తనము తోడనే సుముఖాసత్తి నుద్దేశించి యామె యిట్లు పలికినది :

మదీయ పుణ్యయుగమో పుణ్యంపు టిల్లాల ! నీ
పాతివ్రత్యము చందమున్ విన మదిన్ భావింపగా నెట్టి దు
ర్నీతి ప్రక్రియవారికైనఁ గృపతో నీవిచ్చినం గల్గుఁ ద
త్పాతివ్రత్యము నాకు మీఁదనయినం బ్రాపింప దీవింపవే.

ఆసన్నమరణమైయున్న యామె తుదికోర్కె యిది. మరణావసరమున నిట్టి పవిత్ర మనోరథముఁ గల్గియున్నవారు జన్మాంతరమున జగదీశుని కృపకుఁ బాత్రులగుటలో నబ్బురమేమికలదు ?

మణికంధరుఁడొక గంధర్వుఁడు. నారదశిష్యుఁడు. కలభాషిణిని గాంచి నంతనే యాతఁడు చెప్పిన పద్యమునుబట్టియు శ్రీకృష్ణునిపై నాతఁడు చెప్పిన దండకమునుబట్టియుఁ దీర్థయాత్రావసరమున నాతఁడుచేసిన విష్ణుస్తోత్రమును బట్టియు నాతఁడొక కవి యనియు మనమూహింపవచ్చును. పరస్పరద్వేషమును మాని సంగీత సాహిత్యము లీతనియందుఁ జక్కఁగాఁ నెలకొనియున్నవి. ఈతనికిఁగల యీ సంగీతసాహిత్య విద్యాప్రావీణ్యమును నీతని యపూర్వ సౌందర్యమును గలభాషిణి కీతనియందుఁగల ప్రేమకుఁ గారణములైనవి. ఈతఁడును నృత్తగీతాదులయందును రూప లావణ్యములయందును నిరుప మానమైయున్న కలభాషిణిని గామించినాఁడు. స్వర్లోకమునుండి భూలోకము నకు దిగివచ్చుచు నీతఁడుద్యానవనమునఁ "దమిపూఁదీగెలఁ దూగుటుయ్యెలల" నూగుచున్న కలభాషిణిని గాంచి యామె సౌందర్యమును బ్రస్తుతించినప్పుడే, తనకుఁ దెలియకుండఁగనే యామెను బ్రేమించినాఁ డనవచ్చును. కాని యిరువురును మునిశాపభయమునఁ బ్రణయప్రసంగములఁ జేయరైరి.

మణికంధరుఁడు దివ్యక్షేత్ర సందర్శనాభిలాషతో ద్వారవతి వీడినాఁడు. నానాక్షేత్రముల సందర్శించినాఁడు. ఘోరతపముఁ గావించియుఁ దపస్సిద్ధిని గాంచలేకపోయినాఁడు. దేవవేశ్యాభుజంగుఁడైనాఁడు. రంభయందలి మోహ మును వీడలేక తపోవ్యయమునైన బాటింపక మాయానలకూబరుఁడై మాయా రంభను గూడినాఁడు. తుదకు నిజనలకూబరునిచే శపింపఁబడి పశ్చాత్తప్తుఁడై మృగేంద్రవాహనాలయమునఁ గలభాషిణిని మరలఁ గలిసికొనినాఁడు. కాని

తానువలచిన సుందరిని తనచేతితోనే చంపవలసిన యవస్థ తటస్థమైనది. అన్యమార్గము గోచరింపమి నాతఁడాక్రూరకార్యమున కొడంబడినాఁడు. అనంతరము శల్యాసురుని సంహరించి వరప్రభావమునఁ దానును మడిసి కళాపూర్ణుఁడై జన్మించినాఁడు.

మణిస్తంభుని ప్రకృతి చాల విచిత్రమైనది. ఈతని జీవితమును ద్విధా విభజింపవచ్చును. ఒకటి శాలీననామమున వ్యవహరింపఁబడిన జీవితము. రెండవది మణిస్తంభనామమున వ్యవహరింపఁబడిన జీవితము. ఈతని జీవితము నందలి కొన్ని ఘట్టములను గమనించినచో నీతఁడొక మహాకాముకునియట్లు గోచరించును. మఱికొన్ని యంశములను బరిశీలించినఁ బరమశాక్తేయునియట్లు గోచరించును.

శాలీననామమున నున్నప్పుడీతఁడు తనభార్యకు సంతాననిరోధము గలుగునట్లుగను నిత్యయౌవనయై యుండునట్లుగను ననుగ్రహింప భాషాయోషను బ్రార్థించినాఁడు. ఆమెకు దేవి యొసఁగిన వరము తన యభిప్రాయమునకు వ్యతిరేకముగా నుండుటచే నీతఁడు హఠాత్తుగా శతతాళదఘ్నమగు మడుగులోనికి దూకి యాత్మహత్యాప్రయత్నమునకుఁగూడ వెనుదీయలేదు. ఆర్యమతానుసార మాత్మహత్య మహాపాతకము. ఆర్యులు గార్హస్థ్యమునకు సంతానమునే ఫలముగాఁ జెప్పియున్నారు. శాలీనుఁడీ రెండు ధర్మములనుగూడ మనసునం దిడికొనినట్లు కన్పట్టదు. మఱియు నీతఁడు దివారాత్రముల భేదమును బాటింపక భార్యను గవయువాఁడు. ఇదికూడ సదాచార విరుద్ధమే.

ఈతని రెండవ జీవితమునఁగూడ నీతఁడాచరించిన పనులు మానవప్రకృతివిరుద్ధములుఁ గాముకత్వ ద్యోతకములునై యున్నవి. మృగేంద్రవాహన, కలభాషిణితోఁగూడ నీతనిని దూరమున నొక పొదరింటిలోఁ బారవైవగా నీతఁ డేకాంతముననున్న కలభాషిణిని జూచి మోహపరవశుఁడై యామెను గౌగిలించి యామె మానభంగమును గావింపయత్నించినాఁడు. ఆమె యాక్రోశమును విని నలకూబర రూపముననున్న మణికంధరుఁడు రాఁగా నీతఁడు పిఱికిపందయై పాఱిపోయినాఁడు. పురుషత్వమును దనభార్య పొందఁగా నీతఁడు స్త్రీత్వమును బొంది తన కాముకత్వమును వ్యక్తీకరించియున్నాఁడు.

కాని యీతఁడు కావించిన కొన్ని కార్యములు మహాసాహస ప్రచురములై యున్నవి. మృగేంద్రవాహనానుగ్రహమున దూరశ్రవణమును దూరదృష్టిని సంపాదించుటకై యీతఁడుచేసిన పను లీతని క్రౌర్యమును వేనోళ్లఁ జాటుచున్నవి. వంచనచేసిన కలభాషిణిని మృగేంద్ర వాహనాలయమునకుం గొనివచ్చి యామెనఁట బలినీయఁ గడంగినాఁడు.

క్రూరుఁడును హృదయవిహీనుఁడును గాముకుఁడును నగు నీతనికిఁ పుణ్యవశమున సుగాత్రి భార్యయైనది. ఈమె హైందవనారీలోకమున కాదర్శ ప్రాయయని చెప్పనొప్పును. ఈమెకుఁ బతియే సర్వస్వము. మనోవాక్కాయ ముల నాతని కెదిరింపకుండుటయే యామెదీక్ష. సుగాత్రీ నామమున నీమె యున్నప్పుడీమె భర్తయెడఁ జూపిన యనురాగము కడుంగడు శ్లాఘ్యమై యున్నది. తనతల్లి తనభర్త సేవగించుకొనుచున్నను దానాతని మాట కెదురాడ లేదు. సులభకోపియు నతిసాహసియునగు తనభర్త మడుగులోఁదూకిన యనం తరముకూడ నీమె తనపాతివ్రత్యమునప్లే నిలిపికొని సన్యాసినియై కాలము గడిపినది.

సుగాత్రి దయామయి. మృగేంద్రవాహనాలయమునఁ గలభాషిణిని మణి స్తంభుఁడు బలిసీబోగా నీమె తనకంఠము నామెకంఠమున కడ్డుగా నిడినది. భర్తసౌఖ్యమే తనసౌఖ్యము. భర్తృసేవయే భగవత్సేవయని నమ్మికొనియున్న హైందవనారీమణుల కీయమచరిత్ర నిత్యము పఠనీయము.

కళాపూర్ణోదయమును జదివినవారికిఁ గవి యిక్ష్వాకువ్యమునకు వేశ్యనేల నాయికను జేసినాఁడను ప్రశ్న జనింపకపోదు. ఇట్టికల్పనము నానాఁటి పండిత లోక మాదరింపదేమోయను సందియము కవిహృదయమునఁగూడ లేకపోలేదు. అందులకే కథాప్రారంభమున ద్వారవతిని వర్ణించుచు

అందును వారు వీరనక యందఱు ధర్మధురీణులైన వా
రందఱు శుద్ధభాగవతు లందఱు వేద నిరూఢినున్న వా
రందఱు సాత్త్వికప్రవరు లందఱుఁ దత్త్వమెఱింగినట్టి వా
రందఱు సత్కృపానిరతు లందఱుఁ బావనులెన్ని చూడఁగన్.

ఇట్టిట్టన నేటికిఁ ద
త్పట్టణమున నున్నయట్టి ప్రజ లేజాతిం
బుట్టిన వారలు వంద్యులు
గట్టిగఁ దద్వినుతినెల్ల కలుషము పాయున్.

ఇందుఁ 'దత్పట్టణమున నున్నయట్టి ప్రజ లేజాతిం బుట్టిన వారలు వంద్యులు' అను వాక్యము పై యూహకుఁ బ్రబలాధారముగా నున్నది. కవి కీసందియమును లేకున్న నీ విషయము నింతతఱచి చెప్పవలసినంత యవసరము కన్పట్టదు.

ఇట్టి పాత్రను గల్పించి నాయికను జేయుటలోఁ గవి యుద్దేశమేమి ? యను ప్రశ్నకు సమాధాన మిచ్చుటకుఁ బూర్వమిట్టి నాయికాపాత్ర నిర్మాణ మితఃపూర్వ మేవాఙ్మయమునందైనను కలదాయను నంశమును జర్చింప వలయును.

ఇంతకుఁ బూర్వమిట్టి నాయిక సంస్కృతమునందును దమిళమునందును గూడ కలదు. మృచ్ఛకటికమునందలి వసంతసేన యిట్టిదే. తమిళమునందలి మణిమేఖలాదులలో వేశ్యయే నాయికయై యున్నది. పెద్దన మనుచరిత్రమునందలి వరూధినియు వేశ్యయేకాని యామె స్వర్వేశ్య.

కాని సూరనార్యుఁడీ పాత్రల మనసున నిడికొని కలభాషిణీపాత్రను నిర్మించినాఁడని తలంచుట కవకాశము చాలదు. ఇట్టిపాత్రను సృజించుటలో నాతనికొక మహత్తరాశయము కలదు.

ఆరోజులలోఁ దక్కువ కులమువారి చరిత్రమును గావ్యముగా వ్రాయువారే లేరు. భౌతిక ప్రపంచమునందువలెనే కావ్యప్రపంచమునందును సంపన్నులకుమాత్రమే స్థానముగలదు. రాజులును రాణులును ననుభవించు శృంగారము చూచుటకుదాత్తముగానున్నను నంతరమునఁ గృత్రిమమై స్వభావవిరుద్ధమై గోచరించును. వారి శృంగారములో రతికున్నంత స్థానము ప్రణయమునకుండదు. ప్రణయపూర్వకమైన శృంగారానుభవ మకృత్రిమస్వభావులైన సామాన్య సంసారులకే చెల్లును. సూరనార్యుఁడు బోధింపఁదలఁచిన ధర్మములలో నిది యొకటి. కావుననే యా హీనకులజ నాతఁ డాదరించెను.

అట్లయ్యు వేశ్యనే యేల నాయికను జేయవలయునన్నచో నద్దానికనేక కారణములు గలవు. ఆతఁడు చెప్పఁదలచుకొన్న కథలోఁ జిత్రవిచిత్రములగు ప్రణయగాథ లిమిడియున్నవి. మఱియు నాతఁడు కల్పించుకొనిన కథాప్రణాళికను బరిశీలించితిమేని నందు నాయికాపాత్రమునకు వేశ్యయే యుచితమైనదని మనకు సువ్యక్తము కాకపోదు. మఱియుఁ బాత్రల యుత్తమత్వమునకుఁ గులీనతకంటె శీలసంపన్నత పరమప్రమాణమని గ్రహింపఁగలిగిననేకాని కలభాషిణి యాదర పాత్రము కాదు. దీనికి సహృదయులే ప్రమాణము.

ఇఁకఁ బ్రభావతీప్రద్యుమ్నమునందలి పాత్రరచనా విశేషమును బరిశీలింతము.

సూరనార్యుని రచనయం దన్నిటను బురుషులకంటె స్త్రీలకే యెక్కుడు ప్రాధాన్యమీయఁబడినది. ఈ గ్రంథమునందలి పాత్రలలో శుచిముఖి ప్రజ్ఞామూర్తి. ప్రభావతి ప్రణయమూర్తి. ఇందు శుచిముఖీపాత్రము తిలకాయమానమై యున్నది. చూడఁజూడ నాయంచగరితకొఱకే కవి యిమ్మహాప్రబంధమును రచియించెనా యనికూడఁ దోచును. భారతమున శ్రీకృష్ణపాత్రమునందు సోమయాజి యాత్మీయత ప్రతిఫలించినట్లే యిందు శుచిముఖీపాత్రమున సూరన యాత్మీయత ప్రతిఫలించుచున్నదని ప్రౌఢవిమర్శకుల యభిప్రాయము.

కళాపూర్ణోదయమునఁ గలభాషిణీపాత్రమునఁ బ్రేమప్రవాహము పొంగి పొరలినది. ప్రభావతీప్రద్యుమ్నమున శుచిముఖీపాత్రమునందుఁ బ్రజ్ఞావిశేషము

మిన్నుముట్టినది. హృదయ దౌర్బల్యముచేఁ గలభాషిణి మహాకష్టములకు లోనైనది. బుద్ధిబలముచే శుచిముఖి యొరుల కష్టములకుఁగూడఁ దరుణోపాయ మైనది. సూరనార్యుని పాత్రరచనానైపుణ్యమును, రాజకీయ వేతృత్వమును, హృదయగాంభీర్యమును, యుక్తిప్రత్యుక్తి కౌశలమును నెఱుంగవలయునన్నచో శుచిముఖీ పాత్రమును బరిశీలింపవలయును.

చతుర్ముఖుని తేరుమోయు సారంగధరాఖ్యుని కూతురు శుచిముఖి. వాగ్దేవతయే సమస్తవిద్యల నామెకుఁ గఱపి తనంతటిదానిగ నొనర్చినది. అతి వాఙ్మహిమాఢ్యయగు నీరాజహంసికిని దనప్రోది రాచిలుకకును భాషాయోష కైతసెప్పఁ బోటీపెట్టినది. అందు జయముగాంచిన శుచిముఖినామె గారవించి 'యుపమాతిశయోక్తి కామధేను' బిరుదము నొసంగి గండపెండరము నొక్క-దాని నయ్యబల తదంఘ్రిమూలమునఁ దొడగినది.

తొలుదొల్త నీయంచగరిత మనకింద్రుని యుద్యానవనమునందు సాక్షాత్క-రించును. ఇంద్రుఁడు వజ్రనాభవధోపాయము నాలోచించుచుండఁగా వియద్గం గలో నట్టిటుఁ దిరుగాడు నంచలపిండు గానవచ్చినది. వానింజేరఁజీరి యాతఁడు తన కార్యావసరముల నెఱింగించుచుండఁగాఁ దనవరుఁడెఱిఁగింప నీహంసి వజ్రిమ్రోల నిలిచి తనవాఙ్నైపుణ్యమును సమయోచిత బుద్ధికౌశలమును వెలయించినది. ఇంద్రోపేంద్రుల బుద్ధికి నగమ్యములైన యూహలుగూడ నీరాజహంసికి సుసాధ్యములైనవి.

మఱియుఁ దాను వజ్రనాభుని నగరిలోఁ దిరుగుతఱిని వినినవియుఁ గనినవియు నగు నంశములఁ గ్రోడీకరించి తర్కించి సహేతుకమైన యొక నిశ్చయమున కామె వచ్చినది. ప్రభావతికి స్వప్నమునఁ బార్వతి సాక్షాత్కరించి ప్రద్యుమ్నుని చిత్రమొసఁగుటయు నా స్వప్నవిషయమునఁ బ్రభావతికి నామె చెలికత్తెయగు రాగవల్లరికి జరిగిన సంభాషణము సర్వమును దాను వినిన దంతయు నింద్రున కెఱింగించినది. చెప్పుటయేకాక తన సిద్ధాంతము నీ క్రింది రీతిని వ్యక్తముచేసినది :

ఆ యింతి ప్రద్యుమ్ను జాయఁగాఁ బలికిన
గౌరి మాటకుఁ దప్పు కలుగదనుము
దనుజ విరోధిపుత్త్రునకు నాదుష్టదై
త్యుఁడు దనంతఁ దనూజ నొసఁగఁడనుము
ప్రద్యుమ్నుఁడట్లు ప్రభావతీపతియైన
దానవునకుఁ బోరు తప్పదనుము
వజ్రపురము ప్రభావతికొఱకు కేలుట
యసురకు జయమైనఁ బొసఁగదనుము

చిత్రఫలకంబు ప్రత్యక్ష సిద్ధమగుటఁ
జేసి యాకల యధిక విశ్వాస యోగ్య
మదియు వేకువగావున నచిరభావి
ఫలము దేవేంద్ర! నీవెంచి తెలిసికొనుము.

దేవేంద్రున కీమె వాగ్వైదగ్ధ్యమును యుక్తిప్రత్యుక్తి నైపుణ్యమును సహేతుక విమర్శజ్ఞానమును ముదముఁ గొల్పినవి. ఆతఁడు సంతసము పట్టఁ జాలక 'వాగ్దేవతవో కాక యాకెదిద్దిన కవివో' యని యా రాజహంసిని ప్రశంసించి యామెనే శ్రీకృష్ణునికడకు నీవిషయము నెఱింగింపఁ బంపినాఁడు.

శ్రీకృష్ణుఁడుగూడ నీరాజహంసి బుద్ధివిశేషమున కాశ్చర్యపడినాఁడు. క్రూరరాక్షసునిపైకిఁ దనకొడుకు యుద్ధమునకేగుట రుక్మిణికి హితవుగానుండదని హంసి గ్రహించి శ్రీకృష్ణుని యేకాంతమిమ్మని కోరినది. ఇట్లు సూక్ష్మాతిసూక్ష్మము లైన విషయములందుఁగూడ నీరాజహంసి కేమఱుపాటుగాని పొరపాటుగాని కానరాదు. రాజకీయవేత్తకు ముఖ్యముగాఁ గావలసిన రహస్యగోపనమును, వాఙ్నైపుణ్యమును గభీరహృదయమును నీమెకు బాగుగా నలవడినవి.

శ్రీకృష్ణునితోడి రాజకీయ ప్రసంగములో హంసి వజ్రనాభవధఁ గావింప నర్హుఁడు ప్రద్యుమ్నుఁడేయని నిర్ణయించుకొనినది. తరువాత ద్వారవతి వీడి పోవుచు మధ్యేమార్గముననున్న యొక యుద్యానవనమునందుఁ దురగారూఢుఁడై కందుకకేళిం దేలు ప్రద్యుమ్నుని గాంచినది. వినోదాసక్తమైయున్న నవ్వీరుని మనసు ప్రభావతిపై మరలునట్లు గావించుట భవిష్యత్కార్యమున కుపయోగ పడునని గ్రహించినది. కాని పిలువని పేరంటమునకేగుట రాజనీతి విరుద్ధము గదా! కావున నాతఁడే తమ్ముఁ బిలుచునట్టి యవసరమును గల్పింపవలయును.

ప్రజ్ఞాధురీణయగు శుచిముఖి కిది కష్టసాధ్యముకాదు. వెంటనే తన చెలిమికత్తెతోఁ బ్రద్యుమ్నునకు శ్రవణగోచర మగునట్లుగా నల్లయతఁడే యాతఁడు గానోపునని పలికినది. కందుకకేళీలోలుఁడగు ప్రద్యుమ్నుని మనసు హఠాత్తుగా నీయంచపిండువైపు మరలినది. తన ప్రసంగమును వారు చేయఁ గారణమేమియో యడుగవలయునని ప్రద్యుమ్నుఁ డాయంచల నెలుగెత్తి పిలిచి నాఁడు. శుచిముఖియెత్తు నెగ్గినది. అవకాశముకలిగిన విడుచునదికాదు శుచిముఖి. ఆతని ప్రసంగమువచ్చిన తెఱంగెఱింగించుచుఁ బ్రసంగవశమునఁ జెప్పినట్లు ప్రభావతీసౌందర్యమును సంస్తుతించినది. ఇప్పటికింతే చాలునని యచ్చోటు వీడినది.

మూఁడవ సంగమున నామె ప్రభావతియుద్యానవనమునఁ గానవచ్చును. ప్రభావతిముందర నామె చూపిన ప్రజ్ఞావిశేష మద్భుతావహము. ఈ సంభాషణ

మునందామె యాశించిన ప్రయోజనము లనేకములు గలవు. ఒకవంకఁ బ్రభావతికిఁ బ్రద్యుమ్నునిపై వలపు గలుగునట్లు చేయవలయును. ఇందులకుఁ బరమేశ్వరియే పునాదివైచినది.

కాని యా చిత్రఫలకమునందలి పురుషునివంటి పురుషుఁ డెందైనఁ గలఁడాయను సందేహము ప్రభావతియందుఁ బ్రగాఢమై తుదకు నిస్పృహగాఁ బరిణమించుచున్నది. దానిని బోనడచుట శుచిముఖి పనియైయున్నది. ఇది సాధించుటంత కష్టకార్యము కాకపోయినను బ్రద్యుమ్ను నచ్చటికి రప్పించుట కష్టతరము. బ్రహ్మవర ప్రభావమున వజ్రనాభుని యనుజ్ఞలేనిదే యొరులెవ్వరు నానగరుఁ బ్రవేశింపఁ జాలరు. ప్రద్యుమ్నుని కాతఁడు ప్రవేశము నొసంగు ననుమాట కలలోనైన నూహింపరాని విషయము. ఇఁక నాతని యనుజ్ఞ వడయుటకుఁ బ్రభావతీ సాహాయ్య మత్యావశ్యకము. మఱియుఁ బభావతికి రహస్యభంగము కాకుండఁ బ్రద్యుమ్ను నటకు రావింపవలయును.

ఈ విషమ సమస్యా పరిష్కారమునకై శుచిముఖి యోజించుచుండఁగాఁ బ్రద్యుమ్నునిలేఖ దైవవశమున నఁటఁజేరినది. ఆ లేఖంగాంచి ప్రభావతి యొడలు మఱచినది. ప్రేమప్రవాహము పొంగిపొరలినది. ప్రద్యుమ్నునిగూడకున్నఁ బ్రాణములు నిలుచుటయే కష్టమనిపించినది. కాని యేమి లాభము? శుచిముఖికిఁ గలిగిన విషమసమస్యయే యిపుడామె నెదుర్కొనినది. దానిని బరిష్కరింప శుచిముఖితప్ప నన్యాధారమామెకు గోచరింపలేదు. శుచిముఖికిఁ గావలసినదియు నదియే.

ఆమె ప్రార్థనముపై శుచిముఖి యొక యుపాయ మామెకెఱింగించినది. తన్నెట్లియిన వజ్రనాభుని సన్నిధికిఁ గొంపోయినఁ బ్రద్యుమ్ను నటకు రహస్య భంగము కాకుండ రావింపఁగలనని ప్రతిజ్ఞచేసినది. ప్రభావతీ సాహాయ్యమున వజ్రనాభుని దరికేగి తన వాక్చాతుర్యముచేతను శాస్త్రపాండిత్యముచేతను నాతని మెప్పించి మెలమెల్లగా భద్రనటుని వృత్తాంతమును జారవిడిచినది. వజ్రనాభుఁడును నాతనిరాక కనుజ్ఞ యిడినాఁడు. ఇంతతో నీ దుర్ఘట కార్యము ముగిసినది.

శుచిముఖి కావించిన దుర్ఘట కార్యములును నింతలో ముగిసినవన వచ్చును. ప్రద్యుమ్నాదుల వజ్రనాభుఁడెఱింగి వారిపై నాతఁడు సైన్యముల నంపుతఱి నామె యా వృత్తాంతమును శ్రీకృష్ణునకుఁ దెలియఁజేయుటయే యామె కడసారిపని యని చెప్పవచ్చును.

ఈ కార్యకలాపము జరుగుచున్నంతకాలము ప్రభావతికామె నిజవృత్తాంతము నావంతయు నెఱిఁగింపలేదు. ప్రభావతీసౌఖ్యమునకైయే తానంతటి పాటు పడుచున్నట్లు నటించినది. తుదకుఁ బ్రద్యుమ్నుఁడును గదసాంబులు నొకరి

రహస్య మొక తెలియంగకుండ నామె మెలగినది. ఇంతటి నేర్పు నింతటి రహస్యగోపన సామర్థ్యము నింతటి ప్రజ్ఞావిశేషమును సామాన్యుల కలవడునవి కావు. సూరనార్యుఁడీ పాత్రమున నొక మహామాత్యుని బ్రదర్శించిఁ నాఁడన వచ్చును.

పాత్ర నిర్మాణకౌశలము కవులందఱకు నబ్బునట్టిది కాదు. మఱియు నొక్కొక్క కవి కొక్కొక్కదానియం దభిరుచి యుండును. ఒక కవికి వర్ణ నాభిమానము మెండుగా నుండును. ఇంకొకనికిఁ గథాకల్పనమునందుఁ బ్రీతి యధికమై యుండును. వేఱొకనికిఁ బాత్రనిర్మాణమునం దాసక్తియుండును. ఈ మూఁడింటిని సమరసభావమున నడుపఁగల కవులరుదుగా నుందురు. ఏకవికి దేనియం దభిరుచి మెండుగానున్నది యను విషయ మొక్కటియే మనకిటఁ చర్చనీయము.

రామరాజభూషణునకుఁ బాత్ర నిర్మాణకౌశల మంతగానున్నట్లు కానరాదు. వరూధినీప్రవరులవలె గిరికావసురాజులు తలఁచినంతనే తలంపునకు వచ్చునంత స్ఫుటముగాఁ జిత్రింపఁబడి యుండలేదు. అనుప్రాసాదుల విషయమున శ్లేష ధ్వన్యాదుల విషయమున నీతఁడు చూపినంతశ్రద్ధ సజీవపాత్ర నిర్మాణవిషయమున నీతఁడు చూపలేదు. గిరికావసురాజులందు చెప్పఁదగిన విశేషమేమియుఁ గాన రాదు. వారలంకారశాస్త్రమును నచ్చునఁబోతపోసిన విగ్రహములవలెనేయున్నారు. ప్రాసంగిక వృత్తమునందుఁ గోలాహలుఁడొక యౌవనోన్మాదివలెను శుక్తిమతి యొక భీరువువలెను జిత్రింపఁబడి యున్నారు.

ఆముక్తమాల్యదయుఁ బాత్రరచనా విషయమున వసుచరిత్రనే చాలవఱకుఁ బోలియున్నది. రాయలు బహువర్ణనాప్రియుఁడు. ఈ వర్ణనాప్రియత్వముచేతనే ఈతని పాత్ర రచనాచాతుర్యము మఱుఁగుపడి యుండును. ఇట్లయ్యు నీతని పాత్రలు రేఖామాత్రముగనైన మనకు గోచరించుచునేయున్నవి.

విష్ణుచిత్తుని యమాయకత్వమును జ్ఞానరహితమైన యాతని భక్తిని జూపుట కీతఁడు కొంత పాటుపడియున్నాఁడు. ఈతని పాత్ర నిర్మాణకౌశల మంతయు మాలదాసరియందుఁ గేంద్రీకరింపఁబడి యున్నది. మాలదాసరి పరమభక్తిగల కీర్తనపరుఁడు. యామునాచార్యుఁడు జ్ఞాని. వేదాంత వివేక సంపన్నుఁడైన భక్తుఁడు. ఈ మువ్వురకును భగవంతునివలన సమానఫలమే లభించినది. మఱికొంత మథించి చూచినచో మాలదాసరి కీర్తన ప్రభావమే పరమోత్కృష్ట మనవలసివచ్చును. ఈతని యొక్కనాటి కీర్తనఫలము బ్రహ్మ రక్షస్సునకే సాయుజ్యము నిచ్చినది.

జ్ఞాననిరూఢమైన భక్తివలె జ్ఞానరహితమైన భక్తియు, దానివలెనే భక్తి సహితమైన కీర్తనయు భగవదనుగ్రహ పాత్రములేయని చెప్పుటకే యీ మూఁడు పాత్రములును సృజింపఁబడినవి.

రాయల యాత్మీయత యీమూఁడు పాత్రలయందును గలదు. ఆయన విష్ణుచిత్తునివంటి మహాభక్తుఁడు, మాలదాసరివంటి కీర్తనపరుఁడు, యామునాచార్యునివంటి మహాజ్ఞాని.

చింతలపూడి యెల్లనార్యుని రాధామాధవ ప్రబంధములో రాధా పాత్రము సర్వాంగసుందరముగాఁ జిత్రింపబడియున్నది.

విష్ణుసంబంధములైన పురాణములలో సనఁగా భాగవత, హరివంశ, విష్ణు పురాణములలో రాధపేరెచ్చటను గానరాదు. స్కాందబ్రహ్మవైవర్త పురాణములలో నీమెనుగూర్చి కలదు. స్కాందమునుబట్టి రాధ కృష్ణుని మనః ప్రీణనార్థము శతగోపుని కుమార్తెగా బ్రహ్మచే సృజింపఁబడినవ్యక్తి. అందు వారిరువురకు నేవిధమైన శృంగారమును వర్ణింపఁబడియుండలేదు. బ్రహ్మవైవర్తములో సూర్ధ్వలోకముల కన్నింటికినిబైన గోలోకమొకటి యున్నదనియు దానికధినేత శ్రీకృష్ణుఁడనియు రాధ శక్తిస్వరూపిణి యనియు నిరూపింపఁబడియున్నది. భరతవర్షమునందలి బృందావన గోలోకము దాని ప్రతిబింబమే. ఆ రాధాకృష్ణులే భూలోకమునందలి రాధాకృష్ణులు.

కాని లోకములోని గాథలనుబట్టి యిచ్చట వీరి సంబంధము వేఱుగానున్నది. ఆమెను బరకీయనుగాఁ గృష్ణుని మేనయత్తగా నాతని వలపుకత్తెఁగాఁ జూపుకథలు లోకములో ననేకములు వ్యాపించియుండుటయే కాక యీ వింత కథలు కావ్యములలోనికిఁగూడ నెక్కినవి.

చింతలపూడి యెల్లనార్యుని గ్రంథమట్టిదికాదు. ఇందు రాధ కృష్ణునకు స్వయంవరలబ్ధయైన భార్యగాని వలపుకత్తెగాదు. ఈ స్వయంవరము రుక్మిణీ స్వయంవరమును బోలియుండును. తండ్రి సహస్రగోపుఁడు రాధను గృష్ణునకీయఁబోగా నామె యన్న భద్రుఁడనువాఁడు రుక్మిణి యన్నయగు రుక్మివలెఁ బ్రతిపక్షమున నిలుచును. అయ్యెడ బ్రాహ్మణుఁడు రాయబారము నెరపఁగా నియ్యెడ చిలుక రాయబారము నెరపినది.

ఈతఁడు సృజించిన పాత్రములలో మధురవాణీ పాత్రమొకటి సజీవమై యొప్పుచున్నది. వాణియే మధురవాణి. రాధాదేవికిఁ దాపోపశమనముఁజేయ గృష్ణప్రార్థితయై యాతని సందేశము నామెకుఁ దెల్పినది.

ఎడపాటి యెఱ్ఱన తన శృంగారమల్హణ చరిత్రమున సహాధ్యాయులైన వారి యనురాగము ప్రేమగా నెట్లుమారునో నిరూపించినాఁడు. ఈతని గ్రంథమునకు మూలము సోమనాథుని పండితారాధ్యచరిత్ర. మల్హణుఁడు నాతని ప్రియురాలైన పుష్పగంధియు శివమహిమవలన నెట్లు ముక్తిపొందిరో సోమనాథుఁడు చెప్పినాఁడు. ఈ గ్రంథమున శ్వేతోపాఖ్యానమను నొక చిన్నకథ

కూడఁగలదు. అది వేశ్యాసంపర్క మనర్థదాయకము కాదని నిరూపించుట కేర్పడిన గాథ. అదియుంగాక చాల నప్రస్తుతములగు కామశాస్త్ర ప్రసంగము లిందుగలవు. ప్రధాన కథాభాగమునుగూడ నీతఁడంత ప్రౌఢముగా నిర్వహించి నాఁడని చెప్పఁజాలము.

ఇందీతఁడు ధనదత్తుఁడను నొకకోమటిని బ్రవేశపెట్టినాఁడు. ఈకోమటి చేష్టలన్నియు హాస్యరసజనకములై కడుపుబ్బ నవ్వుపుట్టించును. కోమటి పుష్ప గంధిపై మరులుకొని యామె తనకొడఁబడదని యామె తల్లికడకొక చెలికానిని బంపఁదలంచి యాతనితో

నిలిపెందర్థం బడిగినఁ
గలఁగక యొడఁబడుము నాకుఁగలవాఁడవయో
చెలికాఁడ ! మెచ్చునీకుం
గలదని

చెప్పి బ్రతిమాలుకొనినాఁడు.

పుష్పగంధిపైఁగల వలపుచే నవ్వైశ్యవరుఁడు చెందిన విరహము నాతని శీతలోపచార విధానములు కవి యిట్లు వర్ణించి పాఠకులకుఁ గడుపుబ్బ నవ్వు పుట్టించినాఁడు. చూడుఁడు :

బేరసారంబు మీఁదటి ప్రేమలుడిగి
సెట్టి సానివిలాస మీక్షింపరోసి
సత్రసాలయ్య ముద్దాడ నైచదయ్యె
వనిత మీదటిహాళి నవ్వైశ్యవరుఁడు.

కాసువిడిచినఁ బ్రాణమాకసముఁ బట్టు
ముదితఁ జూడక ప్రాణంబు మున్నెపోవుఁ
దెగువ నీరెంటికిని నేది తెరువు చెపుమ
పాపి ! లంజతికంబ ! నీ బంటుఁగావు.

చక్కిలంబులు కొన్ని చవిచూచు నందంద
మెల్లనె యనుపగుగ్గిళ్లు నమలు
చల్లగావలెనని చలిమిడి భక్షించు
నొకపాటుగాఁగఁ బానకముఁద్రాగు
నయన పోలయ్యకు నంజలిఘటియించుఁ
దులసితీర్థమువఁ గన్నులుదొలంచు
తల గోడతోడుతఁ దాకించుకొనఁబోవు
పాపిదైవమయని పండ్లు కొఱుకు

నడుచిపడుఁ బొత్తికడుపంతఁ బొడిచికొనును
మూర్ఛ నిద్రయు నాహారమును త్యజించి
యున్నచో నుండనైపక యొరలియొరలి
మొరట ! పోదము రమ్మను ముదితకడకు.

ఇట్లు విరహవేదనాదందహ్యమాన మానసులైన సెట్టిగారు చిట్టచివరకుఁ బుష్పగంధి యింటికిఁ బయనము సాగించినారు. ఆపయనమెంత విపరీతముగ నున్నదో చూడుఁడు.

గందపుఁబొట్టు వీడియముఁ గచ్చలపాగయుఁ గావిదుప్పటిన్
సందులఁ బూసలున్ జెవులచాటున నీలపుదంట పోగులున్
గందినయట్టి వెండిమొలకట్టును నీలపుటుంగరంబులున్
బొందవు కిఱ్ఱుచెప్పులును బొల్పెసగన్ ధనదత్తుడెంతయున్.

కోమటి జాణలు కొందఱు
వేమారును బాడుకొనుచు వెనువెంటను రాఁ
బ్రేమమునఁ నరిగెఁ బిల్లల
తో ముదివందియనుబోలె దుస్పృహలీలన్.

కవికి సెట్లపై నింతటి వైమనస్య మేలకలిగెనో తెలియకున్నది. అతి మూర్ఖుఁడగు నవ్వైశ్యుని శృంగారచేష్టలను గూడఁ గవి యీతీరుననే వర్ణించినాఁడు.

మొగమెత్తకుండినఁ దగిలి వీడియమిందఁ
యనుచుఁ జేతులువట్టి యదుముకొనును
జూడకూరకయున్న నుద్దులేమందువు
చెప్పుమంచును మీఁదఁజేయి వేయుఁ
బలుకకూరకయున్నఁ బావులేనీవలెఁ
బండుకోరాదని పట్టుఁజెయ్యి
గదియకూరకయున్నఁ జదువులు చదువుచు
నిదిమేలుకాదని యెత్తుకొనును
గన్నుమూసిన పొట్టిరాగాలుసేయు
నదరిపడి మిన్నలేనియు నావులించు
విదురవోనీడు మేల్కని నిలువనీడు
వెలికినేగినఁ దానును వెంటనరుగు.

ఎన్ని శృంగారచేష్టలుచేసినను నెంతయాదరణము చూపినను పుష్పగంధి రతికనుమతింపకపోగా నాకోమటి

వ్యథఁ దల్పు గడియపెట్టికా
శిథిలాత్ముఁడు దాసితోడఁ జెనకుచునుండెన్
క్షుధ నొందినట్టి పిల్లికి
విధిమూడిన యెల్కలేదె వెదకినసైనన్.

సెట్టిగారికిఁ బాపము ధనమంతయుఁ బోయి తుదకు దాసీసంగమము సంభవించినది.

కవికర్ణరసాయనకర్తయగు సంకుసాల నృసింహకవియుఁ బాత్రనిర్మాణ కౌశలము కలవాఁడుకాఁడు.

యవనాశ్వుని పుత్త్రుఁడగు మాంధాత, తండ్రియనంతర మాతని సింహాసన మధిరోహించి, దిగ్విజయయాత్రను సలిపి, కుంతలపతి తనయను విమలాంగి యనుదానిని బెండిలియాడి, సంసారభోగానుభవమువలనఁ దనిసి చిరకాలము తపమొనర్చి విష్ణు సాక్షాత్కారమును బొంది, యా దేవుని యాజ్ఞచే నాయుశ్శేష మును బ్రజాపాలనమునందే గడపి యంతమున విష్ణుసాయుజ్యము నందినాఁడు. నృసింహకవి యీ చిన్నకథ నారాశ్వాసములఁ బ్రబంధముగాఁ జేసినాఁడు. ఈ పెంపంతయు నీకవిచేసిన వర్ణనాబాహుళ్యముపై నాధారపడియున్నది. వర్ణనలయం దీతనికిఁగల మక్కువయే యీతని పాత్రరచనాచాతుర్యమును గుంఠితము గావించి యుండును.

పిల్లవసుచరిత్రములైన కవిరాజమనోరంజనమును, దపతీసంవరణోపా ఖ్యానమును, గవిజనరంజనమును, రసికజనమనోభిరామమును సజీవపాత్ర రచనావిషయమున నధమములనియే చెప్పవచ్చును.

ఇవి కేవలము వసుచరిత్రానుకరణములు. ఈ ప్రబంధముల వ్రాసినకవులు శయ్యాసౌభాగ్యమున కిచ్చినంత ప్రాధాన్యము మఱిదేనికినిచ్చినట్లు కానరాదు. కాని వసుచరిత్రకారుని పద్యరచనా నైపుణ్యమును గళారహస్య జ్ఞానమును వీరికచ్చినవికావు. ఆతని పద్యములలోని జిగిబిగియుఁ గూర్పుసొంపును వీరి కలవడినవికావు. కావున నివి యన్నియు నామమాత్రానుకరణములనియే చెప్ప నొప్పును. వీరిలో గంగాధర కవితప్ప తక్కినవారందఱు క్షీణయుగములోని వారే. ఇట్టివారి యశ్రద్ధానుకరణములో యా యుగమునకు క్షీణత్వము నాపాదించినవి.

శ్లేషాదుల పరమప్రయోజనము చమత్కార సంపాదనము. సకృత్ప్రతీత మైనప్పుడే యది చమత్కారజనకముగా నుండును గాని లేనిచో హాస్యాస్పదమై వృథాప్రయాసమగును. వీరికీ చిత్రకవిత్వమునందింత రక్తియుండుట శోచ నీయము.

కందుకూరి రుద్రయ తన నిరంకుశోపాఖ్యానమున నిరంకుశ పాత్ర రచనా విషయమున నెంతటి శక్తిసామర్థ్యములు చూపినను నాతఁడు గ్రహించిన యితివృత్తమసద్విషయమగుటచే నాపాత్రమంతగా రాణింపలేదనియే చెప్పవచ్చును.

వైజయంతీ విలాసమున సారంగు తమ్మయ్యయు, విప్రనారాయణ చరిత్రమునందు జెదలువాడ మల్లనయు ఒక్క కథనే వ్రాసియున్నారు. కథ యొక్కటియేయయ్యు నెవరికివారే వ్రాసియుందురు కాని యొకరినొకరు చూచి వ్రాసియుండరనుట కాధారములనేకములు కలవు. తమ్మయ విప్రనారాయణుఁడే దేవదేవియందనురక్తుఁడైనట్లు వ్రాయఁగా, మల్లన, దేవదేవి నాయకుని మనస్సు చలించుటకుఁ బడరానిపాట్లు పడినట్లు వ్రాసినాఁడు. ఎట్లయినను వీరికిఁ బాత్ర నిర్మాణకౌశలము కొంతకలదనియే చెప్పవచ్చును, తమ్మయకు వైష్ణవ ప్రవృత్తి యందంతగా శ్రద్ధయున్నట్లు కానరాదు. విప్రనారాయణునివంటి పరమ భాగవతోత్తముని వర్ణించుతఱినిగూడ నీతఁడు నీచోపమలనే యుపయోగించినాఁడు. చూడుఁడు :

అమ్మగువ గనుంగొనియెన్
ముమ్మరముగఁబట్టి నామములు మైనెల్లన్
గ్రమ్మికొన నుట్టిఁబెట్టిన
గుమ్మడికాయయును బోలెఁ గూర్చున్నతనిన్.

ఇది దేవదేవి యోగినీవేషమున విప్రనారాయణుని కడకేగినపుడు చెప్పిన పద్యము. ఇట్టి సమయముననే మల్లనకవి చెప్పిన యీక్రింది పద్యమెంత మనోహరముగానున్నదో చూడుఁడు :

ననిచిన గుజ్జుమావికెలనం దగుగందవుమ్రాని కొమ్మలం
బెనగొనియున్న మల్లికల పెక్కువ గన్గొని నీక్కుగట్టి నం
జనిత కుతూహలాంకురము శాఖలువాఱగ వచ్చుచున్న య
మ్మునికుల సార్వభౌముని ముముక్షువరేణ్యు మహానుభావునిన్.

దేవదేవి దాసరి సానివేషము, విప్రనారాయణుఁడు దేవదేవిని వెంబడించుటయు నిందునందుఁ గొంచెమించుమించుగ నొక్కతీరుననే వర్ణింపఁబడియున్నది. భావనావిషయమున నీ కవులయందు భేదముచూపట్టినను బాత్రరచనా విషయమున నిరువురును సమాన ప్రజ్ఞ కలవారనియే చెప్పనొప్పును.

చారిత్రక ప్రబంధములనఁదగు కృష్ణరాయ విజయమునందును, రంగరాయ చరిత్రమునందును బాత్రనిర్మాణనైపుణ్య మంతగాఁ గానరాదు. కొంత కొంత రంగరాట్చరిత్రమే యీ విషయమున మేలనిపించును. బహుభాషా

ప్రయోగ సామర్థ్యముచే రేఖామాత్రముగనైన సీతఁడా పాత్రలను మనకుఁ జూపఁగలిగినాఁడు.

పొన్నగంటి తెలగన్న యచ్చతెనుఁగు కవులలో మొదటివాఁడు. ఈతని యయాతి చరిత్రమునందును బాత్ర నిర్మాణకౌశలము కానరాదు. దీనికొక ప్రబల కారణము గలదు. కావ్యమును వ్రాయుటలో ననావశ్యకములైన నియమములను బెంచుకొనువారు కావ్యముఖ్య ప్రయోజనములను మఱచిపోవుట సహజము. మఱచిపోకున్నను, దీక్ష వేతొకదాని నాశ్రయించి యుండుటచేఁ దదితర విషయములవంక కద్దానిని మఱల్చుట కవకాశము చాలదు. ద్వ్యర్థికావ్యములు వ్రాయువారు ఇట్టి విషమావస్థయందే యూగులాడుదురు.

గౌరన ద్విపదకావ్యమునకుఁ బద్యకృతి వ్రాసిన శంకరకవి తన హరిశ్చంద్రోపాఖ్యానమున నత్యద్భుతమగు పాత్రనిర్మాణ కౌశలమును జూపియున్నాఁడు. ఇందు సగపాలు గౌరనదే యనవచ్చును. గౌరనకుఁగల భావనాశక్తి శంకరకవికి లేకున్నను, గౌరనయందు లోపించియున్న కరుణరసపోషణ సామర్థ్య మీ కవికి మిక్కుటముగఁ గలదు. కాటికాపరియగు హరిశ్చంద్రుఁడు, కాలకౌశికుఁడు, పుత్త్రశోకాతురయగు చంద్రమతి వీరిరువురి గ్రంథములయందును నతిలోక రమణీయముగాఁ జిత్రింపఁబడినారనియే చెప్పనొప్పును.

చంద్రభాను చరిత్రమునఁ దరిగొప్పులమల్లన, కథాకల్పనమునఁ గళాపూర్ణోదయము ననుకరింపఁదలఁచి శక్తికిమించిన పాటుపడి పాత్రనిర్మాణమును బాడుచేసినాఁడు. ఈతఁడు తనకుఁ బూర్వము పుట్టిన ప్రతిప్రబంధకథను ననుకరించుటకు యత్నించినాఁడనవచ్చును. దీనివలనఁగథ సందర్భరహితమగుటయుఁ గవియస్వతంత్రత బయలు పడుటయునను రెండు దుష్ఫలితములు గలిగినవి.

ఎలకూచి బాలసరస్వతి యాదవరాఘవపాండవీయమను గ్రంథమును వ్రాసినాఁడు. మూఁడర్థములు చెప్పునప్పటికే కవి ముప్పుతిప్పలు కాఁగా నిఁకఁ బాత్ర నిర్మాణమునకుఁ బాటుపడుటెట్లు ?

స్త్రీ జనోచితమైన కోమలత తన వాక్కునకు నిసర్గముగాఁ గలదు గాన కుమ్మరి మొల్ల సీతాపాత్ర నిర్మాణమునఁ గొంత ప్రాగల్భ్యముఁ జూపినది.

కృష్ణరాయల యుగాంత్యమునకును రఘునాథ రాయల సారస్వత సేవా ప్రారంభమునకును గల మధ్యకాలమున నాంధ్రమునఁ బేరుగల ప్రబంధములు మూఁడు వెలసినవి.

మట్ల యనంతభూపాలుఁడు కకుత్స్థ విజయమును, సవరముచిన నారాయణ నాయకుఁడు కువలయాశ్వ చరిత్రమును, దామెర్ల వెంగళనాయకుఁడు

బహుళాశ్వ చరిత్రమును వ్రాసినాడు. ఇందుఁ బాత్ర రచనావిషయమునఁ గువల యాశ్వ చరిత్రమే కొంత మేలనిపించును. ఇందుఁ గవి కళాపూర్ణోదయమును గొంతవఱ కనుకరించి యున్నాఁడు. ఇది మార్కండేయ పురాణములోని మదా లస కథ. ఆ కాలమునందలి యుద్ధ తంత్రాదిచర్యల నీకృతి యద్ధమునందు వోలెఁ జూపును. సేనలు దండువెడలుట, విడియుట, విడిదిలో స్వేచ్ఛా విహా రములు మొదలగు నానాటి యాంధ్రభటుల చర్యలీ గ్రంథమునందు విపులముగా వర్ణింపఁబడి యున్నవి.

రఘునాథరాయలు క్రీ॥ శ॥ 1614 లో సింహాసన మధిష్ఠించి యున్నాఁడు. క్రీ॥ శ॥ 1610 లో జరిగిన తోపూరు యుద్ధముతో నాతని కీర్తి దిగంతములకు వ్యాపించినది. కృష్ణరాయల ఖ్యాతికి నుదయగిరి విజయము కారణమైనట్లే తోపూరు విజయమీరాజు యశస్సునకుఁ గారణమైనది. ఈ రాజుల కిరువురకుఁ బెక్కింట సామ్యముకలదు. ఇరువురును గవులు, పరాక్రమవంతులు. ఇరువురును లక్ష్మికంటె సరస్వతి నెక్కువగా నారాధించినవారు. ఇరువురును నడివయస్సు ననే మరణించిరి. ఈ రాజకవి మూలముననే దక్షిణాంధ్రమునఁ దంజావూరు సాహిత్య ముఖ్యకేంద్రమయ్యెను. మధురయు నించుమించింత ఖ్యాతినే గడిం చినది. ఈ రెండింటికిని వెనుకఁ జెప్పఁదగినది పుదుక్కోట.

దక్షిణాంధ్ర నాయకరాజుల యుగమునకు వైలక్షణ్యమును ప్రాధాన్య మును సంపాదించిన కొన్ని ముఖ్యాంశములిటఁ జెప్పుట ప్రస్తుతాంశమునకు సాహాయ్యకమై యుండును :

1. ప్రక్రియా వైవిధ్యము సంప్రదాయ సిద్ధములగు పూర్వయుగ ప్రబంధములవంటివియుఁ గొన్ని ప్రబంధములు వ్రాసిరి.
2. ఆ ప్రబంధములలోఁ బెక్కింటి ననతివిస్తృతము గావించి, శబ్దమునకంటె భావమునకే ప్రాధాన్యమొసంగి, యిరువదియవ శతాబ్ది కవులకు మార్గదర్శకులైరి.
3. తెలుఁగునఁ గ్రొంగ్రొత్తగాఁ గేవల వచన కావ్యములను వ్రాసిరి.
4. ప్రబంధ కవిత్వముతోపాటు గేయ కవిత్వమునకును సమాన గౌరవము నొసంగిరి.
5. యక్షగానముల కగ్రతాంబూలమునిచ్చి ప్రజలలో నాటక కౌతుక మును బెంచిరి.
6. పురాతన గాథలతోపాటు తాత్కాలిక లోక వృత్తములనుగూడఁ గావ్యవస్తువుగా స్వీకరించిరి.

7. కావ్యములయందు వేదాంతబోధను బరిహరించుటయేగాక కళా సౌందర్యమునకును ధర్మబోధకును ముడిపెట్టకుండఁ గళాసిద్ధియే కళా ప్రయోజనము (Art for art's sake) అనెడి నేటి యొక పాశ్చాత్యమున కుపలక్ష్యీభూతముకాఁదగిన కొన్నిరచనలనుజేసిరి.

ఈ ప్రక్రియా వైవిధ్యమునుబట్టి యానాటి ప్రబంధములలోని స్త్రీ పురుషుల నడవడి యెట్లుండునో యించుక యూహింపనగును. భారతములో శాంతరస ప్రధానమై కానవచ్చు సావిత్ర్యుపాఖ్యానము రఘునాథరాయని చేతిలో శృంగార భూయిష్ఠమైనది. ఈ మార్పు నాటి రాజులయుఁ బ్రజలయు శృంగార పరత్వమునకుఁ బ్రబలమైన తార్కాణము. వారు శృంగార రసికులేకాక హాస్య చతురులుకూడ నైయుండిరి. కాని కొన్నియెడల నీ హాస్య శృంగార లౌల్యము పాత్రౌచిత్య జ్ఞానమునుగూడ భంగము కావించినది. విశ్వామిత్రునంతటి బ్రహ్మర్షినిగూడ బొజ్జనాడించుకొనుచు మేనకవెంటఁ బర్వులు వెట్టు తేలిక మానిసిగాఁ జిత్రించుటే హాస్యలౌల్య ఫలమే యనఁదగును. ఆ నాటి శృంగార ప్రబంధములలో నాయికలుగా వర్తించుపాత్రలుగాని, యుపపాత్రలుగా వర్తించు నచ్చరలుగాని యప్పటి రాజ శుద్ధాంత జనమునకును వారి వేశ్యాజనమునకుఁ బ్రతిసృష్టియేయని చెప్పవచ్చును. రఘునాథుని వాల్మీకి చరిత్ర శృంగార సావిత్రి కంటె మేలుగా రచింపఁబడిన దనవచ్చును. ఆటవికుల సంసారమును వర్ణించుటలోఁ గొన్నియెడల ధూర్జటినిగూడ రాయలు మించియున్నాఁడు. వాల్మీకికి హఠాత్సంభవమైన రామభక్తిని, దత్ఫలమును దలచుకొని కవిపరవశుఁడై రామకీర్తనము పాడినట్లే కావ్యములోని కొన్ని ఘట్టములుండును.

ఈతని యాస్థాన కవులలోఁ జేమకూర వేంకటకవియుఁ గృష్ణాధ్వరియు ముఖ్యులు. కృష్ణాధ్వరి మహాపండితుఁడు. వేంకటకవి కవులలో మేటి. వేంకటకవి రచించిన సారంగధర చరిత్ర తద్రచిత విజయ విలాసముతో సరిపోల్చినఁ జాల పేలవముగా నుండును. విజయ విలాసమునందలి ప్రతి పాత్రమునందును జైతన్య ముట్టిపడుచుండును. నాయకుఁడగు నర్జునుఁడు రూప పరాక్రమములయందసమానుఁడు. కృతిభర్తయగు రఘునాథునే మనసున నిడుకొని కవి యీ నాయక పాత్రను నిర్వహించినాఁడా యను నూహ కవకాశమును గల్పించు పద్యములనేకములిందుఁ గలవు.

విజయ విలాసమునందలి నాయికలు ముప్వురు. ముప్వురును శృంగార మూర్తులే. ముప్వురు సమమాన రూపరేఖా సౌందర్యములు కలవారే. అట్లయ్యు వ్యక్తిత్వమునం దొకరికి నొకరికినిఁ జాల భేదము కలదు. ఉలూచి ప్రౌఢాంగన: తాను వలచిన వానిని మాయోపాయమునఁ దన యింటికే గైకొని పోయినది. వలపు గ్రుమ్మరించి నెఱజాణతనమంతయు నేర్పుమైఁ జూపి కవ్వడిని

గైవసము చేసికొన్నది. తలఁచిన తలఁపులందేమి పలికిన పలుకులందేమి చేసిన చేఁతలందేమి యామె ప్రౌఢతనము సువ్యక్తమగుచునే యుండును. నీవు పరాంగనవుకదా నిన్నెట్లు వివాహమాడవచ్చునని యర్జునుఁడు ప్రశ్నింపఁగా నేను కన్నియ నిందులకు నా కన్నులును నా వలపు కస్తురినామమును సాక్షి. ఇంకను నీకనుమానమైన నీ మోవి మధురామృతమాని బాస చేసెదనని సాహసించి చెప్పునామె ప్రౌఢతనమును, రసికత సుగ్గడింప నేరితరము?

చిత్రాంగదాపాత్ర విషయమునఁ గవి యంతగా శ్రద్ధ చూపినట్లు కానరాదు.

మూఁడవది సుభద్ర. ఈ పాత్రను సృజించుటలోఁ గవి యప్రతిమాన సామర్థ్యమును జూపియున్నాఁడు. ఈమె ముద్దరాలు. సౌందర్యమునఁ దనకు సాటిలేనిది. వయసునఁజిన్నది. తన మేనత్త కొడుకగు నర్జునుని బల పరాక్రమాదులను రూప సౌందర్యములను విని యాతనిపై వలపు నిలిపినది. కాని యమ్మదిత మనోరథమునకు బలరాముఁ డడ్డుగా నిలిచియున్నాఁడు. బలరాముని పైముఖ్యము నెఱింగినవాఁడు కావుననే యర్జునుఁడు మాయామౌని రూపమున ద్వారవతిఁ బ్రవేశించినాఁడు. కృష్ణుఁడర్జును గుర్తించియు నీ వివాహము తనకు సమ్మతమగుటచే నూరకున్నాఁడు. కన్యక గావున మౌని పరిచర్యకై సుభద్రయే నియమింపఁబడినది. మాయతపసి కోర్కెలు ఫలించినవి. ఇచ్చట వీరిద్దరి సంభాషణమును జదివి యానందింపవలయునే కాని యిట్టిదని వ్రాయ నలవికాదు.

కృష్ణాధ్వరి శృంగారనైషధ పారిజాతమును వ్రాసినాఁడు. ద్వ్యర్థి కావ్య మగుటచే నిందు పాత్ర నిర్మాణకౌశల మంతగాఁ గానరాదు.

తంజావుర మేలిన మహారాష్ట్రుల కాలమునఁ బుట్టిన తెలుఁగు ప్రబంధ మొక్కటియే కలదు. అది ముద్దుపళని రాధికాసాంత్వనము. రాధా ప్రణయాత్మక మైన ప్రబంధములలో దీనిని పోలిన దింకొకటి కానరాదు. నంది తిమ్మనఁ బందెమువైచినవివోలె నీ కవయిత్రి రాధికా విప్రలంభ శృంగార రచనము నతి మాత్రముగా రచియించినది. అన్యాసక్తుఁడైన ప్రియునియెడఁ బ్రియురాలికి జనించు తీక్ష్ణభావములన్నియు నీ కావ్యమునందువలె నాంధ్రమున నింకెందును కానరావు. పుట్టువుచే వేశ్యయు సంస్కారముచే రసికురాలునగు నీమె తానే స్వయముగా నాయికయై తన హృదయమునే వ్యక్తముచేసినదా యనిపించును. కాని యిందలి శృంగారము మాత్రము సరసులకు సహ్యముగా నుండదు. కొన్ని పట్టుల స్త్రీజనోచితమైన లజ్జ నీమె త్యజించినదా యనిపించును.

సారస్వత సేవాపరాయణత్వమునందుఁ దంజావురికి రెండవదిగా గణింపఁదగినది మధురాపురము. ఇందు ముఖ్యులైన కవులు మువ్వురు

మాత్రమే కలరు. లింగనమఖి కామేశ్వర కవి సత్యభామా సాంత్వనమును, వెలిదిండ్ల వేంకటపతి శృంగార రాధామాధవమును, శేషము వేంకటపతి తారాశశాంకమును వ్రాసినారు. రాధామాధవ గాథను బరకీయ శృంగారముగాఁ జిత్రించిన మొదటి తెలుఁగు ప్రబంధము శృంగార రాధామాధవము. స్వేచ్ఛా ప్రణయమనెడి (Free love) యాధునిక పాశ్చాత్య సిద్ధాంతము నానాఁడే యామోదించిన వాఁడువోలె వెలిదిండ్ల వేంకటపతి యొకటి రెండుచోట్ల వ్రాసినాఁడు. మొత్తముపై నీమూఁడు ప్రబంధముల యందును నాయికాపాత్ర చిత్రణము మనోహరముగనే యున్నది.

మధుర తంజాపుర రాజ్యముల వైభవ మస్తమించినతోడనే సామ్రాజ్యములు స్థాపించిన యాంధ్రులకు సామంతరాజ్యములైన లేకుండఁబోయినవి. స్వాతంత్ర్య రహితములును నైశ్వర్య శూన్యములునైన పిల్లజమీనులతో జాతి క్షీణముఖమును బట్టినది. తదాశ్రయమైన కవిత్వమునకు నాక్షీణతయే కలిగినది. ఆ దారిద్ర్య పరాధీనతలే కవులలోని భావదాస్య పరాధీనతలకుఁ గారణములైనవి. కవులలోను ప్రజలలోను బూర్వతేజము నశించినది. జాతిని పునరుద్ధరించి నూత్నమార్గమున నడుపఁగల కవియు లేఁడయ్యెను. పూర్వకవులలో ననుకరణ శీలురైన కవులు కొందఱుకలరు గాని వారి సంఖ్య యత్యల్పము. ఈయుగములో నందఱు నస్వతంత్రులే యనవచ్చును. వారిలో నొక్కింతయైన స్వాతంత్ర్యమును జూపినవారీక్రిందఁ బేర్కొనఁబడినవారు. అందు మొదటివాఁడు కంకంటి పాపరాజు.

ఈతని యుత్తరరామాయణము ప్రబంధోచితమైన శైలిలో వ్రాయఁబడినది. ఈకవినిగూర్చి వ్రాయునప్పుడీ కథనే వ్రాసిన కవిబ్రహ్మను మరువరాదు. ఇందు సీతాపరిత్యాగము, రంభారావణసంవాదము మొదలైన శిల్పనికషోపలములైన ఘట్టములు కొన్నిగలవు. ఆఘట్టములను బరిశీలించితిమేని యీతనికి కవిబ్రహ్మకుగల దృష్టిభేదము తేటతెల్లముకాఁగలదు. సీతాపరిత్యాగ ఘట్టమును గవిబ్రహ్మ చాలసంక్షేపముగా వ్రాసినాఁడు. పాపరాజాఘట్టమునే చాల విపులీకరించి వ్రాసినాఁడు. కవిబ్రహ్మ సీతనొక వీరవనితగా భావించియున్నాఁడు. ఆమెయందు రాజసముట్టిపడుచుండును. ఆమె మహాకష్టములు వచ్చినను మతిఁ జలింపఁజేసికొనక వానినెదుర్కొనుటకు సంసిద్ధమైయున్న ధీరస్వాంత. ఆమె లక్ష్మణుని యెదుటనే బోరుమని యేడువక విధివిధానమనుల్లంఘ్యమని సహనభావమున మౌనము వహించినది. లక్ష్మణునితోఁగూడ రాజవనితోచితముగ ముక్తసరిగ మాటలాడినది. ఇఁకఁ బాపరాజు సీతాపాత్రము నింకొకవిధముగ నూహించినాఁడు. ఈమె రామపరిత్యాగమునుగూర్చి వినినంతనే పిడుగడచినట్లు నేలఁగూలి, దీనాతిదీనయై, బేలయై పలవించినది. ఈమెయందు నిగ్రహమను

గుణము లేశమైనఁ గానరాదు. సీతారాముల ప్రణయమును దొలుదొల్త సఖ్యముగా నిరూపించినవాఁడు భవభూతి. ఆయుద్దేశమునే పునరుద్ధరించిన వాఁడు కవిబ్రహ్మ. పాపరాజునకీ రహస్యము గోచరింపలేదు. కాని యీఘట్టమును పాపరాజు కరుణరసము చిప్పిలునట్లు వ్రాసినాఁడు. రావణుఁడెంతటి క్రూర రాక్షసుఁడైనఁ దిక్కనచేతిలో నాతఁడొక రసికుఁడైనాఁడు. పాపరాజు రావణుని పరమకఠినునిగాఁ బశుతుల్యునిగాఁ జిత్రించినాఁడు. ఈరెండు గ్రంథములను సమగ్రముగాఁ బరిశీలించినచో నొకవిషయము గోచరించును. తిక్కన సృజించిన నారీలోకమంతయు వీరభావ ప్రపూరితము. వారిహృదయములాపదలయందు మహామహీధరాశ్మసంఘాత కర్కశములు. సంపదలుగల్గుతఱి శిరీషకుసుమకోమలములు. ఇట్టి వీరవనితలను సృజించిన యాంధ్రకవియే మఱి యొకఁడు లేఁడు. పాపరాజు ప్రబంధధోరణిలోఁ బడినాఁడు. సీతామూర్తిని సృజించుటలో నాతఁడొక సామాన్య ప్రబంధనాయికనే సృజించినాఁడు. పుట్టినయింటిని మెట్టినయింటిని పరమపవిత్రము గావించిన పరమపావనియనియు రామునివంటి యేకైకవీరుని సహధర్మచారిణియనియు నగ్నిగర్భము నమృతపూరమువోలె నూహింపఁగల్గిన ధీరస్వాంతయనియు లోకవిద్రావణుఁడగు రావణునంతవానిఁ దృణప్రాయముగాఁ జూచిన వీరనారియనియు సీతామాతనాతఁ డూహింపలేకపోయినాఁడు. దీనికంతకు నీకవులకుఁగల దృష్టిభేదమే కారణము.

ఉత్తరరామాయణ రచనలోఁ బాపరాజునకు సాహాయ్యము గావించిన పుష్పగిరి తిమ్మన సమీరకుమార విజయమును వ్రాసినాఁడు. శయ్యానైగనిగ్యమే కాని సజీవపాత్ర నిర్మాణ కౌశలమిందుఁ గానరాదు. గట్టుప్రభువను నాతఁడు కుచేలోపాఖ్యానమును వ్రాసినాఁడు. కృష్ణకుచేలుల స్నేహపురస్కృతమైన గాథనెత్తి "ప్రబంధమన్న శృంగారమే" యన్న నిందనీతఁడు పాపినాఁడు. కవి కుచేలునితోఁ దాదాత్మ్యమందినట్లు కన్పట్టును, నిరుపేదయగు కుచేలునిపాత్ర మిందుఁ జైతన్యముట్టిపడునట్లు చిత్రింపఁబడియున్నది.

ఈయుగమున ద్వ్యర్థికావ్యములనేకములు పుట్టినవి. క్రొత్తలంక మృత్యుంజయకవి ధరాత్మజావివాహము, బుక్కపట్టణం తిరుమల వేంకటాచార్యుల యచలాత్మజా పరిణయము (సీతాపార్వతుల వివాహము), అయ్యగారి వీరభద్రకవి యాదవరాఘవపాండవీయము, ఓరుగంటి సోమశేఖరకవి రామకృష్ణార్జున రూపనారాయణీయము, పిండిప్రోలు లక్ష్మణకవి రావణదమ్మీయము మొదలగునవి యీద్వ్యర్థి త్ర్యర్థి కావ్యములు. వీనియందుఁ బాత్రనిర్మాణమను మాటయేతలచుట కవకాశము లేదుకదా!

ప్రబంధ వాఙ్మయమునకు క్షీణయుగమునఁ గలిగిన యీ యపప్రథ మరల నాధునిక యుగమున మాసిపోయినదనవచ్చును. ఆధునిక కాలమునఁ

గలిగిన యాంగ్లవిద్యాజ్ఞానము మనలో విమర్శ ప్రబోధముఁ గలిగించినది. ఈ విమర్శ జ్ఞానముతోఁ బ్రాచ్యవిద్యావైదుష్యమును మేళగించి ప్రబంధముల రచించిన మహాకవులు నేఁడు కలరు.

తిరుపతి వేంకటేశ్వరకవులు పాణిగృహీత శ్రవణానందములను రెండు ప్రబంధములను వ్రాసిరి. ఈ రెండు గ్రంథముల యందును నాయిక వేశ్యయే. శ్రవణానందములోని నాయకుఁడు మధుసూధనుఁడను వైష్ణవుఁడు. ఉదారుఁడను బ్రాహ్మణుఁడు పాణిగృహీతలోని నాయకుఁడు. వీరి నాయికానాయకులు ప్రథమమున మైమఱచి విశృంఖల విహారమొనర్చి, యనంతరము వివేకముగల్గి పశ్చాత్తాపమునందుదురు. ఇదియే వీరియందలి నవ్యత.

వీరేశలింగముగారు నిరోష్ఠ్య నిర్వచననైషధమును రసికజన మనోరంజనమును వ్రాసిరి. రసికజన మనోరంజన మచ్చతెనుఁగు గ్రంథము. ఈరెండు గ్రంథములును పాండిత్యప్రకటనార్థము వీరేశలింగముగారు వ్రాసియున్నట్లు కన్పట్టుచున్నది. ఇందుఁ బాత్ర చిత్రణమంతగాఁ గానరాదు.

కొక్కొండవారి బిల్వేశ్వరీయము క్షేత్రమహాత్మ్యము కావున నిందుఁబాత్ర పోషణమంతగా కానరాదు. వావిలకొలను సుబ్బారావుగారి కౌసల్యాపరిణయము గతానుగతికములైన ప్రబంధములలో నొక్కటిగాఁ గానవచ్చుచున్నది. మంథపాక పార్వతీశ్వర శాస్త్రిగారి రాధాకృష్ణ సంవాదము ప్రబంధమా కాదాయను సందియమును గలిగించుచున్నది. ఇది వేంకటగిరిప్రభువుల పట్టాభిషేకవర్ణనము కావున నిందును బాత్రచిత్రణము గానరాదు. మాడభూషివారి భరతాభ్యుదయమున నించుక పాత్రచిత్రనైపుణ్యము కాననగును. సెట్టి లక్ష్మీనరసింహముగారు ప్రభాస శాపవిమోచనమునఁ బాత్రచిత్రణ సామర్థ్యమును బాగుగాఁ బ్రకటించి యున్నారు. క్షుద్రప్రబంధముల వెట్టిపోకడలిందుఁ గానరావు.

వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు తమ వీరసింహుఁడను ప్రబంధమునఁబాత్రనిర్మాణనైపుణ్యమును జూపియున్నారు. కృష్ణరాయలు వీరసింహుఁడు మొదలగు పాత్రములిందు మనోజ్ఞములుగఁ జిత్రింపఁబడి యున్నవి. ఇట్లే నేఁడు ననేకులు గవులు ప్రబంధములను వ్రాయుచున్నారు. గతశతాబ్దిలోఁ బ్రబంధవాఙ్మయమునకు వచ్చిన యపప్రథ యీనాఁడు నశించునని తోచుచున్నది.

# ప్రబంధములు - వర్ణనలు

పురాణములకుఁ బ్రబంధములకుఁగల ముఖ్యభేదములలో వర్ణనావిషయ మొక్కటియే యున్నది. పురాణకవి కథాకథనమునందే దృష్టినిల్పినవాఁడై వర్ణనావిషయము నందంతగా శ్రద్ధవహింపఁడు. ప్రబంధకవితకు వర్ణనలొక ముఖ్యాంగము. అష్టాదశ వర్ణనాత్మకమై ప్రబంధముండవలయునను నియమమే యీ యంశమునకొక ప్రబల నిదర్శనముగా నున్నది.

తుదకీవర్ణనలే మితిమీరి ప్రబంధ రచనకొక కళంకము నాపాదించినవి. కాని రాయలకాలమునందు వెలసిన ప్రబంధములు మాత్రము యథోచిత వర్ణనా విలసితములై యున్నవనవచ్చును.

ఈ యుగమునం దావిర్భవించిన ప్రబంధముల వర్ణనౌచిత్యముంగూర్చి ప్రసంగించుటకుఁ బూర్వము వర్ణనావిషయమునఁ గల కొన్నినియమములఁ బరిశీలింతము.

వర్ణనలు కథాగతిని బెంచునవియై యుండవలయునేగాని దానిని నిరోధించు నవియై యుండరాదు. ఇది వర్ణనలయెడఁ గవి పాటింపవలసిన మొదటిధర్మము. వర్ణ్యమానవస్తువు స్ఫురణకురాక వర్ణనాపద్ధతిపై మనసుపోయినప్పుడా వర్ణనలు కావ్యసౌందర్య భంజకములనియే తలంపనగును.

వర్ణనలయందు ఝటితిస్ఫురణయు నక్లిష్టతయు నుండవలయును. అప్పుడేయవి స్వాభావికములై హృదయంగమములై యుండును. వానియందు సాంకేతికములైన నియమములధికముగా నుండినచో నవి చమత్కారావహములై యున్నను వర్ణింపఁబడిన వస్తువు, స్వచ్ఛరూపమునఁ బాఠకులకు సాక్షాత్కరింపదు.

వర్ణనలఁ గవులు తమ పాండిత్య ప్రకర్షకునై చేయరాదు. దృశ్యము కన్నులఁగట్టినట్లు చేయుటకుఁ గథాకథనము పేలవముగాకుండ నూత్న చైతన్యము నను గలిగించుటకును వర్ణనలావశ్యకములైయున్నవి. వానివలనఁ బాత్రలు దృగ్గోచరములగుటకు బదులు, దూరదూరముగఁబోయి మసకమసకగఁ గన్పట్టినచో నవి నిష్ప్రయోజనములే యగుచున్నవి.

ఇఁక వర్ణనలఁ జేయుచో నేయంగమున కాయంగమును వర్ణించుటకంటె నాకారమంతయు స్మృతిపథమునఁ బడునట్లు వర్ణించుటయే మేలు. కవి మనకా యాకారముఁగూర్చి ప్రధానముగా నెద్దానింజెప్పఁదలచెనోయది సుబోధకము గావించినఁ జాలును. తక్కినవి యప్రస్తుతములేయగును. ఇందులకుఁ దిక్క-

నార్యుని జమ్మివర్ణనమొక నిదర్శనము. ఇందుఁ దద్భయంకరాకారముఁ గూర్చి కవి మనకుఁ జెప్పఁదలచినాఁడు. తత్ప్రదర్శనమునందే తన వర్ణనాప్రాగల్భ్య మంతయుఁ గేంద్రీకరించి యున్నాఁడు.

ఇవి వర్ణనావిషయకములైన కొన్ని నియమములు. ఇవి ముఖ్యముగాఁ బాటింపఁదగినవి. కాని యీ నియమములన్నియు సూచనామాత్రములేయని గ్రహింపనగును. కవి లోకముఁగూర్చి యే విషయము మాటాడినను "నిరంకుశాః కవయః" అను వాక్యము మాత్రము మఱువరాదు.

కవులందఱు నొక్క స్వభావమే కలవారై యుండరు. కొందఱు బహు వర్ణనాప్రియులై యుందురు. కొందఱకు స్వభావోక్తి యనిన నభిమానము. కొందఱకు నతిశయోక్తి యనినఁ బ్రీతి. కొందఱి కుత్ప్రేక్షయుఁ గొందఱికుప మయుఁ బ్రాణములు. వారివారి వ్యక్తిత్వముఁ బట్టి వారివారి యభిరుచులు మారు చుండుటయు భిన్నభిన్న మార్గములఁ బోవుచుండుటయుఁ గలుగును. ఎవరి కెయ్యది స్వభావసిద్ధమో దానిని వారెంతగాఁ బ్రయోగించినను విసుపుచెందరు. మఱియు నాహ్లాదమును జెందుచుందురు.

కాని కవులందఱు స్వతంత్ర వ్యక్తిత్వము కలవారుకారు. అందు గతానుగతికుల సంఖ్యయే యధికము.

వసుచరిత్రకారునకు శ్లేషానుప్రాసాదులయందుఁ బ్రీతిమెండు. అవి యాతనికి స్వభావసిద్ధములై యున్నవి. కావున నాతని గ్రంథమునకు సంబం ధించినంతవఱకవి ప్రమోదజనకములే యగుచున్నవి. అదియుంగాక యాతని కవితయం దితరములగు విశిష్టగుణము లనేకములు గలవు.

ఇకఁ బిల్లవసుచరిత్రములఁ జూడుఁడు. పులినిఁజూచి నక్క వాతలు పెట్టుకొనె నను సామెత వీనియందు సార్థకమగుచున్నది. వసుచరిత్రకారునకు శ్లేషానుప్రాసాదులయందుఁగల ప్రజ్ఞ సహజసిద్ధము. వీరికవి బహుప్రయత్న సాధ్యము. కావుననే కృత్రిమము అస్వాభావికములైన యీ రచనలందదు కులుగానుండి రసికులకు విసుపుపుట్టించును.

ఇందులకుఁ జేమకూర వేంకటకవి యొక యపవాదమనవచ్చును. వసు చరిత్రకారునితోఁ బోటీకి నిలుచుటయేకాక కొన్నిపట్టులలో నాతనిఁగూడ వేంకటకవి మీఱినాఁడనుట సత్యదూరముకాదు.

ఇంతకుఁ జెప్పవలసినదొక్కటే. కవి యేదివ్రాసిన నెట్లువ్రాసిన నది యాతనిలో స్వభావసిద్ధమై యుండవలయును. అస్వాభావికమగు ననుకరణము కావ్యకళా సౌందర్య భంజకమగును.

స్వాభావికమగు వర్ణనాప్రజ్ఞను జూపిన ప్రబంధకవులలోఁ బ్రప్రథముఁడుగాఁ బేర్కొనఁదగినవాఁడు అల్లసాని పెద్దనార్యుఁడు. ఈతని వర్ణనలన్నియు స్వాభావికములగుటయేకాక కథాగతికి ననుకూలములుకూడ నైయుండును. పెంచి వర్ణించుటయనిన నీతనికిఁ బ్రీతిమెండు. అట్లయ్యు నవ్వవి కడుంగడు హృద్యములుగా నుండునట్లు వ్రాయఁగలఁడు. మార్కండేయ పురాణమున రెండు పద్యములలోనున్న సిద్ధాగమనఘట్టము నీతఁడించుమించుగా నొక యాశ్వాసమంతయు వ్రాసినాఁడు. ఇట్లే 'స్వర్వేశ్యయగు వరూధిని మారసమానుఁడగు ప్రవరుని జూచినది' అని యతి సంక్షేపముగా నప్పురాణమునఁ జెప్పఁబడిన విషయము నీతఁడెన్నియో స్వకపోలకల్పనలుపెట్టి పెంచి వ్రాసినాఁడు. ఈరెండు నీతని వర్ణనాప్రియత్వమునకుఁ బ్రబల దృష్టాంతములు. ఇట్టివింకనెన్నియేనియుం గలవు.

ఇట్టి వర్ణనలవలనఁ బ్రబంధములకు ఫలద్వయము చేకూఱుచున్నవి, ఒకటి : వర్ణ్యమానవస్తువు ప్రత్యక్షముగా గోచరించుట. రెండు : పాత్రల మనఃప్రవృత్తి విశదమగుట. ఈరెండును సాధించుటలోఁ బెద్దనార్యుఁడు కృతకృత్యుఁడై యున్నాఁడనవచ్చును.

మఱియుఁ బ్రబంధములపై నిక్కాలమున నొక యపప్రథ ప్రబలియున్నది. ప్రబంధవర్ణనలు కథాగతికి సంబంధించియుండవనియుఁ బ్రబంధకవులనావశ్యకమైనను శాస్త్రనియమోల్లంఘనముఁ గావింపలేక యష్టాదశ వర్ణనలతోఁ దమ కావ్యముల నింపుదురనియు దాని సారాంశము.

ఈయపప్రథ కేవల మాధారరహితమనుటకు వీలులేదు. క్షీణయుగములోని కొన్ని ప్రబంధములఁబరిశీలించితిమేని యయ్యది సత్యమే యనిపించును. కాని మహాకవికృతములై వాఙ్మయాలంకారములనఁదగిన ప్రబంధములెన్నియో కలవు. వానిఁగూడ నిట్లేదూషించుట యవివేకమనందగును.

మనుచరిత్రాది మహాప్రబంధములయందుఁగల వర్ణనలు కథాగతికినెట్లు సాహాయ్యకములగుచున్నవో యీక్రింది దృష్టాంతములఁబట్టి గ్రహింపనగును:

ప్రవరుఁడు వీతిహోత్రుని సాహాయ్యమున నిజగృహముఁ జేరినాఁడు. అంత విరహానల దంద్రహ్యమాన మానసయగువరూధిని, పూచిన లతాగృహమునందుఁ జంద్రకాంతశిలాతలమున మేనుచేర్చి బహుదశాభేదములతో బాధ పడుచుండెను. అట్టి సమయమున సాయంసమయాంధకార వర్ణనములఁ గవి చేసినాఁడు. సాయంసమయమున సూర్యుఁడు కషాయదీధితిని దాల్చినాఁడని చెప్పుచు నద్దానిఁ బ్రకృతకథతోఁ గవి యెట్లు కలిపినాఁడో చూడుఁడు :

తరుణి ననన్యకాంత నతిదారుణ పుష్ప శిలీముఖ వ్యథా
భరవివశాంగి సంగభవుబారికి నగ్గముసేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితోనని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణిదాల్చెఁ గషాయ దీధితిన్.

సూర్యుఁ డస్తంగతుఁ డగునప్పు డరుణదీధితిఁ బొందుట సహజమేయయ్యు నద్దానిఁ బ్రవరకృత వరూధినీ తిరస్కారజనిత రోషముగా నుత్ప్రేక్షించి కవి యీ వర్ణనకుఁ గథకు నవినాభావ సంబంధముఁ గల్పించినాఁడు. మరియు కవి యిచ్చోటఁ గావించిన వర్ణనలు ముందు రాఁబోవు కథను సూచించునవియై యున్నవి. ఈ క్రింది పద్యమును జూడుఁడు :

ఉరుదరీ కుహర సుప్తోత్థ శార్దూలముల్
యురవారి శోణిత శంకఁ ద్రావ
వనకుంజ మధ్య శాద్వల చరన్మృగ పంక్తి
దావపావక భీతిఁ దల్లడిల్ల
నాశ్రమాంతర భూరుహాగ్రముల్ మునికోటి
బద్ధకాషాయ విభ్రాంతిఁ జూడ
ఘన సాను శృంగ శృంగాటకంబులఁ గాంచి
యమరులు హేమాద్రియనుచు వ్రాలఁ
గాసెఁ బేశలరుచిఁ గింశుక ప్రవాళ
ఘుసృణ కిసలయ కంకేళి కుసుమ గుచ్ఛ
బంధుజీవజపారాగ బాంధవంబు
లన్నగంబున జరఠారుణాతపములు.

ఈ పద్యములోఁ గవి వర్ణించినది భ్రాంతి. సుప్తోత్థితములైన పులులు సెలయేటి నీటిని రక్తమనుకొనుచున్నవి. పొదరిండ్లను జింకలు దవదహన మనుకొను చున్నవి. మునులు కూడఁ దమ యాశ్రమ వృక్షముల కొనలను జూచి తమకావి వస్త్రములేమో యనుకొను చున్నారు. ఎఱ్ఱని చఱియలను శిఖరములను జదుకము లను గాంచి దేవతలు మేరుపర్వతమేమో యనుకొనుచున్నారు. జంతువులు మనుష్యులు కాక దేవతలుకూడ భ్రాంతి కధీనులై యున్నారు. అట్టిచో విరహ మునఁ గ్రాగి క్రాగియున్న యెడందగల వరూధిని భ్రాంతికి లోనగుట యొక యబ్బురమా ? ఈ పద్యమున నమరులఁ జేర్చుటయందలి కవి ప్రతిభను రసికు లూహింతురుగాక !

ఇట్లే యా సాయంసంధ్యాసమయమునఁ బ్రియునెడఁబాసి తదీయ విర హమున నిర్వేదము నొందుచున్న యొక చక్రవాకిని వర్ణించి కవి యప్పటి వరూధిని యవస్థను సూచించినాఁడు :

ఏ విహంగము(గన్న నెలు(గిచ్చుచును సారె
కును సైకతంబుల( గూడ( దారు(
దారి కన్గొని యది తనజోడు గాకున్న
మెడయెత్తి కలయంగ మింటనరయు
నరసి కన్నీటితో మరలి తామర యెక్కి
వదన మెండ(గ సరోవారినద్దు
నద్ది త్రావ(గనై(వ కట్టిట్టు గన్గొని
ప్రతిబింబ మీక్షించి బ్రమసి యుఱుకు
నుఱికి యెఱకలు దడియ వేఱొక్క తమ్మి
కరుగు నరిగి రవంబుతో( దిరుగు తేంట్ల(
బొడుచు ముక్కున మఱియును బోవు వెదక
సంజ(బ్రియు( బాసి వగనొక్క చక్రవాకి.

ప్రియ వియోగము పక్షులకే దుస్సహ మగుచుండ(గా ని(క స్వర్వేశ్యయగు వరూధిని విషయమున నది యెట్లుండునో చెప్పవలయునా ?

మెల్లమెల్లన( గటికి చీకటి దిశాస్తోమము నాక్రమించినది. వరూధినీ హృదయమున నంధకారము ప్రవేశించినది. అంతట( జంద్రోదయ మైనది. కాని యేమిఫలము ? చంద్రకాంతి విరహిణులకు సుఖాస్పదము కాదు. కావుననే యీ క్రింది పద్యమున వెన్నెల చిచ్చుతో సరిపోల్చ(బడినది :

జలజాగార పరంపరల్ మఘవదాశాభిత్తి( దీంద్రించుచున్
దళమై వెన్నెల చిచ్చులంటిన మిళద్బాహ్యాచ్ఛదశ్యామికా
చ్ఛలనంగంది ముడుంగుచోసిమసిమచ్ఛబ్దంబుతో(బుట్టు న
గ్గలపుం గ్రొంబొగలో యనంగ వెడలెన్ గర్భస్వనద్భృంగముల్.

పద్మములిట ముడుచుకొనినవి. వరూధినీ హృదయకమలమును ముడుచుకొనినది. ఇప్పటి యవస్థలో( జంద్రిక, కమలమునకు వరూధినీహృదయకమలమునకు(గూడ శత్రువే. వరూధినీ హృదయావేగము పద్మముఖనిర్యద్భృంగనాదముచే సూచింప(బడినది. పిదప( జంద్రుని గామోద్రేకమునకై యుపయోగించు సిద్ధౌషధముతో సరిపోల్చి, వరూధినీహృదయాంతరాళమున నంతకంతకతిశయించు మదనసంతాపమును నిరూపించినా(డు.

మఱియు నక్కడక్కడ ననేకపద్యములలో నొక్కొక్క వాక్యముతోనే యప్పటి వరూధిని యవస్థను జిత్రించి ప్రకృతియు నామెయెడ నెట్టి సానుభూతిని( జూపుచున్నదో కవి మనకెఱుకపఱచినా(డు. చూడు(డు :

.... .... .... దిశాస్తోమంబు శోభాదరి
ద్రాణంబయ్యె సరోజషండములు నిద్రాణంబులయ్యెం గడున్.

దిక్కుల కాంతి తఱిగిపోయినది. వరూధినీ వదనశోభయుఁ దఱిగి పోయినది. సరోజషండములతోపాటు వరూధినీ హృదయకమలమును ముకుళించుకొనినది. లేక వరూధినీ హృదయకమలము ముకుళింపఁగనే సరోజ షండనిమీలన వ్యాజమునఁ బ్రకృతియు సానుభూతిఁ జూపినది.

ఇట్లే చంద్రాస్తమయమునుగూడ వరూధిని విరహావస్థతో సరిపోల్చి పెద్దన వర్ణించియున్నాఁడు :

పాటన సేయమిన్ గురులుపైఁబడి శీర్ణపటీరపంకలా
లాటికమై దరస్మిత విలాసపుఁ జంద్రిక డొంకివాడుటన్
చేటఁ దొఱంగి విన్ననగు నీమొగమోయన మాసి చంద్రుఁడో
పాటలగంధి వ్రాలెనదె భానురుచిం దన కందు మీఱఁగన్.

వరూధిని ముఖమునందుఁ గురులు జారియున్నవి. చంద్రునియందుఁ గళంకమున్నది. భానురుచిచేఁ జంద్రుని కాంతి మాసిపోయినది. వరూధిని ముఖమునను జిరునవ్వునుకాంతి యంతరించినది. అద్దపుబిళ్ళవలెనున్న చంద్రుఁడు మంచిగంధమంటగట్టిన పాపటబొట్టువలెనున్న వరూధిని ముఖముతో సరిపోల్పఁబడి యున్నాఁడు.

ఇట్లే పెద్దనార్యుని ప్రకృతివర్ణనలు పాత్రలయవస్థతో నైక్యమైయుండును గాని వేనికవి విడివిడిగానుండి కూర్పుబిగి సడలింపవు.

నిశిత పరిశీలనముఁ బ్రౌఢసాహితీ పటిమయుఁ గల మహాకవులలో నొక్కఁడు రామరాజ భూషణుఁడు. ఈతఁడు బహువర్ణనాప్రియుఁడు. ఈతని వసుచరిత్రమునందలి కథావస్తువత్యల్పమైనది. అయితివృత్తమును బెంచి యింత ప్రౌఢప్రబంధముగా వ్రాసిన యిమ్మహాకవివర్ణనాప్రతిభకు లోకమచ్చెరు వందినది. మనోజ్ఞములగు నీతని వర్ణనములలో నొకటి ప్రథమాశ్వాసము నందలి చైత్రలక్ష్మీవర్ణనము. అందు హృద్యములగు పద్యములనిటఁ బొందుపఱచుచున్నాను :

ఒనర హిమావకుంఠనము లూడ్చి తెమల్చిన పత్త్రిభంగముల్
సనసనియాడుచున్ మొగడచన్నులు పల్లవపాణిఁ గప్పు నూ
తనలతికాలతాంగుల నుదారగతిం జలివాపి నెయ్యపుం
బెనకువ నేర్పు దక్షిణసమీరణుఁ డొయ్యనఁ దావులంటుచున్.

అలరుంగైదువుజోదు కూర్మిసయిదోడై మాధవశ్రీతపః
ఫలమై యాడు మరుత్కుమారుఁ బ్రియమొప్పం దేనెనీరార్చి పెం
చెలిపూఁజొంపపు పొత్తులం బొదివి ధాత్రీజాతముల్ జోలపా
డెలసత్పల్లవడోల నుంచి కలకంఠీనాద గీతంబులన్.

అరిగాఁ బంచమమేపగించి నవలా లవ్వేళ హిందోళ పై
ఖరి నూపం బికజాత మాత్మరవ భంగ వ్యాకులంబై వనీ
ధర నాలంబిత పల్లవవిధుల్దాల్పం దదీయధ్వనిన్
సరిగాఁ గైకొనియెన్ వసంతము మహాసంపూర్ణభావోన్నతిన్.

చివురుంగైదువు వేల్పు చైత్రమున నక్షీణధ్వజోత్క్షేపవై
భవుఁడై తెమ్మెర తేరిపైఁ గదలిరాఁ బ్రత్యగ్ర సాలాగ్ర హ
ర్మ్య విటంకంబులు ప్రాకి వల్లివనజాస్యల్ సల్లిరుత్ఫుల్ల ప
ల్లవ హస్తంబుల భావిభావుక ఫలోల్లాసంబుతోఁ గ్రొవ్విరుల్.

వసురాజు రథారూఢుఁడై యుద్యానవనమునకరిగి యందు విహరించు నప్పుడు కవి గావించిన వర్ణనము మనోజ్ఞము నదృష్టపూర్వమునై యున్నది. చూడుఁడు :

నృపమౌళి భవసువర్ణ పరాగములు సువ
ర్ణ పరాగములు నభిన్నత వహించెఁ
గమనీయ తపనీయ కదళికా పవనంబు
కదళికా పవనంబు కలిసి మెలఁగె
లలితమాగధలోక కలకంఠగానంబు
కలకంఠగానంబు నలమికొనియెఁ
దతవాదక సమీర హత కిన్నరీరుతుల్
కిన్నరీరుతులు నేకీభవించె

నపుడు సేరంగ వచ్చిన యవనిజాని
కవనిజానీక మచట సాష్టాంగ మెఱఁగెఁ
గేళివన బహిరంగణాక్షీణ మధుర
మధురస ఝరానుబింబ సంభావనమున.

ఘనతర ఫలాసతాఖండ కదళికలును
గీర రాజీకృత సజీవతోరణములుఁ
బొంగునెలమావి కురుజుల భంగనవఫ
లావళులుఁ గాంచె నృపుఁడు వనాగ్రసీమ.

ఈపద్యములలోఁ గవి సహజములైన యలంకారములకును గృత్రిమములైన యలంకారములకు నభిన్నసాజాత్యమును నిరూపించి యున్నాఁడు. తఱచుగా నగరాలంకారములయందు ఖండిత కదళికలు, నిర్జీవములగు చివురుల తోరణములుఁ ద్రెంపిన ఫలములు నుపయోగింతురు. ఇటనటులఁ గాక సజీవములగు ననఁటులే యున్నవి. బారులుగాఁ దిరుగు చిలుకలే సజీవతోరణములు.

పక్షి చంచూహతులచే భిన్నములు గాక యభంగములై తమ నెలవులనే యున్న ఫలావళులు రాజునకు నేత్రోత్సవమును గలిగించినవి. ఇట్లే మనోహర ములైయున్న మఱికొన్ని పద్యములనిట నుదాహరించుచున్నాను :

అలచైత్రాంచిత సత్త్రిశాలికల నిష్టాహారతృప్తిం గుతూ
హలము ల్గాంచు ద్విజావళుల్ శ్రుతిహితావ్యాజానులాపంబుతో
నలఘుశ్రీకర శాఖికాంచలవినిర్య త్కేసరార్ద్రాక్షతం
బులు రాల్చెన్ నరదేవరత్నమకుటీ భూషావిశేషంబుగన్.

ఆదరణీయ రామకథనాంక శుకోక్తులతోడఁ దీపము
త్తైదువచాలు శోభనపుటారతులెత్తె సదాగతిం గిరి
క్షోద వినోదికిం జిగురుజొంపపుఁ గెంపుల పళ్ళెరంబులం
బ్రోదిఁదనర్చు నగ్గలపు మొగ్గలు ముత్తెపుముగ్గులీనఁగన్.

ఈ పద్యములలోఁ గవి జడప్రకృతిపై మానవత్వము నారోపించి వర్ణించి యున్నాఁడు. ఈ పద్యములు గవి భావనాశక్తికిఁ బ్రబల నిదర్శనములైయున్నవి. సమ్మానార్హములగు శక్తులలో భావనాశక్తియు నొక్కటి యనుట కెవ్వరును సందే హింపరు. తద్విజృంభణ మీతని కవితా విలాసమునకు వన్నె పెట్టుచున్నది.

సంస్కృతమున నిట్టి కవితారీతులకు మార్గదర్శకుఁడు శ్రీహర్షుఁడు. నలుని యుద్యానవన విహార సందర్భమున నాతఁడిట్టి భావము లనేకములు ప్రదర్శించి యున్నాఁడు.

రామరాజ భూషణుఁడు నైషధాదులయందు గురుభావము గలవాఁడగు టంజేసి, తచ్ఛాయలీతని వర్ణనలయందును గాననగును. శ్రీ వఝుల చిన సీతా రామస్వామి శాస్త్రిలవారు వసుచరిత్రపై నొక యద్భుతమగు విమర్శ గ్రంథ మును వ్రాసియున్నారు. వసుచరిత్రయందలి నైషధచ్ఛాయలు, వసుచరిత్రాను కరణములు మున్నగు ననేకవిషయములిందు విపులముగా వ్రాయఁబడియున్నవి.

మహాకవి ధూర్జటియుఁ దన కాళహస్తి మాహాత్మ్యమున యథోచితములు హృద్యములునగు వర్ణనలఁ జేసియున్నాఁడు. ఇక్కవి బహు వర్ణనాప్రియుఁడు కాకున్నను జేసిన యా కొలది వర్ణనలైన మిక్కిలి స్వతంత్రములుగా నున్నవి. వరనలయందుఁగూడ నీతఁడు తనకు సహజమైన శివభక్తిని బ్రదర్శించి యున్నాఁడు. చంద్రోదయావసరమున నీ విశ్వమంతయు నిమ్మహాభక్తునకు శివార్చనముగా గోచరించినది. ఈ క్రింది పద్యమును బరిశీలింపుఁడు :

ఉదయగ్రావము పానపట్ట మభిషేకోద ప్రవాహంబు వా
ర్ధి ధరధ్వాంతము ధూపధూమము జ్వలద్దీప ప్రభారాజి కౌ
ముది తారానివహంబు లర్పిత సుమంబుల్గాఁ దమోదూర సౌ
ఖ్యదమై శీతగభస్తిబింబ శివలింగంబొప్పెఁ బ్రాచీదిశన్.

ఈ పద్యమెట్టి సమయమున వ్రాయఁబడినదో చూడుఁడు. శివపూజా విధాన విషయమున హస్తికిని బాసతేనికిని భేదభావ మేర్పడినది. కాని యొకరినొక రెఱుఁగరు. ఒకరినొకరు నాశనము చేయ సన్నద్ధులై యుండిరి. ఆ యాతురతను గవియే యీ తీరునఁ జెప్పినాఁడు :

ఎపుడు పడమటికొండపై నెక్కు భానుఁ
డెప్పుడుదయించు నేఁ బోదు నెప్పుడనుచు

'అయ్యవసరంబున' అని కవి సూర్యాస్తమయ చంద్రోదయాదులను వర్ణించియున్నాఁడు. ఈ వర్ణనలు కథాగతికిఁ బోషకములై యుండుటయేకాక యందలి పాత్రల మనోవేదనంగూడఁ బ్రత్యక్షము చేయుచున్నవి. ఆటవికులను వర్ణించుచోఁ గవి కృత్రిమమగు నాగరక జీవనమునకును సహజమగు నాటవిక జీవనమునకును గల తారతమ్యమును నిరూపించినాఁడు. కఱకు జుంజురు వెండ్రుకలు గాఢముగా నెమలిపింఛముతో బంధించి పునుగుమాని లలాటమునఁ జేగురుబొట్టు పెట్టి, బాఱుటాకులతోఁ గూర్చిన పైటఁదీర్చి జమలి యొడ్డాణంబు సందునఁ బర్ణాంబరమును బదిలపఱచి, కుఱుచ గనుపుల వెదురువింట జాగపురి దాల్చి నారిగా సంతరించి, చెంచెతలు వేట వెడలుదురు.

ప్రకృతి పరిశీలనా విషయమునను ధూర్జటి తన ప్రావీణ్యమును జూపియే యున్నాఁడు. ఈ క్రింది పద్యమును జూడుఁడు :

ప్రాతఃకాల తుషార శీకర చయప్రాప్తిన్ లసన్మౌక్తికో
పేతాగారములట్లు చెల్వెసగు తద్బిందుచ్ఛటాజాత ఖ
ద్యోతచ్ఛాయలఁ గొంతసేపు బహురత్నోద్దీర్ణగేహంబులై
లూతాకల్పిత తంతుపద్మములు వొల్చుంజెప్పఁ జిత్రంబులై.

శిల్పకళా ప్రావీణ్యము మెఱయఁ జెలఁది పురుగు శివలింగముపైఁ బట్టువెట్టినది. ఆ పట్టుపై రేయి మంచు గురిసి బిందువులేర్పడినవి. ఆ బిందువులపై సూర్య కిరణ ప్రసారము గల్గుటచే నది ముక్తాకారమట్లు భాసిల్లినది.

పాండురంగ మాహాత్మ్యమునఁ దెనాలి రామకృష్ణుఁడు నతి మనోహరములగు ప్రకృతి వర్ణనములఁ జేసినాఁడు. అవియుఁ గథాగతితోఁ బొందిపొసఁగి యున్నవి.

అగస్త్యుఁడు దక్షిణాపథమున కేతెంచుతఱి సీతఁడు చేసిన మధ్యాహ్న వర్ణనమతి మనోహరముగా నున్నది :

పద్మినీ పద్మాత పత్రంబు శిథిల ప
　　త్త్రాగ్రమై రాయంచ యాశ్రయించెఁ
దాలుస్రవత్ఫేన జాలంబుతో ఘోణి
　　పంచల రొంపి గలంచి యాడె
దూరోద్గమద్ధామధూమ మంబుదబుద్ధి
　　నెమ్మి లోపొదనుండి నిక్కిచూచె
జఠరస్థజలము నాసానాళమునఁ బీల్చి
　　సామజం బిరుప్రక్కఁ జల్లుకొనియె

సరసిపై నీరు సల సల దెరలె విపిన
సకలవీథులు నిర్మర్త్యగోచ్చయములయ్యె
మట్టమధ్యాహ్నమిది సుధా మధురవాణి!
యర్హ మిచ్చోఁ బథిశ్రమ మపనయింప.

మాల్యవంతముపై నెక్కి యనతి దూరముననున్న పంపా సరోవరప్రాంతమును బరిశీలించితిమేని నేఁడు నిట్టి దృశ్యమే పొడగట్టును. రామకృష్ణుని కాలమునకు విజయనగర సామ్రాజ్యము మహోచ్చ దశయందున్నది. అట్టియెడ నేఁడు కన్పట్టు నీ దృశ్యమును రామకృష్ణుఁడానాఁ డెట్లు చూడఁగలిగెనా యనునది వింతలలో నొక వింత.

చతుర్థాశ్వాసమున రాధా తపస్సందర్భమున రామకృష్ణుఁడాఱు ఋతువుల నతి హృదయంగమముగా వర్ణించియున్నాఁడు. ఇందొక పద్యమున తపో నిమగ్నయగు రాధను వర్ణించియు, నింకొక పద్యమున సంసార మగ్నమైయున్న లోకమును వర్ణించియు, నిట రామకృష్ణుఁడు ప్రకృతికిని పాత్రములకును గల సంబంధమునేకాక, ప్రకృతికిని లోకమునకును గల సంబంధమునుగూడ నిరూపించియున్నాఁడు. ఈ క్రింది పద్యములఁ దిలకింపుఁడు :

పారదంబునఁ దోఁచిన పసిఁడితీఁగ
పగిది రాజిల్లెరాధ, చంపక సువర్ణ
వర్ణమగు మేను కుముద ధవళ తుషార
పటల కంచుకవేల్లన ఘటన కలిమి.

ఇది రాధావర్ణనము. ఇఁక లోకమునుగూర్చి

నవ్యకాలాగరూద్వర్తనములు సతుల
చన్నుఁ గొండల నుష్ణాగ్ని సంభవించె
మతి సమగ్రులు ధూమానుమానకలన
నగ్ని సాధింతు రచలంబులందు నెపుడు.

ఈ పద్యములోఁ దర్కమునుగూడఁ జొనిపినాఁడు.

సురలు కళలెల్లఁ గ్రోలిన సోముతనువు
కప్పురము గుమ్మరించిన కనకక్రోవి
పువ్వుఁ దేనియ చనిన యంభోరుహంబొ
యనఁగ మంచింకి బ్రహ్మాండ మగలెఁ జలిని.

అగలుం గుంకుమ పువ్వను
దొగరుం జేలలును నీతుఁ ద్రోవంగలవే
పొగలేని ముర్మురంబులు
మగువల పాలిండ్లు భోగమహనీయులకున్.

మఱల రాధ

పైనిగుడు మంచుతువ్వర
వానలచేఁ దడిసి కమలవనలక్ష్మి హరి
ధ్యాన నిమీలితలోచన
యౌనల రాధావధూటి కనుకల మయ్యెన్.

మఱలఁ బ్రకృతి

తాలుఁ గాలును గేలునుగేలు మోవి
మోవియును దార్చి భోగినమూహ మమరె
నూహ పేయంగ భోగినమూహమునకుఁ
బొనఁగ మనకంపుఁ బెనఁకువ లెనఁగు గాదె.

శ్యామలకాలాగురునవ
ధూమ మెదకు సుఖమొనర్పఁ దొరవుఁ గన్నుల్
వేమొగుచు కరణి సౌధ
స్తోమ మమరెఁ గప్పఁబడిన సోరణగండ్లన్.

రాధయు మధులక్ష్మియు

కెంజిగురాకుడాలు దులకించిన ధాతుపటంబుచాయఁ జే
యంజదుకెక్కు పుప్పొడుల సంటిన తేఁటులు భూతిభృజ్జటా
పుంజముఁ బోలఁగా విపినభూములలో మధులక్ష్మి పొల్చెనీ
లాంజనవర్ణుఁ గోరి తప మట్లొనరించు మృగాక్షికైవడిన్.

ఇట్లే యాఱుఋతువులను వర్ణించి యున్నాఁడు. ధూర్జటికీ విశ్వమంతయుఁ జంద్రోదయావసరమున శివార్చనముగాఁ గానవచ్చినట్లు రామకృష్ణునకు వర్షఋతువున నీవిశ్వమంతయుఁ గృష్ణమయముగాఁ గోచరించినది.

ఇంద్రచాపంబు గాదిది మౌళితలమున
సవరించు బర్హిపింఛంబు గాని
భిదుర ఘోషంబు గాదిది పాంచజన్య సం
జాత గంభీర ఘోషంబు గాని
యాశ్రయించిన బలాకావళి గాదిది
హారి ముక్తాహార యష్టిగాని
యిదికోల మెఱుఁగు గాదుదిరి బంగారంపుఁ
బసిమి గ్రమ్మెడు పచ్చపట్టుగాని

వృష్టిగాదిది కరుణాంబువృష్టిగాని
నీలమేఘంబు గాదిది నీలవర్ణుఁ
డౌర ! నాకిప్పుడిమ్మోలఁ బ్రత్యక్షమయ్యెననుచు
హర్షపులకిత తనువయ్యె నవ్వధూటి.

వర్ణనావిషయమున ముక్కుతిమ్మన యింకొక నూతన మార్గమును ద్రొక్కినాఁడు. సాధారణముగాఁ గవులకుఁ బ్రబంధప్రారంభముననే పురవర్ణనాదులఁ గావించుట యలవాటు. కాని తిమ్మన యట్లు గావింపలేదు. ప్రథమాశ్వాసమునఁ బురవర్ణనాదుల ప్రసక్తిగల్గియు వీడినాఁడు. ఇఁక ద్వితీయాశ్వాసమంతయు వర్ణనలే. ఇవియైన నతిసంగ్రహముగాఁ జేయఁబడియున్నవి. ఇందు వర్ణింపఁబడిన రాజోపచారాదులన్నియు నానాడు రాజుల యంతఃపురములందు జరుగునవేయైయున్నవి. ద్వితీయాశ్వాసమునందలి యంధకార నక్షత్ర చంద్ర చకోరాది వర్ణనములును, తృతీయాశ్వాసము నందలి నందనోద్యానాది వర్ణనలును జతుర్థాశ్వాసమునందలి యుద్ధాదివర్ణనలును బ్రకరణానుకూలముగ మనోహరముగఁ గావింపఁబడియున్నవి.

ప్రబంధకవులలోఁ గేవల వర్ణనాప్రియులగు కవులును గలరు. అట్టి వారిలో సంకుసాల నృసింహకవి యొక్కఁడు. ఈతని గ్రంథము (కవికర్ణరసాయనము) నందు మనోజ్ఞములగు వర్ణనలనేకములు కలవు. ఇమ్మహాకవి కావ్యముఖమునఁ గావించిన ప్రతిజ్ఞఁ జూడుఁడు :

పరభుక్తములైన యలం
కరణముల జుగుప్సలేకకైకొని పదవి
స్ఫురణంబు చూపు కుకవిత
పరికింపఁగ లజ్జలేని జాణిన గాదే.

ఈప్రతిజ్ఞ నీతఁడెంతవఱకు నిర్వహించుకొనఁ గలిగినాఁడనునది యొక పెద్ద సమస్య.

సామాన్యముగ నిట్టి ప్రతిజ్ఞలఁ గావ్యములం దాద్యంతము నిర్వహించుట కష్టతరము. ఉపయోగించిన యలంకారములన్నియు స్వకపోలకల్పితములే యగుట సామాన్యముగ సంభవింపదు. ఈతఁడు చాలవఱకుఁ దన ప్రతిజ్ఞను సాధింపఁ గలిగినాఁడనియే చెప్పవచ్చును.

ఈతని పదసామగ్రి యెట్టిదైన నభిప్రాయములు మాత్రము నూత్నము లనియే చెప్పనగును. ఈతని రెండవప్రతిజ్ఞయగు

యతివిటుఁడు కాకపోవు పెట్లస్మదీయ
కావ్యశృంగార వర్ణనాకర్ణనమున
విటుడు యతికాకపోరాదు వెసమదీయ
కావ్యవైరాగ్య వర్ణనాకర్ణనమున.

అనుదానియందుఁగూడఁ దనకావ్యమునందలి వర్ణనాప్రాధాన్యమునే వక్కాణించి యున్నాఁడు.

ఈతనివలెఁ బంచేంద్రియ తర్పణముగావించు వర్ణనలఁ జేసిన యాంధ్ర కవి యింకొకఁడులేఁడు. ఈతని వర్ణనలలో నొక చైతన్యవిశేషము కలదు. ఈతనికిఁ బ్రకృతి వివిధరూపముల సాక్షాత్కరించినది. ఒకప్పుడు రోషకషాయ తాక్షియగు ఖండితనాయికారూపమునను, ఇంకొకతఱి బలాకకపాల మాలికా ధారిణియగు కాళికవిధమునను, వేఱొకతఱి నొక భిషగ్వర రూపమునను నిట్లు బహురూపములఁ బ్రకృతి యీతనికిఁ బ్రత్యక్షమైనది. సకలసుఖకారియగు వసంతాగమము పాంథలోకమునకెట్లు మహాప్రళయ సదృశమైనదో కవి యీక్రింది పద్యమున వర్ణించినాఁడు:

రేల వెన్నెలలు పండ్రెండు సూర్యులు చూపు
 బీఱెండలై కాసి నీరసింప
దక్షిణానిలము లుద్ధతి నేడుతెఱఁగులఁ
 బెరిగెడు గాడ్పులై పెల్లగింపఁ
గెంజాయ దిక్కులఁ బిండించు చిగురులు
 కాలానలార్చులై కాకఁ బెనుప
నలి శుకపిక గర్జ లదరఁ బూఁదేనియ
 ఘోరాంత్యవృష్టియై కురిసికలప
విరహవేదన లెసఁగి యుద్వేలగతుల
నద్భుతముగ నేకార్ణవమగుచు ముంప
నఖిలసుఖకారి యగు వసంతాగమంబు
పథికలోకంబునకు మహాప్రళయమయ్యె.

ఈతఁడొకపద్యము నతిచమత్కారముగ వసంతర్తువునందే సకలర్తు సంపదను వర్ణించియున్నాఁడు :

ప్రసవశరప్రతాప శిఖిఁ బర్వఁగఁ జేయుటచే నిదాఘమై
కుసుమరసాతి వర్షమునకున్ గుదురౌటఁ బయోదకాలమై
రసిక మనోంబుజంబులలరంగ శరత్తయి తాన శైశిరో
ల్లసనముఁ జూపి పాంథసతులన్ వణకించె వసంత మత్తఱిన్.

పూర్వకవులు వాడిన పదసామగ్రినే గైకొని యీతఁడు నూతనములగు వర్ణనములఁ గావించియున్నాఁడు. కటికి చీఁకటిని మషీరస నవాంజనాదులతో సరిపోల్చుట యశ్రుతపూర్వము గాదు. కాని యీక్రింది పద్యమును బరిశీలించిన వారికి నరసింహకవి కల్పనానైపుణ్యము గోచరించును :

కలచి చిప్పలఁ బట్టు కతలెఱుంగము గాక
వ్రాయంగ నిది మషీరసము గాదె
నిది గుణంబులుసేయు నిరవెఱుంగముగాక
నీలాల సరులుగా నింపరాదె
కరపటంబులఁ బెట్టు వెలవెఱుంగము గాక
వనితలకిది నవాంజనముగాదె
కడవలఁ గొని ముంచుగతి యెఱుంగముగాక
చేలలకిది మంచి నీలికాదె

పోవదేనిది రవినైనఁ బొదవుఁ గాదె
యంకమనుపేర నురముపై నచ్చు దాల్చుఁ
గాక శశినైన దిగమ్రింగుఁ గాదె? యనఁగఁ
బ్రబలమై గాఢతమ తమః పటలి పర్వె.

వర్ణనౌచిత్యమునకును వర్ణనాసార్థక్యమునకును బింగళి సూరనార్యుని జెప్పి మఱియొక యాంధ్రకవిని బేర్కొనవలయును. ఈతఁడు ప్రార్థనలకై చేయు వర్ణనల యందుఁగూడఁ గథాగతిని సూచించుచునే యుండును. చూడుఁడు—కళా. పూ. పీఠిక :

అనయము ప్రేమ సంధిలఁగ నాస్యచతుష్టయ యోగ్యపద్య చుం
బన ఘనకాంక్షఁబోలె నిగమంబులపేరిట నాల్గురూపులం
దనరెడు భార్యమాట జవదాఁటక సృష్టియొనర్చు వారిజా
సనుఁడు నృసింహకృష్ణవిభుఁ జాలఁజిరాయువుజేయుఁగావుతన్.

ఇందు సరస్వతీ చతుర్ముఖుల ప్రణయలీల సూచింపఁబడినది. పంచ మాశ్వాసమునందలి యీక్రింది పద్యమును జూడుఁడు :

వదనములు నాలుగిటికిని వరుసఁ గలియ
మెలపుతోడన కంఠంబు మలఁచి మలఁచి
యొసఁగెదధరపాన మహోత్సవంబు
గళము గౌఁగిలితోన చెక్కులు నిమురుచు.

ఇట్లే చతుర్థాశ్వాసమునఁ జేసిన సముద్రవర్ణనమునందును గథాగతిని సూచించి యున్నాఁడు :

ఉగ్ర తిమిశిరోరంధ్ర నిష్ఠ్యూతమగుచు
నెగయు సలిలౌఘమది యొడ్డు మిగులనొప్పె
నబ్ధిపేరిటి కుండలి తాంగభోగి
దిస్సనం దనపడగ యెత్తెనొ యనంగ.

తిమి శిరోరంధ్ర నిష్ఠ్యూతమైన వారిధార నెంత చమత్కారముగఁ గథలో నిమిడ్చినాఁడో చూడుఁడు. నిరతాన్నదానమునకై యజ్ఞశర్మ తనభార్యల బేహారికి నమ్మెను. అమ్మెనుగాని యావియోగమును సైపలేక యార్తధ్వని గావించెను. ఆ ధ్వని విని యాతనిభార్యలు నలువురు సముద్రమున నుఱికిరి. అట్లుఱికిన యవ్వనితలు, బలుమీనొక్కటి నోర సలిలం బెగఁగ్రోలుచుండఁ దద్వనములోనికా సలిలపూరము వెంటనేగిరి. అనంతరమది తన శిరోరంధ్రము వెంట నీటిని బైకెగఁజిమ్మినపుడు, నీటితో వారును బైకెగసి యొక దివ్యవిమానముపైఁబడిరి. మీఁదివర్ణనములో నీకథ యెంత చమత్కారముగా సూచింపఁ బడినదో చూడుఁడు.

స్థాణురూపమును వర్ణించుటయేకాక, చలద్రూపముఁ బ్రత్యక్షము చేయఁ గల శక్తియు సూరనార్యునకుఁ గలదు. ప్రద్యుమ్నుని వాహ్యాళిలో నాతఁడు వర్ణించిన తురగవర్ణన మిందులకొక ప్రబలదృష్టాంతము :

తొలుదొల్త నయ్యేక తురగంబు మండల
గతిచారియగుచు నిక్కంబు తోఁచె
నావెనుకను సరూపాశ్వాలి చెదరక
చక్రాకృతినిబర్వు సరణి తోఁచె
నంతట ననతి స్ఫుటావయవంబుగా
నెనసి యేకాంగ వేష్టనత తోఁచెఁ
దుదఁ దద్విభూషణ ద్యుతిరాజి మాత్రంబు
కొఱవి త్రిప్పిన రీతి మెఱసి తోఁచె
నంతకంతకు గతివేగ మగ్గలింప
రాగ వాగె యెచ్చరిక పరాకు జియ్య
యనుజనులు ఱిచ్చవడి తమపని మఱవఁగఁ
బరఁగు నమ్మేటి నెఱరౌతు ప్రౌఢికతన.

ఆంధ్రమహాప్రబంధములలోఁ గొన్నిటిని మాత్రమే యిట నుదాహరించి యున్నాను. ప్రబంధముల నన్నిటి నుదాహరించు టతివిస్తరమగుటయే కాక యనావశ్యకముగూడ నగును.

క్షీణయుగమునందలి యేకొలఁదిమంది కవులో తప్పఁ దక్కిన యాంధ్ర ప్రబంధకర్తలందఱు నౌచిత్యమును పాటించియే వర్ణనలఁగావించి యున్నారు. కాని మనమాగ్రంథములఁ బఠించునప్పుడా గ్రంథములు పుట్టిన కాలమును, దేశమును, బరిస్థితులను మఱువరాదు. కొన్నికొన్నియెడల వారతిమాత్రముగ వర్ణించిన విషయములు మనకీనాఁడు విసువు గలిగించును. అట్టిదానికి నాయా దేశకాల పరిస్థితుల యందలి మార్పేకారణము. మఱియుఁ గవుల వ్యక్తిస్వాతంత్ర్యములఁ బట్టియు నభిరుచులఁ బట్టియుఁ గవితారీతులు మారుచుండును. పెద్దన వేశ్యావర్ణనమొకటి రెండు గీతపాదములతో ముగింపఁగాఁ గృష్ణరాయనికి వేశ్యావర్ణనమే రెండు సీసపద్యములను గ్రమింగినది. ఇది కవుల యభిరుచి భేదమునకు నిదర్శనము.

ప్రబంధవర్ణనల యందలి యౌచిత్యమును గ్రహింపవలయునన్న నాగ్రంథము నామూలాగ్రముగఁ బఠించుటయే యుత్తమమార్గము.

# ప్రబంధములు - రసము

ఈ ప్రకరణమునఁ బ్రప్రథమమున రసస్వరూపనిరూపణముఁ గావింప వలయును. కావ్యమునకు శబ్దార్థములు శరీరమని యాలంకారికుల యభిప్రాయము. ఇఁక నాత్మ యెద్దియను విషయమున నాలంకారికులలో నభిప్రాయభేదములు పొడసూపినవి. భరతముని రసమే కావ్యమున కాత్మయని చెప్పినాఁడు. భామ హాదులలంకార సిద్ధాంతమును స్థాపించిరి. ఉద్భటుఁడు, దండి, రుద్రటుఁడు మొదలగువారీ యలంకార సిద్ధాంతమునే యంగీకరించిరి. కాని వీరు రసప్రాధా న్యము నెఱుంగనివారు కారు. శృంగారాది రసప్రసంగము వీరి గ్రంథము లందును గలదు.

యుక్తం లోకస్వభావేన రసైశ్చసకలైః పృథక్,
రసవద్దర్శిత స్పష్ట శృఙ్గారాది రసం యథా.

అను వాక్యములలో భామహుఁడు రసప్రసంగము గావించియున్నాఁడు. దండ్యా చార్యులును రసవదూర్జస్విపద నిర్వచనమున

మధురం రసవద్వాచి వస్తున్యపి రసస్థితిః.

అనియు

కామం సర్వోప్యలఙ్కారః రసమర్థే నిషించతి

అనియు నుడివియున్నాఁడు. అష్టరసములను వాని స్థాయిభావములను గూర్చి యాతఁడు బాగుగా నెఱుంగును. అందులకే

ఇహత్వష్టరసాయత్తా రసవత్తాస్మృతా గిరామ్.

అనియు

ప్రాక్ప్రీతిర్దర్శితా సేయం రతిశృఙ్గారతాంగతా.

అనియు నుడివియున్నాఁడు.

ఇట్లు రసస్వరూపమును బూర్ణముగా నెఱిఁగిన వారయ్యుఁ గావ్యమున నద్దానికుండవలసిన ప్రాముఖ్యవిషయమున వీరు భిన్నాభిప్రాయులైరి. రసాలం కారములలో, రసముకంటె నలంకారములే ముఖ్యతరములని వీరి యభి ప్రాయము. అలంకార సర్వస్వకారుఁడీ విషయమునే

ఇహ తావద్భామహోద్భట ప్రభృత యశ్చిరన్తనాలఙ్కారికాః ప్రతీయమాన మర్థం వాచ్యోపస్కార తయాఽలఙ్కార పక్షనిక్షిప్తం మన్యన్తే......... ఉద్భటాది భిస్తు గుణాలఙ్కారాణాం ప్రాయశః సామ్యమేవ సూచితమ్......... తదేవమలఙ్కారా ఏవ కావ్యే ప్రధానమితి ప్రాచ్యానాం మతమ్.

అను వాక్యములలోఁ జెప్పియున్నాఁడు.

దీనింబట్టి భామహాదులు ధ్వనిప్రాధాన్యము నంగీకరింపలేదని తలంచుట కవకాశ మేర్పడుచున్నది. కాని యది సదాసత్యమనరాదు. వారు ప్రతీయమానార్థమే కావ్యజీవితమను నంశము నెఱుంగరను మాటయు, వారు తమ గ్రంథములందు ధ్వని గుణీభూతవ్యఙ్గ్యాది పదముల నుపయోగింప లేదనుమాటయు సత్యములే. కాని ప్రతీయ మానార్థముంగూర్చి వారి గ్రంథములందుఁ గొంత యైనంగలదు. అప్రస్తుత ప్రశంస, సమాసోక్తి, ఆక్షేపము అనువానిని నిర్వచించుటలోఁ బ్రతీయమానార్థ ప్రసంగము కలదు.

యత్రోక్తే గమ్యతేఽన్యోర్థ స్త
త్సమాన విశేషణస్సా సమాసోక్తిః.

అను భామహవాక్య మిందులకొక దృష్టాంతము. భామహుఁడును, దండియు ధ్వనిని గావ్యజీవితముగాఁ జెప్పకపోయిన నతిశయోక్తిని బహుధా ప్రశంసించి యున్నారు. సర్వాలంకారములకు నదియే యాదికారణమని వారియభిప్రాయము. ఈ విషయ మీక్రింది శ్లోకమున విస్పష్టము కాఁగలదు :

అలఙ్కారా న్తరాణామ
ప్యేకమాహుః పరాయణమ్
వాగీశమహితా ముక్తి
మిమామతిశయాహ్వయామ్. — దండి.

భామహాదు లలంకారముల కొసంగిన ప్రాధాన్యము చిరకాలమట్లే నిలిచి యున్నది. మమ్మటుఁడు ధ్వన్యాలోకకారునే సర్వథాయనుసరించిన వాఁడయ్యు నలంకారములఁగూర్చి వ్రాసినంతగా మఱి యేవిషయమును గూర్చియు వ్రాయలేదు.

రీతివాదమునకు మూలకారకుఁడు వామనుఁడు. దండియు నీవిషయమునఁ గొంతచర్చఁ జేసియున్నాఁడు. మిక్కిలి యధునాతనులగు నాలంకారికులుగూడ నావిషయమును బరామర్శించియే యున్నారు. వామనుఁడు గుణాలంకారములకుఁ గొంతభేదమును బాటించియున్నాఁడు. దండ్యాదులు గుణాలంకారములకు భేదమును పాటింపరైరి. వామనుఁడు శబ్దార్థభేదమున గుణములను గూడ రెండుతెఱంగుల విభజించి యున్నాఁడు. ఓజస్సు, ప్రసాదము, శ్లేష, సమత, సమాధి, మాధుర్యము, సౌకుమార్యము, ఉదారత, అర్థవ్యక్తి, కాంతి యనునవి యీతఁడు పేర్కొనిన గుణములు. దండియు నీగుణములనే పేర్కొని యున్నను వానిలో శబ్దార్థభేదము నాతఁడు పాటింపలేదు. భరతుని నాట్యశాస్త్రమందుఁగూడ గుణప్రశంస కలదు. చూడుఁడు :

శ్లేషః ప్రసాదస్సమతా సమాధి
ర్మాధుర్యమోజః పదసౌకుమార్యమ్,
అర్థస్యచవ్యక్తి రుదారతాచ
కాన్తిశ్చ కావ్యార్థగుణా దశైతే.

వీనికిని దండివామనాదులు పేర్కొన్న వానికిని భేదమేమియునులేదు. కాని నాట్యశాస్త్రమందు గుణాలంకారములకుఁ బ్రాధాన్యములేదు. దండ్యాచార్యుని గ్రంథమంతయు నించుమించుగా నీగుణాలంకార చర్చతోడనే ముగిసినది. వైదర్భీరీతులీ దశగుణములును ముఖ్యాధారములనియు, గౌడమార్గము వీనికి విపర్యయముగా నుండుననియు నాతని యభిప్రాయము. అర్థవ్యక్తి, ఉదారత, సమాధి, యనునీమూఁడును వైదర్భీగౌడీరీతులు రెండింటియందుఁ గాననగును.

ఇతి వైదర్భ మార్గస్య
ప్రాణా దశగుణా స్మృతాః,
ఏషాం విపర్యయః ప్రాయో
దృశ్యతే గౌడవర్త్మని.

అను శ్లోకము మీది యభిప్రాయమునే చెప్పుచున్నది.

రీతిరాత్మా కావ్యస్య

అనుదానియందు వామనుఁడు కావ్యమునకాత్మ రీతియని వచించినాఁడు.

విశిష్టాపదరచనారీతిః

అని తన్నిర్వచనముఁగూడఁ గావించినాఁడు. ఈతఁడు వైదర్భి, గౌడి, పాంచాలి యను మూఁడురీతులఁ బేర్కొనినాఁడు. వైదర్భియందు దశగుణములును సమానప్రాముఖ్యమునే పడయుననియు, గౌడియందోజః కాంతులకు విశేషప్రాధాన్యము కలదనియు, మాధుర్యసౌకుమార్యములచేఁ బాంచాలి శోభిల్లుననియు నాతఁడు వివరించి యున్నాఁడు. ఈ రీతులకీ పేళ్లెట్లు వచ్చినవో వివరించుచు

విదర్భాదిషు దృష్టత్వాత్తత్సమాఖ్యా

అను సూత్రమునకు వృత్తినిట్లు వ్రాసినాఁడు.

విదర్భ గౌడపాఞ్చాలేషు దేశేషు తత్రత్యైః కవిభిర్యథా స్వరూప ముపలబ్ధత్వాద్దేశ సమాఖ్యా పునర్దేశైః కించిదుపక్రియతే కావ్యానామ్.

గుణముల నిర్వచించుటలో నాట్యశాస్త్రకారునకును దండివామనులకును గొంత భేదముకలదు. గ్రంథవిస్తరభీతిచే నిటఁ గొన్ని మాత్రమే యుదాహరించు చున్నాఁడను.

ఓజః :

సమాస వద్భిర్వివిధై
ర్విచిత్రైశ్చ పదైర్యుతమ్,
సానుస్వారై రుదారైశ్చ
తదోజః పరికీర్త్యతే. —నాట్య. శా.

ఓజస్సమాస భూయస్త్వమ్ —దండి.

గాఢ బన్ధత్వమోజః
అర్థస్య ప్రౌఢిరోజః —వామనుఁడు.

సమాధి :

అభియుక్తైర్విశేషస్తు
యోర్థస్యైవోపలభ్యతే,
తేన చార్థేన సంపన్నః
సమాధిః పరికీర్త్యతే. —నాట్య. శా.

ఆరోహావరోహక్రమస్సమాధిః
అర్థ దృష్టిస్సమాధిః. —వామనుఁడు.

కటక కుండలాదులవంటి యలంకారములకుఁ బ్రాధాన్యమిచ్చిన యలంకార సిద్ధాంతముకంటె, రీతివాద మొకమెట్టు పైకెక్కినదనియే యంగీకరింపవలయును. గుణములకుఁ బ్రాధాన్యమిచ్చియు నీ గుణములు దేనిధర్మములను విషయమును రీతివాదులు పరిశీలింపరైరి.

రీతులెన్నియను విషయమున నాలంకారికులు భిన్నభిన్న మార్గములఁ బోయిరి. రాజశేఖరుఁడు తన కావ్య మీమాంసయందు వామనాదులు పేర్కొనిన మూఁడు రీతులనే పేర్కొనియుఁ గర్పూరమంజరియందు వత్సగుల్మ మాగధీ రీతుల విశేషముగా నొసఁగి యున్నాఁడు. రుద్రటుఁడు లాటీరీతిని గలిపినాఁడు. భోజుఁ డవంతీ, మాగధి, లాటి యను మూఁడు రీతులను జేర్చి యాఱింటిని బేర్కొని యున్నాఁడు.

వక్రోక్తిః కావ్యజీవితమ్

అని వక్రోక్తి జీవితకారుఁడు వక్రోక్తినే కావ్యజీవితముగాఁ బరిగణించి యున్నాఁడు. జయరథుఁడు కవిప్రతిభయే వక్రోక్తికిఁ గారణమనియుఁ గుంతకుండు వైదగ్ధ్య భంగీ భణితియే వక్రోక్తి యనఁబడుననియు నిర్వచించిరి. వామనుఁడు వక్రోక్తి నొక యలంకారముగాఁ బరిగణించి

సాదృశ్యాల్లక్షణా వక్రోక్తిః

అని నిర్వచించినాఁడు. రుద్రటుఁడు వక్రోక్తిని శబ్దాలంకారముగాఁ బరిగణించి, కాకుశ్లేష భేదమున ద్వివిధ వక్రోక్తులను జెప్పినాఁడు. మమ్మటాదులీ విషయమున నీతనినే యనుసరించిరి. శ్లేష వక్రోక్తికి శోభనాపాదించుననియు, స్వభావోక్తికి వ్యతిరేకమైనది వక్రోక్తి యనియు దండి యభిప్రాయము.

శ్లేషస్సర్వాసు పుష్ణాతి
ప్రాయో వక్రోక్తిషు శ్రియమ్,
భిన్నద్వివిధా స్వభావోక్తి
ర్వక్రోక్తిశ్చేతి వాఙ్మయమ్.

అను వానిలో మీది యభిప్రాయము సువ్యక్తమై యున్నది. భామహుఁడును వక్రోక్తిపదము నీయర్థమందే యుపయోగించి యున్నాఁడు. సర్వాలంకారముల యందును వక్రోక్తి యుండియే తీరవలయునని యాతని యభిప్రాయము. ఈ క్రింది యుదాహరణము లీయర్థమునే వివరించును :

వక్రాభిధేయ శబ్దోక్తిరిష్టా వాచామలఙ్కృతిః,
వాచాం వక్రార్థ శబ్దోక్తి రలఙ్కారాయ కల్పతే.

భామహు నుదాహరించుచు లోచనకారుఁడు

శబ్దస్య హి వక్రతా అభిధేయస్య చ వక్రతా, లోకోత్తీర్ణేన రూపేణావస్థానమ్.

అని వివరించి యున్నాఁడు.

భరతుని రసవాదము కావ్యమున కాత్మ రసమని చెప్పును. విభావానుభావ వ్యభిచారి సంయోగమువలన రసనిష్పత్తి యగుచున్నది. ఇట్టి రసోత్పత్తికి నొక కావ్యమంతయు నావశ్యకము. రసము వాచ్యముగా నుండక వ్యంగ్యముగా నుండవలయునని సిద్ధాంతము. ఈ సిద్ధాంతమునే యాధారముగాఁ జేసికొని వ్యంగ్యార్థమే కావ్యమున కాత్మయని ధ్వనికారుఁడు వచించినాఁడు.

అయమేవహి మహాకవేర్ముఖ్యో వ్యాపారో యద్రసాదీనేవ ముఖ్యతయా కావ్యార్థీ కృత్యతద్వ్యక్త్యను గుణత్వేన శబ్దానామర్థానాం చోపనిబన్ధనమ్. ఏతచ్చ రసాదితాత్పర్యేణ కావ్యనిబన్ధనమ్ భారతాదావపి సుప్రసిద్ధమేవేతి...... రసాదయోహి ద్వయోరపితయోః (కావ్యనాట్యయోః) జీవితభూతాః సారభూతోహ్యర్థః. స్వశబ్దానభిధేయత్వేన ప్రకాశితః సుతరామేవ శోభామావహతి. ప్రసిద్ధిశ్చేయమస్త్యేవ విదగ్ధ విద్వత్పరిషత్సు యదభిమతతరం వస్తువ్యఙ్గ్యత్వేన ప్రకాశ్యతే నసాక్షచ్ఛబ్ద వాచ్యత్వేనైవ.

—ధ్వన్యాలోకము.

రసాద్యలంకార వస్తుభేదమున ధ్వని మూఁడుతెఱఁగుల విభజింపఁబడి యున్నది. రసాదియందు నవరసములేకాక తదాభాసాదులుకూడ నిమిడియున్నవి.

> తేన రసఏవ వస్తుత ఆత్మా. వస్త్వలఙ్కారధ్వనీతు సర్వథారసం ప్రతి పర్యవస్యేతే ఇతి వాచ్యాదుత్కృష్టౌతౌ ఇత్యభిప్రాయేణధ్వనిః కావ్య స్యాత్మేతి సామాన్యేనోక్తమ్. ప్రాథమికానా మభ్యాసార్థినాం యదిపరం చిత్రేణ వ్యవహారః ప్రాప్తపరిణతీనాంతు ధ్వనిరేవ ప్రాధాన్యేన కావ్యమితి స్థితమేతత్.

కావ్యాత్మగా ధ్వనిని స్థాపించిన తరువాత గుణాలంకారములను గూర్చి ప్రసంగించినాఁడు.

> తమర్థ మవలమ్బన్తే

అనుదానికి

> యేతమర్థం రసాదిలక్షణమఙ్గినం సంతమవలమ్బన్తే తేగుణాశ్శౌర్యాది వత్. వాచ్య వాచక లక్షణాన్యఙ్గాని యే పునరాశ్రితాస్తేఽలఙ్కారా మన్తవ్యాః కటకాదివత్.

అని వృత్తివ్రాసి గుణములు శౌర్యాదులవంటివనియు నలంకారములు కటక కుండలాదులవంటివనియు నిర్దేశించినాఁడు.

ఇఁక రససిద్ధాంతమును బరిశీలింతము. విభావములు, అనుభావములు, సాత్త్వికభావములు, వ్యభిచారిభావములు అను సామగ్రిచే సముల్లసితమైన రత్యాది స్థాయిభావము రసమని చెప్పఁబడుచున్నది. సజాతీయ విజాతీయ భావములచేఁ దిరస్కరింపఁబడక సామాజికుల యనుభవ పర్యంతమును నిలిచి యుండునది స్థాయి యనిపించుకొనుచున్నది భరతమునియు విభావానుభావ వ్యభిచారిభావ సంయోగమువలన రసము నిష్పన్న మగుచున్నదనియే చెప్పి యున్నాఁడు. ఈ క్రింది శ్లోకములయందీ భావమే వ్యక్తము చేయఁబడియున్నది :

> విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః.
>
> ---నాట్యశాస్త్రము : భరతుఁడు.

> విభావానుభావ సాత్త్వీక వ్యభిచారి భావైరుపనీయమానః
> పరిపూర్ణః స్థాయి భావో రస్యమానోరసః. —రసతరఙ్గిణి.

> విరుద్ధైరవిరుద్ధైర్వా
> భావైర్విచ్ఛిద్యతే న యః,
> ఆత్మభావం నయత్యన్యాన్
> స్థాయీప లవణాకరః. —దశరూపకము.

చరమ సమయ పర్యన్తస్థాయి
త్వాదస్య స్థాయిత్వ వ్యపదేశః. —రసతరఙ్గిణి.

మఱియు, నరులకు నృపతియట్లు, శిష్యులకు గురువునట్లు సర్వభావములకు స్థాయి గొప్పది యని యీ క్రింది శ్లోకమునఁ జెప్పఁబడి యున్నది :

యథా నరాణాం నృపతిః
శిష్యాణాంచ యథా గురుః,
ఏవంహి సర్వభావానాం
భావః స్థాయీమహానిహ. —నాట్యశాస్త్రము.

ఇఁక విభావములనఁగానేమి ? యను ప్రశ్నకు మనమిప్పుడు సమాధానము నీయవలయును. వాగంగాభినయాశ్రయమ్ములైన యనేకార్థములు వీనిచే భావింపఁ బడుచున్నవి కాన నివి విభావములనఁబడుచున్నవి. ఈ భావమునే యీ క్రింది శ్లోకము వ్యక్తము చేయుచున్నది :

బహవోఽర్థా విభావ్యన్తే
వాగఙ్గాభినయాశ్రయాః,
అనేన యస్మాత్తేనాయం
విభావ ఇతి సంజ్ఞితః.

మఱియు, రసమును విశేషముగా నుత్పాదింపఁ జేయునవి కావున విభావములు అనియుఁ జెప్పఁబడి యున్నది :

విశేషేణ భావయన్త్యుత్పాదయన్తి
యేరసాంస్తే విభావాః. —రసతరఙ్గిణి.

ఆలంబనోద్దీపన భేదమున విభావములు రెండు విధములు. ఈ విషయమునే దశరూపకకారుఁడు

ఆలమ్బనోద్దీపనత్వ ప్రభేదేన స చ ద్విధా

అను వాక్యమునఁ జెప్పియున్నాఁడు. నాయికానాయకు లాలంబనములు. ప్రకృచం దన కోకిలాలాపాదు లుద్దీపనములు. భావసంసూచనాత్మకములైన వికారములను భావములనియు, అతిరసపోషకములగు భ్రూవిక్షేప కటాక్షాదులనియు దశరూపక కారుని నిర్వచనము.

అనుభావో వికారస్తు భావ సంసూచనాత్మకః.
స్థాయి భావాననుభావయతః సామాజికాన్ సభ్రూవిక్షేప కటాక్షాదయో రసపోషకారిణోఽనుభావః.

సత్త్వజములగు కొన్ని యనుభావములే సాత్త్వికములనఁ బరఁగు చున్నవి యని యొక నిర్వచనము సాత్త్వికభావ విషయమునఁ గలదు :

పృథగ్భావా భవన్త్యన్యే
అనుభావత్వేఽపి సాత్త్వికాః,
సత్త్వాదేవ సముత్పత్తేః
తచ్చతద్భావ భావనమ్.

ఇఁక రెండవ నిర్వచనము :

సత్త్వం జీవశరీర యే తస్య ధర్మాః సాత్త్వికాః ఇత్థంచ శారీరభావాః స్తమ్భాదయః సాత్త్వికాభావా ఇత్యభిధీయతే. —రసతరఙ్గిణి.

సాత్త్వికభావములీ క్రింది శ్లోకమునఁ జెప్పఁబడియున్నవి :

స్తమ్భప్రలయ రోమాఞ్చాః
స్వేదో వైవర్ణ్య వేపథూ
అశ్రువైస్వర్య మిత్యష్టౌ
స్తంభోఽస్మిన్ నిష్క్రియాంగతా
ప్రలయో నష్ట సంజ్ఞత్వం
శేషాస్సువ్యక్తలక్షణాః. —దశరూపకము.

ఇఁక వ్యభిచారుల నిర్వచనము :

వివిధమాభిముఖ్యేన రసేషు చరన్తీతి

అను నాట్య శాస్త్రము‌ను

విశేషాదాభి ముఖ్యేన
చరన్తో వ్యభిచారిణః,
స్థాయిన్యున్మగ్న నిర్మగ్నాః
కల్లోలా ఇవవారిధౌ.

అను దశరూపకమును

యథావారిధౌ సత్యేవ కల్లోలా ఉద్భవన్తి విలీయన్తేచ తద్వదేవ రత్యాదౌస్థాయిని సత్యే వావిర్భావ తిరోభావా భావాభి ముఖ్యేన చరన్తో వర్తమానా నిర్వేదాదయో వ్యభిచారిణో భావాః

అను తద్వ్యాఖ్యయు

ఉన్మజ్జన్తో నిమజ్జన్తః
కల్లోలాస్తే యథార్ణవే,
తస్యోత్కర్షం వితన్వన్తి
యాన్తి తద్రూపతామపి.

తథా స్థాయిని నిర్మగ్నా
హ్యున్మగ్నా వ్యభిచారిణః,
పుష్ణంతి స్థాయినం స్వాంశ్చ
తన్నయన్తి రసాత్మతామ్.

అను లక్షణాంతరమును, సముద్రమునందుఁ దరఁగ లుద్భవించుచు లయించుచు నా సముద్రమునకుఁ బుష్టిని గలుగఁజేయునవియై తద్రూపతనొందుభంగి స్థాయియందు సంచారులు పుట్టుచు మున్గుచు దానిని రసత్వము నొందించుచుఁ దద్రూపత నొందుననియు సముద్రము లేక తరఁగలులేనిభంగి స్థాయి లేక సంచారులుదయింపవనియుఁ జెప్పుచున్నవి.

రమణీయోల్బణతా సమేతమగు నీరత్యాది భావాబ్ధిలో
నమరంబుట్టుచు మున్గుచుం దగుఁ దరంగారూఢి సంచారి సంఘము

అను నరసభూపాలీయమునందలి పద్యము నీ యంశమునే విస్పష్టము చేయుచున్నది.

వ్యంజనౌషధి సంయోగమున నన్నము స్వాదుత్వము నొందినట్లే, సముచిత విభావాదులవలన నతిశయించి ప్రకాశించు రతి హాస శోక క్రోధోత్సాహ భయ జుగుప్సా విస్మయ శమంబులను స్థాయిభావములు వరుసగ శృంగార హాస్య కరుణ రౌద్ర వీర భయానక బీభత్సాద్భుత శాంతంబులను రసంబులగును.

రసాస్వాదన విషయమున సాహిత్యదర్పణకారుఁడిట్లు చెప్పియున్నాఁడు:

సత్త్వోద్రేకాదఖణ్డస్వ
ప్రకాశానన్ద చిన్మయః,
వేద్యాన్తరస్పర్శ శూన్యో
బ్రహ్మాస్వాద సహోదరః.

లోకోత్తర చమత్కార
ప్రాణైః కైశ్చిత్ప్రమాతృభిః,
స్వాకారవద భిన్నత్వే
నాయమాస్వాద్యతౌరసః.

రసగంగాధరకారుఁడీ రస విషయమున నిట్లు వచించినాఁడు :

సముచిత లలిత సన్నివేశ చారుణా కావ్యేన సమర్పితైః సహృదయ హృదయం ప్రవిష్టైః తదీయ సహృదయతా సహకృతేన భావనా విశేష మహిమ్నా, విగళిత దుష్యన్త రమణీత్వాదిభిః, అలౌకిక విభావానుభావ వ్యభిచారి శబ్దవ్యపదేశ్యైః శకున్తలాదిభిరాలమ్బన కారణైః

చన్ద్రికాదిభిరుద్దీపన కారణైః అశ్రుపాతాదిభిః కార్యైః, చిన్తాదిభి స్సహ కారి భిశ్చ, సంభూయప్రాదుర్భావితేన, అలౌకికేన వ్యాపారేణ, తత్కాల నిర్వర్తితానం దాంశావరణా జ్ఞానేన అత ఏవ ప్రమృష్ట పరిమిత ప్రమాతృత్వాది నిజధర్మేణ ప్రమాత్రా స్వప్రకాశతయా వాస్తవేన నిజస్వరూపానందేన సహగోచరీక్రియమాణః ప్రాగ్వినివిష్ట వాసనారూపః రత్యాది రేవ రసః.

ఈ రసమసంలక్ష్య క్రమమే. ఇది విభావాదులచే వ్యంజనీయ మగుట వలనఁ గ్రమ ముున్నదని చెప్పవలసియున్నను రసాస్వాదాతిశయ మహిమచే నాక్రమము సంలక్ష్యమాణము కాదుకదా!

ఎచట విభావానుభావ వశమున రసవ్యక్తి స్ఫుటమగుచున్నదో యచటనే యసంలక్ష్యక్రమ వ్యంగ్యమును గలుగుచున్నది. ఇతర స్థలములలో రసాది ధ్వనియు సంలక్ష్య క్రమమే యగుచున్నది. ఈ విషయమభినవగుప్తపాదులచే

రసభావాద్యర్థము ధ్వన్యమానమే కాని వాచ్యము కాదు. అయినను సర్వము సంలక్ష్య క్రమవిషయము కాదు

అని చెప్పఁబడినది.

రసమును గూర్చి దిఙ్మాత్రముగాఁ జెప్పఁబడినది. సాధారణముగాఁ బ్రబంధములు శృంగార రసాత్మకములై యుండును. శృంగారమునకు రతియను నది స్థాయిభావము.

తరుణీతరుణుల కితరేతరాలంబనమగు ప్రేమయనెడు చిత్తవృత్తి రతి యని తాత్పర్యముఁ జెప్పుట యుక్తతమంబు. ఏలయన, రతియనునది ప్రేమ మని, ప్రీతియని చెప్పఁబడు నొక చిత్తవృత్తియే. అది గురుదేవతాపుత్ర మిత్ర కళత్రాది విషయకమై యుండును. దానింబెద్దలు స్త్రీ పురుషుల కన్యోన్య విషయకమైనపుడు వ్యభిచారిభావముగను జెప్పుదురు. అట్టిరతి స్థాయిభావంబగునపుడు సంభోగవిషయకేచ్ఛా రూపమనియుఁ బుత్రవిషయకమైనప్పుడు ప్రేమరూప మనియు నొకరతికి రెండులక్షణములు చెప్పుటకన్న రతియంతయుఁ బ్రేమాఖ్య చిత్తవృత్తిరూపమేయనుట యుక్తమని నవీనాలంకారిక సిద్ధాంతము. సంభోగేచ్ఛా రూపము శృంగారస్థాయి రతియని చెప్పి సంభోగపదమునకు

అనుకూలౌ నిషేవేతే
యత్రాన్యోన్యం విలాసినౌ,
దర్శన స్పర్శనాదీని
స సంభోగ ఇతీరితః.

అని లక్షణాంతరము సేయు ప్రయాసకన్న నిదియే యుక్తతమంబు. పైశ్లోకము నకు విలాసవంతులగు తరుణీతరుణుల పరస్పరానుకూల్యము గలవారై యొన రించు దర్శనము, స్పర్శనము, ఆలాపనము, ఆలింగనము మొదలగునవి సంభోగమనఁబడును గాని యీర్ష్యాదులుగల యపుడొనరించు దర్శనాదులట్లు గావని యాశయము. ఇట్లు రసగంగాధరమున

తత్ర స్త్రీ పుంసయోరన్యోన్యాలంబనః ప్రేమాఖ్య శ్చిత్తవృత్తి విశేషోరతిః స్థాయిభావః — గురుదేవతాపుత్రా) ద్యాలమ్బనస్తు వ్యభిచారీ.

అని వ్రాయఁబడినది.

స్త్రీలకుఁ బురుషులకుఁ బరస్పరాలంబనమై ప్రేమమని చెప్పఁబడు చిత్తవృత్తివిశేషము రతి. అది స్థాయిభావమగును. గురుదేవతా పుత్రాద్యాలంబనమైనరతి వ్యభిచారియగును.

అని దీనియర్థము. కావ్యప్రకాశ తాత్పర్యమునింతే.

ఈరతి యంకురితత్వ పల్లవితత్వాద్యవస్థలు గలదయి యుల్లసిల్లు. అందంకురితత్వావస్థయందుఁ బ్రేమమను నామము, బల్లవితత్వావస్థ యందు మానమను పేరును, గోరకితావస్థయందుఁ బ్రణయమను నాఖ్యను, బుష్పితావస్థయందు స్నేహమను నభిఖ్యను ఫలితావస్థయందు రాగమను నభిధానమును భోగ్యావస్థయం దనురాగమను నాహ్వయమును జెంది తేజరిల్లు. ఈఫలాంతావస్థా పంచకము పూర్వానురాగ రూపమగు నభిలాషజన్య విప్రలంభమునందును, భోగావస్థయనునది సంభోగ శృంగారమునందుఁ జేరియుండును.

అఙ్కుర పల్లవ కలికా ప్రసూన ఫలభోగభాగియం క్రమశః ప్రేమా మానః ప్రణయ స్నేహోరాగోఽను రాగశ్చ, ఇయమఙ్కురితా ప్రేమా మానాత్పల్లవితా భవేత్ సకోరకా ప్రణయత స్నేహాత్కుసుమితాభవేత్, రాగవత్ఫలవతీసేయమనురాగేణ భుజ్యతే.

ఇత్యాది ప్రమాణము లనుసంధించునది.

రాయలయుగమునఁ బుట్టిన మహాప్రబంధములలోఁ బ్రప్రథమము మను చరిత్రము. ఇందుఁ బ్రవరవరూధినీ ఘట్టమునందలి శృంగార మాభాసరూప మును బొందియున్నది. ఇందనురాగము వరూధినియందే కాననగును. ప్రవ రుఁడు కేవల విరక్తుఁడు. శాంతశృంగారముల సంఘర్షణములో శాంతమే జయించినది.

రసవిషయకమైన చర్చ చేయునపుడుదాహరణముగాఁ గైకొనఁదగిన గ్రంథము వసుచరిత్రము. ఇందు నాయకుఁడు వసురాజు. నాయిక గిరిక.

వసురాజునందుఁ గీర్తిప్రతాపాద్యుత్తమ నాయకలక్షణములన్నియుఁ గలవు. నాయిక ముగ్ధ. 

ఇక్కావ్యము శృంగారరస ప్రధానమగుటచే నిందోజః ప్రభృతి గుణంబులు, నారభటీ వృత్తియు, గౌడీరీతియు నంతగా నగపడవు. ఇఁక మాధుర్య ప్రసాదాది గుణములకును. కైశిక్యాది వృత్తులకును వైదర్భీ ప్రభృతి రీతులకును నిది యాలవాలమైయున్నదన వచ్చును.



కైశికి చెలంగు శృంగార కరుణలందు
నారభటిరౌద్ర భీభత్సహారిణియగు
నలరుభారతి హాస్య శాంతాద్భుతముల
నమరు సాత్వతి వీరభయానకముల.

అని నరసభూపాలీయమునఁ జెప్పఁబడియున్నది.

శృంగారరస ప్రధానమగు నీగ్రంథమున సంభోగ శృంగారమున కనేకోదాహరణముల నీయవచ్చును. గ్రంథవిస్తరభీతిచే నిట నొకటి రెండు మాత్రమే యుదాహరింపఁబడు చున్నవి.

అనుపమ కాంతివైభవ సమన్వితు నావసురాజుఁ గాంచు ప
ద్మిని సరసాంతరంగమున మించె వినూతనరాగ కందళం
బొసఁగె నఖండవాసనలు నుత్కళికల్విలసిల్లె నల్ల న
ల్లన నిగిడెం బ్రమోదతరళస్థితులై తమిఁజూపు తుమ్మెదల్.

ఈ పద్యములో గిరికాపరమైన యర్థమందు సంపూర్ణమైన శృంగారరసమును జెప్పినాఁడు.

కాంతియుద్దీపన విభావము. వసురాజాలంబన విభావము. సరసాంతరంగమున మించే వినూతనరాగ కందళంబనఁగా ననురాగ యుక్తమైన యంతరంగమునందా యనురాగము పూర్ణమయ్యెననుట. అనురాగమనఁగా రతియనెడు స్థాయిభావము. కందళ పదము పరిపూర్ణత్వమును దెలుపుచున్నది. వినూతనపదము స్పష్టార్థము. మించెననెడి పదము పూర్ణత్వమును జెప్పుచున్నది. అపరిపూర్ణమైన స్థాయిభావమనియుఁ బరిపూర్ణమైన రసమనియు గ్రహింపవలయును. అఖండవాసనలనఁగా సాత్త్వికభావములు. ఉత్కళికలనఁగా సంచారిభావములు, చూపులనఁగా ననుభావములు. ఈరీతిగా విభావానుభావ సాత్త్వికసంచారి సముల్లసితమై స్థాయిభావమైన యనురాగ కందళము సంపూర్ణమైన శృంగార రసమని గ్రహింపవలయును.

ఈ పద్యము మొదలుకొని యీక్రింది నాలుగు పద్యములలో గిరికాదేవికిఁ బ్రథమావస్థయగు నయనోత్సవమును జెప్పినాఁడు :

తొలుదొలుతఁ విలోలగతిఁ బొంగలి తెప్పలనాని కర్ణ కుం
డలరుచి ధాళధళ్యముల డాపున నల్లనఁ బొంచి మించులై
వెలువడి పూర్ణచంద్రుపయి వెన్నెల పుల్గులచాలు వ్రాలు లీ
లల విభుమీఁద వ్రాలె నవలా నవలాలితదృష్టి జాలముల్.

వసుధాసుధాంశుఁ బొదవుచు
వెస మఱలుచు మరలి మగుడ వెడలుచు లలనా
లసమాన దృష్టిజాతము
లసమాంబకు చిత్రశరములై విలసిల్లెన్.

వనజదళాయతాక్షి నిడువాలికచూపనిమేషవృత్తి నా
ఘను నవకంబుపైఁ బొలసి కాంత తదీక్షణ జాలకంబుపై
కొనినఁ ద్రపాబ్ధిఁ గ్రుంకియును గోరికఁ గ్రమ్మఱఁగూడఁ బారు మో
హనగుణశక్తి నివ్వటిలు నవ్వలరాయని నేర్పుపెంపునన్.

కౌతుకము పూని యొండొరుఁ గాంచఁ దివురు
చంచలాక్షికిఁ బతికి నేత్రాంచలములు
గూర్చె వలరాచయొజ్జ గోర్కులు దలిర్ప
నడిగదా భావిశోభన వ్యంజకంబు.

ఇందుఁ 'దొలుదొలుతన్' అను పద్యమున లజ్జాతిశయ స్ఫురణమువలన గిరికా ముగ్ధాత్వము స్పష్టమగుచున్నది.

ఉదయ ద్యౌవనా ముగ్ధా
లజ్జా విజిత మన్మథా

అనియుఁ జెప్పఁబడి యున్నది. లజ్జయనునది సంచారిభావము.

చేత స్సంకోచనం వ్రీడా
నజ్గ రాగ స్తదాదిభిః

అని చెప్పఁబడియున్నది.

'వనజదళాయతాక్షి' అను పద్యమున గిరికాదేవియందు లజ్జయును మదనవికారంబును సమానంబులుగాఁ జెప్పుటవలన మధ్యాత్వము స్ఫురించు చున్నది.

సమానలజ్జా మదనా మధ్యా

అని లక్షణము.

తరువాత నీ క్రింది పద్యములో మోహము, చింత, ఔత్సుక్యము, చాపల్యము అను సంచారిభావములను వర్ణించియున్నాఁడు :

కనుగలవింటఁ జొక్కపు చవుల్వ్రాట్టించి
నారిచే విభ్రమోన్నతులు పెనచి
తమ్మి తూఁపున రసోదగ్రత సవరించి
కంకేళిఁ బ్రబల రాగంబు నించి
యెలమావిఁ గేలంటి యెలమి మీఱఁగఁజేసి
విరవాది నూష్మాభివృద్ధి నెఱపి
కలువచేఁ దమిపెంపు వెలయించి చిగురాకు
మొనల నాకులపాటు మొనయఁజేసి

యసమ శరవీర పుంగవుఁడాత్మ సాధ
నముల నన్నింటి చేఁజూపి కమిచిపోటు
గంటి దూరినరీతి వాల్గంటి మనము
నవనిపతి చిత్తమును దూరె నాక్షణమున.

'నారిచే విభ్రమోన్నతులు పెనచి' యనుచో మోహమను సంచారిభావము కలదు.

మోహస్తు మూర్ఛనం భీతి
ర్దుఃఖ లేశాను చిన్తనైః

అని తల్లక్షణము.

'విరవాది నూష్మాభివృద్ధి నెఱపి' యనుచో సంతాపమను సనుభావము గలదు. ఇది చింతయను సంచారిభావమున కనుభావము.

ఇష్టా నభిగమాద్ధ్యానం
చిన్తా శూన్యత్వ తాపకృత్

అని తల్లక్షణము.

'కలువచేఁ దమిపెంపు వెలయించి' అనుచో నౌత్సుక్యమను సంచారిభావము కలదు.

కాలాక్షమత్వ మౌత్సుక్యం
మనస్తాపత్వరాది కృత్

అని లక్షణము.

'చిగురాకు మొనల నాకులపాటు మొనయఁజేసి.' ఆకులపాటనఁగా వ్యాకులత్వము. వ్యాకులత్వమనఁగాఁ జాపల్యమనెడి సంచారిభావము.

చాపలత్వం నవస్థానం
రాగద్వేషాది సంభవమ్

అని తల్లక్షణము.

ఇట్లు డెబ్బదియవ పద్యమువఱకు సంభోగ శృంగారమే వర్ణింపఁబడినది.

ఇట్లే షష్ఠాశ్వాసమునను సంభోగ శృంగారము వర్ణితమైయున్నది. అవి యన్నియు నిట నుదాహరించుట యప్రస్తుతమగును.

ఈ క్రింది పద్యములయందు మన్మథ దశావస్థలును వర్ణింపఁబడినవి :

గిరికన్య మేన నేకీభవించినఁగాని
తియ్య విల్తుని నిరోధింపరాదు
సింధుజ నెదనుంచి సిరుల మించినఁగాని
మిహికాంశుఁ గనుసన్న మెలపరాదు
శుభవాణి యభిముఖ స్ఫురణఁ జూపిసఁగాని
పరచుటంచలఁ గ్రిందు పఱుపరాదు
పద్మినిఁ గరముఖప్రౌఢిఁ దేల్చినఁగాని
రేల మున్మరము వారింపరాదు

నేర్పున నటంచు నృపతి యా నెలఁతఁ దలఁచి
తలఁచి సగమగు సాత్త్వికోదయ దశాను
భావములఁ జెందు నున్మద ప్రసవబాణ
బాణ మగ్నతఁ గాంచుఁ దాపము వహించు.

ఇందులో మొదటి నాల్గు చరణములయందును సంకల్పావస్థయును గీతి మొదటి చరణమందుఁ గృశత్వావస్థయునుఁ జెప్పఁబడినవి.

అనిశధ్యాత నదీసుతావయవుఁడై యమ్మేటి యయ్యేటి శో
భన ముక్తావళులన్న నన్నది నవాబ్జంబన్న గోరంత సం
టును నొక్కింత ముఖానురాగమును బూనుంగాని యే సొమ్ముఁ గై
కొనఁడే కానుక లిచ్చినం గొనఁడు గోర్కుల్నిండి దైవారఁగన్.

ఇందులో 'అనిశధ్యాత నదీసుతావయవుఁడై' అనుదానిచేఁ జింత యనెడి సంచారిభావమును, 'ఏ సొమ్ముఁ గైకొనఁ దేకానుక లిచ్చినం గొనఁడు' అను దానిలోన రతి యనెడు నవస్థయు వర్ణితములై యున్నవి. ఇట్లే తొంబదితొమ్మిదవ పద్యమువఱకు దశావస్థలు వర్ణింపఁబడియున్నవి.

ఇందంగిరసము శృంగారమేయయ్యు, వీర రౌద్ర కరుణ భయానకాది రసములు నాయాతావుల యథోచితముగ వర్ణింపఁబడియే యున్నవి.

ఈ రీతినే ప్రబంధముల నన్నింటిని బరిశీలింపవలయును.

పింగళి సూరనార్యుని శృంగార రసపోషణములో నొక విశిష్టత కలదు. కళాపూర్ణోదయ ప్రారంభముననే తాను వ్రాయఁదలఁచుకొన్న గ్రంథవిధానము

నీ క్రింది రీతినిఁ దెలిపియున్నాఁడు :

శృంగారరస ప్రాయంబును బుణ్యవస్తు వర్ణనాకర్ణనీయంబును....

ఇది కవి చెప్పఁదలఁచిన గ్రంథతత్త్వము. ఇందు శృంగారముతో భక్తియు జోడింపఁబడినది. ఈ గ్రంథమంతయు సమగ్రముగఁ బరిశీలించినచో నిందలి పాత్రలన్నియు నీరెండుగుణములును గలిగియే యున్నవని తేటతెల్లము కాక పోదు. అధికారి భేదముఁబట్టి ప్రాధాన్యభేదము మాత్రము కలదు.

మహాతపముఁ గావించిన మణికంధరుఁడు రంభయందలి రక్తిని వీడలేక పోయినాఁడు. శారదాభక్తుఁడు శాలీనుఁడు భార్యతో వెట్టిపోకడలు పోయినాఁడు. మహాశూరుఁడగు మణిస్తంభుఁడు కలభాషిణి కౌగిలికాసపడినాఁడు. ఇంతయేల! ఆదిమదంపతులకే శృంగారవిహారమున వేడుకలు వెల్లివిరిసినవి. విగ్రహమని యెఱింగియుఁ దత్సౌందర్య ముగ్ధుడై సన్న్యాసి యొక్కఁడు విష్ణ్వాలయము నందలి యొక స్త్రీ విగ్రహమును గౌగిలించుకొనుటయు నీ విషయమున నొక ప్రబల దృష్టాంతమే యగుచున్నది.

సూరనార్యుని శృంగారవర్ణనములలో నింకొక చిత్రమైన భావసంసర్గ మున్నది. ఆయన శృంగారము విషాదరేఖా శబలితమై యుండును. ప్రేమమూర్తి యగు కలభాషిణి మృగేంద్రవాహనాలయమునఁ గత్తికెరయగుట, వలపు ఫలింప నున్నవేళ మణికంధరుఁడు శాపదగ్ధుఁడగుట, స్వచ్ఛమగు ప్రేమగోష్ఠి చేసికొను చుండఁగా శాలీనుఁడు హ్రదమున మాయమగుట మొదలగునవి యిందుల కుదా హరణములు.

శృంగారరసాధిదేవత నర్తకివలె బహురూపముల నాయనకు సాక్షాత్క రించినది. తద్రూప వ్యక్తీకరణమే ప్రణయప్రపంచమున నాయన ప్రతిపాదింపఁ దలఁచిన సిద్ధాంతము. వానిలో ముఖ్యములు కొన్నియిట నుదాహరింపఁబడు చున్నవి—

1. సరస్వతీ చతుర్ముఖుల ప్రణయము :

పురాణములు బ్రహ్మను సృష్టికర్తయని చెప్పునే కాని యాయనచే నా సృష్టిని జేయించు కారణమేదియో చెప్పఁజాలవు. ఈ రహస్య మీఘట్టమున వ్యంగ్యముగా నున్నది. సరస్వతీరూపయగు ప్రకృతి తనవిలాస విభ్రమములచేఁ జతుర్ముఖరూపుఁడౌ పురుషుని రాగరంజితచిత్తునిజేసి, ప్రపంచసృష్టి కున్ముఖుని జేయుచున్నది. ఆదిమదంపతుల ప్రణయమే సృష్టికి మూలమని ఫలితార్థము.

2. కలభాషిణీ మణికంధరుల శృంగారము :

ఈ గాథలో సహాధ్యయన సహవాసములతోడి స్నేహము కాలక్రమమునఁ

ప్రేమగా ననురాగముగాఁ బరిణమించి ప్రణయ సాయుజ్యమున నెట్లు సిద్ధి పొందునో ప్రతిపాదింపఁబడి యున్నది.

3. సుగాత్రీ శాలీనుల పరిణయము :

సహజ సౌందర్యమును సాధుచిత్తవృత్తియు బింబ ప్రతిబింబములనియు, సౌందర్యమనునది యపస్థానగుణమనియు నిందు నిరూపింపఁ బడియున్నది.

4. కల్యాసురకథ :

ఇందలి రాక్షసశృంగారము, సాధుత్వమెఱుఁగని మోటుమనుష్యుల ప్రణయభగ్నతకొక నిదర్శనము. ఇది నిజముగా నాభాసరూపము.

ఈవిధముగ శృంగార రసాధిదేవతను మననముచేసి సాక్షాత్కరింపఁ జేసికొని, యామె సత్యస్వరూపమును పాఠకులకుఁ జూపి కృతకృత్యుఁడైనాఁడు సూరన. ఒకపంక శృంగార విషయమున నిట్టి మథనము జరుగుచుండఁగా నింకొకపంక భక్తిభావ ప్రపూర్ణులైన కవులు బయలుదేరుచుండిరి. ధూర్జటి, రామకృష్ణుఁడు, కృష్ణరాయలు నిట్టివారు. వీరి గ్రంథములయందలి రసము శాంతమని చెప్పవచ్చును. విప్రలంభ శృంగారాత్మకమైన గ్రంథమును రచించి కృతకృత్యుఁడైనాఁడు తిమ్మన. కామేశ్వరకవి సత్యభామా సాంత్వనము, వెలిదండ్ల వేంకటపతి రాధామాధవము, ముద్దుపళని రాధికాసాంత్వనము మొదలగు కృష్ణనాయకములైన యీ విప్రలంభ శృంగార కావ్యములన్నియుఁ బారిజాతాపహరణమునకు సాక్షాదనుకృతులు.

మనవారికి హాస్యరస మంతగా రుచించినట్లు కానరాదు. ఉన్న కొలది పాటియుఁ జాల మోటుగ ననాగరకముగ నుండును. హాస్యరసపోషణము గావించిన యా కొలదికవులలో నెడపాటి యెఱ్ఱనయు, సారంగు తమ్మయయు, చదలువాడ మల్లయయు ముఖ్యులు. ఎఱ్ఱన తన శృంగారమల్హణ చరిత్రలోఁ గోమటి నొక్కని నుపనాయకునిగ సృజించి హాస్యరసపోషణము గావించినాఁడు. వైజయంతీ విలాసమున సారంగుతమ్మయయు హాస్యరసపోషణ మించుక గావించినాఁడు. ఈతని హాస్యరస పోషణముకంటె విప్రనారాయణ చరిత్రకర్తయగు చదలువాడ మల్లయ హాస్యము యథోచితముగ నుండును. విటకంటకి వేషమును మాటలును జేష్టలును హాస్యరసజనకములై యుండును.

ప్రబంధ కవులకుఁ గరుణరసముపై మనసు పోలేదనియే చెప్పవచ్చును. ఇందులకపవాదముగా హరిశ్చంద్రోపాఖ్యాన కర్త శంకరకవియు, ఉత్తర రామాయణ కర్త కంకంటి పాపరాజును నిలుచున్నారు.

అశ్వపతి తపమునకు విఘ్నము నాపాదింప నేతెంచిన వేశ్యలద్వారా రఘునాథరాయలు తన హాస్యచతురతను వెల్లివిరియించెను. ఈతని వాల్మీకి చరిత్రమునఁ గొంతవఱకు రౌద్రభీభత్సాది రసములు పోషింపఁబడి యున్నవి. శాంతమును లేకపోలేదు.

ఈ కాలమున వెలసిన శృంగార ప్రబంధములలో నుత్తమోత్తమము చేమకూర వేంకటకవికృత విజయవిలాసము. రచనా సౌందర్యమునుబట్టియు రసపోషణ నైపుణ్యమును బట్టియు జూచిన నీ గ్రంథము కృష్ణరాయల యుగమునఁ బుట్టవలసినదిగాఁ దోఁచును. రామరాజభూషణునకుఁ బ్రయత్న సిద్ధమైన శ్లేషధ్వని యీతనికి సహజసిద్ధమైనది. కావ్యమును బ్రతిపద్య రసో దయముగాఁ జేయఁగలనను నీతని ప్రతిజ్ఞయు సర్వధా సిద్ధిపొందినది. తారా శశాంక విజయాది గ్రంథములలో ధర్మసౌందర్య లోపము గలదు. కావున నా గ్రంథములు రసికజనామోదమును బడయఁజాలవు.

నేటి కాలమున మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు, వరుల చినసీతా రామస్వామిశాస్త్రిగారు, మేదేపల్లి వేంకటరమణాచార్యులుగారు, తిరుపతి వేంకటేశ్వరకవులు, సెట్టి లక్ష్మీనరసింహముగారు, కొక్కొండ వేంకట రత్నము పంతులుగారు, వీరేశలింగముగారు, లక్ష్మీకాంత వేంకటేశ్వరకవులు, మాఢభూషి వేంకటాచార్యులుగారు, వావిలకొలను సుబ్బారావుగారు మొదలగు వారు ప్రబంధములను వ్రాసియున్నారు.

పార్వతీశ్వరశాస్త్రిగారి రాధాకృష్ణ సంవాదమున శృంగారాది రసములు యథోచితముగఁ గలవు. ఇది వేంకటగిరి రాజావారి పట్టాభిషేక వర్ణనమగు టచే నిందుఁ గవి తన సంపూర్ణప్రజ్ఞను జూపఁజాలకపోయెను. వరులవారి గ్రంథమున (వీరసింహుఁడు) శృంగారాంగకమగు వీరము చక్కఁగాఁ బోషింపఁబడి యున్నది. వేంకటరమణాచార్యులవారి దేవవ్రత చరిత్రమున వీరమంగిరసమును, శృంగారమంగరసమునని చెప్పవచ్చును. తిరుపతి వేంకట కవుల పాణిగృహీతా శ్రవణానందములు కేవల శృంగార రసాత్మకములే. లక్ష్మీ కాంత వేంకటేశ్వరకవులు శాంతమును బోషించిరి. శృంగారమంగరసముగా వీరి సౌందరనందమునఁ గలదు. సెట్టి లక్ష్మీనరసింహముగారు ప్రభాస శాప విమోచనమను పేర భీష్ముని చరిత్రమును వ్రాసినారు. ఇది వీరరస ప్రధానమగు గ్రంథము. శృంగార మంగరసముగాఁ గలదు.

# కథాకల్పనము

ఆంధ్ర వాఙ్మయమునందలి ప్రబంధములన్నియు నొక్కజాతికిఁ జెందినవి కావు. అందుఁ గొన్ని పౌరాణికములుఁ గొన్ని చారిత్రకములుఁ గొన్ని సాంఘికములుఁ గొన్ని కల్పితములునై యున్నవి. ఈ మీఁది యంశముల మనసునం దిడుకొని యొక్కొక్క తెగకుఁ జెందిన ప్రబంధములను వరుసగాఁ బరిశీలింతము.

పౌరాణికములు :

మన వాఙ్మయమునందుఁ బుట్టిన యనేక ప్రబంధములు పౌరాణికములై యున్నవి. పురాణములలోని యొక యుపాఖ్యానమును గైకొని కవి యిందుఁ బ్రపంచించి వ్రాయును. సందిగ్ధ ప్రబంధములనాటినుండియుఁ దీసికొనినచోఁ బినవీరన శృంగార శాకుంతలము పౌరాణికములలోఁ బ్రప్రథమముగాఁ గానవచ్చుచున్నది.

ఇఁక మనుచరిత్రము. ఈ గ్రంథమును బౌరాణికమే. ఇందలి యుపాఖ్యానము మార్కండేయ పురాణమునుండి గైకొనఁబడినది. అందలి కథకు నిందలి కథకు నెక్కడనో యొకటి రెండు చోటులఁదప్ప నంతగా భేదము గానరాదు. మూలములో స్వరోచికి మనోరమ కానవచ్చుటాతని వనవిహార సందర్భమునన్నై యున్నది. పెద్దన దానిని మృగయావినోద సందర్భముగా మార్చినాఁడు. రసపోషణమునకై యీ మార్పు కావింపఁబడినది. మనోరమ తండ్రి రాక్షసరూపమునఁ దన కూతుఁ దరుముకొని వచ్చుట యందలి బీభత్స రసమునకీ మృగయావినోదము మంచి యుద్దీపన విభావముగ నేర్పడినది. ప్రబంధములలో వేటవర్ణన ముండవలయునను నాలంకారిక నియమమును దీని వలనఁ బరిపాలింపఁబడినది. రెండవమార్పు కథాంతమునఁగలదు. మూలములో స్వరోచి మరణముతోఁ గథ ముగియును. స్వారోచిష మనుకృత విష్ణు స్తోత్రముతోఁ బ్రబంధకథ ముగియును. దీనివలనఁ గావ్యము మంగళాంతమైనది.

మనుచరిత్రముతో నించుమించు సమాన వయస్సు కలది పారిజాతాపహరణము. దీనికి మూలము సంస్కృత హరివంశము. అందు రెండవదియగు విష్ణుపర్వమునఁ బ్రభావతీ ప్రద్యుమ్న కథ యున్నచోటనే యీ కథయుఁ గలదు. ఇంచుమించుగాఁ బ్రబంధకథ మూలముతో సరిపోవును. అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయము సంక్షిప్త రామాయణ మనవచ్చును. పూర్వము మహేతిహాసముగనున్న రామాయణ మీతనిచేతఁ బ్రబంధమైనది.

ధూర్జటియు రామకృష్ణుఁడును క్షేత్ర మాహాత్మ్యములను వ్రాసినారు. సంస్కృతమున శివరహస్య సంగ్రహమను నొక చిన్న పురాణము గలదు. దాని యుత్తర భాగమున నూట యిరువదియవ యధ్యాయములో నీ కాళహస్తి మాహాత్మ్యము వర్ణింపఁబడియున్నది. ధూర్జటి వ్రాసిన నాలుగాశ్వాసములు నందలి యారధ్యాయముల కించుమించుగా సరిపోవును.

ఆముక్తమాల్యదయందలి కథాంశము గురుపరంపరా ప్రభావమనెడి ప్రాచీన వైష్ణవ గ్రంథమునుండి గైకొనఁబడినది. ప్రాసంగికముగా నిందుఁ బొందుపఱుపఁబడిన యామునాచార్య చరిత్రము, మాలదాసరి కథయు, ఖాండిక్య కేశిధ్వజోపాఖ్యానమును గురుపరంపరా ప్రభావ వరాహ పురాణములనుండి గైకొనఁబడినవి. ఈ గ్రంథమునకు విష్ణుచిత్తీయ మను నింకొక పేరుకలదు. గోదాదేవి విష్ణుచిత్తునకు దైవదత్తయగు పుత్రిక. ఆ యిరువురి భక్తిప్రపత్తులే గ్రంథ పూర్వాపర భాగముల నాశ్రయించి యున్నవి. యువతి కావున గోదాదేవి భక్తి శృంగార రూపమును దాల్చినది. రంగశాయిలో నామె సాయుజ్యమును బొందుట యా శృంగారమున కాధ్యాత్మికత్వమును గలిగించుచున్నది. ప్రధాన ప్రతిపాద్యమగు విష్ణుభక్తికిఁ బోషకముగా నుండుననుమాహతో, వస్త్వైక్యము చెడుచున్నను, రాయలీ ప్రాసంగికేతివృత్తముల నిందతికి యున్నాఁడు. తనకుఁ గల యుపనిషద్భాష్యాది వేదాంతశాస్త్ర జ్ఞానమును పాతంజలాది యోగశాస్త్ర జ్ఞానము నీ గ్రంథమున రాయలతి స్వతంత్రుఁడై నిరూపించెను.

సంకుసాల నృసింహకవి వ్రాసిన కవికర్ణ రసాయనముకూడఁ బౌరాణిక ప్రబంధమే. కవితాగుణ సూచకమగు పేరుపెట్టినవారిలో నీతఁడే ప్రథముఁడు. ఇందలి యితివృత్తము మాంధాత చరిత్ర. యువనాశ్వుఁడను రాజు వేటకేగి, యొక గ్రుడ్డును గాంచి పట్టుకొనఁగా నది చిదికిపోవును. ఋషిదంపతులు హంసరూపమున రతి సలుపఁగా నా యండము జనించెను. తమ ప్రేమఫలమగు నా యండము పగిలిపోగా నా ఋషి కోపించి యువనాశ్వుని గర్భమును జీల్చుకొని యొక పుత్త్రుఁడుదయింపఁ గలఁడని శపియించెను. అనంతరము పుత్త్రార్థియై యువనాశ్వుఁడు యజ్ఞముచేసి యందుఁ దనభార్యకై యుంచిన మంత్రోదకములఁ దానే త్రావెను. అంతటఁ దన్మంత్రోదక ప్రభావమున నాతఁడు గర్భము దాల్చెను. ఆతని గర్భమును భేదించుకొని మాంధాత యుదయించెను. వసిష్ఠానుగ్రహమున యువనాశ్వుఁడు పునర్జీవితుఁడాయెను. యువనాశ్వుని యనంతరము మాంధాత సింహాసన మధిరోహించి కుంతలపతి కూఁతురు విమలాంగిని వివాహమాడెను. తపముఁ గావించి విష్ణు సాక్షాత్కారమును బొందెను. ఈ గ్రంథమునఁ బూర్వ భాగమంతయు శృంగారభావ ప్రపూరితము. ఉత్తర భాగము వైరాగ్యజనకము.

రామరాజభూషణుని వసుచరిత్రకు మూలము భారతములోని యుపరిచరవసు వృత్తాంతము. మూలమునకుఁ బ్రబంధమునకు నంతగా భేదము కానరాదు. రసభంజకములని తోఁచిన యంశములను మాత్రమీతఁడు మార్చినాఁడు. మూలమున వసురాజు పుత్త్రవంతుఁడై, సమస్త భోగానుభవమువలనఁ దనిసి, తపము గావించి, యింద్రుని మెప్పించి తదనుగ్రహమునకుఁ బాత్రుఁడై యనంతరము గిరికను బెండిలియాడినట్లు కలదు. వృద్ధుఁడగు నాయకుఁడు యువతీ ప్రణయమున కనర్హుఁడు కావున శిల్పదృష్టిచే నిట సంస్కారమావశ్యకమయ్యెను. మూలమున శుక్తిమతి తనకుఁ బర్వత నిరోధముఁ దప్పించినందులకుఁ గానుకగా వసురాజునకుఁ దనకూఁతు నర్పించినట్లు కలదు. ఉపాయనముగా గ్రహింపఁబడిన కన్య శృంగార ప్రబంధమునకుఁ దగిన రసాలంబనము కాఁజాలదని కవి యన్యథా కల్పనముఁ గావించెను. ఈ మార్పులే లేనిచో నీ కథ యనౌచిత్య కళంకిత మయ్యెడిదనుట కెట్టి సందియమును లేదు.

అద్దంకి గంగాధరకవి తపతీ సంవరణము, అడిదము సూరకవి కవిజన రంజనము, కూచిమంచి తిమ్మకవి రసికజన మనోభిరామము మొదలగు గ్రంథములన్నియుఁ బౌరాణికములే. ఈమీఁది గ్రంథములకు భారతమే మూలము.

చారిత్రకములు :

ఆంధ్రమునఁ జారిత్రకములైన ప్రబంధములు చాల తక్కువగా నున్నవి. కుమారధూర్జటి వ్రాసిన కృష్ణరాయ విజయము వానిలో మొదటిది. దీనికి మూలము రాయవాచకము. రాయలు సింహాసన మెక్కినది మొదలు గజపతి పుత్త్రిక నాతఁడు వివాహమాడు వఱకు నిందు వర్ణితమై యున్నది. ఈతని కించుమించుగా సమకాలమువాఁ డందుగుల వెంకయ్య యనునాతఁడు రామరాజీయమను గ్రంథమును వ్రాసినాఁడు. ఇందళియ రామరాజు చరిత్రము వర్ణితమై యున్నది. రఘునాథాభ్యుదయమను ద్విపదప్రబంధములో రఘునాథ రాయల దిగ్విజయములు వర్ణింపఁబడి యున్నవి. దిట్టకవి నారాయణకవి బొబ్బిలి కథను రంగరాయచరిత్ర మను పేర నొకప్రబంధముగా వ్రాసియున్నాఁడు. గతశతాబ్దియందు, వీరభద్రకవి యనునాతఁడు పలనాటి వీరచరితమును బ్రబంధముగా వ్రాసినాఁడు.

సాంఘికములు :

కందుకూరి రుద్రయ వ్రాసిన నిరంకుశోపాఖ్యానము సాంఘికములలోఁ బ్రథమము. పురాణ క్షేత్రమాహాత్మ్యములయందుఁ గృత్రిమత్వము కలదని రుద్రయయూహించి, అద్దానిని నవరింప నీగ్రంథము వ్రాసినాఁడు. కామ

పురుషార్థమునే యిష్టదైవతముగా నారాధించిన నిరంకుశుఁడనువాఁడు దేవతానుగ్రహపాత్రుఁడగుట యిందలి యితివృత్తము. తిరుపతి వేంకటకవుల శ్రవణానందాదులును సాంఘికములే యనవచ్చును.

కల్పితములు :

కళాపూర్ణోదయము కల్పితప్రబంధ మనవచ్చును. ఇందుఁగూడఁ దుంబురు నారద సంవాదకథ లింగపురాణమునఁ గలదఁట. అత్యల్పమగు నీకథాభాగమును వీడినచోఁ దక్కిన గ్రంథమంతయుఁ బింగళిసూరన స్వకపోలకల్పనమే యనవచ్చును. బాణుని కాదంబరి కథయు నీకథాకల్పనకుఁ దీసికట్టని చెప్పుటలో నతిశయోక్తి కానరాదు. ఈకథ కల్పితము కావున క్లుప్తముగా నిందుదాహరించుట యప్రస్తుతము కాఁజాలదు.

పూర్వమొకప్పు డంబుజాసనుఁడు వాగ్దేవీసహితుఁడై భవనారామమున కేగెను. అందయ్యాదిమ దంపతులు శృంగార వినోదములఁ బ్రొద్దుపుచ్చుచుండఁగా వారిరువురకుఁ బ్రణయ కలహము సంభవించెను. జలజభవుఁడును దద్విరహదశావికలిత ధైర్యుఁడై పురోవర్తిశాఖా సమాసంజిత రత్నపంజరమున నున్న చిలుకంజూచి యుబుసుపోక కొక్కకథ చెప్పుమనఁగా నాచిలుక చెలువ "ఓ దేవ ! దేవరముందఱ నెట్టికథయు నేనుజెప్ప భాజనంబనే. మీరు చెప్పెదరేని వినియెద" ననియెను. అంతట నాతఁడిట్లు చెప్పఁదొడగెను—

కాసారసంజ్ఞ నొక్క పట్టణము కలదు. దానినేలు రాజు కళాపూర్ణుఁడు. ఆతఁడు సద్యోయౌవనుఁడై సరిరాజులనెల్ల జయించెను. ఆతనికి స్వభావుఁడను నొక సిద్ధుఁడు నూతనమగు నొక్క మణియును, విల్లు నమ్ములు నొసంగెను. ఆమణి శలాక యరుణకాంతు లీనునది. ఆ మెఱుంగుఁదూపు లక్షయములు. ఆశరాసన మతనువిజయగౌరవ సంప్రాప్తికారణము. ఆ కళాపూర్ణుఁడు మదాశయుఁడను రాజునోడించి, యాతని భార్య రూపానుభూతియు నాతఁడును దనకూడిగము చేయునట్లు కావించెను. అనంతర మాతఁడభినవకౌముది యను నామెను వివాహమాడెను.

చతుర్ముఖుఁ డింతవఱకుఁ జెప్పఁగనే వాణి యాతని తలిదండ్రు లెవరో కనుగొనుమని చిలుకతోఁ జెప్పెను. అంతట నజుఁడు సుముఖాసత్తి యాతని తండ్రియనియు, మణిస్తంభుఁడాతని తల్లియనియుఁ జెప్పి తక్కిన కథనిట్లు పూర్తిచేసెను—

సత్వదాత్ముఁడను నాతని సచివుఁ డంగదేశమునఁ గ్రముకకంఠోత్తరమను బట్టణము గట్టి యందాతని నభిషిక్తుఁ గావించెను. మదాశయుఁ

దాపురికిఁ బసిఁడికోట కట్టించెను. అమ్మదాశయునకు రూపానుభూతియందు మధురలాలస జనించెను. అంతట నమ్మదాశయుని పురోహితులు ప్రథమాగమ ద్వితీయాగమ తృతీయాగమ తురీయాగములను వారు కళాపూర్ణునిం జేరి యాతఁడు దాల్చు మణిని బర్యాయమునఁ దారుపట్టి తత్సంస్పర్శ మహిమచే నానందమగ్నులగుచుండిరి. అంతట వారిలో నొక్కఁడు తన్మణిని గరంబు నొక్కుటయు నద్దానికిఁ గళాపూర్ణుఁడు కోపించి వారిని బాయంద్రోలి తదపరాధం బునంజేసి తత్స్వామియైన మదాశయుని కనక ప్రాకారంబు నొల్లక విఘటితంబు గావించెను. అమ్మదాశయుండును నద్దానికి విచారింపక యతని దేశంబుసందే యెందైన బ్రదుక నిచ్చగించినవాఁడై క్రముకకంఠోత్తర పురంబును వీడి సకుటుంబముగాఁ బోవుచుండెను. ఆతని పుత్రి మధురలాలస ప్రయాణ క్షోభమునఁ గృశత్వము నందెను. అంత నాతఁడు మగుడఁ గ్రముకకంఠోత్తర పురంబున కేగఁగా నాతని పుత్రి ప్రసన్నత నందెను. ప్రథమాగమాదులు నటకే యేతెంచిరి. కళాపూర్ణుఁడును మధురలాలసను వివాహమాడి సుఖం బుండెను.

వాగ్దేవత చతుర్ముఖుని యీకథ నంతయు నాలకించి, యయ్యది కొలనిలోఁ బ్రతిబింబించిన తన రూపవిలాసములఁ గూర్చి చెప్పఁబడినదేయని వ్యాఖ్యఁ గావించినది. ఆ వ్యాఖ్యానమంతయు గ్రంథమంచే కలదు. బ్రహ్మయు నావ్యాఖ్య సత్యేతరము గాదని యంగీకరించినాఁడు. అనంతరము వాగ్దేవతా చతుర్ముఖులు నగరిలోని కేగిరి.

అనంతర మొకనాఁడు రంభతోఁ నింద్రుఁ డంభోజసంభవు సేవింప నేతెంచెను. అచ్చట మణిపంజరంబుననున్న చిలుక, వాగ్దేవి మున్ను గావించిన మణితవిశేష మాత్మకు నింపుగ నావర్తించుచుండెను. రంభయు నయ్యది యాలించి 'అయ్యవారి సంసేవ వేళ నమ్మవా రుగ్గడించినారా యిది' అని చిలుక నడుగుటయు నాచిలుక తత్స్వరోదయంబైన తెలుంగు నంతయుఁ జెప్పఁ దొడఁగెను. అత్తఱి నంభోజభవుని రాణి యయ్యది యాలించి, చిలుక చేసిన పనికిఁ గోపించి, దానిని భూమియందు వెలయాలి పంగడమునఁ బుట్టుమని శపించెను. నలువ యయ్యది విని చిలుకను గరుణించి మొదట వాణి యొసంగిన శాపంబనుభవించి మరుజన్మంబున మదాశయునకు మధురలాలస యను పేరఁ బుత్రికపై జనించి, కళాపూర్ణునకు భార్యవై, నిఖిలభోగంబు లనుభవించి కృతార్థవయ్యెదవనియు నిక్కథ యవశ్యము భూమిలోఁ బ్రకాశితమగు ననియు, నద్దానిం జెప్పిన వారును వినిన వారును ధాత్రియందుఁ బుత్త్రపౌత్త్ర ప్రపౌత్త్రాది బహుసంతతిం దనర్చుచుఁ జిరకాలము ప్రచుర సంపదభివృద్ధిశోభిత శుభసౌఖ్యంబులు గాంతురనియును నాశీర్వదించెను.

అనంతరమా చిలుకపడఁతి ద్వారవతియందు వేశ్యాకులమునఁ గలభాషిణి యనుపేర జన్మించెను.

ఒకనాఁడు కలభాషిణి తన చెలికత్తియలతో నుద్యానవనమునఁ దూగు టుయ్యేల లూగుచుండఁగా, శ్రీకృష్ణ సంసేవార్థులై యాకాశ మార్గమున నేగుచున్న నారద మణికంధరులు వారలను గాంచి, వారల రూపసౌందర్యము లచ్చర మించుబోఁడుల రూప సౌందర్యములఁ దలఁదన్నుచున్నవని ప్రశంసించిరి. అవ్వాక్యములను విమానారూఢులై యేగు రంభా నలకూబరు లాలించిరి. రంభ యవ్వాక్యములకుఁ గనలి కలహభోజను చెంతకేగి యాతనితో వాదించి, యాతని కోపమునకుఁ బాత్రయయ్యెను. రంభా గర్వభంగము గావింప నారదుఁ డూహించి, కలభాషిణి నామెకుఁ బ్రతిగా నిలుపనెంచి కలభాషిణిని శిష్యురాలిగా నంగీకరించెను. కలభాషిణియు నలకూబరుని గాంచినదాది యాతనియందు మనసు కలిగి యుండెను.

శ్రీకృష్ణుని యంతిపురమున నారదుఁడు, తుంబురుని జయింప సంగీత విద్య నభ్యసించెను. అభ్యసనానంతరము నారదుఁడు స్వర్లోకమున కేగుచు, తన గానమునుగూర్చి శ్రీకృష్ణుని యంతిపురంబున నేమనుకొనుచున్నారో యెఱుంగఁ గలభాషిణిని నియమించి వారి పరిచారికా రూపంబున నేగుటకై యామెకుఁ గామరూపగ్రహణ సామర్థ్యము నొసంగెను. ఆమెయు నట్లే కావించి సంగీతమున నాతని కీడులేరని యంతఃపురాంగనలాడు మాటల నెఱింగించి, యాతని యనుజ్ఞ వడసి తన యింటి కేగెను.

అనంతరము కలభాషిణి యొకనాఁడు తన యుద్యానవనమున వీణ వాయించుకొనుచుండఁగా మణిస్తంభుఁడను నొక సిద్ధుఁడు సింహవాహనుఁడై గగన మార్గమున నేతెంచి, ఆమె యొద్ద నాగెను. ఆమె యాతని మాయలకు లోనై యాతనితోఁగూడ మృగేంద్ర వాహనాలయమున కేగెను. అందున్న సుముఖాసత్తి యను నొక వృద్ధురాలి వలనఁ దన్నాతఁడు దుర్గకు బలిగా నొసంగఁ దెచ్చినాఁడని యెఱింగి కలభాషిణి మిగుల వగలఁ బొందెను. సిద్ధుఁ డామెను జంపఁబోఁగా సుముఖాసత్తి యామెయెడ దయదలంచి తన కంఠము నామె కంఠమున కడ్డుగా నిడెను. మణిస్తంభుఁడు కోపావేశమున నా వృద్ధనే తన కత్తి కెఱ సేయుటయు నా దుర్గా ప్రభావమున నామె సద్యోయౌవనమును గాంచెను. సిద్ధుఁ డంతటఁ గలభాషిణినిగూడ నరుకఁబోఁగా మృగేంద్రవాహన కోపించి యాతనిఁ గలభాషిణీ సహితముగ నతిదూరమునం బాఱవైచెను. వారొక తలిరుఁబాన్పుపైఁ బడిరి. పడుటయే తడవుగ సిద్ధుఁడు మన్మథాతురతఁ గలభాషిణిని పరిరంభణముఁ గావింపఁ బోయెను. అనన్య శరణ్యయై యామె

యెలుఁగెత్తి యఱచెను. ఆ యాక్రందనము నాలించి నలకూబరుఁ డాత్రోవ నేతెంచెను. సిద్ధుఁడు భయమంది పాఱిపోయెను.

కలభాషిణియు నింతవఱకు నలకూబరుని గామించి యున్నది కావున నారద వరప్రభావమున రంభా రూపమునొంది యా రంభామనోహరాకారునితో నొక నికుంజమున కేగెను. ఇంతలో సత్యరంభ వారున్న తావునకు వచ్చెను. మాయరంభకును సత్యరంభకును వాగ్యుద్ధమాయెను. ఆకాశగమనశక్తి లేమిని మాయారంభను నలకూబరుఁడెఱింగి యామెను వీడెను. అంత రంభ కలభాషిణిని కత్తి కెఱ కమ్మని శపించెను. అనంతరము మఱియొక నలకూబరుఁడచట కరుదెంచెను. మొదటి నలకూబరునకు రెండవ నలకూబరునకు బాహాబాహి యుద్ధ మాయెను. అందిరివురును సమాన బలులగుటఁ గాంచి, రంభ వారిని యుద్ధము మానుఁడని వారిని వేర్వేర నిలువ నియమించి రహస్యముగఁ గళాపూర్ణుని సుద్ది మన కెచ్చట వచ్చెనని యడుగఁగా నందు మొదటివాఁ డూరక తెల్లఁబోయెను. రెండవవాఁడు యాథార్థ్యమును వచించెను. అంతట నలకూబరుఁడు మాయానలకూబరుని (మణికంధరుని) శీఘ్రకాలముననే మృత్యువు వాతఁ బడుమని శపించెను.

తరువాత మణికంధరుఁడును మృగేంద్ర వాహనాలయమున కేగి యట నున్న కలభాషిణిని గాంచి యాశ్చర్యమందెను. ఇంతలో మణిస్తంభుఁడచట కేతెంచి యా వింత వృత్తాంత మంతయు వారి కెఱింగించెను. కలభాషిణీ మణికంధరు లొండొరుల ప్రేమ తెలిసికొని మహానందము నందిరి. కాని యా ప్రేమయు నీ జన్మమున సఫలమగుటకు వీలులేకుండ నిరుపురును దుర్వార శాపోపహతులై యుండిరి. కలభాషిణి తన్ను సంహరింపుమని మణిస్తంభుని కోరఁగా నాతఁడాపని కియ్య కొనఁడాయెను. అంతఁ గలభాషిణి కోర్కెపై మణికంధరుఁడే యామెను సంహరింపవలసిన వాఁడాయెను. అంతట మృగేంద్ర వాహన మణికంధరునితో "నీవు బలినిచ్చుటలో నాలసించితివి కావున నీ జన్మమునఁ గాక మరు జన్మమునఁ జక్రవర్తి వగుదు" వని వచించి, కలభాషిణిని పునర్జీవితయై ద్వారవతిలోఁ వదీయోద్యానవనము నందుండున ట్లనుగ్రహించెను. మణికంధరుఁడును జీవితమును రోసి భృగుపతనముఁ గావింప శ్రీశైలమున కేగెను.

మణికంధరుని తీర్థయాత్రా వర్ణనమువలన సుముఖాసత్తియు (వృద్ధురాలు) మణిస్తంభుఁడును భార్యా భర్తలమని తెలిసికొనిరి. వారి పూర్వనామములు సుగాత్రీ శాలీనులని మణికంధరాదులు కూడఁ దెలిసికొనిరి. అంతట సుముఖాసత్తియు మణిస్తంభుఁడు నందేయుండి కొంతకాలము తరువాత వివిధ దేశాట నేచ్ఛ జనింపఁ జనిరి.

మణికంధరుఁడు శ్రీశైలము చేరఁగనే, యచ్చట నొక యంగన యభినవ కౌముదీనామధేయ యాతని శరణుఁజొచ్చి, తన్ను వెన్నాఁడు రాక్షసుని సంహరింప నొక ఖడ్గ మాతని కిచ్చెను. మణికంధరుఁ డారాక్షసు సంహరించి, ఆ రాక్షసుని వరప్రభావమునఁ దానును మరణించెను.

మరుజన్మమున మణికంధరుఁడు సుముఖాసత్తికిని మణిస్తంభునకును గళాపూర్ణుఁడను పేరఁ బుట్టి, సద్యోయౌవనమును గాంచి, సత్వదాత్ముఁడను రాజుచే నేఁబడిన కాసారపురమను రాజ్యము నేలుచుండఁగా స్వభావుఁడను సిద్ధుఁడచటి కేతెంచి, యొక మణిశలాకయు, విల్లునమ్ములు నాతని కొసంగెను. కళాపూర్ణునితో యుద్ధముచేసి యోడిన మదాశయుఁడను హైహయరాజు, తన భార్యయగు రూపానుభూతితోడను, మంత్రియగు ధీరభావునితోడను కళాపూర్ణుని కొలువుననే యుండిపోయెను. అప్పుడే కలభాషిణి మధురలాలస యనుపేర మదాశయునకుఁ బుత్రికయై జన్మించి, కళాపూర్ణుని వివాహమాడి సర్వసౌఖ్యముల ననుభవించెను. కళాపూర్ణునకు మధురలాలసయందు సారసుఁడను వాఁడును నభినవకౌముదియందు సుప్రసాదుఁడను వాఁడును జన్మించిరి.—

ఇది మూలకథ. దీనితో సుగాత్రీ శాలీనుల కథ, అలఘువ్రతుని కథ మొదలగు నెన్నియో కథలను జోడించి, యిమ్మహాగ్రంథమును గవి వ్రాసి యున్నాఁడు.

సామాన్య కవియే యైనచో నీ కథను మీఁద వివరించిన రీతినే వ్రాసి యుండెడివాఁడు. సూరన యప్రతిమ ప్రతిభాశాలి. కావుననే ముందటి వాణీ చతుర్ముఖుల శృంగార కేళీ ఘట్టము పంచమాశ్వాసమునకు మార్పఁబడినది. కలభాషిణి చరిత్రముతోఁ గథ ప్రారంభింపఁ బడినది. ప్రారంభముఁ బట్టియే సూరనకుఁ దక్కిన ప్రబంధకర్తలకుఁ గల భేదము తేటతెల్లము కాఁగలదు. ఒక్కమారె యైదుపాత్రలు రంగము మీదికి వచ్చినవి. రంగము కలభాషిణి విహరించు నుద్యానవనము, సమయము ప్రభాతము. క్రిందఁ గలభాషిణి చెలులతో నూయెల నూగుచుండెను. మీఁద గగనమార్గమున నారద మణికంధరులు, శ్రీకృష్ణదర్శనార్థము వచ్చుచుండిరి. ఒకవంక రంభానలకూబరులు విమానముపై నేగుచుండిరి. నారద మణికంధరులను, రంభా నలకూబరులనుండి వేఱు చేయుచు నొక మేఘశకలము తెరవోలె నుండెను. ఇట్టి మనోహర దృశ్యమును గల్పించిన కవిప్రతిభ నమస్కారార్హము కదా!

# ప్రబంధశైలి

ఆంధ్ర వాఙ్మయమునఁ బ్రప్రథమ గ్రంథమగు భారతము పుట్టిననాటి నుండియు శైలి విషయమున రెండు మార్గములు చూపట్టుచున్నవి. వానిఁ గ్రమముగాఁ జాళుక్య శైలియనియుఁ గాకతీయ శైలియనియుఁ బేర్కొన నగును. ఇందు మొదటిదానికి నన్నయయు, రెండవదానికిఁ దిక్కనయు నాచార్యులు. ప్రథమ మార్గానుయాయులకుఁ బ్రౌఢసమాస గుంఫితమగు రచనయందును, ద్వితీయ మార్గానుయాయులకుఁ దేటతెనుంగు మాటల కూర్పునందును బ్రీతి మెండు. మొదటివారికి శయ్యాసౌభాగ్యమే పరమ లక్ష్యము. అది చేకూరిననాఁడు భావగాంభీర్య మించుక తగ్గినను వారు పాటింపరు. రెండవ వారికిఁ బదములకూర్పు సడలినను భావగాంభీర్యమున్నఁ జాలును. ఈ రెండు శైలులకు నుదాహరణములు :

బహువన పాదపాబ్ధికుల పర్వత పూర్ణ సరస్సరస్వతీ
సహిత మహామహీభరమజస్ర సహస్ర ఫణాళిఁ దాల్చి దు
స్సహతర మూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్.

సుగుణవు పుట్టినింటికిని జొచ్చిన యింటికిఁ దేజమెక్కఁగాఁ
దగు చరితంబు నన్నడచు ధన్యవు ధీరవు దేవి నీపెడన్
వగలడగింపకున్న భువనంబుల నింకిట నెవ్వరోర్చు వా
రు గలక దక్కుమీ హృదయ రోగములన్నియుఁ బుచ్చివైచెదన్.

శయ్యాసౌభాగ్యమునకై పాటుపడిన యాంధ్ర కవులలోఁ బ్రబంధకవులు ముఖ్యులు. ఈ విషయమున వారికి సర్వజ్ఞుఁడగు నాచన సోమనాథుఁడును, గవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడును మార్గదర్శకులు. నన్నయ నాటిన ప్రబంధ శయ్యాబీజము నాచన సోమునినాఁడు ననలెత్తి, శ్రీనాథుని నాఁడు కొనలు సాగి, ప్రబంధయుగమునఁ బుష్పఫల సమన్వితమైనది. శయ్యావిషయమున సోముఁడనేక మార్గములఁ ద్రొక్కియున్నాఁడు. చిత్రకవిత్వమును వెలయించిన యాంధ్ర కవులలో నీతఁడే ప్రథముఁ డనవచ్చును. ఈతఁ డచ్చటచ్చట రచించిన యచ్చతెనుఁగు పద్యములే తరువాతి యయాతి చరిత్రాది ప్రబంధములకు మార్గసూచకములై యుండవచ్చును. ఈతని యనుప్రాసాభిరతియుఁ బ్రబంధ కవుల లోఁగొన్నది. ప్రబంధ కవులలోఁ దఱచుగాఁ గాననగు దీర్ఘసమాస గుంఫిత రచనా విశేషమునకు సర్వజ్ఞ కవిసార్వభౌము లిరువురును మార్గదర్శకులే యనవచ్చును. సోముని రచనావిశేషమున కుదాహరణములు :

అచ్చ తెనుఁగు :

తొలుకారు మెఱుఁగుల తోటలో నాడెడు
రాయంచ కొదమతో రాయఁ జాలి
యిరుల బండారంపు టింటికిఁ బెట్టిన
బొందు మల్లెలకోటఁ బోరగెలిచి
బలుమంచుఁ గంబాల బలసిరాఁ జుట్టిన
క్రొత్తమంజిడి బాగుఁ గొఱతఁ జేసి
పాల పెన్నురువు గుబ్బలిమీఁద నెలకొన్న
నిండు వెన్నెల మ్రుగ్గు నిగ్గుఁ జెఱిచి
జడలఁ గ్రొన్నెల మెడఁ జాఁప సరిగె వొడలఁ
బొడల తోల్మేన వెలిమిడి పూతమించఁ
బొడమి వ్రేతేని ముందటఁ బొదపు సూపెఁ
బొడవు లందెల్లఁ బొడవైన బోటువేల్పు.

అంత్యానుప్రాసము :

భయరసమగ్నులం బ్రధనభగ్నుల దుర్భరదైన్య భుగ్నులన్
నయన విలగ్నులన్నిపసనాయిత నిర్వృత నగ్నులన్ బరా
జయ పరివిగ్నులం బ్రణతి సారవలగ్నుల నగ్నులన్....

ఇట్టి పద్యము లచ్చటచ్చట యెత్తిన కవితయందును గానసగును.

దీర్ఘసమాసములు :

గాండీవారావఝుంపాఘటిత భయ దివౌకః పురాంతః పురంధ్రీ
గండాభోగ శ్రమాంభఃకణ కలుషిత గంగాతరంగాభిషంగా
ఖండాస్మత్కాండపాళీకబళిత సకలాకాశసీమానిశాంతో
ద్దండాతిక్రాంత గీర్వాంతకయమభట సంతానముం గానవైతిన్.

ఇఁకఁ బ్రబంధకవులు సర్వవిధముల శ్రీనాథుననుకరించిరి. తన కవితా ప్రాగల్భ్యమెట్టిదో శ్రీనాథుఁడీ క్రింది పద్యమునఁ బొందుపఱచి యున్నాఁడు :

వచియింతు వేములవాడ భీమన భంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తు తిక్కయజ్వ ప్రకారము రసా
భ్యుచిత బంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని తేవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు ...

ఇట్టి ప్రశంసకు శ్రీనాథుఁడు పాత్రుఁడనుటలో సందియము లేదు. శయ్యా సౌభాగ్యమనిన శ్రీనాథున కాసక్తి మెండనుట కనేకోదాహరణములఁ జూప వచ్చును. గ్రంథవిస్తరభీతిచే నొకటిరెండు మాత్రమిటఁ బొందుపఱచుచున్నాను :

గగనకల్లోలినీకల్లోల మాలికా
హల్లీసకములతో నవఘళించి
చరమ సంధ్యాకాల సంఫుల్ల మల్లికా
స్తబక పంక్తులతోడ సరసమాడి
శరదాగ మారంభ సంపూర్ణ పూర్ణిమా
విమల చంద్రికలతో వియ్యమంది
బిసరుహాసన వధూ పృథుపయోధరభార
హారవల్లరులతో నన(గి పెన(గి....

చిఱుసానఁ బట్టించి చికిలి సేయించిన
గండ్రగొడ్డలి నిశాగహనలతకుఁ
గార్కొన్న నిబిడాంధకార ధారాచ్ఛటా
సత్రవాటికి వీతిహోత్ర జిహ్వ
నక్షత్రకుముద కాననము గిల్లెడు బోటి
ప్రాచి యెత్తిన హస్తపల్లవాగ్ర
మరసి మింటికి మంటికైక్య సందేహంబుఁ
బరిహరింపంగఁ బాల్పడ్డ యవధి....

దీర్ఘ సమాస గుంఫితమగు రచనయందేకాక, యందముగ సంస్కృతాంధ్రముల మేళగించి పొందుపఱుచుటయందును గవి సార్వభౌముఁ డితరకవులకుఁ దీసి పోవువాఁడు కాఁడు.

హాలహలంబను నల్లనేరేడి పండు
మిసిమింతుఁడును గాక మ్రింగినాఁడు
పెనువ్రేలి కొనగోర బిసరుహాసను మోము
కెందమ్మి విరివోలె గిల్లినాఁడు....

శ్రీనాథుని పద్యము లన్నియు హృద్యములే యయ్యు నాతని సీసములు మాత్ర మనుపమానమని చెప్పక తప్పదు. సమపాద విన్యాసమునఁ బొలుపారుచు నీతని సీసములు మత్తమాతంగ గమనమును దలపించును. ఈతని సీసపద్య రచనానైపుణ్యము తరువాతి ప్రబంధకవుల ననేకుల నాకర్షించినది. అందు నల్లసాని పెద్దనాదు లీతని పద్యపాదములనే యథాతథముగా వాడుకొన్నారు.

శ్రీనాథుని శైలికి మెఱుఁగు పెట్టినాఁడు పెద్దన. "అల్లసానివాని యల్లిక జిగిబిగి" యను మాట యీతనియెడ సర్వథా సార్థకము. శ్రీనాథుని వలెనే

పెద్దనయుఁ బ్రౌఢసమాస ప్రియుఁడు. అట్లయ్యు నచ్చటచ్చటఁ బ్రసాద గుణమును గూడఁ బోషించి యున్నాఁడు.

ఉల్లమునందు నక్కటికమూనుట మీకులమందుఁగంటి మం
చల్లన మేలమాడు నచలాత్మజ మాటకు లేఁతనవ్వు సం
ధిల్లఁ గిరీటిఁ బాశుపతి దివ్యశరాఢ్యునిఁ జేయు శాంబరీ
భిల్లుఁడు కృష్ణరాయల కభీష్ట శుభప్రతిపాది గావుతన్.

తావుల్ క్రేవలఁ జల్లు చెంగలువ కేదారంబు తీరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొను కాంతారంబునం దైందవ
గ్రావా కల్పిత కాయమాన జటిలద్రాక్షాగుళుచ్ఛంబులం
బూవుం దీవెల నొప్పు నొక్కభవనంబున్ గారుడోత్కీర్ణమున్.

ప్రౌఢసమాసరచన కుదాహరణము లనేకములు చూపవచ్చును. మచ్చున కొకటి :

అంటఁజనికాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుట నటనానురూప పరిపుల్ల కలాప కలాపిజాలముం
గటక చరత్కరేణు కరకంపితసాలము శీతశైలమున్.

పెద్దనకు శ్లేషయందాదరము తక్కువ. ప్రబంధకవులకు సంవాదాత్మకమైన శైలిని జూపినవాఁడు పెద్దనయే.

ప్రబంధశైలి రామరాజభూషణుని కవితయందుఁ బరమావధి గాంచినది. వ్యర్థపదములు లేక కూర్పు బిగికల్గి కమ్మచ్చుఁ దీసినట్లీతని పద్యము లలరారుచుండును. మఱియు నీతఁడు సంగీతకళారహస్యనిధి యగుటచే బ్రతిపద్యమును స్వరకల్పన కనువుగా నుండునట్లు రచించినాఁడు. ఈతని పద్యములే కాక గద్యములు కూడ సంగీతానుగుణముగ వ్రాయఁబడి యున్నవి. ఈనాఁడుకూడ నాగద్యపద్యములకు స్వరకల్పనచేసి పాడువారు గలరు. ఈక్రింది పద్యములఁ బరిశీలించునది :

అడుగు వెట్టదు నవ్యహరిచందన లతాంత
సరణిపైఁ గాని యీయరుణ చరణ
కేలనంటదు కోరకిత పారిజాత వ
ల్లరిఁ గాని యీయతి లలితబాహ
తనువుఁ జేర్పదు నవోదార మందార మం
జుల శయ్యఁగాని యీ సురభిశాంగి
పెదవిఁ జేర్పదు కల్ప పృథివీజ ఫలసంత
తియెకాని యీ మోవితీపులాడి....

మందయానము నేర్పు నిందిందిరాజీవ
రాజీవ రాజన్మరాళరాజి
కలికి పల్కులు నేర్పు లలిత నానావాస
నావాస నికట కానన శుకాళి
గానంబు పాటలు నేర్పుఁ గుముద రసామోద
సామోద మధుప శుద్ధాంత సమితి
నటన లీలలు నేర్పుఁ దటరూఢ కల్పాగ
కల్పాగచర నీలకంఠవితతి....

వచనమునకుదాహరణము :

మఱియు నక్కులాచల సంతానంబు సంతాన కుసుమ వాసనాసమాగత సారంగ సంగీతభృంగీ తరంగంబు లుపాంగంబులుగాఁ బాదు వేల్పు గాణీల పాణీరిత మాణిక్య వీణామధుర క్వాణామృతంబులఁ గరఁగి జరుగు కురువింద కందళంబుల జలంబులఁ బదనైన గైరికతలంబులం బొడమిన కారణగుణంబునఁ బగడంబు డంబు విడంబించు నిగనిగని తొగరు నిగుడనెగడు....

వచన రచన యందుఁ బ్రబంధకవులందఱును శబ్దాలంకార ప్రౌఢిమఁ జూపియే యున్నారు. శబ్దాలంకార రచనాకౌశలము రామరాజభూషణునకు సహజసిద్ధ మగుటచే నట్టి పద్యములందుఁగూడ మచ్చునకేని వ్యర్థపదముగాని, భావలోపము గాని కానరాకుండ రచించినాఁడు. ఈక్రింది పద్యమెంత మనోజ్ఞముగ నున్నదో చూడుఁడు :

ఒకచాయ ననపాయ పికగేయ సముదాయ
మొకసీమ నానామయూరనినద
మొకవంక నకలంక మకరాంక హయ హేష
లొకక్రేవ వనదేవ యువతిగీత
మొకచెంత సురకాంతల కరాంత తతనాద
మొకదారి నవశారికోదితంబు
లొకయోరఁ బటు చారణ కుమార ఫణితంబు
లొకదండ నలిమండలి కలగాన
మొక్కమొగి మ్రోయఁ గదళీగృహోపపన్న
కిన్నరీబృంద బృందసంగీత రీతి
నమరు నతివేల కోలాహలముల కలిమి
నధిప యీయద్రి కోలాహలాఖ్య మొక్కొ.

ఇట్టి యనుప్రాసాద్యంత్య నియమములు గల పద్యములు వసుచరిత్రమునఁ బెక్కులు కలవు. అందుఁ గవితాగాంభీర్యమున కెట్టిలోపమును గానరాదు—కాని యీతని ననుకరించిన కవులీ శబ్దాలంకారవ్యామోహమునఁ బడి యీతనికిఁ గల భావగాంభీర్యమును జూడరైరి.

ప్రబంధకవులందఱును శయ్యావిషయమునఁ గడు నిపుణులే యనవచ్చును. ద్వ్యర్థికావ్యముల యందును శైలి మనోహరముగనే యుండును. గ్రంథవిస్తరభీతిచే నవియన్నియు నిట నుదాహరింపక విడిచితిని.

# ప్రబంధ కవులు - చారిత్రక విషయములు

విజయనగరాధీశ్వరుఁడును, సాహితీ సమరాంగణ సార్వభౌమ బిరుదాంచితుఁడును అగు శ్రీకృష్ణదేవరాయలే ఆంధ్ర వాఙ్మయమునందలి ప్రబంధ యుగమునకు యుగకర్త. కావుననే దీనిని రాయల యుగమనియు నందురు. కవియుఁ, గవిపండిత పోషకుఁడు నగు నీ రాజకంఠీరవుని యుగకర్తగ నెంచుటలో నసంభావ్యమగు విషయమెద్దియును లేదు. రాయల యుగమునకుఁ బూర్వము ప్రబంధములు లేకపోలేదు. కాని వానికిని, రాయల యుగ ప్రబంధములకును గొంత భేదము కలదు. రాయల యుగ ప్రబంధములందు కథనిమిత్తమాత్రముగ నుండును. వర్ణనాది స్వకపోల కల్పనలకుఁ బ్రాధాన్యము మెండు. ముఖ్యముగా నానాటి ప్రబంధము లాంధ్రీకరణములుగావు. వానియందర్థాతిశాయియగు శబ్దవైచిత్రి సర్వసాధారణముగా గోచరించును. ప్రబంధేతిహాస రచనాసాంకర్యము వానియందు గన్పట్టదు. రాయల యుగమునకుఁ బూర్వము పుట్టిన ప్రబంధములు కొన్ని కేవల మాంధ్రీకరణములు. కొన్నిఁటియందు ప్రబంధ ధోరణియు, నితిహాస ధోరణియుఁ గానవచ్చును. కొన్ని యందదుకులుగ వివిధ చిత్రకథా సంపుటీకరణములవలె నుండును. ఆ గ్రంథములఁ గూర్చి దత్కర్తలఁ గూర్చియు ముందటి ప్రకరణమున వివరించియున్నాఁడను. ప్రస్తుతము రాయల యుగ మందలి ప్రబంధ కర్తలనుగూర్చి విచారింతము.

ప్రప్రథమమున యుగకర్తయగు రాయలకు సంబంధించిన చారిత్రకాంశములను బరిశీలింతము. ఇమ్మహనీయుఁడు కృతిభర్తయేగాక, కృతికర్తయునై యున్నాఁడు. విష్ణుచిత్తీయ మను నామాంతరముగల ఆముక్తమాల్యద యను మహాప్రబంధము నీతఁడు రచించెను. నంది తిమ్మన రచించిన పారిజాతాపహరణ ప్రబంధమునకును, అల్లసాని పెద్దన రచించిన స్వారోచిష మనుసంభవ ప్రబంధమునకును ఈతఁడు కృతిభర్తయై యున్నాఁడు. ఈ మూఁడు గ్రంథములందును ఈ రాజకవికి సంబంధించిన విశేషాంశము లనేకములున్నవి. మఱియు నీతని జీవిత చరిత్రకు సంబంధించి శాసనాధారములు పెక్కులు గలవు. అందు కొన్ని యీతఁడే స్వయముగ వేసినవి. కొన్ని యీతని దుర్గాధిపతులు వ్రాయించినవి. వీని నన్నిఁటి నాధారముగాఁ గొని యీతని జీవిత చరిత్రమును బరిశీలించుట సముచితము.

ఆముక్తమాల్యదయందును, మనుచరిత్ర పారిజాతాపహరణములందును, పెక్కు శిలాశాసనములందును, రాయల వంశవర్ణనము చేయఁబడి యున్నది. ఈతని వంశమునకు తుళువ వంశమని పేరు. వీరి వంశమునకు మూలపురుషుఁడగు తిమ్మయ నాయకుఁడు తుళువరాజ్యమును బరిపాలించుటచే వీరి వంశమునకు

తుళువ వంశమునుపేరు వచ్చినట్లు నంది మల్లయ ఘంట సింగయ కవులు రచించిన వరాహ పురాణావతారికనుబట్టి యూహింపనగును. ఈ వరాహ పురాణము శ్రీకృష్ణదేవరాయల తండ్రియగు నరసనాయకున కంకితము చేయఁ బడినది. ఆ గ్రంథమున కృతిభర్తృ వంశావతారమును వర్ణింపుచు నా జంట కవు లిట్లు వచించిరి :

మిన్నులమోచి భాగ్యముల మీఱిన కోటల రమ్యహర్మ్య సం
పన్నత సస్యవాట గరిమంబులఁ దోఁటల వాహ వారణా
భ్యున్నతిఁ గేలిదీర్ఘికల నుగ్రభటావలి వన్నెకెక్కు వా
రాన్నిధి కాంచిపైఁ దుళువరాజ్యము సంతత వీరభోజ్యమై.

ఆ తుళువరాజ్యమున వి
ఖ్యాతి వహించిరి దిగంత కరికటతట సం
భూత మదఖేళన వి
ద్యా తత్పరకీర్తిఁ బెండ్లియాడిన రాజుల్.

వారల కగ్రగణ్యుఁడు నివారితలైరి వరూధినీధవ
శ్రీ రమణీ విలాసుఁడు విచిత్ర కళాకుశలుండు తిమ్మ ధా
త్రీ రమణుండు సంపద వరించె మరాట వరాటలాట గాం
ధార యుగంధరాధిపసదః ప్రకటీకృత బాహువీర్యుఁడై.

తుళువ నామము మొదట దేశవాచక మనియుఁ, దద్దేశపాలకులుగావున వీరి వంశ నామము నదియే యయ్యెననియుఁ బై వాక్యములనుబట్టి స్పష్టమగుచున్నది.

కాని అల్లసాని పెద్దనార్యుఁడు తన మనుచరిత్రయందు వీరి వంశ నామమునుగూర్చి యింకొక విధముగాఁ జెప్పియున్నాఁడు. చంద్రవంశమున సుప్రసిద్ధుఁడు యయాతికి యదుతుర్వసులను నిర్వురు పుత్త్రులు గలరనియు, నందు తుర్వసు వంశమే తుళువాన్వవాయ మయ్యెనని పెద్దనగారి కల్పన :

అతనికి యదుతుర్వసులను
సుతు లుద్భవమంది రహితసూదనులు కళా
న్వితమతులు వారిలో వి
శ్రుతకీర్తి వహించెఁ దుర్వసుఁడు గుణనిధియై.

వాని వంశంబు తుళువాన్వవాయ మయ్యె
నందుఁ బెక్కండ్రు నృపు లుదయంబు నొంది
నిఖిల భువన ప్రపూర్ణ నిర్నిద్రకీర్తి
నధికులైరి తదీయాన్వయమునఁ బుట్టి.

నంది తిమ్మన కృతమగు పారిజాతాపహరణమునందుఁగూడ తుర్వసు వంశమునందే రాయల పితామహుఁడగు నీశ్వర నాయకుఁడు జన్మించినట్లు చెప్పఁబడి యున్నది. కాని యిందు తుర్వసు వంశమే తుళువ వంశమని చెప్పఁబడలేదు. తుర్వసు శబ్దము తళువశబ్ద మెట్లయ్యెనో పెద్దన చెప్పలేదు. వరాహ పురాణ కర్తలగు మల్లయ సింగయ కవులుగూడ తమ కృతి నాయకుఁడగు నరసనాయకుని చంద్రవంశజునిగాఁ బేర్కొనలేదు. ఆ గ్రంథమందే సాళువ నరసింహభూపతినిగూర్చి చెప్పుచు ' తుహినాంశు వంశ పాథోరాశి మాణిక్య' మని యాతని వర్ణించియున్నారు. ఈతనికడనే నరసనాయకుఁడు చాలకాలము సేనాధిపతిగ నుండెను. ఈ కవులు సాళువ నరసింహభూపతిని స్పష్టముగఁ జంద్రవంశజుఁడని చెప్పుటచేతను, కృతి భర్తయగు నరసనాయకుని వంశ విషయమున మూకీభావము వహించుటచేతను, వీరి వంశము చంద్రవంశము కాదనియే యూహింపనగును.

క్రమముగా వీరు విద్యానగరాధీశ్వరులైన యనంతరము వీరికి చంద్ర వంశముతోడి సంబంధము కల్పింపఁబడి యుండును. శ్రీకృష్ణదేవరాయల తండ్రియగు నరసభూపతిని, తాతయగు నీశ్వరభూపతిని మల్లయ సింగయ కవులు నాయకశబ్దమును జేర్చియే వ్యవహరించియున్నారు. దీనినిబట్టిగూడ వీరు చంద్రవంశజులు గారనియు, నాయకశబ్ద వ్యవహారముచే శూద్రులే యనియు మనము నిర్ణయింపవచ్చును. నరసనాయకుని పుత్త్రుఁడగు వీరనరసింహ రాయల కాలమున వీరు క్షత్రియులుగాఁ బేర్కొనఁబడిరి. తరువాత కృష్ణదేవ రాయల కాలమున వీరు చంద్రవంశజులగు క్షత్రియులని స్పష్టముగాఁ జెప్పఁబడినది. కావున వీరికి చంద్రవంశముతోడి సంబంధము కల్పితమేగాని వాస్తవము గాదు.

తుళువవంశము సాళువ వంశాంతర్భాగమని కొందఱి యభిప్రాయము.[1] కాని యది సరిగాదు. వరాహపురాణ కర్తలు సాళువ తుళువ వంశములను రెండిఁటిని వర్ణించి యున్నారు.[2] అందు తుళువ నరసరాజును, ఈశ్వర భూపతియు, సాళువ నరసింహరాయలకడ దండనాయకులని మాత్రమే చెప్పి యున్నారు. వారికిఁ గల బాంధవ్యమే నిజమగు నెడల దానిని గూర్చి చెప్ప కుండుటకు కారణము గానరాదు. సాళువ నరసింగరాయలకు తిమ్మరాజను నగ్ర జుఁడు గలఁడు. నామసాదృశ్యమును బట్టి ఆతిమ్మరాజే తుళువ వంశ మూల

1. మహమ్మదీయ మహాయుగము - కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు. (341-348 పుటలు)

2. ఆంధ్రకవుల చరిత్ర - ప్రథమసంపుటము : నంది మల్లయ ఘంట సింగయకవులు - వీరేశలింగంపంతులు.

పురుషుఁడగు తిమ్మయ నాయకుఁడని వీరి భ్రాంతికి లోనై యుండును. వరాహ పురాణకర్తలు సాళువ తిమ్మరాజును పేర్కొని, యాతఁడు తుళువ రాజ్యాధిపతి యని చెప్పకపోవుట చేతను, తద్వంశమందే నరసనాయకాదులు జన్మించిరని చెప్పకపోవుటచేతను, సాళువ తిమ్మరాజే తుళువ వంశ మూలపురుషుఁడని చెప్పుటకు వీలులేదు. ఈ రెండు వంశములకును ప్రభుదండనాయక సంబంధము తప్ప వేరొక సంబంధము కాసరాదు. తుళువ వంశము సాళువ వంశాంతర్భాగముకాదు. వీరు చంద్రవంశజులగు క్షత్రియులును గారు.

శాసనాద్యనేక సాధన సామగ్రి కావలసినంత లభించుచున్నను రాయల జీవిత చరిత్రకు సంబంధించిన అనేక విషయములు వివాదగ్రస్తములుగనే యుండుట శోచనీయమగు విషయము. రాయలాంధ్రుఁడా కర్ణాటుఁడా అను సమస్య నేటికిని విడదీయరాని చిక్కుగనే నిలిచియున్నది. చారిత్రక పరిశోధకు లనేకులు ఈ విషయమునఁ దమకుఁదోచిన సమాధానముల నిచ్చియున్నారు. కర్ణాటకులు రాయలు కర్ణాటకుఁడే యనుచున్నారు. ఆంధ్రులాతఁ డాంధ్రుఁడే యనుచున్నారు. మహాపురుషు లేజాతికిఁ జెందినను మహాపురుషులే. జాతిమత కులభేదములు వారి మహాపురుషత్వమున కడ్డుగా నిలువఁజాలవు. కాని వారు మహాపురుషు లగుటచేతనే ప్రతిజాతియు వారినిఁ దనలోఁ జేర్చుకొనుటకు యత్నించుచుండును. రాయలు సర్వసామాన్యుఁడగు రాజేయైనచో అతని జాతి నిర్ణయ విషయమున నిందఱిన్ని పట్టుదలలు వహించెడివారు కారేమో! అది యటుండనిండు. ప్రశ్నరానేవచ్చినది. దానికి యథాశక్తి సమాధాన మిచ్చుట మనవిధి.

ఆముక్తమాల్యదా పీఠికలో రాయలు తన్ను ఆంధ్ర విష్ణువు 'కన్నడ రాయా' అని సంబోధించినట్లు చెప్పికొనియున్నాఁడు. 'ఏను దెలుంగు రాయఁడన్' అని తన్నుగూర్చి ఆంధ్రవిష్ణువు చెప్పికొని రాయలను గన్నడ రాయా యని సంబోధించుట నిస్సందేహముగ పెక్కుసందియములకు దావిచ్చు చున్నది. కాని దీనినే యాధారముగఁగొని రాయలు కర్ణాటుఁ డనుటకు వీలులేదు. విజయనగరాధిపతులను గర్ణాట క్షితిపతులనుట క్రొత్తవిషయము గాదు. శ్రీనాథుఁడు తన కాశీఖండములోఁ దనకుఁ గనకాభిషేకముఁ గావించిన రాయలను గర్ణాట క్షితినాథుఁడనియే పేర్కొనియున్నాఁడు.[1] మఱియు 'తల్లీ కన్నడ రాజ్యలక్ష్మీ' అనియే విజయనగర రాజ్యలక్ష్మిని సంబోధించియున్నాఁడు.[2]

1. కర్ణాట క్షితినాథ మౌక్తిక సభాగారాంత రాకల్పిత స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ కవిరాట్సంస్తుత్య చారిత్ర - కాశీఖండము.

2. తల్లీ కన్నడ రాజ్యలక్ష్మి దయలేదా నేను శ్రీనాథుఁడన్—శ్రీనాథుని చాటుధార.

కావున విజయనగర రాజులను కర్ణాటులుగా వ్యవహరించుట పరిపాటియై. అంతమాత్రమున విజయనగర రాజ్య మాంధ్ర రాజ్యము కాకపోదు. విజయ నగరప్రభువులు నాంధ్రరాజులు కాకపోరు.

కాని యింతమాత్రమున మన సమస్య సమస్యగనే మిగిలియున్నది. తత్పరిష్కారమున కన్యమార్గముల నన్వేషింపవలసి యున్నది.

రాయల వంశమునకు మూలపురుషుఁడు తిమ్మరాజు. ఈతఁడు తుళు దేశస్థుఁడని వరాహపురాణకర్తలు చెప్పియున్నారు. ఆతని వంశమున పుట్టిన రాయలును తుళుజాతికి సంబంధించినవాఁడే యగును. అన్యుఁడు కాఁజాలఁడు. కావున నీ ప్రకారముగఁ జూచినచో రాయలాంధ్రుఁడును గాఁడు; కర్ణాటుఁడును గాఁడు; తుళుజాతి వాఁడగును.

మఱొకవిధముగఁ జూచినచో రాయలాంధ్రుఁడే యని చెప్పవచ్చును. తొలుదొల్త వీరు తుళుదేశీయులే యగుదురుగాక, కాని వీరి మూలపురుషుఁడయిన తిమ్మరాజు కాలముననే వీరు తుళుదేశమును వీడి యాంధ్రదేశమునకు వలస వచ్చిరి. సాళువరాజుల నాశ్రయించి, చంద్రగిరియందు స్థిరనివాసముల నేర్పరచు కొనిరి. ఆంధ్రులతో సంబంధ బాంధవ్యములను గల్పించుకొనిరి. తుళువ వంశ మున జన్మించిన రాజులందఱు ఆంధ్ర స్త్రీలనే వివాహమాడిరి. వారి మాతృభాష యగు తుళుభాష పరిత్యజించి ఆంధ్రమునే మాతృభాషగా స్వీకరించిరి. ఆంధ్ర కవుల నాదరించి పోషించిరి. కృతికర్తలైరి; కృతిభర్తలైరి.

జంటకవులగు నంది మల్లయ ఘంట సింగయలు ఈశ్వరనాయకుని పోషణమున వృద్ధిగాంచిరి. వారు రచించిన వరాహపురాణమునకు ఈశ్వర నరసనాయకుఁడు కృతిభర్త. ద్విపద నారసింహ పురాణ, వచన బాలభారత, సౌభరి చరిత్రాద్యనేక గ్రంథ నిర్మాణచణుఁడగు చెన్నకవిని వీరనరసింహరాయ లగ్రహారము లిచ్చి సత్కరించెను.

ఇఁక కృష్ణరాయల విషయము చెప్పుటనావశ్యకము. ఈతఁడు కవిజన కల్పభూజము. స్వయముగ కవి. బహుకావ్య నిర్మాణ దక్షుఁడు. ఆంధ్రవాఙ్మయ మున కీతని కాలము స్వర్ణయుగము. వేయేల. ఈతఁడాంధ్ర భోజుఁడు.

కృష్ణదేవరాయల యనంతరము విజయనగర సింహాసనము నధిష్ఠించిన అచ్యుత దేవరాయలు ప్రతి సంవత్సరమును ఒక యుత్తమాంధ్ర కావ్యమును రచింపఁజేసి, తన యిష్టదైవమగు శ్రీ వేంకటేశ్వరున కర్పించెడివాఁడు.

ఇట్లు ఆంధ్ర దేశమును స్వదేశముగను, ఆంధ్రభాషను మాతృభాషగను స్వీకరించి, ఆంధ్ర రాజకుటుంబములతో తరతరములుగ సంబంధ

బాంధవ్యములను గలిగించుకొని, ఆంధ్రస్త్రీల గర్భమున జనించి, ఆంధ్రులతోఁ గూడి మాడి జీవనము సల్పి, ఆంధ్రమున గ్రంథరచన చేసి, ఆంధ్రకవుల నాదరించి పోషించి, ఆంధ్ర వాఙ్మయమును బెంపొందించిన తుళువరాజు లాంధ్రులు గాక యన్యులెట్లు గాఁగలరు. కావున కృష్ణరాయ లాంధ్రుఁడనుటయే సమంజసము.[1]

శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారుకూడ రాయలాంధ్రుఁడే గాని కర్ణాటకుఁడు గాఁడని తమ మహమ్మదీయ మహాయుగమున సోపపత్తికముగ నిరూపించియున్నారు.

మహాపురుషుఁడగు రాయల విషయమున నొక యపప్రథగలదు. రాయల తండ్రి యగు నరసనాయకునకు తిప్పాంబయను భార్యయు, నాగాంబ యను భోగ కాంతయుఁ గలరనియు, నందు తిప్పాంబకు వీరనరసింహ రాయలును, నాగలాంబకు కృష్ణరాయలును జన్మించిరనియు ఒక కింవదంతి ప్రచారములో నున్నది.

శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారును, శ్రీ వీరేశలింగము పంతులుగారును ఈ విషయమునుగూర్చి తాము రచించిన కవుల చరిత్రములలో ప్రసంగించి యున్నారు. ఇరువురును నాగలాంబ భోగకాంతయను నిర్ణయమునకు వచ్చిరి.

శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు తమ విశ్వాసమున కాధారముగా కొన్ని పుక్కిటిపురాణములను వివరించిరి.

శ్రీ వీరేశలింగము పంతులుగారు ఈ విషయమున నాంధ్రకవుల చారిత్రమున నిట్లు వ్రాసి యున్నారు :

> కృష్ణరాయల తండ్రియైన నరసింహరాయలకి తిప్పాంబ యనియు, నాగాంబయనియు ఇద్దరు భార్యలు గలరు. ఆయిరువురిలో తిప్పాంబ పట్టపురాణి యనియు, నాగాంబ భోగకాంతయనియు చెప్పుదురు. కొన్ని శాసనముల యందుఁగూడ నిట్లే గానఁబడుచున్నది.

పైవ్రాత కేవలము నిరాధారమైనది. నాగమాంబ భోగకాంతయని నిరూపించు శాసనమొక్కటియును లేదు. ఉపరి, నాగమాంబ నరసనాయకుని భార్యయే యని నిరూపించు శాసనములు గలవు. ఈ శాసనములు కృష్ణరాయల కాలమునాటి వైనచో మనమించుక సందేహింప వచ్చును. కాని వీరనరసింహ రాయల కాలమునాటి శాసనములందే నాగలాంబ నరసనాయకుని భార్యయని స్పష్టముగా చెప్పఁబడియున్నది. చూడుఁడు :

---

1. భారతి, సర్వధారి, ఫాల్గుణము, డాక్టరు వేంకట రమణయ్యగారు.

తిప్పాజీ నాగలాదేవ్యోః కౌసల్యా శ్రీ సుమిత్రయోః,
దేవ్యోరివ నృసింహేన్ద్రాత్తస్మాత్పజ్క్తి రథాదివ,
వీరౌ వినయినౌ రామలక్ష్మణావివ నన్దనౌ,
జాతౌ వీరనృసింహేన్ద్ర కృష్ణరాయ మహీపతీ.

తస్మా న్నరస రాజేన్ద్రాత్తిప్పాజీ నాగమామ్బయోః,
క్రమా ద్వీర నృసింహేన్ద్ర కృష్ణరాయౌ బభూవతుః.
అన్యోన్యోపమయోస్సర్వ సద్గుణౌఘ సముద్రయోః,
తయో ర్వీర నృసింహేన్ద్ర పిత్ర్యం సింహాసనం శ్రితః.

మీది శాసనముబట్టి నాగలాంబ భోగకాంత కాదనియు, నరసనాయకుఁ డగ్నిసాక్షిగ వివాహమాడిన భార్యయనియు స్పష్టమగుచున్నది. శాసనస్థమగు నాధార మిటుండగ, పుక్కిటి పురాణగాథలను విశ్వసించుటకు వీలులేదు.

ఈవిషయమున విచిత్రమగు నంశ మింకొకటి యున్నది. వీరనరసింహ రాయల శాసనము లందును, శ్రీకృష్ణదేవరాయల శాసనము లందును నరసనాయ కున కిరువురు భార్యలనియే చెప్పఁబడియున్నది. కాని కృష్ణరాయల యనంతరము విజయనగర సింహాసనము నధిష్ఠించిన అచ్యుతరాయల కాలమున నరసనాయ కున కోబమాంబ యను నింకొకభార్య యున్నట్లు చెప్పఁబడియున్నది.

తిస్రో నృపస్యేత్యభవన్నభీష్టా
స్తిప్పామ్బికా తాసు చ నాగమామ్బా,
పట్టాభిషిక్తాః పతిదేవతానా
ముత్తంస భూషామణి రోబమామ్బా.

తిప్పామ్బికాయా ద్విజసంపదేఽభూ
ద్విఖ్యాతిమా న్వీర నృసింహరాయః,
నాగామ్బికాయాం నరసావనీన్ద్రోః
కీర్త్యా కరోఽజాయత కృష్ణరాయః.

అచ్యుతరాయల కంకితమైన అచ్యుతరామాభ్యుదయ మను సంస్కృత గ్రంథమున మీది శ్లోకములు గలవు. వీర నృసింహరాయల శాసనములలో గాని, శ్రీకృష్ణదేవరాయల శాసనములలో గాని ఓబమాంబా ప్రసక్తిలేదు. అచ్యుత రాయలు రాజ్యాధికారమును వహించగనే ఓబమాంబ నరసనాయకుని మూఁడవ భార్యగ ప్రత్యక్షమయినది. దీనిని బట్టి చూడగ నీమె భోగకాంతయేమోయను సంశయమున కవకాశము గలుగుచున్నది. కాని యీవిషయము నిదమిత్థముగ నిర్ణయించుట కాధారములులేవు. శ్రీకృష్ణరాయల తల్లి మాత్రము భోగకాంత కాదు. ఆమె నరసనాయకుని భార్యయే.

శ్రీకృష్ణదేవరాయల జన్మదిన విషయమునఁ గూడ వాదోపవాదములు గలవు. అందు ముఖ్యమైనవి రెండు వాదములుమాత్రమే. ఈవిషయమున శ్రీ లక్ష్మణరావు పంతులుగారు తమ మహమ్మదీయ మహాయుగమున నిట్లువ్రాసి యున్నారు :

కృష్ణరాయలు 1465 లో జన్మించెనని యొకఁడును, 1487 లో జన్మించెనని యొకఁడును వ్రాసియున్నారు. కాని యీ మహారాజు జన్మదిన మిదియేయని నిశ్చయముగాఁ జెప్పుట కాధారమేదియును లేదు.

శ్రీ వీరేశలింగం పంతులుగారు కూడ నిట్లే వ్రాసియున్నారు.

ఈ రెండు వాదములను సమగ్రముగా పరిశీలించిన యెడల శ్రీకృష్ణదేవ రాయలు 1487 లో జన్మించెను వాదమే సమంజసముగాఁ గన్పట్టుచున్నది.

నందిమల్లయ ఘంటసింగయకవులు తమ వరాహ పురాణమును 1485 - 1490 ప్రాంతమున రచించియున్నారు. సాళువ నరసింహ భూపతి రాజ్య కాలముననే వరాహపురాణము రచింపఁబడెననుటకు నిదర్శనము లనేకములు గలవు. కృతిభర్తయగు నరసనాయకుని సంబోధింపుచు నీ జంటకవులు "సాళ్వ నరసింగ క్షమాధ్యక్ష దక్షిణ దోర్దండ" "సాళ్వ నరసింగ ధరాధవ దండనాథ" "సాళువ నరసింహ నృపాల దండనాయక తిలక" అని పెక్కుసారులు చెప్పియున్నారు. సాళువ నరసింహ భూపతి శాసనములు క్రీ. శ. 1490 వఱకుఁ గన్పట్టుచున్నవి. కావున వరాహపురాణము 1490 కి పూర్వమే రచింపఁబడి యుండవలెను. పూర్వకాల పరిమితి యించుమించుగా 1485 కావచ్చును. ఆ గ్రంథమున నరసనాయకుని వర్ణనము గలదు. అందు వీరనరసింహరాయలు పేర్కొనఁబడి యున్నాఁడు. కృష్ణరాయల ప్రసక్తి యందు గానరాదు. కావున నానాటికి కృష్ణరాయలు జన్మింపలేదనియో, జన్మించినను చిన్నవయస్సువాఁడనియో నిర్ణయింపనగును. వరాహపురాణమున నరసనాయకుని వర్ణన మీ క్రింది విధముగా నున్నది :

అష్టభాషా కవితాబ్జ సంభవులైన
సుకవి పుంగవులు సంస్తుతులు సేయ
సంకీర్ణ రాజ రంజకులైన గాణలు
గములు గీత ప్రబంధములు పాడ
కల కంకణక్వాణ కర సరోరుహ లైన
రమణులు వింజామరములు వీవ
వరబలాధికులైన శరణాగతారాతి
సామంతు లుభయ పార్శ్వములఁగొలువఁ

గూర్మితనయుండు నరసయ్య గుణనిధాన
మంతికంబున సేవింప నలఁదికొనిన
సురభి కాశ్మీర గంధంబు సోడు ముట్ట
నుండెఁ బేరోలగము నయనోత్సవముగ.

పయి యంశములను బట్టి చూడగా రాయలజన్మ కాలము 1487 ప్రాంత మనియే నిర్ణయింప నగును. ఈ సిద్ధాంతమును పూర్వపక్షము సేయు వాదము లనేకములు గలవు. చారిత్రక పరిశోధకులు వాని నింతకు ముందే పరాస్తము చేసి యుండుటచే వాని నన్నిటి నిట నుదాహరించుట యనావశ్యకము.

వీరనరసింహరాయల యనంతరము శ్రీకృష్ణదేవరాయలు విజయనగర సింహాసన మధిష్ఠించెను. వీరనరసింహరాయల శాసనములు క్రీ.శ. 1509 వఱకు నున్నవి. ఆ సంవత్సరముననే అనఁగా 1509 వ సంవత్సరముననే శ్రీకృష్ణరాయలు పట్టాభిషిక్తుఁ డయ్యెనని చరిత్రకారు లందఱు నేకగ్రీవముగ నంగీకరించి యున్నారు. కాని ఆ సంవత్సరమున నే మాసమున నే దినమున నాతఁడు పట్టాభిషిక్తుఁ డయ్యెనను విషయమున చరిత్రకారులలో భిన్నాభిప్రాయ ములు గలవు. కాని యా నిర్ణయముతో మనకిట నంతగా సంబంధము లేదు. కృష్ణరాయలు క్రీ.శ. 1509-1530 వఱకు రాజ్య మేలెనను మాట మాత్రము వాస్తవము.

శ్రీకృష్ణదేవరాయల కెందఱు భార్యలను విషయమునఁ గూడ వాదోప వాదములు గలవు. సాహితీ విమర్శకును, రాయల భార్యల సంఖ్యకును గల సంబంధమేమి యని కొందఱు ప్రశ్నింప వచ్చును. కాని యది సరియగు ప్రశ్న కాదు. మనుచరిత్ర పారిజాతాపహరణము లందును, రాయలే స్వయముగ రచించిన ఆముక్తమాల్యద యందును యీ దేవేరుల ప్రసక్తి గలదు. రాయల కాలమున విజయనగరమున నున్న కొందఱు విదేశీయులు రాయల భార్యల విషయమున కొన్ని సంగతులు వ్రాసి యున్నారు. రాయల శాసనములలో పట్టపుదేవుల పేర్లుదాహృతములయి యున్నవి. కావున నా పట్టపుదేవు లెవ్వరు? ఎందఱు? అను ప్రశ్నలకు మనము తగిన సమాధాన మీయవలసి యున్నది.

పాయజ్ అను పోర్చుగీసు రాయబారి కృష్ణదేవరాయలకు పన్నిద్దరు భార్యలు గలరనియు, అందు ముఖ్యులు ముగ్గురనియు, అందొక్కతె ఉత్కళ రాజపుత్రిక యనియు, మఱొక్కతె రాజు సామంతులలో నొక్కఁడగు శ్రీరంగ పట్టణ ప్రభువు కుమారితె యనియు, వేఱొక్కతె వేశ్య యనియు వ్రాసి యున్నాఁడు. తక్కిన తొమ్మండ్రు భార్యల విషయమున ఆతఁడేమియుఁ జెప్ప లేదు. అంతిపురమునందలి పరిచారికలను గూడ నీతఁడు రాయల భార్యలుగా భ్రమించెనేమో.

న్యూనిజ్ అను పోర్చుగీసు గుఱ్ఱపు వర్తకుఁడు రాయలకు నలువురు పట్టమహిషు లుండిరని చెప్పి, వారిలో నొక్కతె యుత్కళ రాజకుమారితె యనియు, నిద్దఱు శ్రీరంగపట్టణపు రాజుకూఁతు లనియు, మఱియొక యువతి కృష్ణరాయలు చిన్నతనమున ప్రేమించిన వేశ్య యనియు, నామె పేరు చిన్నాదేవి యనియు నుడివి యున్నాఁడు.

పెద్దన మనుచరిత్రములో చిన్నాదేవి తిరుమలదేవుల నామము లుదాహృతములయి యున్నవి :

ఆ విభు ననంతరంబ ధ
రావలయముఁ దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల
దేవియునుం దనకుఁ గూర్చు దేవేరులు గాన్.

—మనుచరిత్ర : అవతారిక.

పారిజాతాపహరణము నందుఁ గూడ నీ యిర్వురే పేర్కొనఁబడి యున్నారు.

క॥ తిరుమల దేవీ వల్లభ —ఆ ౨, ప ౧౦౫.

క॥ శ్రీ వర్ణనీయ ! తిరుమల దేవీహృదయేశ —ఆ ౫, ప ౧.

క॥ శ్రీ వేంకటగిరి వల్లభ
సేవా వరతంత్రహృదయ ! చిన్నమదేవీ
జీవిత నాయక —ఆ ४, ప ౧.

రాయల కాలము నందలి పెక్కు శాసనములలోఁ గూడ నీ యిరువుర పేర్లును గలవు. తిరుపతి యందుఁ గల రాయల విగ్రహమున కిరుప్రక్కలను చిన్నాదేవీ తిరుమల దేవుల విగ్రహములు ప్రతిష్ఠితములయి యున్నవి. కావున నీ యిర్వురును రాయల పట్టపు దేవులనుటలో నెట్టి విప్రతిపత్తియును లేదు. ఇఁక వీ రెవ్వ రనునది ప్రశ్న.

రాయల సమకాలికులగు పాయజ్, న్యూనిజ్ మొదలగు విదేశీయులు రాయల భార్యలలో నొక్కత వెలయాలనియు, నామె పేరు చిన్నాదేవి యని స్పష్టముగ చెప్పుటచే నామె విషయమున చర్చనీయాంశ మేదియును లేదు. ఇఁక తిరుమలదేవిని గూర్చి కొన్ని యభిప్రాయభేదములు గలవు.

ఈమె గజపతి కుమార్తెయని న్యూయెల్ పండితుఁడు వ్రాసి యున్నాఁడు. కాని యది సరిగాదు. ప్రప్రథమముగా రాయలు తిరుపతి వేంకటేశ్వరుని క్రీ.శ. 1513 ఫిబ్రవరి 10 వ తేదీని దర్శించి యున్నాఁడు. అప్పుడు రాయలతో నాతని

పట్టమహిషులు తిరుమలదేవి, చిన్నాదేవి యున్నట్లును, స్వామి కాభరణాదుల సమర్పించినట్లును శిలాశాసన మున్నది. క్రీ.శ. 1513 నాటికి రాయలు గజపతిని జయింపలేదు. గజపతి తనయను పరిణయము నాడలేదు. కావున న్యూయల్ వ్రాత భ్రాంతి మూలకము.

తిరుమలదేవి శ్రీరంగపట్టణ ప్రభుపు తనయ యని పాయజ్ వ్రాసి యున్నాఁడు. తిరుపతి దేవస్థానమువారు ప్రకటించిన రిపోర్టులో వీరశ్యామ రాయలు నను నాతఁడు శ్రీరంగ పట్టణ ప్రభువై యుండునని వ్రాసి యున్నారు. ఒకచో న్యూనిజ్ తిరుమలదేవి నరసింగరాజ కుటుంబమునకుఁ జెందిన కన్య యని వ్రాసి యున్నాఁడు.

రాయల కాలమున నరసింగరాజ నామధేయము గలవారు పెక్కుమంది కలరు. సాళువ వంశము నందును, ఆరవీటి వంశము నందును నా పేరుగల వారున్నారు. కాని ఆరవీటి సాళువ వంశములకుఁ జెందిన కన్యలను రాయలు వివాహమైన ట్లెచ్చటను లేదు.

న్యూనిజ్ మఱియొక తావున కృష్ణదేవరాయల రాయచూరు దండ యాత్రను వర్ణించుచు

> కృష్ణరాయలఁ గూఁతు నిచ్చిన వాఁడును, మైసూరు మండలాధిపతియు, నగు కుమార వీరయ్య (కుమార వీరశ్యామ రాయలు) యెనిమిది వేల కాల్బలమును, నాలుగు వందల గుఱ్ఱములును, యిరువ దేనుంగులుఁగల సైన్యముతో ఆతని వెనుకఁ బోవుచుండెను.

అని వ్రాసి యున్నాఁడు.

న్యూయెల్ పండితుఁడు ప్రకటించిన మైసూరు వంశావళిని బట్టి క్రీ.శ. 1478 మొదలు 1513 వఱకు మైసూరు మండలమును చామరాజను నాతఁడు పరిపాలించినట్లు తెలియుచున్నది. ఈతఁడే శ్యామరాయలు కానోపును. కావున తిరుమలదేవి తండ్రి మైసూరు మండల పరిపాలకుఁడగు చామరాజని నిర్ణయింప వచ్చును. కృష్ణరాయలు మైసూరు రాజ్యమునుగూడ జయించినట్లు శ్రీ లక్ష్మణరావు పంతులుగారు తమ మహమ్మదీయ మహా యుగమున వ్రాసి యున్నారు :

> కాని కృష్ణరాయలకాలపు రాజగు గంగరాజు తిరుగఁబడి కప్పమిచ్చుట మానెను. అందుచేఁ గృష్ణరాయఁడు శతఘ్నులతోను ప్రబల సైన్యము తోను దానిని సాధించుటకు వెడలెను. శ్రీరంగపట్టణపు రాజగు చిక్కరాయనికిని గంగరాజునకును వైరమగుటచే వానిని గలుపుకొని కృష్ణరాయలు కొండత్రోవనుబోయి శివసముద్రపు కోటను ముట్టడించి శౌర్యముతోఁ బోరాడి వశపఱుచుకొనెను. గంగరాజు కావేరిలోఁ బడి

ప్రాణములను త్యజించెను. అంత నుమ్మటూరు జయించెను. శ్రీరంగ పట్టణపు రాజగు చిక్కరాయని వశపఱుచుకొని యాతఁడు తనకుఁ గప్పము కట్టునట్లు చేసెను. తరువాత మైసూరు దేశమంతయుఁ గర్ణాటకంబంతయుఁ గృష్ణరాయలకు లోఁబడెను. తాను జయించిన కర్ణాటదేశమున కంతటికిని శ్రీరంగపట్టణము రాజధానిగా నేర్పరచి కృష్ణరాయ ధ్వజమను పేర నొక విజయధ్వజము నెత్తించి యచ్చట చిక్కరాజును తన ప్రతినిధిగా నేర్పరచెను. ఆ సమీపమందలి పాళెముల జయించి, కంబగౌడఁడు, వీరప్పగౌడఁడు అను పాలెగాండ్ర వశమున నుంచెను.

శ్రీ వేకుమళ్ళ అచ్యుతరావుగారు 'విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్ర వాఙ్మయ చరితము' అను తమ గ్రంథమున తిరుమలదేవి ఉమ్మత్తూరు గంగరాజు కుమార్తెయని చెప్పియున్నారు. అందే వేఱొకచో ఉమ్మత్తూరి రాజు వీరశ్యామలరాయఁడు రాయలతో సంధిచేసికొని తనకుమార్తెయగు తిరుమల దేవిని రాయలకిచ్చి పరిణయము గావించెనని వ్రాసి యున్నారు. దీనినిబట్టి ఉమ్మత్తూరి ప్రభువు వీరశ్యామలరాయఁడని వారభిప్రాయపడినట్లు తెలియు చున్నది.

కృష్ణరాయల కాలమున ఉమ్మత్తూరు, శివసముద్రము, శ్రీరంగపట్టణము అను ప్రధాన దుర్గములు మూఁడు ఉమ్మత్తూరు ప్రభువుక్రిందనే యుండెడివి. ఆతని పేరు గంగరాజు ఒడయరు. ఆ కాలమున శ్రీరంగపట్టణమును చిక్క రాయలనువాఁడు పరిపాలించుచుండెను. మైసూరు ప్రభువు శ్యామలరాయఁడు. గంగరాజే శ్యామలరాయలనుటకు శ్రీ అచ్యుతరావుగారికిగల ఆధారములెట్టివో మనకు తెలియుటలేదు. అది యటుండనిండు. రాయలదేవేరియగు తిరుమలదేవి వీరశ్యామలరాయల కూతురని స్పష్టమైనది. క్రీ. శ. 1516 లో సింహాచలమున రాయలు వేయించిన శిలా శాసనములోఁగూడ చిన్నాదేవి తిరుమలదేవులే యుదాహరింపఁబడి యున్నారు. అమరావతి మొదలగు శాసనములలోఁగూడ నీ యిరువురి పేరులే గలవు. ఇంతదనుక సర్వమును సవ్యముగనే యున్నది.

ఇఁక రాయలు రచించిన ఆముక్తమాల్యదయందలి ఈ క్రింది పద్యమును జూడుఁడు :

ఆ విభు ననంతరంబ ధ
రావలయము బూని తీవు రహిమై దిరుమ
ల్దేవియును నన్నపూర్ణా
దేవియుఁ గమలాబ్జముఖియు దేవేరులుగాన్.

ఇందు చిన్నాదేవి పేరులేదు. పూర్వశాసనములందును, గ్రంథము లందును గానరాని అన్నపూర్ణాదేవి పేరుదాహృతమైయున్నది. మొదటినుండియు నున్న తిరుమలదేవి యిందును గలదు. చిన్నాదేవిపేరు లేకపోవుటకు కారణము సులభగ్రాహ్యమే. అప్పటికామె స్వర్గస్థురాలై యుండును. వివాహానంతరము చిన్నాదేవి చిరకాలము జీవించినట్లు గానరాదు. క్రీ. శ. 1517 జనవరి రెండవ తేదీని తిరుపతి దేవస్థానమున వ్రాయించిన శాసనములో నీమె పేరున్నది. క్రీ. శ. 1517 డిశంబరు ఒకటవ తేదీని శ్రీకృష్ణరాయల మంత్రులలో నొకఁడగు కొండ మరుసయ్య వ్రాయించిన చోళసముద్రవు శాసనములో నీమె పేరులేదు. కావున నామె క్రీ. శ. 1517 వ సంవత్సరము జనవరి తరువాత డిశంబరు లోపుగా స్వర్గస్థురాలయ్యెనని నిశ్చయముగా చెప్పవచ్చును.

ఇఁక నీ యన్నపూర్ణాదేవి యెవ్వరను ప్రశ్నకు మనము సమాధాన మీయ వలసియున్నది. కొందఱీమెయే గజపతి పుత్త్రియై యుండునని వ్రాసియున్నారు. ఓఢ్రమునందలి కొన్ని గ్రంథములలో ప్రతాపరుద్ర గజపతి తనయపేరు అన్నపూర్ణయనియే యున్నట్లు తెలియుచున్నది. కావున నీమె గజపతి పుత్త్రి యని చెప్పవచ్చును. కాని ఇందులకు కొన్ని ప్రతిబంధములు లేకపోలేదు. వానినిగూడ సమగ్రముగఁ బరిశీలించి యీమె గజపతి కూతురగునో కాదో నిర్ణయించుట సమంజసము.

ప్రతాపరుద్ర గజపతి తనయను రాయలు వివాహమాడెనను విషయమున స్వదేశీయ విదేశీయ చరిత్రకారులలో భేదాభిప్రాయ మావంతయును గానరాదు. కుమార ధూర్జటికృత కృష్ణరాయల విజయమున నొక యాశ్వాసము సంపూర్ణముగ నీ వివాహవర్ణనతో నిండియున్నది.

ఘనతర నిర్భర గండపెండెర మిచ్చి కూఁతు రాయల కొడగూర్చునాడు

అను పెద్దనార్యుని చాటుధారయు నీ పరిణయగాథనే బలపఱచుచున్నది. నాదెండ్ల గోపమంత్రికృత ప్రబోధ చంద్రోదయము వ్యాఖ్యయందలి యీ క్రింది శ్లోకము గూడ గజపతి పుత్త్రికను రాయలు వివాహమాడెననియే చెప్పుచున్నది :

ప్రతాప రుద్రస్య గజేశ్వరస్య
పుత్త్రీం పవిత్రీకృత భూతధాత్రీం,
ప్రత్యగ్రహీద్యః ప్రకట ప్రతాపో
భద్రాం సుభద్రా మివ పాణ్డవేయః.

ఇట్లే మఱికొందఱుగూడ వ్రాసియున్నారు. కాని వీరిలో నొక్కొక్కరు ఒక్కొక్క విధముగా గజపతిపుత్త్రి పేరును జెప్పియున్నారు. కృష్ణరాయ విజయమున నామె పేరు 'తుక్కా' అనిగలదు. రాయవాచకమున నామె పేరు

'జగన్మోహిని' యని యున్నది. నరపతి రాజుల చరిత్రనుబట్టి యామె పేరు 'లక్షి'. విజయనగర సామ్రాజ్యమను గ్రంథములో నామె పేరు 'లక్ష్మీదేవమ్మ' యని గలదు.[1] నాదెండ్ల గోపమంత్రికృత ప్రబోధచంద్రోదయ వ్యాఖ్యాను సారము ఆమెపేరు 'భద్ర'. కాని యిట భద్రా శబ్దము సుభద్రకే విశేషణమని కొందఱనుచున్నారు. వైలరు దొరగారి యభిప్రాయమున నామె పేరు 'రుచీదేవి'. ఇందఱిన్ని పేర్లిచ్చినారు. కాని యిందెవ్వరును గజపతి తనయ పేరు 'అన్న పూర్ణ' యని చెప్పలేదు. అన్నపూర్ణ యెవ్వలో తెలిసికొనుటకుముందు మనము గమనింపవలసిన ముఖ్యవిషయ మింకొకటి గలదు.

మీఁద నుదాహృతమైన రాయల పద్యములో 'కమలాబ్జముఖి' అనునొక పదము గలదు. దీనికి 'కమలాబ్జముఖులు' అను పాఠాంతర మొకటియున్నది. దీని యర్థము ముందు నిర్ణయింపనిదే అన్నపూర్ణ యెవ్వరను ప్రశ్నకు తగిన సమాధానము మనకు రాదు.

కొందఱు పండితులు 'కమలాబ్జముఖి' అను మొదటి పాఠమును గైకొని దానికి కమల యను నబ్జముఖి యను నర్థమును జెప్పిరి. విజయనగర సామ్రాజ్యమను గ్రంథములో గజపతితనయ పేరు లక్ష్మీదేవమ్మయని యున్నదిగదా? ఆ 'లక్ష్మి'యే యీ కమలఅని కొందఱి యభిప్రాయము. కాని యిది సరికాదు.

నామవాచకములకు పర్యాయపదముల నెవ్వరును వాడరు. కొన్నియెడల తెలుఁగుపేర్లను సంస్కృతీకరించుట గలదు. కాని సంస్కృత పదమునకే తత్పర్యాయ పదమును వాడు నాచారము వాఙ్మయ ప్రపంచమునఁ గానరాదు. పండితుఁడును, కవితా మర్మజ్ఞుఁడును అగు రాయలట్లు గావించెననుట సాహసైక మూలము. మఱియు గజపతి పుత్రిపేరు లక్ష్మియని యుండుటయు నసంభవమే. గజపతులు దుర్గారాధకులు. ప్రతాపరుద్ర గజపతికి 'శ్రీ దుర్గా వీరపుత్ర' అను బిరుద నామము గలదు. శాక్తేయుఁడగు గజపతి తన తనయకు లక్ష్మియను వైష్ణవ నామ మిడుట సంభావ్యమగు విషయము గాదు. కావున కమలయే లక్ష్మి యనియు, ఆ లక్ష్మియే గజపతి పుత్రియనియు చెప్పువాదము సమంజసముగాదు.

కొందఱు 'కమలాబ్జముఖులు' అను పాఠమును స్వీకరించి, కమలయు, అబ్జముఖియు నను నిర్వురుభార్యల నామధేయములుగా నా పదమున కర్థమును జెప్పుచున్నారు. అట్లు చెప్పినచో తద్గ్రంథ రచనా కాలమునకు రాయలకు తిరుమలదేవియు, అన్నపూర్ణాదేవియు, కమలాదేవియు, అబ్జముఖీదేవియు నను నల్వురు భార్యలున్నట్లు తేలును. ఈ సంఖ్య న్యూనిజ్ వ్రాతతో సరిపోవు

1. ఈ గ్రంథము శాలివాహన శకము 1526 లో వీరవేంకటపతిరాయల యాజ్ఞానుసారము వ్రాయఁబడినది.

చున్నది. కాని యది యంగీకార్యము కాదు. స్యూవిజ్ చిన్నాదేవి సుదాహరించి యున్నాఁడు. ఆమెను జేర్చిన రాయల కైదుగురు భార్యలగుదురు. బహు శాసనములయందు, గ్రంథములయందు చిన్నాదేవిగాఁ జెప్పఁబడిన ఆమెపేరిప్పుడు మారుట కావశ్యకము లేదు. 'కమలాబ్జముఖి' అను పాఠము సరికాదు. కమలాబ్జ ముఖులను పాఠము సరియేకాని, దాని కర్థమును మీఁద సుదాహరించిన ప్రకారము చెప్పుటకు వీలులేదు.

కావున 'కమలాబ్జముఖులు' అనునది తిరుమలదేవ్యన్నపూర్ణాదేవులకు విశేషణముగా మాత్రమే భావించవలయును. ఒకరు కమలముఖియని, ఇంకొకరు అబ్జముఖియనియు రాయ లిందు సూచించి యున్నాఁడని చెప్పవచ్చును. అట్లు సూచించుటకుఁ గల కారణము తరువాత వివరింపఁబడును.

ఇఁక ప్రస్తుత విషయమును బరామర్శింతము.

రాయవాచకమునందలి జగన్మోహిని యను పదము ఆమె సౌందర్యాతిశయము వ్యక్తము సేయునేగాని అది యామె నామధేయము కాఁజాలదు. నాదెండ్ల గోపమంత్రి యామె పేరెత్తనేలేదని, అందలి భద్రా శబ్దము సుభద్రకు విశేషణమే యనుటయు లెస్సగాఁ దోచుచున్నది. లఖి శబ్దము లక్ష్మీశబ్ద భావమే కాని యామెపేరు లక్ష్మియై యుండుట కవకాశము లేదని ముందే వివరించి యున్నాఁడను. ఆ యుపపత్తులే లఖి శబ్దమునకు నన్వయించును. ఆమె పేరు లక్ష్మీదేవియే యను వాదమును సమర్థింపుచు నొకరు శాసనాధారము నొక దానిని జూపియున్నారు. ఆ శాసనమును రాయల మంత్రులలో నొకఁడగు కొండ మరుసయ్య యను నాతఁడు చౌదేశ్వర్యాలయమునకు ధర్మము నొసంగుచు వ్రాయించెను. అందిట్లు గలదు :

> కృత యుగాంశక ప్రవర్తక శ్రీ తిరుమలాంబికా లక్ష్మీ సమోపేత శ్రీ కర్ణాటక సింహాసనారూఢ శ్రీకృష్ణరాయ మహారాయర సామ్రాజ్యదల్లి.

శాసనకాలము 1517 డిశంబరు ఒకటవ తేదీ. ఈ శాసనకాలమున రాయలకును, గజపతికిని సంధి జరిగినదనియు, నందువలన నిందున్న లక్ష్మీ శబ్దము గజపతి తనయ పేరయి యుండుననియు వారి వాదము. ఆ కాలమున రాయలకును గజపతులకును సంధి జరిగినమాట వాస్తవమే. కాని యందలి లక్ష్మీశబ్దము ప్రతాప రుద్ర గజపతి తనయ పేరనుట సరికాదు.

కర్ణాటాధీశ్వరుఁడగు రాయల దేవేరియు, ఉత్కళాధిపతి తనయయు నగు నామెను దేవి మొదలగు గౌరవ వాచకము లెవ్వియును జేర్చకుండ నెవ్వరును వ్యవహరించుటకు ప్రయత్నింపరు. రాజమర్యాదల నెఱింగి యున్న

వాఁడును, మంత్రిపదవిని నిర్వహించుచున్నవాఁడును నగు కొండ మరుసయ్యయ్యన్నిటికిని వ్రాసి యుండఁడు. అందును తిరుమలదేవి నా శాసనమునందే తిరుమలాంబియని వ్యవహరించియున్నాఁడు. అట్టియెడ గజపతి పుత్రిక నామము నుల్లేఖించునప్పుడు మాత్రమేల గౌరవ వాచక రహితముగ వ్రాసి యవజ్ఞకుఁ బాల్పడును ? ప్రభు కోపమునకుఁ బాత్రుఁడగునా ? కావున నందలి లక్ష్మిశబ్దము గజపతి తనయ పేరటను సమంజసముకాదు. ఇట తిరుమలాంబిక యను లక్ష్మి అను నర్థమునే గ్రహింపవలయును.

హైలరు దొరగారామెపేరు రుచీదేవి యని పేర్కొనినాఁడు.[1] కాని యది సరికాదు. హైలరిచ్చిన కథవంటి కథనే శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులు గారు తమ కవి జీవితములయం దిచ్చియున్నారు. ఈ కథలనుబట్టి రాయల కదియే ప్రథమ వివాహమని తెలుచున్నది. కాని రాయలకది ప్రథమవివాహము కాదు. గజపతి పుత్రికను వివాహమాడుటకుఁ బూర్వమే రాయలు రెండు వివాహము లాడియుండెను. ఆయనకు రుచీదేవి యను భార్య యున్న శిలాశాసనము నందును గానరాదు. గ్రంథములందును లేదు. గజపతి తనయ తన వివాహానంతరము రాయలను వీడి యుండెననుటయు సరిగాదు. ఇందుకు విదేశీయ స్వదేశీయ గ్రంథకర్తల వ్రాతలు అడ్డు వచ్చుచున్నవి. న్యూనిజ్ మొదలగు విదేశీయులు రాయల పట్టమహిషులలో నొక్కతె కటక పురాధీశ్వరుని తనయ యని స్పష్టముగఁ జెప్పియున్నారు. వదలిపోయిన భార్యను పట్టమహిషిగా నెవ్వరును జెప్పరుగదా! నాదెండ్ల గోప మంత్రి 'కటకేందు పుత్త్రి పవిత్రీకృత భూత ధాత్రి' అని చెప్పినాఁడు. భర్తను తిరస్కరించిన భార్య యితరములగు సత్కార్యము లెన్ని యాచరించి యున్నను భారతీయ ధర్మానుసారము పవిత్రీకృత భూతధాత్రి కాఁజాలదు. కావున గజపతి తనయపేరు రుచీదేవి కాదు. ఆమె తన భర్తను వీడనులేదు.

ఈ రుచీదేవియే తన పేరు 'వరదరాజమ్మ' యని మార్చుకొనినట్లును, కంబమునొద్ద నొక పెద్ద తటాకమును త్రవ్వించినట్లును, రాయల మనసు కరగుటకై తుక్కా పంచకమను నైదు శ్లోకములను రచించి యాతని కడకు బంపినట్లును ఒక గాథ గలదు. తుక్కా పంచకమున నీ క్రింది శ్లోకములున్నవి :

౧. చర న్వనాన్తే నవమఞ్జరీషు న షట్పదో గన్ధ ఫలీమజిఘ్రత్,
సా కిం న రమ్యా స చ కిం న రన్తా బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా.

1. The Gajapati King's daughter named Ruchidevi felt disposed to remain near Stambum (Cumbam) and the Ragar directed to do so, while he returned to Vijayanagaram. That daughter of Gajapati, Ruchidevi said that as Krishnadevaraya was the son of a Dasi and she herself noble tribe illustrious of her birth, she preferred to abide by Cumbum.

౨. మా కింశుక ప్రకటయాత్మ నిమేష మాత్రం
మనస్మస్తకే విహరతీతి మధువ్రతోఽయమ్,
కిం మాలతీ విరహవేదనయా త్వదీయమ్
దృష్ట్వా ప్రసూన మచిరా దనలభ్రమేణ.

౩. భ్రమర భ్రమతా దిగన్తరాశే
క్వచి దాస్వాదిత మీక్షితం శ్రుతం వా,
వద సత్య మపాస్య పక్షపాతం
యది జాతీకుసుమానుకారి పుష్పమ్.

౪. కుసుమాని లిఖన్తు నామ చిత్రే
కతిచిత్కారు విశేషరూఢ శిక్షాః,
సురభిత్వమమూని కిం లభన్తే
కిము చైతేషు రసం పిబన్తి భృఙ్గాః.

౫. కిం మాలతీం పాస్యసి మాం విహాయ
చుచుమ్బ తుమ్బీ కుసుమం షడఙ్ఘ్రిః,
లోకే చతుర్భి శ్చరణైః పశుస్స్యా
త్స షడ్భి రత్యర్థ పశుర్న కిం స్యాత్.

—తుక్కా నామగజపతి పుత్రీ కృష్ణదేవరాయపత్నీ.

ఈ శ్లోకములు తుక్కాదేవి రచించినవి గావనియు, (వీరి యుద్దేశమున తుక్కాదేవియే వరదరాజమ్మ లేకరుచీదేవి) యింకొక్క శ్లోకము క్రీ.శ. 1400లకు పూర్వమే రచింపఁబడిన వల్లభదేవుని సుభాషిత రత్నావళి యందు గలదనియు. నింకొకటి క్రీ.శ. 900 లకు బూర్వమే రచింపఁబడిన 'ముకుళభట్ట కృతాభిధా వృత్తి' మాతృకయందు గలదనియు శ్రీరామకృష్ణకవిగారు చెప్పినట్లు తిరుపతి దేవస్థానము వారి రిపోర్టులలోఁ గలదు. కాని యంతమాత్రమున నీశ్లోకములకు తుక్కాదేవితో సంబంధము లేదని చెప్పఁజాలము.

ఈ శ్లోకము లామె స్వకపోల కల్పితములు గావనియు, పూర్వకవికృత శ్లోకములనే యింజామె యుదాహరించి యున్నదనియు దీనినిబట్టి తేలును. విదుషియగు నాతుక్కాదేవి పూర్వకవి కృతశ్లోకముల నుదాహరించినదని చెప్పుటలో నాశ్చర్యపడవలసిన విషయమేమియును లేదు. ఇందున్న క్లిష్ట సమస్య మరొకటియై యున్నది.

ఈ శ్లోక పంచకము నందలి చివరి శ్లోకమును గమనించినచో భర్తృ పునస్సమాగమమును గాంక్షించు వనిత యట్టి యర్థమునిచ్చు నాశ్లోకమును భర్త యొద్దకు బంపి యుండునా యను సంశయము జనింపకపోదు. పశువునకు

నాలుగు పాదములుండును. ఆఱు పాదములుగల భ్రమరము (షడంఘ్రి) అత్యర్థ పశువగును. మామూలు భాషలో 'పశువున్నర' యని చెప్పవచ్చును. ఐదవ శ్లోకమునందలి ద్వితీయ చతుర్థపాదములు వయియర్థమునే చెప్పుచున్నవి. భర్తయొక్క యనురాగమును గాంక్షించు నేస్త్రీయు నట్లు వ్రాయఁజాలదు. వ్రాయదు. కావున నీశ్లోక పంచకము రాయలపత్ని రచించెననుట పరిహాసాస్పదము. తుక్కాయను పేరుగల మఱెవ్వరైన నిట్లు రచించి యుండనోపు. గజపతి పుత్రికి వీనితో నెట్టి సంబంధములేదు.

కృష్ణరాయ విజయమునందు గజపతి పుత్రిపేరు 'తుక్కా' యని చెప్పఁబడి యున్నది. (తుక్కా పంచకమును రచించిన దీమెకాదు.) దుర్గా శబ్దభవము తుక్కా. గజపతులు దుర్గోపాసకులు గావున నామెకది తల్లిదండ్రులిడిన ముద్దు పేరు గావచ్చును, ఆమె నిజమగు పేరన్నపూర్ణయే గావచ్చును లేదా తుక్కాన్నపూర్ణ గావచ్చును. ప్రజలందఱామెను తుక్కాదేవి యని వ్యవహరించు చుండగా రాయలామె నన్నపూర్ణయని పిలుచుచుండ వచ్చును. శ్రీ వేటుమళ్ళ అచ్యుత రావుగారు ఆమె మొదటిపేరు దుర్గయై యుండవచ్చుననియు, వివాహానంతరము వైష్ణవుఁడగు రాయలు కేవల శాక్తేయమునుదెల్పు నా దుర్గా నామమునుమార్చి, వైష్ణవ శాక్తేయముల రెండింటికిని జెందని అన్నపూర్ణయను పేరామె కిడెననియు వ్రాసియున్నారు. కాని అన్నపూర్ణయను శబ్దము వైష్ణవ శాక్తేయములకు రెండిటికిని జెందని పదమెట్లయ్యెనో నాకు దెలియుటలేదు.

కాశీ విశ్వేశ్వరుని పేరన్నపూర్ణ. ఆమె శక్తిస్వరూపిణి. శ్రీనాథుఁడీక్రింది పద్యమున నామెను ఆదిమ శక్తియని వాకొని యున్నాఁడు.

వేదపురాణ శాస్త్ర పదవీనదవీయసియైన పెద్దము
త్తైదువ కాశికానగర హాటకపీఠ శిఖాధిరూఢ య
య్యాదిమశక్తి సంయమివరా! యిటురమ్మని పిల్చె హస్తసం
జ్ఞాదర లీల రత్నకటకాభరణంబు ఘల్లుఘల్లనన్.

ఆదిమశక్తి యనఁగా దుర్గయేకదా! అట్టియెడ నన్నపూర్ణకును దుర్గకును గల భేదమేమి? ఇక వ్యుత్పత్తిని బట్టి యట్లు చెప్పితి మందురేని, దుర్గాశబ్దము మాత్రము యుత్పత్తినిబట్టి శాక్తేయమగునా? మఱియు రాయలంతటి మత సహనము లేనివాఁడా! అతని జీవిత చరిత్రమునందలి యనేకాంశములనుబట్టి, రాయలు మతవిషయమున కేవల సహనభావమునే వహించుచుండెనని మనకుఁ దెలియుచున్నది. కావున వివాహానంతరము రాయలామె పేరు మార్చెననుట సమంజసముగాఁ దోపదు.

ఆమె పేరు అన్నపూర్ణయే గావచ్చును. తుక్కా యనునది యామె ముద్దు పేరయి యుండును. లేదా ఆమె పేరు దుర్గాన్నపూర్ణయైనను గావలయును.

గజపతి పుత్రి పేరన్నపూర్ణయను విషయమున జనశ్రుతియు మనకు సహాక రించుచున్నది. ఓఢ్రభాష యందలి గ్రంథముల యందట్లే యున్నది. కావున అన్నపూర్ణయే గజపతి పుత్రిక.

ఇక వీరిని (తిరుమల దేవ్యన్నపూర్ణా దేవులను) కమలాబ్జ ముఖులనుట లోని స్వారస్యమును శ్రీ చేకుమళ్ళ అచ్యుతరావు గారిట్లు వివరించియున్నారు:

తిరుమల దేవియు, నన్నపూర్ణా దేవియు, వీరిద్దఱును గమలాబ్జముఖు లుగాఁ గవిచే వర్ణింపఁబడిరి కాని ప్రత్యేక స్త్రీ నామములుగ వీనిని గవి యుపయోగింపలేదని నేనూహించుచున్నాను. కమల యనియు, నబ్జముఖి యనియు పేఱుగనున్న యిద్దఱు రాణులను రాయలు పేర్కొన లేదని నా యూహ. కాని తన భార్య లిద్దఱినిఁ గమలాబ్జముఖులని వర్ణించుట యందలి స్వారస్యమేమి యనిన నీ మాటలచే వారిద్దఱి సౌందర్య మహిమను వర్ణించుటయేగాక వారి సాపత్న్య ధర్మమును గూడ నిగూఢముగఁ గవి సూచించెనని నాకుఁ దోఁచుచున్నది. 'కమలము' అనఁ దామరపువ్వు-అబ్జముఖి యనఁ జంద్రముఖి. కావునఁ గమలమునకుఁ జంద్రునకునుగల యన్యోన్య ధర్మమే వీరిద్దఱి యందును గాన్పించుచున్నదని శ్లేషరూపమున నర్మగర్భముగ సూచించినాఁడు.

ఈ యర్థమే సమంజసమని నా యూహ. ఇందువలన శ్రీకృష్ణరాయల దక్షిణ నాయకత్వమున కెట్టిభంగమునులేదు. దక్షిణ నాయకుఁడన భార్యల నందఱ నొకేరీతిని జూచువాఁడనిగదా? సపత్నులలో నీర్ష్యాసూయలున్నచో వాని కాతఁ డెన్నడును బాధ్యుఁడుకాఁడు. తనకు సంబంధించినంతవఱకు తన పత్ను లందఱియెడలను తాను సముఁడై వర్తించుటయే దక్షిణనాయక ధర్మము. కావున అచ్యుతరావుగా రిచ్చిన యర్థము రాయల దక్షిణ నాయకత్వమునకు భంజకము గాదు.

పై విషయములనుబట్టి తేలిన సారాంశమిది : రాయలకు ముప్వురు భార్యలు గలరు—1. తిరుమలదేవి, 2. చిన్నాదేవి, 3. అన్నపూర్ణాదేవి. ఇందన్నపూర్ణయే ప్రతాపరుద్ర గజపతి పుత్రిక.

# రాయల దిగ్విజయములు

క్రీ. శ. 1509 వ సంవత్సరమున జూలై 26 వ తేదీని రాయలు రాజ్యాధికారమును స్వీకరించెను. క్రీ. శ. 1510 వ సంవత్సరము జనవరి 28 వ తేదీని పట్టాభిషిక్తుఁడాయెను. రాజ్య స్వీకారానంతరము ఇంచుమించుగ నాలుమాసములు తన రాజ్యమును జక్కఁజేసికొనుటయందే యాతఁడు గడిపివేసెను. తన సామంతులలో నెవ్వరు రాజభక్తి గలిగి తనయందు విశ్వాసము గలిగి యుండిరో, యెవ్వరు తటస్థభావమును వహించియుండిరో, యెవ్వ రుద్ధతులై తిరుగుబాటుసేయ సమయమునకై వేచియుండిరో తగిన గూఢచారులను నియోగించి తెలిసికొనెను. పరదేశములకుగూడ గూఢచారులను నియోగించి యాయా రాజుల మనస్తత్త్వమును, బలపరాక్రమములను తెలిసికొనుచుండెను. తన రాజ్యము శత్రు నిర్భేదముగ నుండుటకై తన సైన్యమును పెంపొందించుటయందుగూడ నిమగ్నుఁడై యుండెను. రాబడులను సరిగఁ జూచుకొని, కోశాగారమును వృద్ధిచేసెను. ఇట్లు సర్వసన్నద్ధుఁడైన తర్వాతనే జైత్రయాత్రను సాగింప రాయలు నిశ్చయించెను.

రాజ్య స్వీకారమునకును, బట్టాభిషేకమునకును మధ్యకాలమున రాయలొక దండయాత్రను మాత్రము చేసినట్లు కన్పట్టుచున్నది. ఆ దండయాత్రయందు రాయచూరు, ముద్దకల్లు దుర్గములు రాయల వశమయ్యెను. అంతకు ముందవి బిజాపురపు నవాబగు యూసఫ్ ఆదిల్‌ఖాను వశమందుండినవి. ఆదిల్‌ఖానుఁ దేమరి యున్నప్పుడు రాయలాకస్మికముగ వానిపైఁబడి యాదుర్గములను వశముచేసికొనెను.

ఇదియే మొదటి రాయచూరు యుద్ధమనవచ్చును. ఉమ్మత్తూరు దండయాత్రకుఁ బూర్వమే యీ యుద్ధము జరిగెను. రాయల పట్టాభిషేక కాలముననే వేయఁబడిన (28—1—1510) హంపీ శాసనమునందలి 'పరిభూత సురత్రాణేన' అను బిరుద మీ దండయాత్రనే తెల్పుచున్నదని చరిత్రకారుల యభిప్రాయము. ఈ దాడి హఠాత్సంభవ మగుటచే ఆదిల్‌ఖానుఁడు పలాయితుఁడైనాఁడుకాని, మరణింపలేదు. కావుననే హంపీశాసనమున 'పరిభూత' శబ్ద మువయోగింపఁబడినది. ఈయుద్ధయాత్రలను కృష్ణరాయ విజయ మిట్లు వర్ణించుచున్నది:

చటిత దిక్తట నట త్పట పెటార్భటులతో
　　ఘోరమైన తుపాకిగుండ్లచేత
దవ్వుదవ్వున హెచ్చి రివ్వురివ్వునవచ్చి
　　ప్రసరించు రాచూరి బాణములను

పెల్లుగా వెసచిత్తజల్లుగా వెదజల్లు
పెంపరుల్ బెంపారు నంపగములు
ధాటీగతి నటింప మాటికి సూటిగా
నాటుకొన బల్లెంపు టీటిగములు
నటిమి తలిమిన భయమున విఱిగి జరగి
నిజబలంబుల ధాకకు నిల్వలేక
శరణు జొచ్చిన వారలఁ గరుణఁ జూచి
యచటి దుర్గస్థలంబుల నాక్రమించి.

ఈ యుద్ధమును రాయలు గావించుటలో నొక రాజనీతిరహస్య మిమిడి యున్నది. ఆదిల్‌ఖానుఁడును, ఉమ్మత్తూరు ప్రభువగు గంగరాజును మిత్రులు. వీరికి విజయనగరాధిపతులతోఁగల సమాన శత్రుత్వమే వీరిమైత్రికి ముఖ్య కారణము. వీరనరసింహరాయల కాలమున నుమ్మత్తూరు ప్రభువు స్వాతంత్ర్యమును బ్రకటింపగా, నరసింహరాయ లాతనిపై దాడిచేసెను. అంతట గంగరాజునకు సాహాయ్యము గావించుటకై ఆదిల్‌ఖాను విజయనగరముపై దండెత్తెను. నగర రక్షణము ముఖ్యముగావున వీరనరసింహరాయలు గంగరాజుతోడి యుద్ధమును మాని తిరిగి రావలసినవాఁడాయెను.

కృష్ణరాయ లిద్దానిని ఒక గుణపాఠముగా గ్రహించినాఁడు. ఉమ్మత్తూరుపై దండువెడలుటకు పూర్వమే రాయచూరు ముద్దగల్లు దుర్గములు స్వాధీనములు కావలయును. అవి ఆదిల్‌ఖానుని చేతిలో నుండగా దక్షిణమునకుఁ బోయిన వీరనరసింహరాయల కాలము వలెనే, ఆదిల్‌ఖాను విజయనగరముపై దాడిచేయవచ్చును. కావుననే రాయలు మొదటనే మేల్కొని, ఆదిల్‌ఖానుపైఁ బడి రాయచూరు ముద్దగల్లు దుర్గములను స్వాధీనముచేసికొనెను.

పట్టాభిషిక్తుఁడయిన యనంతరము, రాయ లుమ్మత్తూరుపై మొట్టమొదట దండయాత్ర సాగించెను. ఈ యుద్ధము క్రీ. శ. 1510 – 11 లో జరిగెనను విషయమున జరిత్రకారులలో భేదాభిప్రాయము లేదు. ఇందుగూడ రాయలు తన రాజనీతి కౌశలమును విశదీకరించి యున్నాఁడు. ఉమ్మత్తూరు గంగరాజునకును, ఆతని దాయాది యగు నిమ్మళి చిక్కరాజునకును వైరము. రాయలు భేదోపాయమును బ్రయోగించి, చిక్కరాజునకుఁ గొంతరాజ్య మానగొల్పి, యాతనిని దనవంకకుఁ ద్రిప్పికొనినాఁడు. ససైన్యముగ చిక్కరాజు దనవెంట నంటియుండగా, ఉమ్మత్తూరు, శివసముద్రము, శ్రీరంగపట్టణము అను మూఁడు దుర్గములను రాయలు జయించినాఁడు, కావేరీలోఁబడి గంగరాజాత్మహత్య చేసికొనెను. తన వాగ్దానము ప్రకారము రాయ లుమ్మత్తూరును చిక్కరాయల కిచ్చివేసెను.

కోయంబత్తూరు మండల మందలి కుంతూరు గ్రామమందు చిక్కరాయల శాసనమొకటి గలదు. అందు చిక్కరాయ లుమ్మత్తూరు ప్రభువుగాఁ జెప్పఁబడి యున్నాఁడు. శాసనకాలము క్రీ. శ. 30-5-1512. కావున నానాటికి, ఉమ్మత్తూరు యుద్ధము ముగిసినదనియు, రాయలు, చిక్కరాయలను ఉమ్మత్తూరు ప్రభువుగా చేసెననియు నిర్ణయింపవచ్చును. రాయల దక్షిణదేశ విజయమును గూర్చి శ్రీ లక్ష్మణరావు పంతులుగారు తమ మహమ్మదీయ మహాయుగమున నిట్లు వ్రాసియున్నారు:

> ఇట్లు కర్ణాటకము జయించిన పిదప కొడగు (Coorg) మళయాళము అను దేశములఁగెలచి యచ్చటిరాజులిచ్చు కప్పము నిర్ణయించుకొని పాండ్యాది దక్షిణ దేశములను జయించుటకై లక్ష సేననిచ్చి విజయప్ప నాయకుఁడు, వెంకటప్ప నాయకుఁడు అను వారిని బంపెను. విజయప్ప నాయకుఁడు వేలూరుప్రాంతమును జయించి వేలూరు మధ్యస్థానము చేసికొని యచ్చటనుండి పన్నులు వసూలు చేయుచుండెను. చిత్తూరు పాలెగాండ్రను తొండమండలములోని పాలెగాండ్రను, జింజిదుర్గమును, చోళమండలములోని పాలెగాండ్రను వశపఱచుకొని, వారియ పన్నుల నిర్ధారణఁజేసి, జింజిలోఁ గాపురముండి, కృష్ణరాయలకై పన్నులు రాబట్టుకొనుచుండెను. తంజావూరు, తిరుచునాపల్లి, మధుర, తిరునగరు రాజులు విజయప్ప నాయకునకు వశులై కప్పము లొప్పుకొనిరి. ఇట్లు పూర్వ కర్ణాట ద్రవిడ దేశమంతయుఁ గృష్ణరాయలకు వశమై, మూఁడు కోట్ల రూకలిచ్చుచుండెను. కృష్ణరాయ లీదక్షిణ దేశమంతను మూఁడు భాగములుగా విభజించి, వానిపై ముగ్గురు నాయకుల నేర్పఱచెను. జింజిలోనుండు కృష్ణప్పనాయకుఁడు నెల్లూరు మొదలు కొల్లడము నది వఱకును, విజయరాఘవనాయకుఁడు తంజావూరిలోనుండి కావేరీనది ప్రవహించు ఫలవంత దేశములకును, వెంకప్ప నాయకుఁడు దక్షిణ మందలి తిరునల్వేలి ప్రాంతమునకును పాలకులుగానుండిరి. ఇట్లు కర్ణాట ద్రావిడ మళయాళదేశము లాంధ్రుల స్వాధీనమయ్యెను. ప్రస్తుత మాదేశములలోఁ గానవచ్చు తెలుఁగు బ్రాహ్మణులు, రెడ్లు మొదలైన వారాకాలమందుఁ దెలుఁగు దేశమునుండి వెళ్ళినవారే.

ఉమ్మత్తూరు విజయమును దక్షిణదేశ విజయ వృత్తాంతమును పారిజాతాపహరణ మించుకఁ జెప్పుచున్నది. దక్షిణదేశ విజయమునుగూర్చి గాని, మొదటి రాయచూరు యుద్ధమునుగూర్చి గాని శాసన వాఙ్మయము లందంతగా గానరాదు. దీనికి కారణమిది గావచ్చును. అవి పూర్వము విజయనగర రాజ్యములోనివే. అవి మరల స్వాధీనము చేసికొనఁబడినవి. స్థితస్థాపనమగు నీవిషయమునుగూర్చి పెద్దగాఁ జెప్పికొనుట కానాఁటివారు ముచ్చటపడలేదేమో!

దక్షిణదేశ విజయానంతరము రాయలు రెండవ రాయచూరు యుద్ధమును గావించెను. అప్పుడాతఁడు గజపతిపై దండయాత్ర సలుప సర్వసన్నద్ధుఁడగుచుండెను. అట్టియెడ బిజాపురపు నవాబు, గోల్కొండ, అహమ్మదునగర సుల్తానులు తోడురాగా రాయచూరుపై దాడి వెడలుచున్నాఁడని రాయలకు తెలిసెను. వెంటనే యాతఁడు ప్రచండసైన్యముతో రాయచూరుకేగి, కృష్ణానదిని దాటి, మహమ్మదీయ ప్రభువులు ముగ్వురను జయించెను. దీనిని రెండవ రాయచూరు యుద్ధమని చెప్పవచ్చును. ఈ యుద్ధమునందే ఆదిల్‌ఖాను కృష్ణరాయలచే సంహరింపఁబడినాఁడు. ఆముక్తమాల్యదాకృత్యాదియందలి యీ క్రింది పద్యము యీ విషయమునే చెప్పుచున్నది :

అలుకన్ఫోటక దట్టికాఖురపుటీహల్యా న్ఖురాసాని పు
చ్చలు వోదున్ని చలచ్చమూగజ మదాసారప్లుతిస్ఫీర్తిపు
ష్కల సస్యంబిడి యేకధాటి బళిరా కట్టించితౌ దృష్టి కే
దులఖానోగ్రకపాల మర్దపహరిద్భూజాంగల శ్రేణికిన్.

కాబూలునకు పూర్వోత్తరమున నున్నదేశము ఖురాసానుదేశము. ఆ దేశపుభటులు ఆదిలుఖానుని సేనలోనుండి యుందురు. వారి తలలే యిందు ఖురాసాను పుచ్చలుగా చెప్పఁబడినవి.

ఈ యుద్ధము జరిగిన తరువాత రాయలొక ఘనకార్యము గావించినాఁడు. అదియు నాతని రాజనీతి కుశలత్వమునకే తార్కాణగ నున్నది. బహమనీ సుల్తానగు రెండవ మహమ్మదు షాహా గుల్‌బర్గ దుర్గమున జెఱయందుండెను. ఆతనినట్లు బంధించినవాఁడు ఏదులఖాననియే పలువుర చరిత్రకారుల యభిప్రాయము. రాయలు మహమ్మదు షాహాను జెఱనుండి విడిపించి మరల బీదరు సింహాసనమున సుప్రతిష్ఠితుని గావించెను. 'యవనరాజ్య స్థాపనాచార్య' అను రాయల బిరుద మీ విషయమునే వ్యక్తము సేయుచున్నది. గజపతిపై దాను దండయాత్ర సాగించునపుడు మహమ్మదీయులవలని యొత్తిడి తనకుఁ గలుగకుండుటకయి రాజనీతి విశారదుఁడగు రాయలట్లు గావించెను.

దక్షిణ దిగ్విజయానంతరము రాయలు పూర్వ దిగ్విజయమును గావింప సర్వసన్నాహములను జేసికొనెను. ఈ జైత్రయాత్ర క్రీ. శ. 1514 వ సంవత్సరము ప్రారంభమాయెను. క్రీ. శ. 1517 వ సంవత్సరాంతమున ముగిసెను. అనఁగా నాల్గు సంవత్సరము లీ దండయాత్ర నడచిన దనుట. మఱియు నీ జైత్రయాత్రలు నాలుగుసార్లు జరిగినవి. ప్రభుభక్తిపరాయణుఁడును, రాజనీతి విశారదుఁడును నగు తిమ్మరుసు మంత్రిత్వము రాయల కీదండయాత్రలలో శ్రీరామరక్షయై నిలిచినది.

కృష్ణరాయల కాలమున ప్రతాపరుద్ర గజపతియను నాతఁ డుత్కళమును బరిపాలించుచుండెను. నెల్లూరు మొదలు గంజాము మండలము వఱకుఁగల భాగమును తెలంగాణాయందలి కొంతభాగమును గజపతి యధీనమందుండెను. ఆ కాలమునఁగల రాజులలో గజపతి మహాబలశాలి. అమేయమగు గజబలము గలవాఁడు. ప్రచండ సేనాసముపేతుఁడు. లెక్కకు మిక్కిలియగు ధనసంపద గలవాఁడు. వేయేల. ఆనాఁడు ప్రతాపరుద్ర గజపతి నెదిరింపఁగల రాజు లేఁడనియే చెప్పవచ్చును. రాయల పూర్వ దిగ్విజయ యాత్రలను దెలుపు శాసనము లనేకములు గలవు. వానినిబట్టి యీ క్రింది విషయములు దెలియు చున్నవి :

(i) రాయలు క్రీ. శ. 1513 సెప్టెంబరు నెలలోఁ బ్రప్రథమముగా పూర్వ దిగ్విజయమునకయి బయలుదేరెను. క్రీ. శ. 1514 జూన్ నెలలో ఉదయగిరి దుర్గమును సాధించెను. ఈ యుద్ధమున గజపతి పిన్నతండ్రి తిరుమల కాంతరాయఁడు రాయలకు పట్టువడినాఁడు.

(ii) క్రీ. శ. 1514 వ సంవత్సరమున వర్షాకాలమంతయు విజయ నగరమునందే రాయలు గడపెను. శరదాగమము కాగానే మఱల జైత్రయాత్ర సాగించెను. ఈసారి దుర్గమమగు కొండవీటి దుర్గమును బహు ప్రయాసమున కోర్చి సాధించెను. క్రీ. శ. 1515 జూన్ 23 వ తేదీని కొండవీడు దుర్గము రాయల వశమైనట్లు, కొండవీడు దుర్గముననే తిమ్మరుసు వేయించిన యొక శాసనమునుబట్టి తెలియుచున్నది (శా. శ. 1437 యువ సంవత్సర ఆషాఢ శుద్దైకాదశి, శనివారము). ఈ శాసనమున తిమ్మరుసే దుర్గమును జయించినట్లు గలదు. ఈ విజయమునకు తిమ్మరుసు రాజనీతిజ్ఞతయే ముఖ్యకారణమై యుండును. అందులకే తిమ్మరుసు జయించినట్లిందున్నది. ఏమైననేమి ? ఈ శాసన కాలమునాటికి కొండవీటి దుర్గము రాయలవశమగుటమాత్రము తథ్యము.

ఇందు ప్రతాపరుద్ర గజపతి పుత్రుఁడు వీరభద్ర గజపతి రాయలకుఁ బట్టువడినాఁడు. దుర్గమందున్న సరదారు లనేకులు బంధింపఁబడిరి. కుమార హంవీరపాత్రుని కొడుకు నరహరదేవుఁడు, రాచూరి మల్లిఖానుఁడు, ఉద్దండ ఖానుఁడు జన్యావుల కసవపాత్రుఁడు, పూసపాటి రాచిరాజు, శ్రీనాథ రామరాజు, లక్ష్మీపతిరాజు, పశ్చిమ బాలచంద్ర మహాపాత్రుఁడు మొదలగువారు పట్టువడిరి.

(iii) కొండవీటి విజయానంతరము రాయ లమరావతి కేగి తులాపురుష దానము గావించెను. తరువాత శ్రీశైలమున కేగెను. క్రీ. శ. 1515 జూలై ఎనిమిదవ తేదీ అమరావతి యందును, జూలై ఇరువదిఐదవ తేదీని శ్రీశైలము నందును రాయలు శాసనములు వేయించెను. క్రీ.శ. 1515 లో వర్షాకాలమంతయు విజయనగరమునందే గడపెను.

తరువాత బెజవాడకువచ్చి, అటనుండి కొండపల్లికేగి, ఆ దుర్గమును సాధించెను. తరువాత వరుసగా ననేక దుర్గములు రాయల వశమైనవి. అనంతగిరి, ఉంద్రకొండ, ఉల్లకొండ, ఆరువపల్లి, జల్లిపల్లి, కందికొండ, కప్పలువాయి. నల్లగొండ, కంభంమెట్టు, కనకగిరి మొదలైన తెలంగాణా దుర్గములు రాయల వశమైనవి. తరువాత నాతఁడు రాజమహేంద్రవరమును జయించి, అటనుండి సింహాద్రి కేగి, పొట్నూరికడ జయస్తంభమును స్థాపించెను.

(iv) ఇంతదనుక రాయల దండయాత్రలనుగూర్చి స్పష్టముగా తెలియుచున్నది. ఇటుపై దండయాత్రల విషయము మాత్రము ఆనాటి శాసనములఁ బట్టిగాని, వాఙ్మయమును బట్టిగాని స్పష్టముగాఁ దెలియుటలేదు. కటకముపై రాయ లెప్పుడు దండయాత్రచేసెను ? గజపతితో సంధి యెప్పుడు జరిగెను ? గజపతి తనయ నాయన యెప్పుడు వివాహమాడెను ? అను ప్రశ్నలకు తగిన సమాధాన మిచ్చుటకు సరియగు నాధారములు గానరాకున్నవి.

ఈ యాధారరాహిత్యమునుబట్టి కొందఱు పొట్నూరున విజయస్థంభమును స్థాపించినతరువాత రాయలు మఱి కటకముపయి దండయాత్ర సాగింపలేదనియు, విజయనగరమున నుండగనే సంధి ప్రయత్నములు జరిగినవనియు, రాజధానియందే ప్రతాపరుద్ర గజపతి తన తనయను రాయలకిచ్చి, వివాహము గావించి, యాతనితో సంధి గావించుకొనెననియు తలంచుచున్నారు. వీరభద్ర గజపతితోఁ బాటు ప్రతాపరుద్ర గజపతి భార్యనుగూడ రాయలు బందీగా దీసికొనిపోయెననియు, నందులకే గజపతి భయమంది, యాతనితో సంధిచేసికొని, తన భార్యను విడిపించుకొనెననియు కొందఱు దలంచుచున్నారు. రాయలు గజపతి భార్యనుగూడ బంధించి గొనిపోయె ననుటకు మనుచరిత్రయందలి 'కళింగాంగనా బందీగ్రాహ' అను పద్యభాగమును, స్యూయెల్ వ్రాతయు నాధారములుగా నున్నవి.

మనుచరిత్ర నాధారముగాఁగొని, గజపతి భార్యను రాయలు బందీగా గొనిపోయెనని చెప్పుట కవకాశము చాలదు. గజపతి భార్య కళింగాంగన కాదు. ఆమె యుత్కళదేశపు స్త్రీ. ప్రతాపరుద్ర గజపతి కాళింగుఁడును గాఁడు. ఆ కాలమున నాతఁడు కళింగాధీశుఁడు మాత్రమే. పెద్దన యిందు గజపతి భార్యను గూర్చియే చెప్పఁదలఁచినచో 'కళింగాధీశాంగనా' యని చెప్పవలసి యుండును. కళింగాంగన యనఁగా కళింగదేశపు స్త్రీ యని మాత్రమే యర్థము వచ్చును. కావున మనుచరిత్ర నిట నాధారముగా గొనుటకు వీలులేదు.

ఇక నిచ్చట 'కళింగాంగనా బందీగ్రాహ' అను పదమున కర్థ మిట్లు చెప్పుకొనవచ్చును. కొండపల్లి, కొండవీటి దుర్గములు రాయలు వశమగునపుడు, అందలి సరదారులును, వారి భార్యలును రాయలకు బందీలయిరి.

ఆ సరదారుల భార్యలు కళింగాంగనలయి యుందురు. వారినిగూర్చియే పెద్దన యిందు జెప్పియుండవచ్చును.

ఇఁక న్యూయెల్ విదేశీయుఁడు. అతఁడు భ్రాంతికి లోనగుట కవకాశము గలదు. అందును అంతఃపురస్త్రీలలో నెవ్వరెవ్వరో నిర్ణయించుట కాతని కవకాశము నుండియుండదు. మఱియు రాయలు ప్రచండ సైన్యముతో దండ యాత్ర సాగించుచుండ, నట్టి యుద్ధసమయమందు గజపతి తనభార్య నొక దుర్గమున నుంపవలసిన యావశ్యకము గానరాదు. రాజధానియగు కటకమును వీడి యీ దుర్గమునకు రావలసిన యవసరము నామెకు లేదు.

పై యంశములనుబట్టి చూడగా, ప్రతాపరుద్ర గజపతి భార్యను రాయలు బందీగా గొనిపోయె ననుమాట వాస్తవము కాదనియే తోచుచున్నది. అట్టియెడ భార్యను విడిపించుకొనుటకై గజపతి రాయలుతో సంధిచేసికొనెనను వాదమును పరాస్తమగుచున్నది. పొట్నూరున విజయస్థంభమును వేసిన తరువాత రాయలు కటకముపై దండయాత్రయే సేయలేదను వాదమును నిరాకృత మగుచున్నది.

(v) 'కటకపురిఁగాల్చె గజరాజు గలఁగి పఱవ' అను మనుచరిత్ర పద్యపాదమునుబట్టి, రాయలు కటకముపై దండయాత్ర సాగించె ననుమాట మాత్రము వాస్తవము. కాల్చె ననుమాట యత్యుక్తి గావచ్చును; గాని కటకముపై దాడియే చేయలేదనుట వాస్తవము కాదు. రాయలు జగన్నాథమువఱకు వెడలి నట్లును, ఆతని రాకనుగూర్చి విని గజపతి పారిపోయినట్లును ఆముక్తమాల్యద యందలి సప్తమాశ్వాసాంత పద్యమునుబట్టి తెలియుచున్నది:

ఇది నీలాచల నీలచేలక సుభద్రేందీవరాబ్జాక్షి కో
ణ దృగంచద్భుజ వీర్యధుర్య జయ సన్నాహోర్భటీ వాద్య భీ
త్యుదితేభేశ్వర కృష్ణరాయ మహిజాన్యుత్పాదితాముక్తమా
ల్యద నాశ్వాసము సప్తమం బలరు హృద్యంబైన పద్యంబులన్.

పారిజాతాపహరణమున నవతారికలో

అట్టులనె యడఁచుఁ గటకము నింకననుచు నుత్కళమహీశుఁ డను దినమ్ము వెఱచు నెవ్వనికి నతఁడు, రాజమాత్రుండె శ్రీ కృష్ణరాయ విభుఁడు

అని గలదు.

చతుర్థాశ్వాసాంత పద్యములలో 'కటకేశ సింధు మందర కుధరా' అనియు, 'కరణాధిక సూత్కృతి మద్వారదాకర దారణ వీరబలా' అనియుఁ గలదు. వీనిని బట్టి కటకేశ్వరుని రాయలు సంపూర్ణముగ జయించెనని చెప్పఁ

జాలము. కాని యాతని యపార సేనావాహిని నీతఁడు గలంచెనని మాత్రము చెప్పఁగలము.

పారిజాతాపహరణ రచనాకాలము నాటికి కటక విజయ మింకను బూర్తి కాలేదు. అందులకే తద్గ్రంథమున నా విషయము స్పష్టముగాలేదు. మనుచరిత్ర రచనాకాలము నాటి కది పూర్తియైనది. కావుననే తద్గ్రంథమున 'కటకపురిఁ గాల్చి' యని స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నది.

ఏది యెట్లున్నను కటక విజయము క్రీ.శ. 1517 వ సంవత్సరాంతమునకు సంపూర్తి యాయెననియు, గజపతికిని రాయలకును సంధి జరిగెననియుఁ జెప్పవచ్చును.

ఇందులకు కొమ్మూరు గ్రామమున రాయల సేవకుఁడగు లక్ష్మీకాంతరుసు క్రీ.శ. 1517 మార్చి, 12 వ తేదీని వేయించిన శాసనమును,[1] రాయల మంత్రులలో నొకఁడగు కొండమరుసయ్య క్రీ.శ. 1517 డిశంబరు 2 వ తేదీని వేయించిన చోళ సముద్రపు శాసనమును[2] ఆధారములు.

ఈ రెండు శాసనము లందును రాయలు కటకము వఱకు జయించినట్లు స్పష్టముగాఁ గలదు. కావున స్థూలముగా క్రీ.శ. 1517 వ సంవత్సరాంతమునకు కటకవిజయము పూర్తి యయ్యెనని చెప్పవచ్చును.

ఆముక్తమాల్యద యందలి యాశ్వాసాంత పద్యములు రాయల దిగ్విజయములనే చెప్పుచున్నవి. వాని నీ క్రింద నుదాహరించుచున్నాను :

1. ఇది గర్ణాట ధరాధృతి స్థిర భుజాహేవాక లబ్ధోధరా
   ద్యుదయోర్వీధర తత్పృత్పృవ్యకృత నవ్యోపాయ నోష్ణీషర
   త్నదృగంచత్పద కృష్ణరాయ వసుధాధ్యక్షోది తాముక్తమా
   ల్యద నాశ్వాసము హృద్య పద్యముల నాద్యంబై మహిం బొల్పగున్.

ఇందు ఉదయగిరి విజయము వర్ణింపఁబడి యున్నది. ఈ విజయ వృత్తాంతము ముందే చెప్పఁబడినది.

2. ఇది భూమండన కొండవీడు ధరణీభృద్దుర్గ పూర్వాద్రి భా
   స్వ దిభేశాత్మజ వీరభద్రజన జీవగ్రాహ రాహాయమా
   ణ దృఢాంచద్భుజ కృష్ణరాయ మహిభృన్నామ మస్మ దాముక్తమా
   ల్యద నాశ్వాసము హృద్య పద్యము ద్వితీయంబై మహింబొల్పగున్.

---

1. A. R. 824 of 1922
2. ద. హిం. శా. సం. 9 సంఖ్య 507.

ఇది కొండవీటి విజయమును వర్ణించుచున్నది. దీని వృత్తాంతము గూడ ముందే చెప్పఁబడి యున్నది.

3. ఇది పాత్ర ప్రహరేశ్వర ప్రభృతి బంహిష్ఠోత్కలానీక గు
ప్త దివి స్పృక్పటుయంత్ర కొండపలి హృద్భాహసి కద్రాజ దీ
ప్య దుదారోద్యమ కృష్ణరాయనృప సంజ్ఞా స్మత్కృ తాముక్తమా
ల్యద నాశ్వాసము హృద్యపద్యము తృతీయంబై మహిం బొల్పగున్.

ఇందు కొండపల్లి దుర్గమును, తక్కుఁగల తెలంగాణా దుర్గములను రాయలు వశపఱచుకొనిన విషయము వర్ణింపఁబడి యున్నది.

4. ఇది సింహాచల దంభకేసరి పదాభీష్టార్చనా పుణ్య ల
బ్ధ దురుట్టంకణ పొట్టునూరి విజయ స్తంభోపలోట్టంకితాం
క దృఢేష్టాక్షర కృష్ణరాయనృప సంజ్ఞా స్మకృ తాముక్తమా
ల్యద నాశ్వాస వరంబు నాలవది హృద్యంబై మహిం బొల్పగున్.

ఇందు పొట్నూరు వఱకును రాయల దిగ్విజయము వర్ణింపఁబడి యున్నది. పొట్నూరు కడ రాయలు తన దిగ్విజయ సూచకముగ విజయ స్తంభమును నాటించెను.

5. ఇది యంత్రోక్తి యథార్థనామ యవనాస్పృక్పూర్ణకెంబావి వా
రిద పద్ధత్యవరోధివప్రవలయ శ్రేణీ విఘాత క్రియా
స్పద సేనాగ్రగ కృష్ణరాయమహి భృత్సంజ్ఞాస్మ దాముక్తమా
ల్యద నాశ్వాసము పంచమం బమరు హృద్యంబైన పద్యంబులన్.

ఈ పద్యమున రాయలకు మహమ్మదీయులతో జరిగిన యుద్ధములు వర్ణింపఁబ యున్నవి.

ఇందు 'కెంబావి'ని గూర్చి పలువురు పలువిధముల వ్యాఖ్యానించి యున్నారు. కెంబావి యనఁగా 'కెంబా' అను పట్టణమని టీకాకారులు వ్రాసిరి. కాని శ్రీ లక్ష్మణరావు పంతులుగారు కెంబావిని గూర్చిన విషయము నిశ్చితముగా నిట్లు చెప్పియున్నారు :

> హైదరాబాదు రాజ్య పటమును జూడగా కెంబావి యను గ్రామము గుల్బర్గా జిల్లాలో గానవచ్చినది. ఇది గుల్బర్గాకు నైఋతి మూలను యాబదిమైళ్ల మీద నున్నది. షారాపురము, సాగర్ అనునవి దీనికి సమీపమునందే యున్నవి. పైన సురపురమని చెప్పఁబడిన షారాపురము నకు కెంబావి వాయవ్యమున పన్నెండు—పదిహేను మైళ్ల దూరమున నున్నది. సగరపురమని చెప్పంబడిన సాగర్, కెంబావికిఁ దూర్పున

పదహారు—పదిహేడు మైళ్లమీద నున్నది. కెంబావి, షారాపూర్, సాగర్ యీ మూడును గుల్బర్గా జిల్లాలోనివి. ఈ మూఁడును కృష్ణా భీమానదుల యంతర్వేదిలో కృష్ణకు నుత్తరమునను, భీమకు దక్షిణమునను నున్నవి. రాయచూరునకుఁ గెంబావి వాయవ్యమూలగా అరవై-డెబ్బయి మైళ్లమీద నున్నది. రాయచూరు కృష్ణా తుంగభద్రల యంతర్వేదిలో నున్నదని సదువరు లెఱింగియే యున్నారు. ఈ కెంబావి విజయనగరమునకు సూటిగ నుత్తరమున తొంబదిమైళ్ల దూరమున నున్నది.

కావున నాముక్తమాల్యదలోని కెంబావి యిదియే యని తలంచుట న్యాయము. ఈ కెంబావి పూర్వ మొకప్పుడు చాళుక్యులకు ముఖ్య రాజధానిగా నున్నట్లు తెలియుచున్నది.

6. ఇది నైరామన యావనావనిధవా హీనాభ్ర చుంబిస్ఫుర
ద్వివితాభీల మణీగృహాళి దళనోద్వేలోగ్ర హస్తి వ్రజో
ద్య దనీకాగ్రగ కృష్ణరాయ మహిభృత్సంజ్ఞాస్మ దాముక్తమా
ల్యద నాశ్వాసవరేణ్య మాఱవది హృద్యంబైన పద్యంబులన్.

ఇందు 'నైరామన' అను గ్రామముకడ జరిగిన యుద్ధము వర్ణింపఁబడినది. ఈ నైరామన యను గ్రామము రాయచూరు జిల్లాలోని మారీపురమునకు యీశాన్యమూలగానున్న గ్రామ మనియు, యిప్పటి దీని పేరు నిరుమానూరనియు శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు వ్రాసి యున్నారు.[1]

ఈ నైరామనకడ యుద్ధము 1509 లో రాయలు చేసిన దండయాత్రల సందర్భమున జరిగెననియు, కెంబావికడ యుద్ధము 1512 లోని దండయాత్రల సందర్భమున జరిగెననియు కొందఱి యభిప్రాయము. మఱికొందఱి యభిప్రాయమున నీ రెండు యుద్ధములు 1521 వ సంవత్సరమున జరిగిన రాయచూరు యుద్ధమునకు సంబంధించినవి.

7. సప్తమాశ్వాసాంతమునందలి పద్య మింతకుముందే[2] ఉదాహృతమై యున్నది. ఈ పద్యమున రాయలు జగన్నాధము వఱకు దండయాత్ర చేసెననియు, అంతట ప్రతాపరుద్ర గజపతి భయమంది పాఱిపోయెననియుఁ జెప్పఁబడినది.

ఈ యేడు పద్యములందును వర్ణింపఁబడిన దండయాత్రలు వరుసగా జరిగినవికావు. కాలక్రమమునుబట్టి రాయలు వీనిని వర్ణించినట్లు గానరాదు.

---

1. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సం. ౧౪, సంచిక ౪, పుట ౧౨౨.
2. చూడు పుట 151.

5, 6 పద్యములలో నుదాహృతములయిన దండయాత్రలు మహమ్మదీయులపై నడచినవి. తక్కినవి రాయల కళింగ విజయమునకు సంబంధించినవి.

క్రీ॥ శ॥ 1520 వ సంవత్సరము, మే నెల 19 వ తేదీని రాయలు మఱియొకమారు రాయచూరు దుర్గమును స్వాధీనము చేసికొనుటకయి యుద్ధము గావించెనని చరిత్రకారులందఱును చెప్పుచున్నారు. ఆ కాలమున ఇస్మాయిల్ ఆదిల్‌షాహ రాయచూరు దుర్గమును తన వశము చేసికొనుటచే, రాయలీ యుద్ధమును గావించెనని కొందఱి యభిప్రాయము. ఆదిల్‌షాహ రాయచూరును పట్టుకొనుటకయి, యుద్ధ సన్నాహములు చేయుచుండగనే రాయలాతని నోడించెననియు, ఆ మహమ్మదీయ ప్రభువునకు రాయచూరు దుర్గమప్పటికి స్వాధీనము కాలేదనియు గొందఱి యభిప్రాయము. ఈ యుద్ధమున ఆదిల్‌షాహ పలాయితుండయ్యెను. ఈ యుద్ధమునుగూర్చి చెప్పినవాఁడు న్యూనిజ్ అను విదేశీయుఁడు.

ఆదిల్‌షాను జయించిన పిమ్మట రాయలు బీదరుపయి దండివెడలెను. బరీదు అనునాతఁడు మహమ్మదు షాహా కుమారులను చెఱయందుంచెననియు, బరీదును జయించి రాయలు మహమ్మదు షాహా కుమారులను జెఱనుండి విడిపించెననియు న్యూనిజ్ వ్రాసియున్నాఁడు. బీదరు నా కాలమున బెడంద కోట యని పిలుచుచుండిరి. ఈ బెడందకోట విజయమునుగూర్చి పెద్దనగారి చాటువొకటి గలదు :

సమర క్షోణిని గృష్ణరాయల భుజాశాతాసిచేఁబడ్డ దు
ర్దమ దోర్దండ బెడందకోట యవనవ్రాతంబు సప్తాశ్వ మా
ర్గమునం గాంచి సెబాసహో హరి హరంగాఖోబు ఘోడాకి తే
తుమునీ బాయిల బాయిదే ములకి యందు ర్మింటికిం బోవుచున్.

# ఆముక్తమాల్యదాకర్తృత్వము

సాహితీ సమరాంగణ సార్వభౌముఁడగు శ్రీకృష్ణదేవరాయలు విష్ణుచిత్తీయమను నామాంతరముగల ఆముక్తమాల్యద యను మహా ప్రబంధమును భక్తిభావ నిర్భరముగా రచించియున్నాఁడు. ఇమ్మహాగ్రంథము శ్రీకృష్ణదేవరాయల కృతమే యని పండిత విమర్శకు లనేకు లంగీకరించి యున్నారు. కాని కొందఱు కొన్ని హేత్వాభాసములను జూపి, ఆముక్తమాల్యద పెద్దనార్య కృతమని వాదించుచున్నారు. వానిని బరీక్షించుట ప్రస్తుత కర్తవ్యము.

1. ఆముక్తమాల్యద యందలి యవతారికలో మనుచరిత్ర యందలి పద్యములు కొన్ని గానవచ్చుచున్నవి. కావున నీ గ్రంథమును పెద్దనయే వ్రాసి, రాయలపేర వెలయించెనని కొందఱి యభిప్రాయము.

2. లక్షణ గ్రంథకర్తలు కొందఱు ఆముక్తమాల్యదను పెద్దన కృతముగాఁ జెప్పియున్నారు. ఆంధ్రకవితా పితామహుఁడు 'కొనియె' ననుటకు 'కొనెనని' చెప్పెననుచు, అప్పకవి విష్ణుచిత్తీయమునుండి యుదాహరణ నిచ్చియున్నాఁడు. 'యథా అల్లసాని పెద్దనార్యేణ ఆముక్తమాల్యదాయామ్' అని అహోబలుఁడు చెప్పియున్నాఁడు. ఇట్లే మఱికొందఱుగూడ నాముక్తమాల్యదను పెద్దన వ్రాసెననియే చెప్పినారు.

ఉరువగు విష్ణుచిత్త తనయోద్వహనంబును సంస్కృతాంధ్ర వా
గ్గరిమ నలంక్రియారస సఖంబగునట్లుగఁ బెద్దనార్యుఁ డు
ద్ధుర ఫణితిన్ రచించె.... —శ్రీనివాస వ్యాఖ్య.

పేర్మి నల్లసాని పెద్దన్న యాముక్త
మాల్యదాఖ్య కృతి సమంచితముగ
జేసెనీవు టీకసేయుము చెఱకున
బండు పండినట్లై యుండుగాక. —గుడిపాటి వెంకటాద్రి.

3. ఒక అజ్ఞాతకవి చెప్పిన చాటువులో విష్ణుచిత్తీయము పెద్దనార్య కృతమని చెప్పఁబడి యున్నది :

కృష్ణరాయల పేరునిడి నీవు రచియించి తివి తొల్లి
విష్ణుచిత్తీయ మనఁగ
గాతిన్య మర్థంబు గ్రాహ్యంబుగాదు సా
ధారణులకని భూధవుఁడు బలుక

దరువాత మనుచరిత్రము నొసరించి తు
త్తమ కావ్యము మహాద్భుతముగఁ బిదపఁ
బెక్కుఁ గావ్యములను బెంపెక్క విరచించి
మంటివి రాజ సన్మానమునను
భంగమొందిన యల రామలింగ ముఖులు
సాటి రాఁగలవారె నీతోటి సౌర
యాంధ్ర కవితా పితామహ యల్లసాని
పెద్దనార్య విశేష వివేకధుర్య.

4. అంతఃపురములలోను, దర్బారులందును నిరంతరముఁ గాలము గడుపు రాజులెన్నడు నెఱుంగరాని సర్వసామాన్య జీవితమిందు వర్ణింపఁబడి యున్నది.

5. ఇందుఁ బ్రతిపాదింపఁబడిన వివిధ శాస్త్రవిషయములు నిరంతర శాస్త్రాధ్యయన సంపన్నులగు పండితులకే తెలియఁదగినవి. అవిరళ రాజకార్య నిమగ్నులగు రాజులెన్నడు నట్టి విషయములను కూలంకషముగ నెఱుంగుట కవకాశము లేదు.

6. కృష్ణరాయల కంకితము సేయఁబడిన మనుచరిత్రము, పారిజాతా పహరణము అను రెండు గ్రంథములయందును గూడ కృష్ణరాయలు కవితా ప్రియుఁడనియేగాని కవియని యెచ్చటను జెప్పఁబడలేదు. తత్కృత గ్రంథ ములును బేర్కొనఁబడలేదు.

మీఁది యంశములను వరుసగాఁ బరిశీలింతము.

1. అల్లసాని పెద్దన మనుచరిత్రములోని పద్యములు కొన్ని ఆముక్త మాల్యదలో నుండుట వాస్తవమే. కృష్ణరాయల వంశావళిని గూర్చియు, ఆతని శౌర్యధైర్య పరాక్రమాదుల గూర్చియు మనుచరిత్రావతారికలో పెద్దన కొన్ని పద్యములను వ్రాసియున్నాఁడు. కొన్ని స్వల్ప భేదములతో నా పద్యములే ఆముక్తమాల్యదయందును గాన్పించును. వీనిని బట్టియే కొంద ఱాముక్త మాల్యద పెద్దన కృతమనుచున్నారు.

కాని పండిత విమర్శకు లనేకులీ వాదము నంగీకరింపలేదు. వారి యుద్దే శమునఁ బెద్దన పద్యము లాముక్తమాల్యదయం దుండుటకుఁ గల కారణములు రెండు విధములుగా నున్నవి :

1. కృష్ణరాయల యవికత్థనత్వము.

2. పెద్దనయెడ రాయలకుగల గౌరవము.

కృష్ణరాయలాత్మస్తుతి పరాఙ్ముఖుడు. తన్నుగూర్చిగాని, తన వంశమును గూర్చిగాని స్తుతివాక్యములు సెప్పికొనుట కిష్టము లేనివాడు. కావుననే, ఆముక్త మాల్యదయందు స్వవంశ వర్ణనావసరమున బెద్దన కృతములగు •పద్యములను వాడుకొనియున్నాడు. ఇది మొదటి కారణముయొక్క స్థూలస్వరూపము.

కాని యిక్కారణము గొందఱికి రుచింపలేదు. అవతారికయం దాత్మ స్తుతికి వెఱచినకవి, ఆశ్వాసాంత పద్యములందెట్లాత్మస్తుతికిఁ బాల్పడెను? ఆముక్తమాల్యదయందలి యాశ్వాసాంత పద్యములు (ముందే యుదాహరింపఁ బడినవి) కేవల మాత్మస్తుతి పరాయణములే యనుట కెట్టి నిదర్శనములు నక్కఱలేదు. కావున, పెద్దన పద్యములిందుండుట కవికర్తృత్వము కారణమనఁ గాదు.

కృష్ణరాయలకు పెద్దనయెడగల గౌరవము జగత్ప్రసిద్ధము. ఆ గౌరవమే యాతని పద్యము లాముక్తమాల్యద యందుండుటకు ముఖ్యకారణము. ఈ గౌర వమును విశదీకరించుచు, శ్రీ శేకుమళ్ళ అచ్యుతరావుగారిట్లు చెప్పియున్నారు:

ఈయూహకుఁ దోడుగ నేను మఱియొక యూహనిచట సహృదయులకు విన్నవించుచున్నాను. కృష్ణదేవరాయలకు నల్లసాని పెద్దన్నగారియెడల నత్యంత భక్తివిశ్వాసము లుండినట్లనేక నిదర్శనములున్నవికదా!

ఎదురైనచోఁ దన మదకరీంద్రము నిల్పి
　　　కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందుకొనువేళఁ బురమేగఁ
　　　బల్లకిఁ దనకేలఁ బట్టియెత్తె
పిరుదైన కవిగండపెండేరమున కీవె
　　　తగుదని నాదు పాదమున దొడిగె
గోకటగ్రామాద్యనేకాగ్రహారంబు
　　　లడిగిన సీమలయందు నిచ్చె

ఆంధ్ర కవితాపితామహా! అల్లసాని
పెద్దన కవీంద్ర! యని నన్ను బిలుచునట్టి
కృష్ణరాయలతో దివికేగలేక
బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబనగుచు.

ఇత్యాది పద్యముల మూలమునఁ బ్రభువాత్సల్యము విశదమేకదా! రాజ్య విషయములలో మంత్రి తిమ్మరసీరాయనికి నప్పాజీయయ్యెను. కవిత్వ విషయములోఁ దన యాస్థాన కవీశ్వరుఁడైన యల్లసాని పెద్దన్న యీ రాజకవికి నప్పాజీ తుల్యుఁడయ్యెనని చెప్పవచ్చును. ఇట్లుభయులును

బితృసమానులే. వారియెడల నత్యంత ప్రేమాతిశయము రాయలు చూపుచువచ్చెనుగదా! మఱియు నల్లసానివాని గ్రంథమందుఁ దన యేలికయగు కృష్ణరాయలప్రశంస కృతిపతి కారణమున నున్నది. కాఁబట్టి యాగ్రంథముఁ జదివినపుడెల్లఁ గృష్ణదేవరాయలు జ్ఞప్తికి వచ్చును. అట్లే కృష్ణరాయల గ్రంథముఁ జదివినపుడెల్ల నల్లసాని పెద్దన్న స్మరణకు వచ్చుటెట్లు? రాయలు తనగ్రంథముఁ దన యాస్థాన కవీశ్వరునకు సంకితముచేయుట యయుక్తము గదా! ఇంక నేవెరవునఁ దన కవితాగురుసంబంధ మభేదాధ్యవసాయముగఁ గల్పింపవచ్చును? ఆ కవీశ్వరుఁడు తన్నుగూర్చివ్రాసిన పద్యములఁ దానుపయోగించు కొనినయెడలఁ దనకుఁగల గౌరవము, భక్తి, కవిత్వాదరణము, గాఢాను రాగము నివియన్నియు నొక్కసారిగఁ జేకూరును. కావున శాశ్వత ప్రేమైకబంధ స్ఫోరకముగ నీ పద్యములను దానుపయోగించుకొనెనని నేఁజెప్ప సాహసించుచున్నాను.

ఈ వాదమును స్థాపించుటలో శ్రీ అచ్యుతరావుగారు వింతపుంతలఁ ద్రొక్కిరని చెప్పకతప్పదు. ఇది వాదముగాదు. అతివాదము — విచిత్రవాదము. రాయలకుఁ బెద్దనపైఁగల గౌరవము సుప్రసిద్ధమే. కాని యది వ్యక్తీకరించుట కిదియా మార్గము? ఇట్టి మార్గమును బూర్వులెవ్వరు నవలంబింపలేదు. ఇక నెవ్వరు నవలంబింతురను నాశయునులేదు. ఇది నిశ్చయముగా విపరీతమార్గము.

ఒక గ్రంథమును బఠించునపుడు మనకు సాధారణముగ స్మృతిపథమునఁ బడునవి అందలి పాత్రలు, వారిచర్యలు, వారిసంభాషణములు. అచ్చటచ్చట గ్రంథకర్తయు జ్ఞప్తికిరావచ్చును. కాని గ్రంథకర్తను దలంచువారు కేవల విమ ర్శకులు మాత్రమే. సాధారణులు, కథాపురుషులనే స్మరింతురు. వారి కష్టసుఖ ములను దమవిగా భావించి, విషాదానందములకు లోనగుచుందురు. అట్టి తన్మయత్వమే లేనిచో రసానందమే మృగ్యమగును.

విషయమిట్లుండగా నాముక్తమాల్యదా పఠనావసరమునఁ బెద్దన స్మృతికి వచ్చుట యెట్లు?

మఱియొక విషయము. రాయలు స్మరణకు వచ్చునప్పుడెల్ల తప్పక పెద్దనయు స్మరణకురాకతప్పదు. వారిమైత్రి యట్టిది. వారిరువురకుఁగల గాఢాను బంధమట్టిది. ఇది రాయలకుఁ దెలియనిదికాదు. అట్టియెడఁ దనగ్రంథమును జదువునపుడెల్ల పెద్దన జ్ఞప్తికివచ్చుటకై రాయలాతని పద్యములను దన గ్రంథ మున నుపయోగించుకొనెనను వాద మంగీకార్యముకాదు.

అయిన రాయలు పెద్దన పద్యములనేల వాడుకొనెను?

ఔచితీనిర్వహణార్థము రాయలు పెద్దన పద్యములఁ దనగ్రంథమున నుపయోగించుకొనెనని నా సమాధానము.

అచ్చటి సన్నివేశము నొకపరి స్మరింపుడు. రాయలు నిండుకొలువుండి తన స్వప్నవృత్తాంతమును బెద్దలకు విన్నవించెను. ఆ వృత్తాంతమునాలకించి, వారా రాజన్యుని వంశగౌరవమును, శక్తిసామర్థ్యములను బ్రశంసించిరి. ఇది సన్నివేశము.

సభ్యులు ప్రశంసించిరనఁగా నా సభయందున్నవారందఱు నొక్కపెట్టున గొల్లుమని ప్రశంసావాక్యముల నుచ్చైస్స్వరమునఁ బల్కిరని యర్థము కాదు గదా! అట్లు గావించుట ప్రాచీనరాజసభాగౌరవమునకే కళంకము. ఆ సభలో నొకరిద్దరుమాత్రమే లేచి, సభ్యులందఱి తరపునఁ గొన్ని ప్రశంసా వాక్యము లను బలికియుందురు. చక్రవర్తికి నిత్య సన్నిహితుఁడును, హితుఁడునగు పెద్దనయందుండె ననుట సత్యదూరము కానేరదు.

అవతారిక వ్రాయు నవసరమున రాయల మనఃఫలకమున నానాటిసభా వృత్తాంతము మెదలియుండును. అప్పుడుపన్యసించిన వారిలోఁ బెద్దనయే పెద్దగావున, నాతని పద్యములనే తత్సందర్భమున నుంచుట యుక్తమని రాయలు భావించియుండును, అందులకుఁ బెద్దనకూడ సంగీకరించియే యుండును.

కావున, మనుచరిత్రయందలి పద్యము లాముక్తమాల్యద యందుండుట కౌచితీ నిర్వహణ కాంక్షయే ముఖ్యకారణ మనవచ్చును.

2. లక్షణ గ్రంథకర్తలకు లక్ష్యలక్షణ సమన్వయమే ప్రధానముగాని గ్రంథకర్తృత్వముగాదు. కర్తృత్వవిషయము లోకాభిప్రాయమును గాదనవలసిన యావశ్యకత వారికిలేదు.

3. ఈకవియెవ్వఁడో? ఈపద్యమెప్పుడు చెప్పెనో మనకుఁదెలియదు. ఇట్టిపద్యము నాధారముగాగొని గ్రంథ కర్తృత్వమును నిర్ణయింపరాదు.

మఱియు నిందు విష్ణుచిత్తీయము మొదటికృతియనియు మనుచరిత్రము తరువాతి కృతియనియుఁ జెప్పఁబడి యున్నది. ఇదితప్పు. మనుచరిత్ర పారిజాతాపహరణములు రెండును విష్ణుచిత్తీయమునకుఁ బూర్వము రచింపఁ బడిన గ్రంథములే.

మనుచరిత్రమున రాయచూరు యుద్ధప్రసంగము గానరాదు. విష్ణుచిత్తీయమున నదిగలదు. ఆముక్తమాల్యద సమాప్తమగుసరికి, రాయలజైత్రయాత్ర సమాప్తమైనది. మనుచరిత్ర రచనము నాటికి చిన్నమ జీవించియున్నది. విష్ణు చిత్తీయావతారికా రచనమునాటికామె మరణించినది.

కావున మనుచరిత్రయే మొదటిగ్రంథము. ఆముక్తమాల్యద తరువాతి కృతి. వీని నస్తవ్యస్తముగాఁ జెప్పిన యీ పద్యము విశ్వసనీయముగాదు.

4. మదోన్మత్తులై, నిరంతర భోగపరాయణులై యంతిపురమును వీడని రాజుల విషయమున నిట్లు చెప్పవచ్చును గాని, రాయలవంటి రాజుల విషయమున నిట్లు చెప్పుటకు వలనుగాదు.

కృష్ణరాయలు తిమ్మరుసుతోగూడ, మారువేసమున, రాత్రియందుఁ బత్తనమంతయుఁ దిరుగువాడనియు, నహర్నిశము ప్రజాక్షేమమునుగూర్చి విచారించువాఁడనియుఁ జెప్పుకథలనేకములు లోకమున వ్యాప్తములై యున్నవి. ఈ కథలన్నియు సత్యములు కాకపోవచ్చును. కాని, అన్నియు నబద్ధములనఁ గాదు. అందుఁ గొంత సత్యముండకపోదు.

అట్టియెడ రాయలకు సామాన్యజన జీవితవిధానము దెలియుట కవకాశము చాలగలదు. మఱియుఁ గవులకు దుర్గ్రాహ్యములగు విషయములేమియుండును ? 'రవిగాంచనిచోఁ గవి గాంచునేకదా !'

5. ఈ మాటయు రాయలయెడ వర్తింపదు. రాజులందఱు నపండితులై యుందురనునది కేవలము భ్రాంతి మూలకమగువాదము. అపండితులగు రాజులు లేకపోలేదు. కాని యంతమాత్రమున రాజులందఱు నపండితులనుట సమంజసముగాదు.

కృష్ణరాయల బాల్యమును వర్ణించుచు సంగీత కళానిధియగు లక్ష్మీనారాయణకవి

బాల్యేఽసౌ సకల కలాకలాపయుక్తః

అని చెప్పియున్నాఁడు. ఈతని పాండితీ ప్రకర్షను బలపఱచు కథలనేకములు గలవు.

కావునఁ గృష్ణరాయల పాండిత్యమును శంకింప నక్కఱలేదు. మఱియు నిరంతర విద్వద్గోష్ఠియు నిందులకుఁ గొంత దోహదముచేసి యుండవచ్చును.

6. కృష్ణరాయకృత గ్రంథములను మనుచరిత్ర పారిజాతాపహరణములు పేర్కొనసంత మాత్రమున రాయలు కవియే కాడని చెప్పఁజాలము.

ఇట్టివిషయములందుఁ బూర్వులు సర్వసాధారణముగ నుపేక్షవహించెడివారు. ఇందులకుదాహరణము లెన్నియేనిగలవు.

కేతన దశకుమార చరిత్రమునఁ దిక్కన కృతనిర్వచనోత్తర రామాయణము పేర్కొనఁబడలేదు. తిక్కనయే తన భారతమున నిర్వచనోత్తర రామాయణమునుగూర్చి చెప్పలేదు.

కావున నిదియొక శంకగాఁజాలదు. ఇఁకఁ బారిజాతాపహరణమున రాయల కవితాప్రావీణ్యముగ్గడింపఁ బడియేయున్నది. తిమ్మన రాయలను గవితా ప్రావీణ్య ఫణీశుఁడని కీర్తించియున్నాఁడు. కావున రాయల కవితాశక్తిని శంకింపఁబనిలేదు.

మీది కారణములనుబట్టి యాముక్తమాల్యద పెద్దనకృతమను వాదము పరాస్తమైనది.

మనుచరిత్రకు నాముక్తమాల్యదకును సర్వత్ర భేదమే గన్పట్టును. ఈ భేదము కేవలము శైలికి మాత్రమే సంబంధించి యుండలేదు. అలంకృతి విశేషములందుగాని, పదసంయోజన యందుగాని, భావనయందుగాని, పాత్ర నిర్మాణ కౌశలమునందుగాని, వర్ణనలయందుగాని, యీ రెండు గ్రంథములకు నెందును సాదృశ్యము గానరాదు. విష్ణుచిత్తీయకర్తకు పాత్ర నిర్మాణ చాతురి లేదు. మనుచరిత్రకారుఁడు పాత్ర నిర్మాణ కౌశలమునఁ బేరెన్నికఁగన్నవాడు. ప్రకృతి పరిశీలనమున నాముక్తమాల్యదాకర్త యగ్రగణ్యుఁడు. సూక్ష్మాతిసూక్ష్మము లగు ప్రకృతి మర్మములను గ్రహించుటలో నాతఁడు మేటి. మనుచరిత్రకారునకుఁ బ్రకృతి పరిశీలనమున నంతటి నిశితదృష్టి యున్నట్లు గానరాదు. ఆముక్త మాల్యదాకర్త కాంధ్రమునఁ గవితసెప్పుట కదియే తొలియత్నముగా గన్పట్టును. మనుచరిత్రకారుఁ డాంధ్ర కవిత్వమున సిద్ధహస్తుఁడు.

ఆముక్తమాల్యదాకర్తకు శాంతరస పోషణమునందును, భక్తిభావ విపులీ కరణమునందును బ్రీతిమెండు. ఆతనికి శృంగారరస పోషణమున నంతగా శక్తియున్నట్లు గానరాదు. ఆతని యాంతరప్రకృతి శాంతి కాముకము ; భక్తి భావ పరిపూర్ణము. శాంతోన్ముఖమయ్యు, మనుచరిత్రకారుని ప్రకృతి విషయ వాంఛాసంవాసితము. ఆతనికి శాంతమనెడి దృష్టికలదు కాని దానినెన్నడు నాతఁ డందుకొనలేదు. ఆతఁడు శృంగార పరిణత మనస్కుఁడు. మనుచరిత్ర కర్త విష్ణుభక్తుఁడయ్యు శివద్వేషము లేనివాఁడు. విష్ణుచిత్తీయకర్త దేవతాంతర స్మరణమునే యంగీకరింపని విష్ణుభక్తుఁడు. విష్ణుచిత్తీయకర్తకు మారుమూల పదములు వాడుటయం దాసక్తి మెండు. మనుచరిత్రకర్త సర్వసామాన్యముగా సుప్రసిద్ధ పదములనే వాడును.

ఇట్లీ గ్రంథములం దిసుమంతయును సాదృశ్యము గానరాదు. ఈ రెండు గ్రంథములు నేక కర్తృకములగుట యసంభవము.

# స్వారోచిష మను సంభవము - అల్లసాని పెద్దన

సాహితీ సమరాంగణ సార్వభౌముఁడగు శ్రీకృష్ణదేవరాయల యాస్థానము నలంకరించిన కవి దిగ్గజములలో నగ్రగణ్యుఁ డల్లసాని పెద్దన. ఈతఁడు నంద వరీక బ్రాహ్మణుఁడు. చొక్కనామాత్య పుత్రుఁడు. ఋగ్వేది. ఆశ్వలాయన సూత్రుఁడు. వసిష్ఠసగోత్రుఁడు. ఈతఁడు తొలుత నద్వైతియైయుయ్యు తరువాత శఠగోపయతి యను వైష్ణవస్వామి శిష్యుఁడై, వైష్ణవమును స్వీకరించినట్లు మనుచరిత్రములోని యీ క్రింది పద్యమునుబట్టి తెలియుచున్నది :

కొలుతున్ మద్గురు విద్యా
నిలయున్ గరుణాకటాక్ష నిబిడ జ్యోత్స్నా
దళితాశ్రిత జన దురిత
చ్ఛలగాఢ ధ్వాంతసమితి శఠగోపయతిన్.

నందవరీక బ్రాహ్మణులు కడప, కర్నూలు, అనంతపురము జిల్లాలలోఁ జాలవఱకుఁ గన్పట్టుచున్నారు. నందవరీకులు సామాన్యముగా నియోగులనియే యందురు. అల్లసాని పెద్దన జన్మస్థలమునుగూర్చి భిన్నాభిప్రాయములు గలవు. బళ్లారి జిల్లాలో 'మూపాడు' పరగణాయందలి 'దోరాలయ' గ్రామము ఈతని జన్మస్థలమని శ్రీ లక్ష్మణరావుగారి యభిప్రాయము. శ్రీ వేటుమళ్ల అచ్యుత రావుగారు లక్ష్మణరావుగారి అభిప్రాయముతో నేకీభవింపక తమ యభిప్రాయము నీ క్రింది వాక్యములలోఁ జెప్పియున్నారు :

కొన్ని విషయములు జూచినఁ బెద్దన కడప జిల్లాలో నేదోయొక గ్రామమున జన్మించి యుండునని నేనూహించుచున్నాను. నేనిట్లభిప్రాయ పడుటకు ముఖ్యకారణము :

(1) సాళువ నృసింహరాయలు చంద్రగిరిలో రాజ్యము చేయుచుండి నట్లును, నాతనియొద్ద కృష్ణదేవరాయల తండ్రియగు తుళువ నరస రాయలు దండాధిపతిగా నుండినట్లును చరిత్ర విషయము. సాళువ నృసింహరాయలు చాలకాలమువఱకు చంద్రగిరిలోనే విజయనగర చక్రవర్తుల సామంత రాజుగఁ బరిపాలనము చేయుటచేత నాతని దండ నాయకుఁడగు నరసరాయలును చంద్రగిరిలోఁగాని, లేక తన స్వకీయ రాజ్యస్థానమగు చిత్తూరు జిల్లాలోనున్న దేవకీపట్టణమునగాని నివసించి యుండవలె. కాబట్టి కృష్ణదేవరాయలును అన్నయగు వీరనృసింహ రాయఁడును, తమ్ముఁడగు నచ్యుతదేవరాయలును, నరసరాయలకు చంద్రగిరిలోనో లేక దేవకీపట్టణములోనో బుట్టి యుండవలెను. గాని

నరసరాయలు వార్ధకదశలో విజయనగరములోనున్న కొలది కాలములో వీరందఱును జన్మించి యుండుట యసంభవము, అసహజము. కావున కృష్ణదేవరాయల బాల్యము చంద్రగిరి ప్రాంతములో గడచి యుండును. ఆ కారణమున కృష్ణరాయని బాల్యగురువగు పెద్దనార్యుఁడును దత్ప్రాంత నివాసియై యుండవలెను. చంద్రగిరికి కడప జిల్లా దగ్గరగాని బళ్ళారి జిల్లా కాదుగదా!

(2) కృష్ణదేవరాయలకు సవతి యన్నగారగు వీరనృసింహదేవరాయలు రాజ్యార్హుఁడై యుండుటచేత నతని తల్లియగు తిప్పాంబ తన తనయుని కంటె నెక్కువ సామర్థ్యముగల సవతికొడుకైన కృష్ణదేవరాయల నెటులనైన బరిమార్ప నుద్దేశించి యందుకు బ్రయత్నములు చేయుటచేత, ప్రధానమంత్రియగు తిమ్మరుసు కృష్ణదేవరాయలను బదిలపెట్టుటకు చంద్రగిరి కోటలోనుంచినట్లుఁ దెలియవచ్చుచున్నది. అట్లయినయెడల జిన్నతనముననే కవితా గురువైన అల్లసాని పెద్దనామాత్యుఁడు కడప ప్రాంతములలో నుండి యుండవలెను.

(3) అల్లసాని పెద్దనార్యుఁడు శ్రీకృష్ణదేవరాయలవల్ల పొందిన బహుమతులలో కోకటగ్రామము ముఖ్యమైనది. ఈ గ్రామమును తాను తిరిగి దేవబ్రాహ్మణుల కిచ్చివేసినట్లు దానశాసనము లున్నవి. సామాన్యముగ నే మానవుఁడైనను తాను సంపాదించెడు భూవసతులు తాను పుట్టిన స్థలములలో సంపాదించుట లోకస్వభావము. అల్లసాని పెద్దన కడప జిల్లా గండికోట సీమలోనున్న యీ కోకట గ్రామముఁ గోరుట తన తా ప్రాంతముల యందున్న జన్మస్థలాభిమానమును దెలియఁ జేయు చున్నదని నా యభిప్రాయము.

(4) ఈ కోకట గ్రామమునకు సమీపమున 'పెద్దనపాడు' అను గ్రామ మున్నది. ఆగ్రామమున నిప్పటికిని పెద్దనగారిపేరున అగ్రతాంబూలముఁ దీసికొందురు, ఆ పెద్దనగారు మన అల్లసాని పెద్దనగారనియే యచ్చటి జనుల యభిప్రాయము.

ఈ కారణములనుబట్టి అల్లసాని పెద్దనార్యుఁడు కడప మండలములో కమలాపురము తాలూకాలోనున్న కోకట గ్రామములోగాని, దాని సమీప గ్రామములోనున్న పెద్దనపాడు నందునగాని జన్మించెనని నా యభిప్రాయము.

తమ వాదమునకు ప్రోద్బలకముగా శ్రీ అచ్యుతరావుగారు, శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారి యభిప్రాయమునుగూడ వ్రాసియున్నారు. శ్రీ శర్మగారి యభి

ప్రాయమునకును, అచ్యుతరావుగారి యభిప్రాయమునకును భేదమావంతయును లేదు. శ్రీ శర్మగారు మఱికొన్ని యుపపత్తులను విశేషముగా నిచ్చియున్నారు. వాని సారాంశ మిది :

పెద్దనపాడు గ్రామమునకు దగ్గఱగనే కోకట గ్రామమున్నది. ఆ యూర వరి పండదు. అందలి ముఖ్యవ్యవసాయము జొన్నపైరు. కవి కల్పకమని ప్రసిద్ధవహించిన రాయలను అట్టిగ్రామము తనకిమ్మని మహాకవి యేలకోరెనో తెలియకున్నది. నిజమాలోచించిన విపరీతమగు నిట్టికోరికకు కారణము కవికిఁ గల జన్మస్థల వ్యామోహమనియే జెప్పవచ్చును.

కవిగురువగు శఠగోపయతి యందు నివసించుచుండుటచే నా గ్రామము బెద్దన గోరెనని కొందఱు చెప్పుచున్నారు. కాని యా యభిప్రాయము సరికాదు. కోకట గ్రామమున సమీపమున కేదార సంభృతములగు గ్రామము లనేకములు గలవు. అట్టియెడ గురుదక్షిణగా నా గ్రామములో నొక్కదానిని గోరక కేవలము జొన్నపండు గ్రామమును గోరెనను సమంజసముగా లేదు. కోకట గ్రామమునఁ బ్రథమ తాంబూలమును బెద్దనగారికిచ్చు నాచారము లేదు. దఱినున్న పెద్దనపాడున గలదు. కావున పెద్దనపాడు గ్రామముననే మనుచరిత్రకారుఁడు జన్మించెననుట సమంజసము.

ఇదిగాక శ్రీ శర్మగారు మఱొక యుపపత్తినిగూడఁ జూపియున్నారు. 'అచటఁ బుట్టిన చిగురుఁ గొమ్మైన జేవ' అని మనుచరిత్రమున నొక పద్య పాదము గలదు. ఇందు 'చిగురుఁగొమ్మ' అను పాఠము సరిగాదనియు, 'చిగురుకొమ్మ' అను పాఠమే సరియైనదనియు వారి వాదము. 'చిగురు కొమ్మైనన్' అనుదానికి చిగురుచెట్టుయొక్క కొమ్మయైనను చేవగలదని యర్థము చెప్పవలెనట. చిగురుచెట్టనునది కడప మండలముననను, అనంతపుర మండలము నను గలదట. దానికి చేవయే యుండదు. చాలకాల ముండినఁ బడిపోవును. చిగురుకొమ్మ యను పదము నిటీవల ముద్రించినవారు మాండలికమగు దాని నర్థము నెఱుంగక 'చిగురుఁగొమ్మ' యని దిద్దిరి. చిగురు అను పదమును విశేషణముగా భావించి, ద్రుతకార్యమునుజేసి యట్లు దిద్దిరి. మాండలికమగు నీ చిగురుచెట్టు ప్రస్తావననుబట్టికూడఁ బెద్దన కడప మండల నివాసియని చెప్పుట కవకాశము కలదు. ఇది శ్రీ శర్మగారి వాద సారాంశము.

శ్రీ లక్ష్మణరావు పంతులుగారి వాదమునే శ్రీ కందుకూరి వీరేశలింగము గారును అనుసరించిరి. వీరి వాదము కేవలము జనశ్రుతిపై నాధారపడియున్నది. శ్రీ శర్మగారి వాదము సహేతుకముగఁ గన్పట్టుచున్నది. శ్రీ అచ్యుతరావుగారు వీరి వాదమునకు దోహదముగా మఱికొన్ని కారణములను జూపియున్నారు. అవికూడ సమంజసముగఁ గన్పట్టుచున్నవి.

పెద్దన మహాకవి రాయల యనుగ్రహమున పెక్కు గ్రామములను సంపాదించి యుండెను. అందు కోకట గ్రామముపై నాతనికిఁ బ్రీతి మెండనుట కాతని 'కోకట గ్రామాద్య నేకాగ్రహారంబు లడిగిన సీమలయందు నిచ్చె' నను చాటువే నిదర్శనము. కేవలము జొన్నమాత్రమే పండు నీ గ్రామమును బరిగ్రహించుటయు, నద్దానియెడ మిక్కిలి మక్కువగలిగి యుండుటయుఁ, బెద్దన కా గ్రామముతోఁగల పూర్వ సంబంధమునే నిశ్చయముగా వ్యక్తము సేయు చున్నది.

ఆంధ్ర మహాకవులలోఁ బెద్దనకొక విశిష్టత గలదు. సామాన్యముగ మనకు గన్పట్టునవి రాజుల దాన శాసనములే. కవులు వేసిన దాన శాసనములు దుర్లభములనియే చెప్పవచ్చును. ఈ సిద్ధాంతమున కపవాదము పెద్దనయొక్కఁడే. ఇమ్మహాకవి రాజానుగ్రహమునఁ బెక్కు గ్రామములను సంపాదించుటయేగాక వానిలోఁ గొన్నిఁటిని దేవబ్రాహ్మణులకు తిరిగి యొసఁగియున్నాఁడు.

శ్రీకృష్ణదేవరాయ లీతనికిఁ గడపజిల్లా గండికోట సీమలోనున్న కోకట గ్రామము నగ్రహారముగ నిచ్చినట్లు దాన శాసనములున్నవి. ఆ కోకట గ్రామమునకు శఠగోపపురమను పేరుఁబెట్టి పెద్దన మహాకవి దేవబ్రాహ్మణులకు తిరుగ దానముసేసి రెండు శాసనములను జెక్కించెను.

ఇందొక శాసనము క్రీ. శ. 1518 ఏప్రిల్ 25 వ తేదీకి సంబంధించినది. దీనిలో కోకట గ్రామములో కొంతభాగము ఆ గ్రామములో వేంచేసియున్న సకలేశ్వరదేవునికి ధూపదీప నైవేద్యములకునై యిచ్చినట్లున్నది.

రెండవ శాసనము క్రీ. శ. 1518 అక్టోబరు 31 వ తేదీకి సంబంధించినది. దానియందును కోకటమందలి మఱికొంత భూమిని చెన్నకేశవస్వామివారి దీపారాధన కిచ్చినట్లు గలదు. ఇట్లు కోకట గ్రామమును శివకేశవుల కిర్వురకును బంచి యిచ్చి, పెద్దన మహాకవి తనకు వారియెడగల సమరసభావమును వ్యక్తీకరించియున్నాఁడు. ఇమ్మహాకవి కోకట గ్రామమును వైష్ణవుల కగ్రహారముగా నిచ్చెనని, కోకటము కైఫీయత్తునందు గలదు. కోకట శాసనములు రెండింటియందు నా విషయము గన్పట్టదు. శివకేశవులకు గొంతభాగ మిచ్చినట్లుమాత్రమే గలదు.

మూడవ శాసనము దక్షిణ ఆర్కాటు జిల్లాలోనున్న అన్నూరు గ్రామమునకు సంబంధించినది. ఆ జిల్లాలోనున్న కఠివాచి సీమయందలి అన్నూరు గ్రామమునకు సంబంధించిన కొంత భూమిని, ఆ గ్రామమున వేంచేసియున్న శ్రీ వరదరాజస్వామివారికిని, అమ్మవారికిని అంగరంగవైభవాదులకు సమర్పించినట్లు ఆ శాసనమున గలదు. అన్నూరు శాసనకాలము 6–11–1519. ఈ

శాసనమునఁ బెద్దనార్యుఁడు తన ఆంధ్ర కవితా పితామహ బిరుదమును జెప్పి కొని యున్నాఁడు. కోకట శాసనములందీ బిరుద ప్రశంసలేదు.

చిత్తూరు జిల్లాయందలి మేల్పాడు గ్రామ రికార్డులలో అల్లసాని పెద్ద నార్యుని ప్రశంస కొంత కన్పట్టుచున్నది. శ్రీ కృష్ణదేవరాయలు అల్లసాని పెద్దనకు తానెంపూడి అను గ్రామమును అగ్రహారముగా నిచ్చినట్లును, ఆ గ్రామములోఁ గొంత భాగమా కవీంద్రుఁడు చోళేంద్రసింగయుదయరాార్ అను దేవునకు సమర్పించినట్లును ఆ శాసనమునఁ జెప్పఁబడియున్నది.

పై విషయములనుబట్టి పరిశీలింపగా పెద్దన జీవిత విధానము మనకొక విధముగా స్పష్టమగుచున్నది. పుట్టినదాదిగ నీతఁడు ధనికుఁడో దరిద్రుఁడో మనము చెప్పఁజాలము. కాని రాయలతోడి సంబంధము గలిగినది మొదలీతని జీవితము సర్వథాధన్యమని చెప్పవచ్చును. భోగపరాయణుఁడయి యీతఁడు విషయలౌల్యమునఁబడి, యాముష్మికమార్గమునే మఱచినవాఁడుకాఁడు. ఐహికా ముష్మికములు రెంటింటిని సమన్వయముచేసిన మహనీయుఁ డీతఁడు. ఈతఁడు చేసినమహాకార్యములనుబట్టి యీతఁడు దేవద్విజ గురుభక్తి గలవాఁడని తేటతెల్ల మగుచున్నది. ఈతఁడు వైష్ణవమును స్వీకరించి శివకేశవులయెడ సమరస భావమునే సర్వత్ర ప్రదర్శించి యున్నాఁడు.

# నంది తిమ్మన - పారిజాతాపహరణము

నంది తిమ్మన రాయల యాస్థానమునందలి యష్టదిగ్గజములలో నొకఁడు. శ్రీ కృష్ణదేవరాయలకు తన పారిజాతాపహరణ ప్రబంధ గ్రంథము సంకితము చేసియున్నాఁడు.

ఈతఁ డార్వేల నియోగిబ్రాహ్మణుఁడు. కౌశిక గోత్రుఁడు, ఆపస్తంబ సూత్రుఁడు. నంది సింగయ్యకును దిమ్మాంబకును బుత్రుఁడు. మలయమారుతకవి బిరుదాంచితుఁడగు ఘంట సింగయకు మేనల్లుఁడు. అఘోర శివాచార్యశిష్యుఁడు. ఘంట సింగయయు మాదయ్యగారి మల్లనయు నఘోర శివాచార్య శిష్యులే.

నంది తిమ్మన వంశవృక్షము పారిజాతాపహరణమున నీ క్రింది విధముగా నున్నది :

కౌశిక గోత్ర విఖ్యాతుఁ డాపస్తంబ
సూత్రు డార్వేల పవిత్రకులుఁడు
నంది సింగామాత్యునకును దిమ్మాంబకు
దనయుండు సకల విద్యా వివేక
చతురుఁడు మలయమారుత కవీంద్రునకు మే
నల్లుండు కృష్ణరాయ క్షితీశ
కరుణా సమాలబ్ధ ఘనచతురంత యా
నమహాగ్రహార సమ్మానయుతుఁడు
తిమ్మయార్యుండు శివపరాధీన మతియ
ఘోర శివగురు శిష్యుండు పారిజాత
హరణమను కావ్యమొనరించె నంధ్రభాష
నాదివాకర తారా సుధాకరముగ ॥

నంది తిమ్మనకు మలయమారుతకవి బిరుదాంచితుఁడగు ఘంట సింగయ మేనమామ. ఘంట సింగయకు నంది మల్లయ (సింగయయు, మల్లన్నయు జంట కవులు—ప్రబోధ చంద్రోదయ, వరాహపురాణ కర్తలు) మేనమామ. ఈ విషయము ప్రబోధ చంద్రోదయమున నీ క్రింది విధముగాఁ జెప్పఁబడి యున్నది :

కలఁడు కౌశిక గోత్ర కలశాంబు రాశి మం
    దారంబు సంగీతనంది నంది
సింగమంత్రికిఁ బుణ్యశీల పోచమ్మకు
    నాత్మ సంభవుఁడు మల్లయ మనీషి

యతని మేనల్లుఁ డంచిత భరద్వాజ గో
త్రారామ చైత్రోదయంబు ఘంట
నాగ ధీ మణికిఁ బుణ్య చరిత్ర యమ్మలాం
బకుఁ గూర్మి తనయుండు మలయమారు
తాహ్వయుఁడు సింగనార్యుఁడు నమృత వాక్కు
లీశ్వరారాధకులు శాంతులిలఁ బ్రసిద్ధు
లుభయ భాషల నేర్పరులుపమరులున
మర్థు లీ కృతిరాజ నిర్మాణమునకు.

నంది తిమ్మన్న, నంది మల్లయకుఁ బౌత్రుఁడని జనశ్రుతి యున్నట్లు శ్రీ వీరేశలింగము పంతులుగారు తమ కవుల చరిత్రలో సూచించినారు. కాని యది సరియనుట కాధారములు లేవు. నంది తిమ్మనకు నంది మల్లనయే పితామహుఁడగుచో మేనమామ యగు సింగయను బేర్కొనిన తిమ్మన తన పితామహునేలఁ బేర్కొనలేదు? సింగయయు మల్లనయు జంట కవులు. నంది మల్లనకు సంగీతనంది యను సార్థక బిరుదముకూడ కలదు. సంగీత సాహిత్య రంగములు రెండిటియందును సుప్రసిద్ధుఁడగు మల్లనయే నంది తిమ్మనకు పితామహుఁడగుచో నాతనిని దిమ్మన తప్పక స్మరించియే యుండెడివాఁడు. కావున వీరేశలింగము పంతులుగారు సూచించిన సంబంధము వీరిర్వురకును లేదనియే చెప్పవచ్చును.

శ్రీ శేకుమళ్ళ అచ్యుతరావుగారు వీరి సంబంధమును గూర్చి మఱొక విధముగా నూహించి యున్నారు. నంది మల్లయ, నంది తిమ్మనకు పితామహుఁడు గాకపోయిన జ్ఞాతి కుటుంబమునకుఁ జెందిన పెదతండ్రియో, పెదతండ్రి కుమారుఁడోయై యుండుననియును, జ్ఞాతి వైషమ్యముచేతనే తిమ్మన నంది మల్లయ విషయమున మూకీభావము వహించెననియును వారి యూహ. కాని యిది కేవలము వారి యూహయే. దీనికెట్టి యాధారములును లేవు.

శ్రీ గురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు తమ కవిజీవితములలో నంది మల్లన తిమ్మనలకు విపరీతమగు నొక బంధుత్వము నూహించియున్నారు. నంది సింగన మంత్రికి (వరాహపురాణమున చెప్పఁబడినట్టు నంది మల్లనకు తండ్రి) భార్య లిరువురు గలరు. అందొకయామె మలయమారుత కవికి (జంటకవులలోని వాఁడు కాఁడు) సోదరి. పేరు తిమ్మాంబ. ఆ తిమ్మాంబ యందు నంది సింగన మంత్రికి గలిగిన కుమారుఁడే ముక్కుతిమ్మన. సింగన మంత్రి రెండవ భార్యపేరు పోచమ్మ. ఆమెకు మల్లయ్యయను కుమారుఁడును, అమ్మలాంబయను పుత్రికయును గలిగిరి. అమ్మలాంబ కుమారుఁడే వరాహ

పురాణకర్తలలో నొకఁడగు ఘంట సింగయ (మలయమారుత కవి). ఘంట సింగయ తండ్రి ఘంట నాగయ. కాని యీవాదము కేవలము నిరాధారమైనది.

నంది సింగన మంత్రి కిర్వురు భార్యలున్నట్లెందును గానరాదు. మఱియు మలయమారుత కవు లిద్దఱున్నట్లును నాధారములు గానరావు. నంది మల్లయ నంది తిమ్మనలు సమవయస్కులుగ వీరి సిద్ధాంతము ప్రకారము గన్పట్టుచున్నారు. మరియు సింగన కవి వీరిర్వుర కంటెఁ జిన్నవాఁడుగఁ గన్పట్టుచున్నాడు. ఈ వాదమునకు సందర్భశుద్ధి యున్నట్లు గానరాదు.

నంది మల్లయ ఘంట సింగయకవులు శ్రీకృష్ణదేవరాయల తండ్రి యగు నరసరాయలకు తమ గ్రంథముల నంకితముచేసి యున్నారు. నంది తిమ్మన శ్రీకృష్ణదేవరాయ యాస్థానకవి. అట్టియెడ లోకస్వభావమునుబట్టి చూచినచో తిమ్మనకంటె నంది మల్లయ ఘంట సింగయ కవులు వయసునఁ బెద్దలయి యుండుట సమంజసము. తిమ్మన తండ్రిపేరును, మల్లయ తండ్రిపేరును నొకటియే యగుటచే వీరిట్టి భ్రాంతికి లోనైయుందురు. కావున నీవాదము అంగీకార్యముకాదు.

# పారిజాతాపహరణ రచనాకాలము

రాయ వాచకమున నీక్రింది విధముగాఁ జెప్పఁబడి యున్నది :

మరునాడు కొలువులోపల యిష్టకథా వినోదమైన నగరి నియోగులున్ను, కవీశ్వరులు విద్వాంసులు మొదలైన నిండుసభలోన సాళువ తిమ్మరుసయ్యగారున్ను, రాయసం కొండమరుసయ్య మొదలైన వారలున్ను ప్రసంగం వెంబడిని అందరున్ను యెంచినట్లు కవితాచాతుర్యము గల వారలున్ను రాయలవారినిచూచి, ప్రసంగం వెంబడిని, నీదుకీర్తి శాశ్వతముగా నిలిచేటందులకు ఆదియందు అవనీపతులు కృతులందుచురాగా వారల ప్రతాపములున్ను కీర్తిన్ని అందరున్ను యెంచినట్లు స్వామివారు కృతులందు కొంటెకీర్తి ప్రతాపములు శాశ్వతముగా నిలుచును. గనుక తిమ్మరుసయ్య :....................తెలుపగా రాయలవారున్ను చాలా సంతోషపడి ముక్కుతిమ్మయ్య, అల్లసాని పెద్దయ, మాదయగారి మల్లయ్య మొదలైన కవీశ్వరులతో కృతు లందుకోవలెనని కవితానాయకులతో ప్రసంగించి పారిజాతాపహరణమున్ను, మనుచరిత్రన్ను చెప్పమని ఆనతిచ్చేరు.

దీనిని బట్టి కృష్ణదేవరాయలు కళింగదేశమును జయించి, అనేకములగు తీర్థములను సేవించి, విద్యానగరమునకు మరల వచ్చినతరువాత, మహామంత్రుల ప్రేరణమున నాచంద్ర తారార్కముగఁ దనకీర్తి నిలుచునట్లుగ పెద్దనాదులను కావ్యనిర్మితికి ప్రోత్సహించెనని తెలియుచున్నది. కుమార ధూర్జటి రచించిన కృష్ణరాయ విజయములోఁగూడ కృష్ణదేవరాయలు దిగ్విజయానంతరమే కృతుల నందినట్లు చెప్పఁబడియున్నది.

బంధుర కవీంద్ర కృతులలోఁ బ్రౌఢిగన్న
మనుచరిత్రాది కృతులంది మహిమచెలఁగి
సకలసామ్రాజ్య వైభవ సరణివెలయ
ధరణి యేలుచునుండె నద్ధరణివిభుఁడు.

శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు, భారతి 1925 జూలై సంచికలో నీ కావ్యమందున్న చరిత్రాంశములను సమగ్రముగఁ జర్చించి, పారిజాతాపహరణము, మనుచరిత్ర విష్ణుచిత్తీయముల కంటె ముందుగనే వ్రాయంబడినదనియు, క్రీ. శ. 1515 అక్టోబరు నాటికే పూర్తిగావింపఁబడినదనియుఁ జెప్పియున్నారు.

శ్రీకృష్ణదేవరాయలు కటకమును జయించినట్లు స్పష్టముగా పారిజాతాపహరణమున చెప్పఁబడకుండుటయే వీరి యభిప్రాయమునకు మూలాధారము. కొండవీడు యుద్ధమున గజపతుల నోడించిన తరువాత రాయ లమరావతిలో రత్నతులాపూరుష మహాదానము గావించిన కాలముననే (యువ సం॥ ఆషాఢ బహుళ ద్వాదశి—అనఁగా క్రీ.శ. 1515 అక్టోబరు) పారిజాతాపహరణ మాతని కంకితము గావింపఁబడెనని వారి యభిప్రాయము.

వీరి సిద్ధాంతమును విమర్శించుచు, శ్రీ చేకుమళ్ల అచ్యుతరావుగారిట్లు వ్రాసి యున్నారు :

సింహాచలము, పొట్నూరుల ప్రశంస యా గ్రంథమున లేకపోయినను కటకాధిపతిని జయించినట్లు విస్పష్టముగా నున్నది. కొండవీడున దప్ప గజపతులతో కృష్ణరాయనికి ఘోర సంగ్రామము మఱియొకచోటను జరిగినట్లు చరిత్రయందుఁ గాన్పింపదు.

కావున కటకాధీశుని జయించినట్లీ క్రింద నుదహరింపఁబడిన పారిజాతాపహరణములోని వాక్యములు, మనుచరిత్రాముక్తమాల్యదలలోని యంశములవలెనే కృష్ణరాయని కళింగ దిగ్విజయ యాత్రల నన్నిటికి నన్వయింప వచ్చునని నా యాశయము. (1) ఉత్కల భూమీ ధవ దర్ప హరణ భుజసారా (2) కటకేశ సింధు మంధర కుధరా. ఇంక—

బలనికాయము కాలిమట్టుల నడంచుఁ
గటకమును నింకననుచు నుత్కలమహీశుఁ
డనుదినంబును వెఱచు నెవ్వనికి నతఁడు
రాజమాత్రుండె శ్రీకృష్ణరాయ విభుఁడు.

అను పద్యమునుబట్టి శ్రీకృష్ణరాయలు కటకమును స్వాధీనము చేసికొనలేదని యున్నది గాన యాతఁడు రెండవసారి యనఁగా క్రీ.వె. 1516 లో సింహాద్రి వఱకు వెళ్లక పూర్వమే యీ గ్రంథము రచింపఁబడినదని శ్రీ దత్తుగారు వెలువఱచిన యభిప్రాయమునకీ క్రింది సమాధాన మాలోచింపఁదగినది :

కృష్ణరాయలు కటకపురి వఱకెన్నఁడును దండయాత్ర సాగింపలేదు. రాజధానియగు కటకము నెన్నఁడును లోఁబఱచుకొనలేదు. సింహాచల ప్రాంతములకుఁ బోవుసరికే గజపతులువచ్చి కృష్ణరాయనితో సంధిచేసికొనిరి. కావుననే సింహాచలమున కించుక దూరముననున్న గోస్తనీ నదీతీరమందలి పొట్నూరువద్ద తన విజయ కంబమును నాటి వెనుకకు మఱలెను. కటకము వఱకు దాడి సాగించిన యెడల నే మహేంద్రగిరి

పైననో తన విజయ చిహ్నము స్థాపింపవలసిన వాఁడే. కావున కటకమును జయించలేదన్న యంశ మంత ముఖ్యాధారముగాదు.

పైగా నీ పద్యమున శ్లేషరూపమగు వర్ణనము జేయఁబడినది. కటకమను సంస్కృత పదమునకు కాలిమట్టియ యను విశేషార్థ ముండుటచే నా యర్థమునకు సరిపోవునట్లు కటక విషయము తక్కిన వానితోఁ గూర్పఁబడినదని తోచుచున్నది. కావున నీ వాక్యములు ఈశ్వరదత్తుగారి వాదమునకు నిర్ధారణమగు సహాయము నివ్వఁజాలవని నా యభిప్రాయము.

అయినను సింహాచలము, పొట్నూరు ప్రశంసలు పారిజాతాపహరణమున లేకపోవుట ముఖ్యమగు విషయము. పైగా యవనులతో జరిగిన పోరు సంగతియే యెచ్చటను ముచ్చటింపఁబడలేదు. కావున కళింగ విజిగీషామనీషను రాయలు రెండవసారి దండెత్తిన యాత్రకు పూర్వ మీ గ్రంథము గ్రంథకర్త చేతులలో పూర్ణాకృతి నొంది యుండినదేమో యను సంశయము బొడముచున్నది.

అట్లైన 1516 నకు పూర్వమే వ్రాయఁబడి, తదనంతరము మనుచరిత్రతోఁ బాటు రాయలకు గృతిసమర్పణము గావింపఁబడి యుండును. అయినచో రాయ వాచకమందు సూచింపఁబడిన కృష్ణరాయని యాదేశము సమర్థనీయముకాదు. కృష్ణరాయలే పారిజాత కథను ప్రబంధ రూపముగా వ్రాయుమని కవి కాజ్ఞాపించినచోఁ బెద్దనార్యుఁడు మనుచరిత్రలోఁ జెప్పికొనినట్లు తిమ్మన యేల తన గ్రంథమందుఁ బ్రశంసించి యుండఁడు? కావున కృష్ణరాయ విజయములో నున్నట్లుగా కళింగ రాజ్య విజయాంతమున కృష్ణరాయలు పై రెండు కృతులను ఒకే కాలమున స్వీకరించెననియే మన మూహింప వలసినదిగాని, కృష్ణరాయ లానతిచ్చినవఱకు నీ ప్రబంధము రచింపఁబడలేదని యూహించుట కవకాశము గాన్పింపదు. కావున మనుచరిత్ర ఆముక్తమాల్యదలకంటె ముందుగానే యిది రచింపఁబడినదిగాని మనుచరిత్రతోనే రాయలకుఁ గృతి యీయఁబడినది.

కాని యీ వాదమంత సమంజసముగాఁ గన్పట్టదు. మనుచరిత్ర పారిజాతాపహరణముల కృతిసమర్పణకాల మొక్కటియే యనుట సరిగాదు. దీనికి కొన్ని ప్రతిబంధకము లున్నవి.

సాధారణముగా కృతిసమర్పణ కాలముననే కృత్యవతారిక వ్రాయుదురు. కృష్ణరాయలు ఈ రెండు ప్రబంధములును ఒక్క కాలముననే కృతిఁబొందినచో, మనుచరిత్రావతారిక యందు వర్ణింపఁబడిన రాయల దిగ్విజయము లన్నియుఁ

పారిజాతాపహరణమునం గన్పట్టకుండుటకు కారణము గానరాదు. మఱొక విషయము. శ్రీ అచ్యుతరావుగారు రాయలెన్నడును కటకము ముట్టడియే చేయలేదని చెప్పుచున్నారు. అట్టియెడ 'కటకపురిం గాల్చె గజరాజు గలంగి పరవ' నను మనుచరిత్ర వాక్యమున కర్థమేమి? కాల్చెననుట యత్యుక్తి కావచ్చును. రాయల ప్రతాపము నగ్నితో సరిపోల్చినాఁడు గావున 'గాల్చె' నను క్రియను పెద్దన వాడియున్నాఁడు. గెల్చెనన్నను ప్రమాదములేదు. అది అటుండ నిండు. రాయలు కటకపురిని గాల్చెనా, గెల్చెనా యనునది మన ప్రస్తుత విషయముకాదు. పారిజాతాపహరణ రచనా కాలమునకు లేదా తత్కృతి సమర్పణ కాలమునకు రాయలు కటకపురిని జయించెనా లేదా యనునదియే మన ప్రశ్న.

పారిజాతాపహరణ కృతి సమర్పణ కాలమునకు కటక విజయము పూర్తియైనదని చెప్పఁజాలము. కాని కటకేశ్వరుని రాజ్యమును రాయలు గలంచి వేసినట్లును, తద్గజయూథము విచ్ఛేదము గావించినట్లును చెప్పగలము. 'కటకేశ సింధు మంథర కుధర', 'ద్విరదాకర దారణ వీరబలా' అను పారిజాతాపహరణమందలి సంబుద్ధు లిందులకు ప్రమాణములు. వీని వలన సింహాచల పొట్నూరు విజయములును సూచింపఁబడినవని చెప్పుట కవకాశము గలదు. కొందఱు వీనిని బట్టి ఉదయగిరి కొండపల్లి దుర్గ విజయములే సూచింపఁ బడినవని చెప్పవచ్చును. కాని యది సరికాదు. కొండవీడు మొదలగు దుర్గముల విజయమును వర్ణించిన తరువాతనే తిమ్మన యీ పద్యములను చెప్పినాఁడు. కావున నిందు కవి పునరుక్తికిఁ బాల్పడె ననుటకంటె, సింహాచల పొట్నూరు విజయము లిందు సూచింపఁబడిన వనుటయే సమంజసము.

సింహాచల దండయాత్రలో గజపతి విజయము పూర్తికాలేదు. కావుననే "ఉత్కల మహీశుఁడనుదినమ్మును వెఱచు" నని కవి చెప్పియున్నాఁడు. మను చరిత్ర కృతి సమర్పణ కాలమునకు కటక విజయము పూర్తియైనది. పారిజాతాపహరణ కృతి సమర్పణ కాలమున నది పూర్తికాలేదు. కావున నీ రెండు గ్రంథములను రాయలొక్క కాలముననే పరిగ్రహించెనను శ్రీ అచ్యుతరావు గారి సిద్ధాంతము నిర్బాధకము కాదు.

సింహాచల యాత్ర నుండి విజయనగరమునకు వచ్చిన తరువాత ధాత సంవత్సరమున (క్రీ. శ. 1516–1517) పారిజాతాపహరణ కావ్యమును రాయలు కృతినందెనని నిశ్చయింపవలసి యున్నది. పూర్వ దిగ్విజయయాత్రకు ముందు జరిగిన దక్షిణదేశ దండయాత్రలను గూడ సంగ్రహముగా కవి యీ పద్యములందు వర్ణించియున్నాఁడు :

సమ్మర్దక్షమ ! ధీనిబంధనవిధా సంక్రందనాచార్య ! ఘూ
రమ్మ్యాన్యాచల వజ్రపాత ! జగతీరక్షాంబుజాక్షా ! శర
ధ్యమ్మార్గస్థ దశాస్యరాజ్య సమసహ్యక్ష్మాప్రోద్భవాతీర ఘా
గుమ్మత్తూరి శివం సముద్ర పురవప్రోన్మూల నాడంబరా !

నాగమాంబాధిభూనారసింహాత్మజ
భోగలీలా పరాభూత సంక్రందనా
త్యాగ విద్యా నిషద్యాయిత ప్రాభవా
సాగరాంతక్షమా సంపదేకాస్పదా !

శ్రీరంగేశ్వర నాభి పంకజ రజశ్శ్రీకింతె, జోళేంద్ర ల
క్ష్మీ రాజత్కుచపాళి కుంకుమము కంటెన్ సహ్యాభూ భృత్తటీ
నీరంధ్రీకృత గైరికద్రవము కంటెన్ వన్నెగావించె గా
వేరీతోయము కృష్ణరాయ, డహితోర్వీనాథ రక్తప్రభన్.

ఈ పద్యములందు రాయలు శివసముద్రము, ఉమ్మత్తూరు మొదలుగా గల దుర్గములను జయించుటయు, ఆ సముద్రమును గల భూమండలమును బరిపాలించుటయు వర్ణింపఁబడి యున్నది. దక్షిణ దేశమునే కాకుండ గుల్బర్గ మొదలగు దుర్గములను గూడ రాయలు జయించినట్లు చెప్పఁబడియున్నది. ఈ విజయము లన్నియు క్రీ. శ. 1516–17 సంవత్సరములకు లోపల జరిగినవే. కావున పారిజాతాపహరణ కృతి సమర్పణ కాల మదియే యని నిర్ణయింప వచ్చును.

మను చరిత్ర కృతి సమర్పణ కాలమునకు కటకవిజయము పూర్తి యైనది. అది మనుచరిత్ర యందు స్పష్టముగ నున్నది. రెండవది కలబరిగ విజయము. దీనిని గూర్చియు మనుచరిత్రమున గలదు. "ప్రళయ ఘనాఘన ఘోషజయానక ధాంకృతి భీమ చపేట లుఠత్కలబరిగీ కటకక్షితి రక్షక" అను మాటలలో కలబరిగ దండయాత్ర స్పష్టముగా చెప్పఁబడినది.

ఈ దండయాత్రలు రెండుమాడులు జరిగినట్లు చరిత్రకారులు చెప్పు చున్నారు. మొదటి దండయాత్ర క్రీ. శ. 1514 లో జరిగినది. రెండవది 1521 లో జరిగినది. ఇందే దండయాత్రను గూర్చి యిందుఁ జెప్పఁబడి యున్న దను విషయము చర్చనీయము.

రాయచూరు యుద్ధము క్రీ. శ. 1520 వ సంవత్సరము మే నెల 19 వ తేదీని జరిగినదని చరిత్రకారు లందఱును నేకగ్రీవముగఁ జెప్పుచున్నారు. కృష్ణ రాయల విజయములలో నది ముఖ్యాతి ముఖ్యమైనది. దానినిగూర్చి మనుచరిత్ర యందు ఒక్కమాటయైనను జెప్పఁబడిలేదు. కావున నాయుద్ధమునకు పూర్వమే

మనుచరిత్ర కృతిసమర్పణము జరిగియుండును. దీనినిబట్టి మనుచరిత్ర యందుఁ జెప్పఁబడిన కలబరిగె విజయము క్రీ. శ. 1514 సంవత్సరపు దండయాత్రకు సంబంధించినదే యని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

కావున మనుచరిత్ర కృతిసమర్పణము క్రీ.శ. 1517 డిసెంబరు ఒకటవ తేదీకి పరమునను, క్రీ.శ. 1520 సంవత్సరము మే 20 వ తేదీకి పూర్వమునను జరిగెనని నిశ్చితముగాఁ జెప్పవచ్చును. కటక విజయమునకును, మూడవ రాయచూరు యుద్ధమునకును నడుమగల కాలమది.

శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు మనుచరిత్ర కృతిసమర్పణ కాలము క్రీ. శ. 1526 ఏప్రియల్ నెలకుఁ దరువాతనై యుండవచ్చునని చెప్పి యున్నారు. వారి నిర్ణయమునకు వచ్చుటకు ముఖ్యాధారము మనుచరిత్రము నందలి యీ క్రింది పద్యము :

ఉదయాచలేంద్రంబు మొదల నెవ్వని కుమా
　　రతఁ గ్రౌంచాచల రాజమయ్యె
నావాడపతి శకంధర సింధు రాధ్యక్షు
　　లరిగాఁపు లెవ్వాని ఖరతరాసి
పాపంచగౌడ ధాత్రీపదం బెవ్వాని
　　కసి వాలుగా నేఁగునట్టి బయలు
సకల యాచక జనాశాపూర్తి కెవ్వాని
　　ఘన భుజాదండంబు కల్పశాఖి
ప్రబల రాజాధిరాజ వీరప్రతాప
రాజ పరమేశ బిరుద విభ్రాజి యెవ్వఁ
డట్టి శ్రీకృష్ణరాయ వీరాగ్రగణ్యుఁ
డొక్కనాఁడు కుతూహలం బుప్పతిల్ల.

ఈ పద్యమందలి మొదటి మూఁడు పాదముల యందు రాయల విజయములకు సంబంధించినవి కొన్ని చారిత్రకాంశములు గలవని శ్రీ లక్ష్మణ రావుగారి యభిప్రాయము. వానినిగూర్చి వారీక్రింది విధముగా వ్రాసియున్నారు :

> పై మూఁడు చరణములలోని 'ఉదయాచలేంద్రము', 'నావాడపతి', 'శకంధర' 'సింధురాధ్యక్షుఁడు' అను పదములచేఁ గవి కొన్ని చరిత్రాంశముల సూచించినాఁడనుటకు సందేహములేదు.
>
> ఉదయాచలేంద్ర మనఁగా నెల్లూరుసీమలోని ఉదయాద్రి. సింధురాధ్యక్ష అనఁగా గజపతి అని చెప్పిన టీకాకారుల యర్థమును మన మంగీక రింపవచ్చును. కాని యితర పదముల వలన నేదేశమును గాని,

యేరాజును గాని గ్రహింపవలయునో టీకాకారుల వ్రాతల వలన నర్థ బోధకమగుటలేదు.

నావాడపతి = నావాడ దేశపు రాజు. శకంధర = శకంధరుఁడను రాజు. పంచగౌడ ధాత్రీపదము = కన్నోజీలు మొదలైనవారి యుత్తరదేశము. అని టీకాకారులు వ్రాసియున్నారు. ఇంతకంటె నధిక స్పష్టమైన యర్థ మేమైన నింకుండి లాగవచ్చునేమో యత్నింతము.

ఇందలి శకంధర శబ్దము సికందర్ (అలెగ్జాండరు అను శబ్దమును పారశీక చరిత్రకారులందఱును సికందర్ అని వ్యవహరించెదరు. దీనినే మనవారు శకంధరగా మార్చి శక శబ్దమునకును దానికిని సంబంధము కల్పించిరని నాయూహ) అను పారశీక శబ్దమునకు సంస్కృత రూపమని నా తాత్పర్యము. కృష్ణదేవరాయల కాలమున గుజరాతు రాజ్యముపై సికందర్ అను నవాబుండెను. పెద్దనచేఁ జేర్కొనఁబడు గౌరవముంగన్న సికందరుఁ డీతఁడే యగునేని రాయలు గుజరాతు మీఁదికి క్రీ. శ. 1526 లో వెళ్ళెనని చెప్పుటయేగాక, ఆయేడు ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్—ఈ మూఁడు నెలలలో నెప్పుడో యొకప్పుడు వెళ్ళెననికూడఁ జెప్పవచ్చును. ఎందుకన నీతఁడు మూఁడు నెలలే రాజ్యము చేసెను.

ఈ కాలము మన మిదివఱకూహించిన కాలముతో సరిపోవుటలేదు. ఈ రెండు కాలములలో నేది నిజమో శోధింపవలెను. ఆపంచగౌడ ధాత్రీపదములో ఆఙ్ అనుదానికి మనము మర్యాద అనియే యర్థము తీసికొనవచ్చును. అభి విధి అని తీసికొననక్కరలేదు. (ఆఙ్ మర్యాదాభి విధ్యోః — పాణిని 2–1–13). ఆపంచగౌడ అనఁగా పంచగౌడ దేశము వఱకు అని యర్థము. పంచగౌడులనఁగా సారస్వతులు, కన్యాకుబ్జులు, మైథిలులు, గౌడులు, ఉత్కళులు.—గుజరాతీయులు పంచ ద్రావిడులలోని వారేగాని గౌడులుకారు. కావున ఆపంచగౌడ మనఁగా గుజరాతుదేశము వఱకును నని యర్థము చేయవచ్చును. దానికి గౌడ దేశము తగిలియున్నది గనుక ఆపంచగౌడ పద మిచ్చుట మర్యాద పదము.

ఇట్లీ పద్యము కృష్ణరాయని యుత్తర (నర్మదకుత్తర) దిగ్విజయ యాత్రను సూచించుచున్నదని యర్థము చేసికొనవచ్చును. ఆపంచగౌడ దేశమనఁగా నర్మదకు నుత్తరమున నున్న యుత్తరదేశమనియు సాధారణముగా నర్థము చేసికొనవచ్చును. ఇందును గుఱించి యింతకంటె నెక్కుడు చర్చించుటకు నధిక సాధనము లేమియునులేవు.

శ్రీ లక్ష్మణరావు పంతులుగారు చర్చించిన విషయములనుబట్టి చూడగా మనుచరిత్ర కృతిసమర్పణ కాలము క్రీ. శ. 1526 ఏప్రిల్ నెలకుఁ దరువాతిదై యుండవచ్చునని చెప్పవచ్చును. కాని పంతులుగారి యభిప్రాయమంత సమంజసముగాఁ గన్పట్టుటలేదు.

క్రీ. శ. 1524 లోనే రాయలు చనిపోయెనను వాదమొకటిగలదు. ఆవాదముమాట యటుండనిండు. 1525 వ సంవత్సరమున కృష్ణరాయల యేకైకపుత్రుఁడు దివంగతుఁడాయెను. అట్టియెడ రాయలు విషాదసాగరమున మునిగియుండును. అక్కాలమున నాతఁడు కృతిస్వీకరణాద్యుత్సాహజనక కార్యములం దాసక్తిఁ జూపెనని చెప్పుట కవకాశము కానరాదు. మఱియు 1525—26 సంవత్సరములలో నాతఁడు దండయాత్రలు సాగించెననుటకును జారిత్రకాధారములు కానరావు. 1526 వ సంవత్సరమున ఫిబ్రవరి, మార్చి, ఏప్రిల్ నెలలలో రాయలు విజయనగరముననే యున్నట్లు శాసనాధారములును గలవు. కావున మనుచరిత్ర కృతి సమర్పణ 1526 లో జరిగెననుట కవకాశము గానరాదు.

ఇఁక శకంధర శబ్దమునుగూర్చి కొంత చెప్పవలసియున్నది. గుజరాతు నేలిన సికందరు మూఁడునెలలు మాత్రమే రాజ్యము చేసియున్నాఁడు. అట్టివానిని రాయ లరిగాపుగాఁ జేసెనని పెద్దన చెప్పియుండఁడు. చెప్పినను నందు స్వారస్యములేదు. ఇక నీపద్యమునందలి శకంధర శబ్దమునకీ క్రింది యర్థమును జెప్పవలసియున్నది. ఈ పద్యమునఁ బెద్దన నర్మద కుత్తరమునయున్న ప్రదేశమునుగూడ రాయల విహారభూమిగా వర్ణించియున్నాఁడు. చారిత్రకములగు నాధారములనుబట్టి పరిశీలించినచో నక్కాలమున నాప్రదేశమంతయు ఢిల్లీ చక్రవర్తుల యధికారమునకు లోనైయున్నది. రాయల కాలమున సికందరు లోడీ యను నాతఁడు చక్రవర్తియై యుండెను. ఈతఁడు క్రీ. శ. 1489 నుండి 1517 వఱకు ఆగ్రా రాజధానిగా పరిపాలనము గావించినాఁడు. పెద్దనార్యుని పద్యము నందలి సికందర శబ్ద వాచ్యుఁడీతఁడే యని చెప్పవచ్చును. సికందరులోడీ రాయలకు కేవల మరిగాపు గాకపోవచ్చును. కాని రాయల శౌర్యప్రతాపములఁ జవిఁజూచిన వారిలో నాతఁడు గూడ నొక్కఁడై యుండవచ్చును. కావున శ్రీ లక్ష్మణరావు పంతులుగారి యభిప్రాయము నిర్బాధకమని చెప్పఁజాలము.

మనుచరిత్రము క్రీ. శ. 1517 తరువాత క్రీ. శ. 1520 సంవత్సరమునకు పూర్వము రచింపబడెననుటయే యిప్పటికున్న వాదములలో సమంజసముగాఁ గన్పట్టుచున్నది. క్రీ. శ. 1516—17 సంవత్సరముల మధ్యకాలమునఁ బారిజాతాపహరణ కృతిసమర్పణ కాలమని స్థూలముగా జెప్పవచ్చును.

# మాదయగారి మల్లన—రాజశేఖర చరిత్రము

రాయల యాస్థాన కవులలో నొకఁడుగ మాదయగారి మల్లన రాయవాచకము నందును, కృష్ణరాయ విజయము నందును బేర్కొనఁబడి యున్నాఁడు. ఈతఁడు రాజశేఖరచరిత్ర మను మహాప్రబంధమును రచించి, తిమ్మరుసు మహాప్రధానికి నల్లుఁడు, మేనల్లుఁడునగు నాదెండ్ల అప్పయ మంత్రికి అంకితమిచ్చి యున్నాఁడు. రాయల యాస్థాన కవియయ్యు నీతఁడు రాయలకెట్టి గ్రంథము నంకితము చేసినట్లు గానరాదు. రాయవాచకమునందలి వాక్యములు గూడ సందిగ్ధములుగనే యున్నవి. అందుగూడ మనుచరిత్ర పారిజాతాపహరణములే పేర్కొనఁబడి యున్నవి. ముక్కు తిమ్మన, అల్లసాని పెద్దన్న, మాదయగారి మల్లన అను మహాకవులు మువ్వురును రాయవాచకమునఁ బేర్కొనబడియున్నారు. కాని గ్రంథములు మాత్రము రెండే చెప్పఁబడి యున్నవి. కావున మల్లనమహాకవి రాయలకంకితముగా నెట్టి గ్రంథమును రచింపలేదని చెప్పుటయే సమంజసము. కాని యిది నిశ్చయవాక్యము మాత్రముకాదు.

మాదయామాత్యుని పుత్రుఁడగు మల్లయనుగూర్చి యీక్రింది విషయములు రాజశేఖరచరిత్రమున జెప్పఁబడి యున్నవి:

శంకర పాదసేవన వశంవదమానస పంకజాత ని
శ్శంక వచోవిలాస రుచిసార వినిర్జిత పూర్ణ పూర్ణిమై
ణాంక దురక్షరానన భయంకర శౌనకగోత్ర పాత్ర య
య్యంకి పురాగ్రహార విభవాకర మాదయమల్ల సత్కవీ.

ఇది శ్రీమదఘోర శివాచార్య గురు కరుణా విశేష లబ్ధ సారస్వత మాదయామాత్య పుత్ర మల్లయ నామధేయ ప్రణీతంబైన రాజశేఖర చరిత్రంబను మహాప్రబంధంబు.

దీనిని బట్టి యీక్రింది యంశములు దెలియుచున్నవి. ఈతనిది శౌనక గోత్రము. ఈతఁ డయ్యంకి పురమున కధికారి. అఘోర శివాచార్యుని శిష్యుఁడు. ఈ అఘోర శివాచార్యుఁడే ముక్కుతిమ్మనకును, ఈతని మేనమామయైన ఘంట సింగన్నకును గూడ దీక్షాగురువైనట్లు వారి గ్రంథములవలన దెలియుచున్నది. మల్లనకవి కీతఁడు శైవదీక్షాగురువే కాక సారస్వత గురువును నైనట్లు రాజశేఖరచరిత్రమందలి గద్యమును బట్టి తెలియవగును. మల్లన యింటిపేరు తెలియుటలేదు. రాజశేఖర చరిత్రమునగృతిపతి యీతని 'నయ్యంకి పురాగ్రహార విభవాకర' అని సంబోధించుటచే యీతని గృహనామ

మయ్యంకియై యుండునని కొంద అభిప్రాయపడుచున్నారు. అయ్యంకి గృహ నామము గలవారు కొందఱు కలరు.

తురగా రామకవితోఁ గలసి నాగరఖండమును రచించిన బాలసరస్వతి యింటిపే రయ్యంకివారు. ఆతఁడును శౌనక గోత్రజుఁడే. కావున నీతఁ డయ్యంకి మల్లనయై యుండవచ్చును. అఘోర శివాచార్యుని శిష్యుఁడుగావున నీతఁడు శైవబ్రాహ్మణుఁడై యుండవచ్చునని పలువురు తలంచుచున్నారు. కాని యీతఁడువీరశైవుఁడుమాత్రము కాఁడు. సామాన్యముగ శైవబ్రాహ్మణులని పిలువఁబడు శివార్చకుల తెగకుఁ జెందినవాఁడును గాఁడు. శివభక్తిపరుఁడగు నియోగి బ్రాహ్మణుఁడని చెప్పవచ్చును. ఈతఁడు శివకేశవులయెడ సమభావము గలవాఁడనుటకు రాజశేఖర చరిత్రమునందలి ప్రథమ పద్యమే నిదర్శనము. అది శ్రీ వేంకటేశ్వర స్తుతిరూపమై యున్నది. 'అయ్యంకి' అను గ్రామము ప్రస్తుతము కృష్ణామండలములోఁ గలదు.

కృతిపతియగు నాదెండ్ల అప్పయమంత్రి ఆరువేల నియోగిబ్రాహ్మణుఁడు. కౌశిక గోత్రజుఁడు. నాదెండ్ల యనునది యొక గ్రామ నామము. ఆ గ్రామము గుంటూరు జిల్లా నరసరావుపేట తాలూకాలోనున్నది. అప్పనమంత్రి శ్రీ కృష్ణ దేవరాయల కాలమున సకల రాజ్యకార్య ధురంధరుఁడయి, మహామంత్రియై వెలసిన సాళువ తిమ్మరుసు మేనల్లుఁడు. అప్పనమంత్రికేగాక తత్పూర్వులకు గూడ విజయనగర రాజ్యముతో సంబంధముండినట్లు రాజశేఖర చరిత్రమునుబట్టి తెలియుచున్నది. అప్పనమంత్రి ప్రపితామహుని సోదరుఁడయిన చిట్టి గంగనా మాత్యుఁడు సాళువ నరసింహరాయలకడ మంత్రిగానున్నట్లీక్రింది పద్యమును బట్టి తెలియుచున్నది :

సాళువ నారసింహ మనుజ ప్రభు కార్య కళాధురంధరుం
డై లవణాబ్ధి వేష్టిత ధరాధిప దుర్మత మంత్ర మంత్రి ఖం
డాల వితాన కేసరి యనంగ ననంగ సమాన రూపరే
ఖా లలితాంగుఁ డట్టి చిటి గంగన యొప్పు గుణానుషంగుఁడై.

ఈ చిటి గంగనామాత్యుఁడు రాజనీతి కుశలుఁడనియు, వాగ్మి యనియు నీ క్రింది పద్యమునఁ జెప్పఁబడియున్నది :

అంగాధీశ కళింగరాజ మగధాద్యక్షోధి భూభృత్సభా
రంగాభంగ విహారముల్ ఘనశిలాగ్రావస్థలీ సంసర
ద్గంగోత్తుంగ తరంగ నిర్గళిత నిధ్వానోద్భవ ప్రక్రియ
సాంగత్యంబులు చిట్టిగంగ విభు వాచాసంభవారంభముల్.

ఈ చిటి గంగనామాత్యునికడనే సాళువ తిమ్మరుసు రాజనీతి నభ్యసించె నని చెప్పుదురు.

అప్పయమంత్రి తండ్రియగు తిమ్మన, సాళువ తిమ్మరుసు సోదరియగు కృష్ణమాంబను వివాహమాడియున్నాఁడు. తిమ్మరుసు పుత్రికయగు తిరుమలమ్మను అప్పనమంత్రి వివాహమాడెను. రాజశేఖర చరిత్రమున తిమ్మరుసు మంత్రిని గూర్చి యీ క్రింది విధముగాఁ జెప్పఁబడి యున్నది :

ఏ మంత్రిమణి నిజస్వామి కార్యక్రియా
తత్పరమానసోత్సాహశాలి
ఏ మంత్రిమణి మిత్రహిత బాంధవాశ్రిత
ప్రకర రక్షణ కళా ప్రౌఢబుద్ధి
ఏ మంత్రిమణి వచో హేలాభి నైర్మల్య
శీతలతాధూత శీతరోచి
ఏ మంత్రిమణి సుధాధామ శాంభవధామ
ధాళధళ్య సుతుల్య ధవళకీర్తి
అట్టి మంత్రి కులోత్తంస మహిత నృపతి
పటల మకుటాగ్ర ఘటిత సత్పద్మయుగళి
సకల కర్ణాట రక్షా విచక్షణుండు
దీన సురశాఖి సాళువ తిమ్మ మంత్రి.

అమ్మహామంత్రి కతని యర్థాంగలక్ష్మి
సకల పుణ్యాంగనా జన శ్లాఘనీయ
లక్ష్మమాంబ నుదయించి లలిని మెరయు
తిరుమలాంబికఁ బెండ్లియై తేజరిల్లె.

అప్పన మంత్రి తమ్ముఁడు గోపన. రాజశేఖర చరిత్ర రచనాకాలమునకు గోపన గుత్తిదుర్గ రక్షణాధికారమున నున్నట్లు తద్గ్రంథమునుబట్టి తెలియుచున్నది. గోపన మంత్రి సంస్కృత ప్రబోధ చంద్రోదయ నాటకమునకు చంద్రిక యను వ్యాఖ్యానము రచించెను. అందు తానును, అప్పన మంత్రియు తిమ్మరుసు భాగినేయులమని చెప్పికొనెను :

తస్య శ్రీకృష్ణరాయస్య ప్రాజ్యరాజ్య ధురంధరః,
కులక్రమా గతో మన్త్రీ సార్వ తిమ్మ చమూపతిః.

ఆపూర్వ పశ్చిమ సముద్ర మదత్త రాజ్యమ్
ఆసేతు సింహగిరి చా ప్రతిమ ప్రతాపః,
యః కృష్ణరాయనృప పాలక కదమ్బ నాథః
కౌణ్డిన్య గోత్ర తిలకః కవి పారిజాతః.
తద్భాగినేయా తరణి ప్రతాపౌ నాదిణ్డ్ల యప్పప్రభుగోప వర్యౌ.

శ్రీ కృష్ణదేవరాయల రాజ్యకాలమున సాళువ తిమ్మరుసు మహాప్రధానియై విజయనగర సామ్రాజ్యమును శత్రు దుర్నిరీక్ష్యముగ నొనర్చెను. అట్లు గావించుటలో విశ్వాసపాత్రులగు సేనానాయకు లాతనికిఁ బెక్కువిధములఁ దోడ్పడియుండిరి. ఆతని మేనయల్లుండ్రగు అప్పన గోపన మంత్రులుగూడ రాజ్యనిర్వహణమున నాతనకి చేదోడువాదోడుగఁ బనిచేయుచుండిరి. ఆతని పెదమేనల్లుఁడగు కోనయ విషయముమాత్ర మెందును జెప్పఁబడియుండలేదు. అప్పన గోపనలు మాత్రము రామలక్ష్మణులవలె అవక్రపరాక్రమోపేతులయి మేనమామకు దుర్గరక్షణాది కార్యములందుఁ దోడ్పడుచుండిరి. రాజ్యాధికారములను నిర్వహించుటయేగాక వీరనేకములగు దానములను గావించియు, దేవాలయములను బ్రతిష్ఠించియు బహుజన శ్లాఘాపాత్రులయి పన్నెకెక్కిరి. అందందు వీరు వేయించిన శిలాశాసనము లనేకములు నేడు లభించినవి.

రాజశేఖర చరిత్ర రచనాకాలమునకు గోపనమంత్రి గుత్తిదుర్గమునకుఁ బాలకుఁడుగానున్నట్లు గ్రంథమునుబట్టి తెలియుచున్నది. అప్పనమంత్రి యుద్యోగమునుగూర్చి యిందేమియుఁ జెప్పఁబడలేదు. అందువలననే కొందఱు విమర్శకులు రాజశేఖర చరిత్ర రచనాకాలమునకు అప్పనమంత్రి కెట్టియుద్యోగమును లేదనియు, ఆనాఁటి కాతఁడు అయ్యంకి గ్రామమునకుఁ గరణముగా మాత్రముండి యుండెననియు నూహించియున్నారు.

రాజశేఖర చరిత్రమున అప్పన మంత్రి యే దుర్గమునకు రక్షకుఁడుగా నుండెనో చెప్పఁబడనిమాట వాస్తవమే. కాని యాశ్వాసాంత పద్యమున "శృంభఃపూర్వ భూభృద్దిశా నారీ మన్మథ" అను విశేషణము యీతనిఁగూర్చి కలదు. దీనినిబట్టి శ్రీ బండారు తమ్మయ్యగారు రాజశేఖర చరిత్ర రచనాకాలమునకు అప్పనమంత్రి యుదయగిరిదుర్గ రక్షకత్వమున నియుక్తుఁడయి యుండునని యూహించి యున్నారు.

శ్రీ చేకుమళ్ల అచ్యుతరావుగారు, శ్రీ తమ్మయ్యగారి యూహ సరికాదని చెప్పుచు నీక్రింది విధముగా వ్రాసియున్నారు :

> వీరుచేసిన యూహ నాకెంతమాత్రమును సరిపడలేదు. పూర్వభూభృద్దిశా యని యున్నదిగాని పూర్వభూభృత్పురమని యుండలేదు. పూర్వభూభృత్పురమని యున్నయెడల వారుచేసిన యర్థము సరిపోవచ్చును. 'దిశా'యని యుండుటచేఁ బ్రత్యేకముగా నొక పురనామకమగు సీమగాక, మఱియేదో విపులతరమగు దేశముగా నుండవలెనని తలంచితిని.
>
> ఇట్లు వితర్కించుచు నన్వేషింప సాగితిని.
>
> శాసనాదిక ప్రకటనలలోఁ బ్రవీణులగు నా స్నేహితులతో ముచ్చటింపగా నొకరు మంగళగిరి శాసనములో నాదెండ్ల అప్పయ్యను గుఱించి కొంత

విషయ మున్నదియని తెలియఁజేసిరి. ఆ వెంటనే 'ఎపిగ్రాఫికా, ఇండికా' ఆరవ సంపుటములో నున్న యా శాసనమును జదివితిని. తదుపరి నా మొదటి యనుమానము రూఢమయినది. పూర్వ భూభృద్దిశాయను విశేషణము ఉదయగిరి రాజ్య సూచకము గాదనియు, మఱి వేఱు ప్రదేశమును గుర్తించు చున్నదనియు స్పష్టమైనది.

నాదెండ్ల అప్పయ్య ఉదయగిరిలో నెన్నడు నివసించి యుండలేదు. ఆ శాసన ప్రకారము శ్రీ కృష్ణదేవరాయలు సాళువ తిమ్మరుసు సహాయమున కొండవీడు దుర్గమును సాధించి, గజపతి నోడించిన తరువాతఁ దాను నూతనముగా జయించిన దేశమును బరిపాలించుటకుగాను తిమ్మరుసు మహామంత్రి ద్వారా తగినవారిని నియమించెను. అప్పుడు తిమ్మరుసు తన మేనల్లుడు నల్లుఁడు నయిన అప్పయ్యకు గుత్తి, వినుకొండ, అమరావతి, మున్నగు కోటలపయి నధికారము నప్పగించి, తన కనిష్ఠ భాగినేయుఁడయిన గోపయ్యను కొండవీడు దుర్గమున నుంచి తూర్పు దేశ మంతయును స్వాధీనము చేసికొనెను. ఈ యేర్పాటువలన నప్పయ్యకు ననంతపురము జిల్లా మొదలు గుంటూరు జిల్లా తుదవఱకు ననఁగా తూర్పు కొండల భాగమంతయు—కొండవీడు తప్ప—అప్పగించెను.

కావున 'పూర్వ భూభృద్దిశా' అను మాటవలన తూర్పు కొండలదేశమని స్పష్టమగుచున్నది. ఈ దేశమంతకు మధ్యస్థముగానున్న వినుకొండ యీతని రాజ్య స్థానముగా నుండవచ్చును. ఏలయన నీయన చేసిన దాన శాసనములలోఁ జాలవఱకు నా సీమ యందును, నా పట్టణము చుట్టు పట్లనున్న గ్రామముల యందును గాన్పించుచున్నవి. కనుక వినుకొండ ముఖ్యస్థానముగాఁ జేసికొని, తూర్పు నాఁడంతయు—కొండవీడుకాక—నాదెండ్లప్పయ్య పరిపాలించెనని నిశ్చితముగాఁ జెప్పవచ్చును.

ఈ విమర్శనమునందలి సామంజస్యమును బరిశీలింపవలసి యున్నది. 'పూర్వభూభృద్దిశా నారీమన్మథా' అనునొక్క విశేషణమునుబట్టి యింతటి వ్యాఖ్యానము సేయుట కవకాశము గలదా ? అను ప్రశ్నకుఁగూడ మనము సమాధానమీయవలసి యున్నది. శ్రీ అచ్యుతరావుగారు పేర్కొనినట్లు రాజశేఖర చరిత్ర రచనా కాలమునకే అప్పన మంత్రి వినుకొండ, అమరావతీ మున్నగు దుర్గములకు రక్షకుఁడయి యున్నచో, మల్లనకవి యా విషయమునేల స్పష్టముగఁ జెప్పలేదు ? ఆశ్వాసాంత పద్యమునందలి యొక సంబుద్ధి విశేషణమున నిగూఢముగఁ జెప్పవలసిన యావశ్యకత యేమిగలదు ? గోపన మంత్రిని గుత్తి దుర్గ రక్షకుఁడని స్పష్టముగాఁ జెప్పిన కవి, కృతిభర్తయగు అప్పన మంత్రి విషయమున

నీ మూఁకీ ఖావమేల వహించెను? ఈ ప్రశ్నలకు సదుత్తరము లభించిననే గాని శ్రీ అచ్యుతరావుగారి వాదము సంగీకరించుటకు వీలులేదు. మఱియొక విషయము.

శ్రీ అచ్యుతరావుగారు పేర్కొనిన మంగళగిరి శాసనము శ్రీ కృష్ణదేవ రాయలు కొండవీడు దుర్గమును సాధించిన తరువాత చేయఁబడిన యేర్పాటు లకు సంబంధించినది. కాని రాజశేఖర చరిత్రము కొండవీడు దుర్గ విజయము నకు పూర్వమే రచింపఁ బడెననుటకు ఆధారము లనేకములు గలవు. రాజశేఖర చరిత్రమున శ్రీ కృష్ణదేవరాయలనుగూర్చి యొక్క మాటయినను లేదు. రాయల రాజ్య కాలముననే యీ గ్రంథము రచింపఁ బడియున్నచో, ఆంధ్రభోజుఁడని ప్రశస్తి వహించిన యమ్మహనీయుని గూర్చి యెద్దియును వ్రాయఁబడకుండుట సంభావ్యమగు విషయముగాదు. సాళువ తిమ్మరుసును గూర్చి చెప్పఁబడిన పద్యమునందు గూడ నాతఁడు "సకల కర్ణాట రక్షా విచక్షణుండు" అని మాత్రమే వ్రాయఁబడినది. అచ్చట గూడ కృష్ణరాయ ప్రశంస గన్పట్టదు. కావున నీ గ్రంథము రాయల రాజ్యారంభమునకు పూర్వమే రచింపఁబడినదని చెప్పుట కవకాశము కలదు.

తిమ్మరుసు రాయల రాజ్యకాలముననే గాక వారి యన్నయగు వీర నృసింహరాయల కాలమున గూడ మహామంత్రియేగదా! కావున సకల కర్ణాట రక్షా విచక్షణాది బిరుదములు తిమ్మరుసు కానాఁడు కూడ వర్తించును. రాజ శేఖర చరిత్రమున గోపన మంత్రి గుత్తి దుర్గమునకు రక్షకుఁడని చెప్పఁబడి యున్నది. రాయలు కొండవీడును జయించిన తరువాత తద్దుర్గ రక్షణభారము గోపన మంత్రిపయిఁబడెను. కొంతకాలము గడచిన తరువాత కొండవీడు, కొండపల్లి సీమలేకము సేయఁబడినవి. ఆ రాష్ట్ర పాలనమునకు కొండమరు సయ్య నియుక్తుఁడాయెను. అనంతరము మఱల గోపన మంత్రి యే కొండవీడు దుర్గాధ్యక్షుఁడుగ నియమింపఁబడెను. రాయల జీవితాంతము వఱకు గోపన మంత్రియే కొండవీడు దుర్గమును బరిపాలించెను.

రాజశేఖర చరిత్రమున కొండవీడు దుర్గ ప్రసంగము లేకపోవుటచే నది కొండవీడు విజయమునకు పూర్వమే రచింపఁబడెనని చెప్పకతప్పదు. గోపన మంత్రికిఁగల గుత్తి దుర్గ రక్షణాధికారమును బేర్కొన్న మల్లనకవి కొండ వీడు ప్రసంగమును గూడఁ జేయక పోవుటచే తత్కావ్య రచనాకాలమునకు గోపన మంత్రి కొండవీడు దుర్గ రక్షకుఁడు కాఁడనియే చెప్పవలెను. కొండ వీడు దుర్గ విజయానంతరము తద్దుర్గ రక్షకుఁడుఁగ బ్రప్రథమమున నియుక్తుఁ డయినవాఁడు గోపన మంత్రియే గావునను, తద్దుర్గాధిపత్య ప్రసంగ మక్కావ్య మున గానరాదు గావునను, రాజశేఖర చరిత్రము కొండవీడు విజయమునకుఁ బూర్వమే రచింపఁబడెనని నిశ్చితముగాఁ జెప్పవచ్చును.

అట్టియెడ కొండవీటి విజయమునకుఁ దరువాతి విషయములను బేర్కొను చున్న మంగళగిరి శాసనము నాధారముగాఁ బేర్కొని 'పూర్వ భూభృద్దిశా నారీ మన్మథః' అను విశేషణమున కర్థముచెప్ప యత్నించుట సవ్యముగాఁ గన్పట్టదు. అంత మాత్రమున అప్పనమంత్రి కేవల మయ్యంకి కరణముగా నుండెనని చెప్పుటకును వలనుపడదు.

రాజశేఖర చరిత్రము నందలి కథకు మూలమెద్దియో తెలియుటలేదు. పురాణేతిహాసములలో మారుమూల నెచ్చటనైన నుండవచ్చును. లేదా కవి స్వకపోలకల్పనమైనను గావచ్చును.

## కథాసారము

హేమధన్వుఁడను రాజు అవంచిపురమును పరిపాలించుచుండెను. ఆతని భార్య విభావసుఁడను రాజు కూతురు పాలిక. ఆ దంపతు లనపత్యులయి మహేశ్వరుని గూర్చి ఘోర తప మాచరించిరి. వారి భక్తికి మెచ్చి యీశ్వరుఁడు వారికి సంతానదాయకమగు ఫలము నొకదాని నిచ్చెను. రాణి యా ఫలము నారగించెను. తత్ప్రభావమున నామెకు పుత్రుఁడు కలిగెను. అతఁడే రాజశేఖరుఁడు.

రాజశేఖరుఁడు చిన్ననాటనే వేద వేదాంగముల నభ్యసించి, సకల కలా కుశలుఁడై ధనుష్మదగ్రణియు, మహాశూరుఁడు నయ్యెను. హేమధన్వుఁ డొక నాడు నిండు పేరోలగమున నుండగా నాకముని యయ్యాస్థానమునకు వచ్చి, తన కూఁతు నొక్క రక్కసుఁడు అపహరించుకొని పోయెననియు, ఆతని బారినుండి తన తనయను రక్షింపుఁడనియు హేమధన్వుని వేడుకొనెను. అంతట హేమధన్వుఁడు తన తనయుఁడగు రాజశేఖరుని తత్కార్యార్థము నియోగించెను.

తండ్రి యాజ్ఞానుసారము రాజశేఖరుఁడు ధనుస్తూణీర పాణియై బయలు దేరి మంథరపర్వత ప్రాంతమున నా రక్కసునితో ఘోరయుద్ధము గావించెను. ఆతనిధాటి కోర్వఁజాలక, అప్పిశితాశనుఁడు మహాకాళి శరణుజొచ్చెను. మహాకాళియు తన భక్తుఁడగు నా రక్కసుని రక్షింపగోరి, రాజశేఖరునకుఁ బ్రత్యక్షమై ఆతని శౌర్యప్రతాపముల నుగ్గడించి. రక్కసుని క్షమింపుమని కోరి రాజశేఖరున కొక దివ్యమణి నిచ్చెను. అంతలోనే యొక యోగిని మునికుమారిక యగు భానుమతి నాతని కప్పగించి, అతనికి కానుకగా త్రికాలవేదియగు చిలుక నిచ్చెను. అఁటనుండి రాజశేఖరుఁడు బదరికాశ్రమమునకేగి, యాశీస్సులనంది, భానుమతి నామెతల్లి కప్పగించి, తిరిగి వచ్చుచు మార్గమధ్యమున నొక సరోవర ప్రాంతమున విడిసెను.

ఆ సమయముననే అరుణపుర రాజగు కీర్తిపాలుని కూతురు కాంతిమతి యను నామె సఖీ జనపరివృతయై ఆ కొలనిలో జలక్రీడ లాడుటకు వచ్చెను.

ఆమెను జూచి రాజశేఖరుడు మోహపరవశుడాయెను. ఆమెయు నాతని వలచెను.

త్రికాల వేదియగు చిలుక వారి వృత్తాంతమును రాజశేఖరున కిట్లెరిగించెను.

అరుణ పురమున నిర్వురు బ్రాహ్మణులు వసించుచుండిరి. వారిలో ముకుందుడనువాడు ధనవంతుడు. అరుణుడనువాడు నిర్ధనుడు. ధనముఁ గోరి అరుణుడు యమునానదీ తీరమున విష్ణునిగూర్చి ఘోరతప మాచరింపు చుండెను.

ఆ సమయమున పుష్పవతీ పురాధిపతి యగు నందకుడను గంధర్వ నృపాలు తనయ లతయును, మహేంద్ర నగరాధిపతియగు చిత్రవాహనుఁ డను యక్షేశుని కూతురు కనకమంజరియును జలకములాడ నచ్చోట కేగిరి. పుష్పమంజరి నొకదానిని కోయుటకయి వారిలోవారు తగవులాడుకొని, తత్సమీపముననే తపమాచరించుచున్న అరుణుని తపోభంగము గావింప ప్రతినలు గైకొనిరి. ప్రప్రథమముగ లతయను చిన్నది తత్తపోభంగమును గావింప యత్నించెను. అమ్మహర్షి కినిసి యామెను మనుష్యకాంతగా జనింప శపించెను. ఆమెయే అరుణపురాధిపతి పుత్రియగు కాంతిమతి.

విచిత్రమగు నీ వృత్తాంతమును వినిన తరువాత రాజశేఖరుడు కాంతిమతీ విరహమున మిక్కిలి యాకులపాటొందెను. కాంతిమతియు తన చెలి కత్తెను రాజశేఖరునికడకు దూతగాఁ బంపెను. రాజశేఖరుడును కాంతిమతి కడకు తన చిలుకను బంపెను. ఆ చిలుక సింధుపతియగు కీర్తిపాలునికడ రాజశేఖరుని గుణగణములను బ్రశంసించెను. సింధుపతియు సంతుష్టాంత రంగుఁడయి తన కూతును రాజశేఖరునకిచ్చి వివాహము గావించెను. వివాహానంతరము దంపతులిర్వురు తమ రాజధానికేతెంచి, సమస్త భోగభాగ్యముల ననుభవించుచుండిరి.

మీఁది కథయందెట్టి విశిష్టతయుఁ గానరాదు. ఇట్టి కట్టు కథలు మన దేశమున కొల్లలుగ గలవు. కాని కథా కథనమునందు మల్లనకవి కొంత వైశిష్ట్యమును బ్రకటించి యున్నాడు.

ఈతని కవిత్వమునకు ముఖ్యలక్షణములు రెండుగాఁ గన్పట్టుచున్నవి. ఒకటి — ఔచిత్య పరిజ్ఞానము. రెండవది — సంయమనము, శృంగార వర్ణనములను కవులు వెట్టి తలలు వేయు నక్కాలమునఁ గూడ నీతడు తన శృంగార వర్ణనలను లజ్జా వినయ సంభరితములుగనే వర్ణించియున్నాడు. అష్టాదశ వర్ణనము లిందును గలవు. కాని సహృదయులగు వారికి విసుగు గల్గించు టెందును గానరాదు. వర్ణనావసరమున అనావశ్యకమగు శబ్ద వైచిత్రిగాని, విషయాంతర ప్రసంగముగాని మచ్చునకైనను కవి చేయలేదు.

# ధూర్జటి

శ్రీకృష్ణదేవరాయల యాస్థానము నలంకరించిన మహాకవులలో ధూర్జటి యొకఁడు. కాళహస్తి మహాత్మ్యమను నొక మహా ప్రబంధమును ఈతఁడు రచించి, శ్రీకాళహస్తీశ్వరున కంకితము గావించెను. గ్రంథమున కవిని గూర్చిన యంశములేమియును లేవు. ఆశ్వాసాంత గద్యమున తన తల్లిదండ్రుల పేళ్లనుమాత్రమే చెప్పియున్నాఁడు. గద్యమునుబట్టి యీతఁడు కాళహస్తీశ్వర భక్తుఁడనియు, భవ పరాఙ్ముఖుఁడనియు మాత్రము తెలియుచున్నది.

గద్యము

ఇది శ్రీమత్కాళహస్తీశ్వర చరణ కమల సేవాపరాయణ సింగమ రమానారాయణ జక్కయ నారాయణ తనూభవ భవపరాఙ్ముఖ ధూర్జటి ప్రణీతంబైన శ్రీకాళహస్తి మాహాత్మ్యంబను మహా ప్రబంధంబునందు—

ఈ గద్యయందలి ధూర్జటి తలిదండ్రుల పేర్లనుబట్టి శ్రీ వేటుమళ్ల అచ్యుతరావుగారు ఒక వింత వ్యాఖ్యానమును గావించియున్నారు.

ఇందు సింగమరమానారాయణ యను పేరు తల్లిదనియు, జక్కయ నారాయణపేరు తండ్రిదనియు నేనూహించుచున్నాను. సింగమయనియు, రమాయనియు నీ రెండును స్త్రీ వాచకములు. జక్కయ యనునది పురుషవాచకము, నారాయణ శబ్దము రెండు పేర్లతోను జేర్పఁబడినది. బహుశః ధూర్జటికవి తురీయాశ్రమము స్వీకరించిన తరువాత నీ గ్రంథాంకితము చేసి యుండుటచే విప్రసన్యాసులు సర్వము నారాయణ నామోచ్చారణతో సంబంధింపఁ జేయవలసిన ధర్మము గానఁ దన పూర్వాశ్రమ మాతాపితల నామములకు నారాయణశబ్దము చేర్చియుండవచ్చును. ఈ యూహకు భవపరాఙ్ముఖ యను వాక్యము మఱింత బలముగా నున్నది. ఈ నా యూహ సరియైనదియో కాదో పండితులు నిర్ణయింతురుగాక.

శ్రీ అచ్యుతరావుగారిట్లూహించుటలో నిజముగా కొంత భ్రాంతికి లోనైనారను మాట వాస్తవము.

విప్రసన్యాసులు నారాయణ నామోచ్చారణ గావించుట సత్యమే. కాని యది యిట్టి సందర్భములందు కాదు. ఎవ్వరైన పెద్దలు తమకు నమస్కారము గావించిన, వారి నాశీర్వదించు పట్టునగాని, గృహస్థులగు వారు స్వగృహమున భిక్షకై యాహ్వానించునపుడు తమ యంగీకారమును దెలుపునప్పుడుగాని, సన్యాసులు నారాయణ నామోచ్చారణమును గావింతురు. అట్లు తన్నామోచ్చారణము గావించుటలో నిగూఢమగు నర్థము చాల గలదు. అది వివరించుట ప్రస్తుతము

మనకప్రస్తుతము. ఇఁక సన్యాసి యగువాఁడు పూర్వాశ్రమ స్మరణయే గావింపఁ గూడదు. అది యట్లుండనిండు.

కాళహస్తి మాహాత్మ్యమును రచించిన ధూర్జటి శివభక్తి తత్పరుఁడు. గ్రంథాదిని శివస్మరణము తప్ప దేవతాంతర స్మరణమును గావింపలేదు. అట్టి వాఁడు తన తలిదండ్రుల నామములకు నారాయణ శబ్దమును తానై జేర్చెననుట సంభావ్యముకాదు. అది వారి నామములందే సహజముగా నుండి యుండును. మఱియు తురీయాశ్రమమును స్వీకరించునపుడు పూర్వాశ్రమ వ్యవహార యోగ్య మగు నామము పోయి తురీయాశ్రమ యోగ్యమగు నామము మాత్రమే వ్యవ హృతమగు చుండును. తన నామమును స్పష్టముగాఁ జెప్పుకొనుచున్న ధూర్జటి, తురీయాశ్రమమును స్వీకరించెననుటయు సమంజసముకాదు. భవపరాఙ్ముఖ శబ్దమున కంత ప్రాధాన్య మీయఁబనిలేదు. అది మానసికమగు సంసార వైముఖ్యమును మాత్రమే సూచించును.

యౌవనమున ధూర్జటి విషయలౌల్యమునకు లోనై యుండును. 'స్తుతిమతి యైన యాంధ్రకవి' అను పద్య మిందులకు ప్రబల తార్కాణము. కుమార ధూర్జటి యీ పద్యము నుదాహరించుటచే నిది యసత్యమనఁరాదు. తాతగారి కపప్రథఁ గల్పించునవి గావున మూఁడు నాల్గు చరణముల నుదాహరింప మానెను. వయసున భోగపరాయణుఁడయి వ్యవహరించిన ధూర్జటి ముదిమిని విషయపరాఙ్ముఖుఁడయి యుండవచ్చును. అందులకే కాళహస్తి మాహాత్మ్యమున భవపరాఙ్ముఖుఁడనని చెప్పికొని యున్నాఁడు. ఈ మాట యెంత మాత్రమును తురీయాశ్రమ స్వీకారమును దెల్పదు.

కాళహస్తి మాహాత్మ్యమును బట్టి ధూర్జటి కాలముగాని కులముగాని తెలియుటలేదు. కాని యితర గ్రంథములను బట్టి యీతని కులగోత్రములును, కాలమును నిర్ణయింపఁబడుచున్నవి. కుమార ధూర్జటి బిరుదునామముఁగల వేంకటార్యుఁడు తన కృష్ణరాయ విజయ ప్రబంధమున ధూర్జటిని గూర్చి కొన్ని విషయములు చెప్పియున్నాఁడు. ఆ పద్యములివి :

నను భరద్వాజ గోత్రుని సదాపస్తంబ
    సూత్రుని బాంధవ స్తోత్రపాత్రుఁ
బాకనాటార్వేల వంశ ప్రసిద్ధుని
    ధూర్జటి పౌత్రు బంధురచరిత్రు
సద్గురు కారుణ్య సంప్రాప్త విద్యావి
    హారుని శ్రీ కాళహస్తి నిలయు
చిత్ప్రసూనాంబికా శ్రీకరానుగ్రహా
    సాదిత కవితారసజ్ఞ హృదయ

సార రచనాధురీణుఁ గుమార ధూర్జ
టి ప్రధానాగ్ర గణ్యుఁ బటీరహీర
మహిత సత్కీర్తిఁ గాశియమాత్యు పుత్రు
వేంకటార్యుని బిలిపించి వేడ్కఁ బనియె.

స్తుతిమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేల కల్గెనో
యతులిత మాధురీ మహిమ నా మును మీ పెద తాత చాల స
న్నుతిఁ గనె గృష్ణరాయల మనోజ్ఞసభ న్విను మీవు నట్ల స
త్కృత బహుమాన వైఖరులఁ గీర్తి వహింపుము ధాత్రిలోపలన్.

మీఁది పద్యములనుబట్టి వేంకటార్యునకు (కుమార ధూర్జటికి) మహాకవి ధూర్జటి పెదతాత యనియు, వేంకటార్యుని తాత పేరుకూడ ధూర్జటియే యనియు తెలుచున్నది. కాని నిజమాలోచించిన వేంకటార్యునకు మహాకవి ధూర్జటి పెద తాత కాఁడు. పరునకు మాత్రమే పెదతాతయై యుండును. అట్లుగాక మహాకవి ధూర్జటి యాతని పెదతాతయే యైనచో కృష్ణరాయల యాస్థానము నాతఁడుండుట కవకాశములేదు. ఈ విషయమును గూర్చి శ్రీ చాగంటి శేషయ్యగారు తమ యాంధ్రకవి తరంగిణీ పంద్రెండవ సంపుటములో విపులముగా చర్చించి యున్నారు. ఆ యంశములనే యిందు పొందుపఱుచుచున్నాఁడను.

కృతి ప్రేరకుఁడయిన ఆర్వీటి చినవేంకట భూపతి కవితోఁ బలికినట్లు రచింపఁబడిన యీ క్రింది పద్యముల వలన (పద్యములు మీఁద నుదాహరింపఁ బడినవి) నీ కవి కృష్ణరాయ విజయమును రచించునప్పటికి విశేష వయసు కలవాఁడు కాఁడనియు, సావిత్రీ చరిత్రము, ఇందుమతీ వివాహము నను రెండు ప్రబంధముల నదివఱకే రచించియుండెననియు, నీతఁడుఁ దేటతెలుఁగు మాటలతో మనోహరముగఁ గవిత్వము చెప్పఁగల వాఁడనియుఁ దెలియు చున్నది. కుమార ధూర్జటి రచించిన సావిత్రీ చరిత్రమును, ఇందుమతీ వివాహ మును కాలగర్భమునఁ బడిపోయినవి.

కృష్ణరాయ విజయ ప్రేరకుఁడు ఆకువీఁటి రాజగు చినవేంకటాద్రి యని యీ గ్రంథ ముద్రిత ప్రతి పీఠికలో శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రులవారు వ్రాసియున్నారు. కాని యది పొరపాటు. ఆకువీఁటి చినవేంకటాద్రి రాఘవ పాండవీయ కృతిభర్తకు సోదరుఁడు. కృష్ణరాయ విజయ కృతి ప్రేరకుఁడు ఆర్వీటి చినవేంకటరాజు. ఇతఁడు ఆర్వీటి బుక్కరాజు వంశములోనివాఁడు.

రామ పృథ్వీరమణ సాధ్వీమణి నాంచారమాంబా గర్భశుక్తి ముక్తాఫలం
బును నగు చిన్న వెంకటరాయ రాజ దేవేంద్రుండు

అని కవి చెప్పియుండుటచే నీ కృతిప్రేరకుని తండ్రి రామరాజనియు, దల్లి

నాంచారమ్మయనియు స్పష్టమగుచున్నది. ఆర్వీటి వంశములో నళియ రామరాజునకు మనుమఁడు చినవేంకటరాజు గలఁడు. కాని యీ కృతిప్రేరకుఁ డాతఁడు కాఁడు. ఆతని మనుమఁడు కోదండరామరాజు. ఇతనిని రామరాజని పిలిచెదరు. ఈతని కుమారుఁడే కుమార ధూర్జటి కాశ్రయుఁడయిన చినవేంకటరాజు. కోదండరామరాజు భార్య నాంచారమ్మ యని 'అందుగుల వెంకయ్య' కృతమైన 'రామరాజీయము' నందున్నది. దీనినిబట్టి రామరాజీయ కృతిభర్తయైన ఆర్వీటి కోదండరామరాజుయొక్క రెండవ కుమారుఁడైన చినవేంకటరాజే శ్రీ కృష్ణరాయవిజయ కృతిప్రేరకుఁడనుట నిశ్చయము.

ఆరవీటి చినవేంకటరాజు తల్లి నాంచారమ్మ. తండ్రి (కోదండ) రామరాజు. ఈ విషయము కృష్ణరాయవిజయము నందలి వాక్యములవలన స్పష్టమగుచున్నది. ఆకువీటి పెద వెంకటాద్రి, చిన వేంకటాద్రి అను సోదరులకు తల్లి తిమ్మాంబ. తండ్రి తిమ్మనరపాలుఁడు. ఈ విషయము రాఘవ పాండవీయము కృత్యాది యందలి పద్యములు ధ్రువపఱచుచున్నవి. కావున కుమార ధూర్జటి కాశ్రయదాత ఆరవీటి చిన వేంకటరాజు కాని ఆకువీటి చిన వేంకటాద్రికాఁడు.

కుమార ధూర్జటికిఁ బెదతాతయైన ధూర్జటి కవి శ్రీ కృష్ణదేవరాయల కాలములో నున్నవాఁడని పయిని వ్రాసిన 'స్తుతిమతియైన' అను పద్యమువలనఁ దెలియుచున్నది. ఆతనికి సోదరుని మనుమఁడైన యీ కవి ఆతనికిఁ దరువాత నేబది యఱువది సంవత్సరములలో నున్నాఁడని యూహించినచో పదునాఱవ శతాబ్దినిఁ జివర భాగమున నున్నాఁడని యూహింప వచ్చును. కాని దీనికొక బాధకము కన్పట్టుచున్నది.

కుమార ధూర్జటి కాశ్రయము నొసంగిన చినవేంకటరాజు ఆర్వీటి అళియ రామరాయలకు మనుమని మనుమని కుమారుఁడయి యున్నాఁడు. అళియ రామరాయలు క్రీ.శ. 1565 సంవత్సరమున తాళికోట యుద్ధమున గాలధర్మము నొందినవాఁడు. ఆతని మనుమని మనుమని కుమారుఁడు పదునాఱవ శతాబ్ది చివర భాగమున నుండుట సంభవముకాదు. ఈ చినవేంకటరాజు తండ్రియైన కోదండ రామరాజు కాలము క్రీ.శ. 1630 సంవత్సర ప్రాంతమయి యుండునని అందుగుల వెంకయ్యకవి చారిత్రమున వ్రాసి యున్నాఁడను. కావున నీ చినవేంకటరాజును, కుమార ధూర్జటియు 1650–60 ప్రాంతమువారై యుందురని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

అట్లయినచో కుమార ధూర్జటికి ధూర్జటికవి పెదతాత యగుట పొసఁగదు. కుమార ధూర్జటికి కాళహస్తిమాహాత్మ్య కృతికర్త యగు ధూర్జటి నిజముగాఁ బెదతాతయే (తాతకు అగ్రజుఁడు) అని నిశ్చయించితిమేని ఆతఁడు కృష్ణదేవ రాయల యాస్థానమున లేఁడని చెప్పవలసివచ్చును. కుమార ధూర్జటియు, నాతని

కుమారుఁడును, నాతని పుత్రుఁడును, లోకమును ధూర్జటి కృష్ణదేవరాయల యాస్థానమునందున్న వాఁడని చెప్పుచుండగా, మనమందులకు వ్యతిరేకముగా నిర్ణయించుటకంటె కుమార ధూర్జటి చెప్పిన పెదతాత యను మాటకు పరుసకు తాత యని యర్థము చెప్పి సమన్వయించుట యుక్తమని తలంచుచున్నాఁడను.

కృష్ణరాయ విజయమునందలి పద్యమునుబట్టి ధూర్జటికవి పాకనాటి యార్వేల నియోగి బ్రాహ్మణుఁడనియు, అపస్తంబ సూత్రుఁడనియు, భరద్వాజ గోత్రుఁడనియుఁ జెప్పవచ్చును. కుమార ధూర్జటి పుత్రుఁడయిన లింగరాజను కవి కాళహస్తి మాహాత్మ్యమను మఱియొక ప్రబంధమును రచించి యున్నాఁడు. అందు మహాకవి ధూర్జటిని గూర్చి యీ క్రింది పద్యమును వ్రాసి యున్నాఁడు:

శ్రీ కాళహస్తి గౌరీనాథ పదపద్మ
  సద్భక్తి యుక్తి నిశ్చలతఁ గాంచి
సార సుధాసార సరసోక్తి గుంఫనఁ
  గాళహస్తి మహత్త్వ కథ నొనర్చి
కృష్ణరాయ కిరీట కీలిత మణి గణా
  ర్చిత పదాబ్జద్వయ శ్రీ వహించి
యాసేతు కాశీతటావనీ విఖ్యాత
  సత్కీర్తి విస్ఫూర్తిఁ జాల వెలసి
ధరణిఁ జెలువొందె నే కవీశ్వరవతంస
రత్న మమ్మహనీయు ధూర్జటి సుధీంద్రుఁ
దలఁతు జలనిధివీచికా కలకలాను
కారి భూరికవిత్వ వాక్పటిమ గులుక.

మీఁది పద్యమునందలి 'కృష్ణరాయ కిరీట కీలిత' అను పాదమున కొంత యత్యుక్తియున్నను కృష్ణరాయల యాస్థానమున ధూర్జటి యుండెననుటకు యిది యొక ప్రబల నిదర్శనమని చెప్పక తప్పదు. మహాకవి ధూర్జటియు, లింగరాజ కవియు కాళహస్తి మాహాత్మ్యమునే వ్రాసియున్నారు. కాని వీరియువురి గ్రంథముల మాతృకల విషయమున గొంత భేదము కన్పట్టుచున్నది.

లింగరాజకవి చెప్పిన యీ క్రింది పద్యములను గమనించునది:

విను కాళహస్తి మహిమం
బనుపమమై వెలయు మును షడధ్యాయి కథన్
దెనుఁగునఁ గావ్యముగ నొన
ర్చెను బెద ధూర్జటి కవీంద్ర శేఖరుఁ డనఘా.

బహు పురాణ మథిత భవ్యార్థ శివతత్త్వ
సారమెల్ల నైక్య సరణిఁ బొదలి
జగతి శివరహస్య సంగ్రహమను నితి
హాస మొనరు విబుధు లభినుతింప.

ఆ యితిహాసంబు నందలి యుత్తర
భాగంబునందు భాస్వన్నిరూఢిఁ
గాళహస్తి మహత్త్వకథ నూట యిర్వది
యధ్యాయములఁ జెలు వమరుచుండుఁ
దత్కథఁ దెనుఁగున ద్రాక్ష రసోర్మికా
పరిపాక విస్ఫూర్తిఁ బరిఢవిల్లఁ
గృతి యొనర్పుము మదంకితముగ శబ్ద చ
మత్కృతిఁ బండితు ల్మది గణింప.

మహాకవి ధూర్జటికవి గ్రంథమునకు షడధ్యాయి కథ మూలమని మాత్రమే లింగరాజు చెప్పియున్నాఁడు. ఆ షడధ్యాయములు నెందున్నవో చెప్పలేదు. స్కంద పురాణము నందలి వైష్ణవ ఖండమున వేంకటాచల మాహాత్మ్యమను భాగము కలదు. అందు ముప్పదియవ యధ్యాయము మొదలు ముప్పదియైదవ యధ్యాయము వఱకు కాళహస్తి మాహాత్మ్య కథ కలదు. ఈ యాఱధ్యాయములే లింగరాజు చెప్పినవి కానోపును.

కాని యిందలి కథను యథాతథముగా ధూర్జటి యాంధ్రీకరింపలేదు. మూలకథ నాధారముగాఁ గొని, దానికి మఱికొన్ని కథలను జేర్చి, స్వకపోల కల్పనలతోఁ బెంచి, ధూర్జటి యొక మహా ప్రబంధమును నిర్మించి యున్నాఁడు. లింగరాజకవి గ్రంథమునకు శివరహస్య సంగ్రహమను గ్రంథము మూలము. అందున్న నూట యిర్వది యధ్యాయముల కథ నితఁడాంధ్రీకరించి యున్నాఁడు.

మహాకవి ధూర్జటి శ్రీకృష్ణరాయలతో ప్రతిభటత్వమును వహించి, కాళహస్తి మాహాత్మ్యమును వ్రాసియుండును. కృష్ణరాయలు తన ఆముక్తమాల్యద యందు గ్రంథావతారికలో విష్ణువును తప్ప దేవతాంతర స్మరణమును గావింప లేదు. మహాకవి ధూర్జటియు జ్ఞానప్రసూనాంబికా కాళహస్తీశ్వరులను తప్ప తన గ్రంథావతారికలో నితర దేవతలను స్మరింప లేదు. విష్ణుచిత్తీయమున యామునాచార్య చరిత్రము మొదలగు కథలు విష్ణుమాహాత్మ్య బోధకములుగ మూలకథకుఁ జేర్పఁబడియున్నవి. ధూర్జటియు మూలకథయందు లేకపోయినను శివమహిమను బ్రకటించుటకై నత్కీరుని యుదంతమును ప్రత్యేకముగఁ జెప్పి యున్నాఁడు. రాయల యాస్థానమునందలి ముక్కుతిమ్మన, మాదయగారి మల్లన మొదలగు మహాకవులు గూడ శివదీక్షను పొందినవారే. కాని ధూర్జటివలె మత

స్వాతంత్ర్యమును ప్రకటించినవారు కారు. ఇంతటి స్వతంత్రబుద్ధిగల ధూర్జటిని అష్టదిగ్గజములలో నొకనిగాఁజేసి సన్మానించిన రాయల మతసహనము ప్రశంసనీయము.

స్థలపురాణమును ప్రబంధీకరించుటలో ధూర్జటికి శ్రీనాథుఁడు పరోక్షగురువై యుండును. శ్రీనాథునివలెనే ధూర్జటియు యథావద్వస్తు వర్ణనమును గావించి స్థానికప్రకృతిని చక్కఁగ నిరూపించి యున్నాఁడు.

లింగరాజు కుమారుఁడగు వేంకటపతి యను నాతఁడు తన రత్నావళీపరిణయమున మహాకవి ధూర్జటిని గూర్చి యిట్లుచెప్పియున్నాఁడు :

పటు గంగాలహరీ తరంగసమ శుంభత్ప్రౌఢతాంచత్కఁళా
ఘటనున్ బాదవినమ్ర కృష్ణ నరరాడ్గంభీర కోటీర వి
స్ఫుట రత్నద్యుతి పాటలీకృత పదాంభోజాతు సర్వజ్ఞు ధూ
ర్జటినిం గొల్చెద నస్మదీయ కులకర్తన్ భక్తిరంజిల్లగన్.

'శ్రీకాళహస్తీశ్వరా' అను మకుటముతో ఆంధ్రమున నొక శతకము కలదు. ఆ శతకమునుగూడ మహాకవి ధూర్జటియే రచించెనని కొందఱి యభిప్రాయము. కాళహస్తి మాహాత్మ్య గ్రంథపీఠికయందు, కాళహస్తీశ్వర శతకము ధూర్జటి కృతము కాదని చెప్పఁబడియున్నది. శతకమున తద్గ్రంథము ధూర్జటి కృతమని చెప్పుట కాధారములు లేవు. కాని యా శతకము ధూర్జటి కృతమని జనశ్రుతి మాత్రము కలదు. మఱియు కస్తూరి రంగకవి అభేదయతి కుదాహరణముగఁ దన రంగరాట్ఛందమున, 'ధూర్జటివారి కాళహస్తీశ్వర శతకములోనిది' అని యీ క్రింది పద్యము నుదాహరించియున్నాఁడు :

నీకుంగాక కవిత్వ మెవ్వరికి నేనీనంచు మీఁదెత్తితిన్
జేకొంటిన్ బిరుదంబుఁ గంకణము మున్జేఁ గట్టితిన్ బట్టితిన్
లోకుల్మెచ్చ వ్రతంబు నా తలఁపుతీరున్ బీరునింగాదు ఛీ
ఛీ ! కాలంబున రీతి తప్పుదుసుమీ ! శ్రీకాళహస్తీశ్వరా !

శతకమునందలి భావమునకును, ప్రబంధమునందలి భావములకును గొంత సాదృశ్యమున్నమాట వాస్తవమే. కాని యంతమాత్రమున నీ శతకము ధూర్జటి కృతమని చెప్పలేము. ఏమైనను యీ గ్రంథకర్తృత్వము వివాదగ్రస్తమై యున్నది.

# అయ్యలరాజు రామభద్రకవి

రాయల సరస్వతీ మందిరము నలంకరించిన అష్ట దిగ్గజములలో రామభద్రకవి యొక్కఁడని లోకమునఁ బ్రతీతియున్నది. ఈతఁడు రచించిన రామాభ్యుదయ మను మహాప్రబంధమున గ్రంథాంత గద్యయందు యీ క్రింది రీతిగాఁ జెప్పఁబడియున్నది :

> ఇది శ్రీమదొంటిమిట్ట రఘువీర శతక నిర్మాణకర్మఠ జగదేకఖ్యాతి ధుర్యాయ్యలు రాజతిప్పయ మనీషి పర్వతాభిధాన పౌత్రాక్కయమాత్య పుత్ర పరిశీలిత సమిద్ధ రామానుజమత సిద్ధాంతమర్మ ముమ్మడివరదాచార్య కటాక్ష వీక్షాపాత్ర హృదయ పద్మాధిష్ఠిత శ్రీరామభద్ర రామభద్ర కవి ప్రణీతంబైన రామాభ్యుదయంబను ప్రబంధంబు.

దీనినిబట్టి యీతఁడు ఒంటిమిట్ట రఘువీర శతకమును రచించిన తిప్పయ మనీషికిఁ బ్రపౌత్రుఁడనియు, పర్వతమంత్రికిఁ బౌత్రుఁడనియు, అక్కయామాత్యునకుఁ బుత్రుఁడనియు, ముమ్మడి వరదాచార్యునకు శిష్యుఁడనియు, శ్రీరామభద్రోపాసకుఁడనియు తెలియుచున్నది. కవి జీవితవృత్తాంతమును దెల్పు నితరాధారములెవ్వియు రామాభ్యుదయమున గానరావు. ఇందు రామభద్రకవి తన గోత్రమునుగూర్చి యేమియుఁ జెప్పలేదు.

కాని నారాయణామాత్యుఁడు తన హంసవింశతి మహాకావ్యమునందును, అయ్యల భాస్కరకవులు రెట్టమత శాస్త్రమునందును యీ రామభద్రకవిని తమ పూర్వులలో నొకనిగాఁ జెప్పికొనియున్నారు. వారిది కౌండిన్యస గోత్రము. కావున రామభద్రకవిదిగూడ నా గోత్రమే యని చెప్పవచ్చును. తనతండ్రి పేరు నమాత్య శబ్దముచేర్చి చెప్పుటచే నీతఁడు నియోగిబ్రాహ్మణుఁడయి యుండును. ఈ కవి నివాసము కడపమండలములోని యొంటిమిట్టయై యుండును.

రామాభ్యుదయము గొబ్బూరి నరసరాజున కంకితము గావింపఁబడినది. ఈ నరసరాజు ఆరవీటివారి దౌహిత్రుఁడు. కవి తన గ్రంథమున గొబ్బూరివారి వంశమును, ఆరవీటివారి వంశమునుగూడ వర్ణించియున్నాఁడు. శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు తమ మహమ్మదీయ మహాయుగములో రామభద్ర కవినిగూర్చి యిట్లు వ్రాసియున్నారు :

> ఈతఁడు కృష్ణరాయలవారి యనుజ్ఞ ననుసరించి సకల కథాసార సంగ్రహమను తెలుఁగు కావ్యమును రచించెను. రాయల మరణానంతర మితఁడు నలుబది యేబది సంవత్సరముల వఱకును బ్రతికియుండెను. రామాభ్యుదయ మను కావ్యమును రచించి, రామరాజున కల్లుఁడగు గొబ్బూరి నరసరాజున కంకితమిచ్చెను.

శ్రీ లక్ష్మణరావుగారి వాక్యములలో రెండు పొరపాటులు దొర్లియున్నవి. సకల కథాసార సంగ్రహమును రామభద్రకవి రచించినమాట వాస్తవమే కాని యాతఁడీ రామభద్రుఁడు కాఁడు. అయ్యలరాజు రామభద్రుఁడు కౌండిన్యస గోత్రుఁడు. సకల కథాసార సంగ్రహకర్త కాశ్యపస గోత్రుఁడు. సకల కథాసార సంగ్రహమునందలి యీ క్రింది గద్యనుబట్టి యీ విషయము స్పష్టమగు చున్నది :

> ఇది శ్రీ రామభద్ర ప్రసాదలబ్ధ కవిత్వ మహత్త్వ విశారద శారద సత్కవి మిత్ర ఆపస్తంబసూత్ర పాత్ర కాశ్యపసగోత్ర పవిత్ర రామ భద్ర ధీముద్రాభద్ర రామభద్ర ప్రణీతంబైన సకల కథాసార సంగ్రహము.

అయ్యలరాజు రామభద్రుని రామాభ్యుదయ గద్యకును, దీనికిని పోలికయే లేదు. మఱియు సకల కథాసార సంగ్రహకర్తకు శారదుఁడను కవిమిత్రుఁ డొకడు కలఁడు. అయ్యలరాజు రామభద్రున కట్టి కవిమిత్రుఁడున్నట్లు గానరాదు. సకల కథాసార సంగ్రహ మొక స్వతంత్ర మహాప్రబంధము కాదు. పూర్వ మహాకవుల పద్యము లిందు కొలఁది మార్పులతోఁ గన్పట్టుచున్నవి. గ్రంథావ తారికయందు శ్రీ కృష్ణదేవరాయలు కవినిగూర్చి పలికినట్లీ క్రింది వాక్యములు గలవు :

> ఇట్లు కీర్తివిస్తార ధురంధరుండగు కృష్ణరాయ నరపాలాఖండలుండు నన్నుఁ బిలిచి, శ్రీమత్సీతారమణ చరణకమల పరిచరణాయమాన మానసుండవు, బహువిధ కవితా చమత్కార ధుర్యుండవు, మన్మనోరథ కార్య నిర్వాహకుండ వగుటంజేసి పురాతన మహాకవి విరచిత ప్రబంధంబు లన్వేషించి, భగవద్భక్తి నిష్ఠాగరిష్ఠులగు రాజశ్రేష్ఠుల వృత్తంబులు ప్రసిద్ధంబు లగునట్లుగాఁ బ్రశస్త కథలు విన్యస్తంబుగ ఎలకూచి సాహిత్య లక్షణ చిత్ర కవిత్వ ప్రభావంబు లొక్కచోటం గనుపడ రచింపవలయునని ప్రార్థించి, మఱియు నిట్లనియె....

మీఁది వాక్యములలో ముఖ్యముగా గమనింపఁ దగినది 'ఎలకూచి సాహిత్య లక్షణ' ప్రసంగము. ఈ యెలకూచి, యెలకూచి బాలసరస్వతియేయై యున్నచో నీ గ్రంథము బాలసరస్వతి కాలమునఁగాని, ఆతని తరువాతికాలమునఁ గాని రచింపఁబడి యుండవలయును. రామభద్రునివంటి మహాకవి యిట్టి గ్రంథమును రచించెననుట హాస్యాస్పదమగు విషయము.

ఇందలి పద్యములను జదివినచో నెట్టివారికైనను నీ విషయము తేట తెల్లము కాఁగలదు. గ్రంథవిస్తరభీతిచే రెండు పద్యములనుమాత్ర మిట నుదాహరించుచున్నాఁడను :

అటఁ జని కాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరిజ్ఝ రీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగతరంగ మృదంగ నిస్వన
స్ఫుటనటనానురూప పరిపుల్ల కలాపకలాపి జాలమున్
ఘటకచరత్కరేణు కరకంపిత సాలము శీతశైలమున్. —మనుచరిత్రము.

అటఁజని కాంచె భూమివిభుఁ డంబరచుంబిత వింధ్య భూధర వి
స్ఫుట ఘనమూర్ధ్న నిర్గత సుశోభిత పుణ్య శిరస్సరిజ్ఝరీ
పటల ముహుర్ముహుర్లుఠదభంగుర నూత్న తరంగ సంగతో
త్కట పరఫేన నిర్జిత సుధాంభ మహానది నర్మదా నదిన్....

—సకల కథాసార సంగ్రహము.

మీఁది యంశములనుబట్టి పరిశీలింపఁగ సకల కథాసార సంగ్రహకర్త అయ్యలరాజు రామభద్రకవి కాఁడనుట స్పష్టము.

కృతిపతియైన గొబ్బూరి నరసరాజు రామరాయల మేనల్లుఁడుగాని యల్లుఁడు కాఁడు, కోనేటి తిమ్మరాజు కూతురు రంగమాంబ యనునామె నరస రాజు భార్య యైనట్లు రామాభ్యుదయ కృత్యాదినిబట్టి తెలియుచున్నది. రామా భ్యుదయ కృతిభర్తయైన నరసరాజు వేయించిన శాసనమొకటి లభించినది. శాసనకాలము క్రీ. శ. 1556 వ సంవత్సరమునకు సరియగు నలనామ సంవత్స రము. రామాభ్యుదయ మించుమించుగా నిక్కాలమున రచింపఁబడెనని చెప్ప వచ్చును.

మఱియు రామాభ్యుదయము నళియ రామరాయలను కవి యీ క్రింది విధముగా వర్ణించియున్నాఁడు.

ఆ పటుకీర్తి రామ వసుధాధిపచంద్రుఁడు కృష్ణరాయ ధా
త్రీపతి సార్వభౌమ దుహితృప్రియుఁడై వితతప్రతాప సం
తాపిత శత్రుఁడై యల సదాశివరాయ నిరంతరాయ వి
ద్యాపుర రాజ్యలక్ష్మికి నిదానము దానయి మించెనెంతయున్.

ఈ పద్యమునుబట్టి సదాశివరాయల రాజ్యకాలమున రామాభ్యుదయము రచింపఁబడెననుట స్పష్టము. క్రీ. శ. 1543 ప్రాంతమున సదాశివరాయలు అళియరామరాయ సాహాయ్యమున విజయనగర సింహాసన మధిష్ఠించెను. రామాభ్యుదయ కావ్యమటుతరువాత నేడెనిమిదేండ్లలో రచింపఁబడి యుండును. కావ్య రచనాకాలమునకు రామభద్రుఁ డించుమించుగా నేబది సంవత్సరముల వాఁడని యెంచితిమేని, రామభద్రుని జననకాల మించుమించుగా క్రీ. శ. 1500 అగును. శ్రీకృష్ణదేవరాయల రాజ్య కాలము క్రీ. శ. 1509 నుండి ముప్పది

పటకని చరిత్రకారు లంగీకరించి యున్నారు. రాయల రాజ్యకాలమున ప్రారంభమునఁ గాకపోయినను చివరి దశయందైనను రామభద్రుఁడు తదాస్థాన ప్రవేశము గావించుట కవకాశము గలదు. మహాప్రతిభగల వ్యక్తి యిరువది యైదేండ్లకు విత్వత్కవి యగుటలో నాశ్చర్యపడవలసిన విషయములేదు. కాని యంత చిన్నతనముననే అష్టదిగ్గజములలో నొకఁడుగ పరిగణింపఁబడెనా యను విషయము సంశయాస్పదము.

# తెనాలి రామకృష్ణ కవి

ఆంధ్రదేశమున సుప్రసిద్ధులగు మహాకవులలో రామకృష్ణుఁ డొకఁడు. ఈతనిగూర్చి యాంధ్రలోకమున పెక్కు కథలు ప్రచారమునందున్నవి. వాని సత్యాసత్యములను నిర్ణయించుట మన ప్రస్తుత విషయము కాదు. కాని రామ లింగఁడు, రామకృష్ణుఁడు అను పేళ్లఁ బ్రసిద్ధి వహించిన వ్యక్తులిరువురా? లేక ఒక్కరా? అనువిషయము ప్రస్తుతము పరిశీలింపఁ దగియున్నది. మఱియు రామలింగఁడుకూడ రాయల యాస్థానమునందలి యష్టదిగ్గజములలో నొకఁ డను జనశ్రుతి సత్యమా కాదా యను విషయముకూడఁ బరిశీలనార్హము.

రామలింగ, రామకృష్ణ నామధారు లిరువురు లేరనియు, నొక వ్యక్తియే యిట్లు భిన్నకాలముల వ్యవహరింపఁ బడుచు వచ్చెననియు పండిత విమర్శకు లనేకు లంగీకరించి యున్నారు.

ఉద్భటారాధ్య చరిత్ర గ్రంథకర్త రామలింగఁడని కలదు. పాండురంగ మాహాత్మ్య కర్త రామకృష్ణుఁడని కలదు. ఘటికాచల మహాత్మ్యమను నింకొక గ్రంథము రామకృష్ణకవి కృతమని చెప్పఁబడుచున్నది. కాని యా గ్రంథము నకు కృత్యాది పద్యములు రామకృష్ణ కవి రచింపలేదు. ఆ విషయ మా గ్రంథ మునందే చెప్పఁబడి యున్నది. కావున ఘటికాచల మాహాత్మ్యమును వీడి, తక్కిన రెండు గ్రంథములయందున్న కృత్యవతారికలను బరిశీలింతము.

ఉద్భటారాధ్య చరిత్ర కృత్యాదినిట్లు గలదు :

కౌండిన్య మునిరాజ మండలేశ్వర వంశ
        పాథోధి నవసుధా భానుమూర్తి
పాలగుమ్మెలేశ పద పయోజద్వయీ
        ధ్యాన ధారణ సముదాత్తచిత్తు
మానితాయాతయామా నామభావిత
        విపుల మహా యజుర్వేదవేది
రామేశ్వరస్వామి రమణీయ కరుణావి
        శేషపోషిత విలసితసమగ్ర

సహజ సాహిత్య మాధురీ సంయుతాత్మ
లక్కమాంబకు ఘనయశోలక్ష్మివెలయు
రామ ధీమణికిని బుత్రు రామలింగ
నామ విఖ్యాతుఁ గావ్య నిరయ ధురీణు.

విలసదయాతయామ బహువేద వివేక పవిత్ర భావసం
కలితములైన వాక్యములఁ గావ్యముఁ జెప్పఁగనేర్తు వాది కా
వ్యుల కవితానిగుంభన సమున్నతిఁ గాంచిన వాఁడ పౌదు నీ
వలఘు వచోవిలాస సుగుణాకర రామయలింగ సత్కవీ!

పాండురంగ మాహాత్మ్యమునందు రామకృష్ణకవి తన్నుగూర్చి యిట్లు చెప్పికొని యున్నాఁడు :

నను రామకృష్ణకవిఁ గవి
జన సహకారావళీ వసంతోత్సవ సూ
క్తినిధిఁ బిలిపించి యర్ధా
సనమునఁ గూర్చుండఁ బనిచి చతురతననియెన్.

తగ సంస్కృతము దెనుంగుగఁ జేయఁ దెనుఁగు సం
స్కృతముగఁ జేయంగఁ జతురమతివి
పలుతెఱంగుల నెన్నఁగల కావ్య ధారల
ఘనుఁడ వాశువునందుఁ గరము మేటి
వఖిల భూమీ పాలకాస్థాన కమలా క
రోదయ తరుణ సూర్యోదయుఁడవు
శైవ వైష్ణవ పురాణావళీ నానార్థ
ములు నీకుఁ గరతలామలక నిభము

లంధ్ర భూమి కుచాగ్ర హారాభమైన
శ్రీ తెనాల్యగ్రహార నిర్ణేత వగ్ర
శాఖికా కోకిలమ వీవు సరసకవిత
రమ్యగుణ కృష్ణరామయ రామకృష్ణ!

కౌండిన్యస గోత్రుఁడ వా
ఖండల గురువిభుఁడ వఖిల కావ్యరస సుధా
మండన కుండలుఁడవు భూ
మండల వినుతుఁడవు లక్ష్మమావరతనయా!

మీఁదు పద్యములనుబట్టి యీ క్రింది విషయములు తేలుచున్నవి.

ఇరువురును రామయ పండితుని పుత్రులు. ఇరువురకును దల్లి లక్కమాంబయే. ఇరువురును కౌండిన్యసగోత్రులు. ఇంతవఱకు సారూప్యము గన్పట్టును.

ఇక భేదము :

ఉద్భటారాధ్య చరిత్ర గ్రంథకర్త పాలగుమ్మి యేలేశ్వరుని శిష్యుఁడు. ఈతనికి కుమారభారతి యను బిరుదమున్నది. పాండురంగ మాహాత్మ్య కర్త చిక్కరు భట్టాచార్య శిష్యుఁడు. శారదా బిరుదాంకితుఁడు. కాని యీ భేదములు మతాంతర స్వీకరణము వలన నొక్క వ్యక్తికేర్పడి నవియే సులభముగా నిర్ణయింప నగును. శైవుఁడయి యున్న కాలమున పాలగుమ్మి యేలేశ్వరుని శిష్యుఁడయి యుండెను. అప్పుడీతని నామము రామలింగఁడు. తరువాత చిక్కరు భట్టాచార్యుల శిష్యుఁడయి వైష్ణవమును బరిగ్రహించెను. అప్పుడీతని పేరు రామకృష్ణుఁడు. ఉద్భటారాధ్య చరిత్ర రచనాకాలమున కీతఁడు వయసు ముదిరినవాఁడు కాఁడు. కావుననే యానాడు కుమార భారతీ బిరుదమును ధరించి యున్నాఁడు. పాండురంగ మహాత్మ్య రచనా కాలమునకు ఈతఁడు వయసున మాత్రమే గాక వైదుష్యము నందును బెద్దయై పలువుర మన్ననలను బడసిన వాఁడు. కావుననే 'శారద నీ రూపము' అని కృతి భర్త తన్ను సంబోధించి నట్లు సగర్వముగాఁ జెప్పికొనినాఁడు. కావున రామలింగ, రామకృష్ణ నామ ధారులు భిన్నవ్యక్తులు కారనియు ఒక్క వ్యక్తియే యట్లు కాలాంతరమున భిన్న నామములను ధరించెననియుఁ జెప్పనగును.

ఇట్టి యెడ సంశయమున కాస్పదమగు విషయమొక్కటియే గలదు. రామలింగ రామకృష్ణులు అన్నదమ్ములగుట కవకాశము గలదు. అన్నదమ్ము లగువారికి గోత్ర విషయమునఁ గాని, సూత్ర విషయమునఁగాని తల్లిదండ్రుల నామ విషయమునఁగాని భేదముండుట కవకాశము లేదుకదా! కాని యీ సంశయమునకు తావులేదు.

ఉద్భటారాధ్య చరిత్ర, పాండురంగ మాహాత్మ్యములను సవిమర్శ దృష్టిని బరిశీలించినచో నా రెండు గ్రంథములును భిన్న కర్తృకములు కావనియు, నేక కర్తృకములే యనియు స్పష్టముగా గోచరించును.

ఈతని కాలమును గూర్చి పండితలోకమునఁ గొన్ని భేదాభిప్రాయములు గలవు. ఉద్భటారాధ్య చరిత్రము బయల్వడుటకు పూర్వము విమర్శకులు కొంద ఱీతఁడు రాయల యాస్థానమున నుండుట కవకాశము లేదని వ్రాసి యున్నారు. కాని యీ గ్రంథమును చూచిన తరువాత యీ యభిప్రాయము తప్పని తోపకపోదు. ఈతఁడించు మించుగా క్రీ. శ. 1500 ప్రాంతమున జన్మించి క్రీ. శ. 1570 ప్రాంతమున కాలధర్మము నొందియుండునని పలువురు పండితులు సిద్ధాంతీకరించి యున్నారు. గ్రంథరచనా కాలమును బట్టి పరిశీలించి నను మీఁది సిద్ధాంతమే సత్యమని తోచుచున్నది.

ఈతని గ్రంథములలో మొదటిది ఉద్భటారాధ్య చరిత్రము రెండవది పాండురంగ మాహాత్మ్యము మూఁడవది ఘటికాచలమాహాత్మ్యము. వీనినిగూర్చి యించుక వివరింపవలసి యున్నది.

## ఉద్భటారాధ్య చరిత్రము

ఇందు మూఁడాశ్వాసములు గలవు. ఉద్భటుఁడు శివాంశసంభూతుఁడని శైవుల విశ్వాసము. ఈతఁడు ముంజభోజుఁడను రాజునకు గురువై, యాతని నుద్ధరించుటయు, ఉద్భటుఁడు దేహత్యాగము చేసినపిదప యాతని శరీర మగ్ని దగ్ధమగుచుండగా నందుండి యుద్భవించిన ధూమము శివశాపవశమునఁ బిశాచ రూపముం బొందియున్న గంధర్వులకుఁ దొల్లింటి రూపముఁ బ్రసాదించుటయు నిందలి ముఖ్యాంశములు. ఆనుషంగికముగ శివప్రభావమును బ్రకటించు కథ లిందుఁ గొన్ని చెప్పఁబడినవి.

ఈ గ్రంథము ఊరదేచ మంత్రికి అంకితము గావింపఁబడినది. ఈ దేచ మంత్రి రాయల రాజ్యకాలమున మహాప్రసిద్ధుఁడై కొండవీడు దుర్గరక్షకుఁడుగా నియుక్తుఁడయిన గోపన మంత్రికడ రాజకార్య నిర్వాహకుఁడయి యుండెడి వాఁడు. ఈ దేచమంత్రి కౌండిన్యస గోత్రుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. ఆరు వేల నియోగి బ్రాహ్మణుఁడు. చంద్రశేఖరమౌని శిష్యుఁడు. నాదెండ్ల గోపమంత్రి క్రీ.శ. 1515 మొదలు 1533 వఱకు కొండవీడు దుర్గ రక్షకుఁడయి యుండెను.

మీఁది యంశములను బట్టి మనకొక్క విషయము తేటతెల్లమగు చున్నది. రామకృష్ణుఁడు రాయల కాలమునకు కేవలము బాలుఁడు కాఁడు. ఆతఁడు కవి యగుటయే గాక ఆనాటికే మహా ప్రబంధ నిర్మాణ దక్షుఁడయి యుండెను. మఱియు రాయల యాస్థానమున మహాప్రసిద్ధుఁడయి యున్న గోప మంత్రికి రాజకార్య నిర్వాహకుఁడగు దేచమంత్రికి తన కార్యమును గృతి యిచ్చి యున్నాఁడు. దేచమంత్రికి గోపమంత్రితోఁ గల సంబంధమును బట్టియు, వారిర్వురితో రామకృష్ణునికిఁ గల యనుబంధమును బట్టియు రాయల యాస్థాన ప్రవేశము రామకృష్ణున కానాడు దుస్సాధమని చెప్పుటకు వీలులేదు. ఈతఁడించుమించుగా పాతిక సంవత్సరముల వయసున రాయల యాస్థానమునఁ బ్రవేశించి యుండును. అంత కించుక పూర్వమే యుద్భటారాధ్య చరిత్రమును వ్రాసి దేచమంత్రికిఁ గృతి యిచ్చియుండును

## పాండురంగమాహాత్మ్యము

రామకృష్ణుఁడు రచించిన రెండవ గ్రంథము పాండురంగమాహాత్మ్యము. ఈ గ్రంథ రచనా కాలమునకు కవి శైవమును వీడి వైష్ణవమును స్వీకరించి నాఁడు. కావుననే ఉద్భటారాధ్య చరిత్రము రామలింగ కవికృతమని యుండగా, నీ గ్రంథము రామకృష్ణకవి కృతమని చెప్పఁబడి యున్నది.

ఈ గ్రంథమును రామకృష్ణుఁడు విరూరి వేదాద్రి మంత్రికిఁ గృతియిచ్చి యున్నాఁడు. ఈ వేదాద్రిమంత్రి విరూరునకు కరణము. పెదసంగ భూపాలునికడ

వ్రాయసకాఁడునై యున్నట్లు కృత్యవతారికను బట్టి తెలియుచున్నది. మఱియు నీతఁడు కందాళ యప్పగారు అను వైష్ణవ పండితుని శిష్యుఁడు. ఈతని శాసనములు క్రీ. శ. 1540—1545 ప్రాంతమునఁ గన్పట్టుచున్నవి. కందాళ యప్పగారి శిష్యుఁడగు వేదాద్రి మంత్రియు నిక్కాలముననే యుండెననుట సంభావ్యము.

మఱియు పెదసంగ భూపాలుని కాలమును బట్టియు విరూరి వేదాద్రి మంత్రి కాలమును నిర్ణయింపవచ్చును. పెదసంగ భూపాలునకు కామందక కృతి పతియగు వేంకటాద్రి మేనల్లుఁడు. కామందక కృతికర్తలగు వేంకట రామకృష్ణ కవులు తద్గ్రంథ రచనాకాలమును జెప్పియున్నారు. ఆ పద్యమిది :

రమణీయంబుగ శాలివాహన శకవర్షంబుల్ గతంబై సహ
స్రము నేనూఱును నాఱునై వెలయఁగాఁ బ్రౌఢిందెనింగించిరౌ
ర మహిందిమ్మయ వేంకటాద్రి విభుపేరన్ వేడ్కఁ గామందకీ
యము శ్రీ వేంకట రామకృష్ణులు స్వభాన్వబ్దంబునన్ రూఢిగన్.

ఈ పద్యమును బట్టి కామందకీయ రచనాకాలము క్రీ. శ. 1584 అని స్థిరపడుచున్నది. కామందకీయ రచనాకాలమును బట్టి వేంకటాద్రి కాలమును, వేంకటాద్రి కాలమునుబట్టి పెదసంగభూపాలుని కాలమును, సంగభూపాలుని కాలమును బట్టి విరూరి వేదాద్రి మంత్రి కాలమును తెలిసికొనవచ్చును.

మఱియు రామకృష్ణ కవియు కామందకీయ కృతిపతి యగు వేంకటాద్రియు, భట్టరు చిక్కాచార్యుని శిష్యులే. రామకృష్ణుఁడు, భట్టరు చిక్కాచార్యుల శిష్యుఁడైనట్లు పాండురంగ మాహాత్మ్యమున స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నది. కామందకమున వేంకటాద్రి 'భట్టరు చిక్కాచార్య వర్యశిష్య' అని తత్కర్తలచే సంబోధింపఁబడి యున్నాఁడు.

ఈ భట్టరు చిక్కాచార్యుఁడు ఆనాఁడు సుప్రసిద్ధుఁడగు వైష్ణవ మతాచార్యుఁడు. రామకృష్ణకవి కల్లుఁడగు లింగముగుంట రామకవియు, రామకవి తమ్ముఁడగు తిమ్మకవియు నీ వైష్ణవ మతాచార్యుని శిష్యులే. కామందకీయ కృతిభర్తయైన వేంకటాద్రికి పెదసంగభూపాలుఁడు మేనమామ యను విషయము రెట్టమత శాస్త్రమందు స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నది.

ఈ రెట్టమత శాస్త్రమును అయ్యల భాస్కర కవులు రచించి యున్నారు. ఆ గ్రంథమున పెదసంగభూపాలునకును, వేంకటాద్రికిని గల సంబంధము సుస్పష్టముగ నీ క్రింది పద్యములలో చెప్పఁబడి యున్నది :

గుణనిధి యగు తత్కన్యా
మణిజనకుఁ బోధజనకు మంజులభాషా
ఫణివరు రణవిజయార్జునుఁ
బ్రణుతింపఁ దరంబె గురువ పార్థివ వర్యున్.

పృథుల విక్రమశాలి పెదసంగ నృపతియు
సత్యసంధుఁడు చినసంగరాజు
ధర్మ గుణాఢ్యుండు తమ్మ భూపాలుండు
రుచిరకీర్తి ధనుండు రుద్రఘనుఁడు
ప్రధనాంగణ కిరీటి బసవ నరేంద్రుండు
స్థిరభాగ్యనిధి పెద చిట్టఘనుఁడు
సింధు గాంభీర్యుండు చిన చిట్టవర్యుండు
సతత ధన్యుఁడు పొట్టిసంగశౌరి

కలిత తేజుండు పాపసంగ ప్రభుండు
ననఁగఁ బరగిన తొమ్మండ్రు తనయ వరులఁ
గాంచి విజయ సంశీలుఁడై మించెనౌర
మంగరాజన్య గురువ సమ్రాడ్వరుండు.

ఆ గురువరాజ వరునకుఁ
ద్యాగ సముద్రునకు నల్లుఁడయి వెలసెధరా
భాగధురంధరతను నా
భాగుఁడు పెద తిమ్మరాజు ప్రజలు నుతింపన్.

ఈ పద్యములందు చెప్పఁబడిన పెదతిమ్మరాజు రెట్టమత శాస్త్ర కృతిపతి యగు వేంకటాద్రికి తండ్రియును పెదసంగరాజునకు బావయును, గురువరాజున కల్లుఁడునై యున్నాఁడు. రెట్టమత శాస్త్ర గ్రంథాంతమునఁ గూడ తద్గ్రంథ రచనా కాలము చెప్పఁబడి యున్నది. ఆ పద్య పాదమిది.

శాలివాహన శక సమమిల వేయు నార్నూట తొంబదిరెండు రూఢిగాగ—

దీనిని బట్టి శాలివాహన శకము 1692 నకు సమమగు క్రీ.శ. 1770 సంవత్సరమున నీ గ్రంథము రచింపఁబడినట్లు తేలుచున్నది. కాని యీ పద్యమును నమ్ముటకు వీలులేదు. ఇతరాధారములను బట్టి రామకృష్ణకవి కాలమును, వేంకటాద్రి కాలమును నిర్ణయింపఁబడి యున్నవి గావున నీ పద్యము ప్రక్షిప్తమనుటయే యుక్తము.

మీఁది యంశముల నన్నింటిని బరిశీలించి జూచినచో పాండురంగ మాహాత్మ్య కృతి ప్రదానకాల మించుమించుగా క్రీ. శ. 1550 ప్రాంతమని

నిర్ణయింపనగును. దీనికి కందాళ యప్పగారి కాలమును, కామందకీయ కృతిపతి యగు వేంకటాద్రి కాలమును నిదర్శనములయి యున్నవి. మఱొక విషయము.

పాండురంగ మాహాత్మ్య చతుర్థాశ్వాసమున నీ క్రింది పద్యము గలదు:

గిరికాను షక్తబుద్ధి ను
పరిచరునింబోలు నొక్క పన్నగ మొకనాఁ
డురవడి నెచ్చట నుండియొ
మురమర్దను దివ్యభవనమున కేతెంచెన్.

ఈ పద్యమునుబట్టి కొందఱు పాండురంగ మాహాత్మ్యము వసుచరిత్రము నకుఁ దరువాత రచింపఁబడెనని యూహించు చున్నారు. అనేక కారణములను బట్టి వసుచరిత్రము క్రీ.శ. 1570–1580 మధ్యకాలమున రచింపఁబడెనని చెప్ప వచ్చును. అట్టియెడ పాండురంగ మాహాత్మ్యము క్రీ.శ. 1580 ప్రాంతమున రచింపబడెనని చెప్పవలెను. అప్పటికి రామకృష్ణున కించుమించుగా నెనుబది సంవత్సరము లుండును. ఎనుబది సంవత్సరముల వయసున పాండురంగ మాహాత్మ్యమువంటి ప్రౌఢకావ్యమును రచించుట దుర్ఘటమగు కార్యము. కావున యీ పద్యమందు రామకృష్ణుఁడు వసుచరిత్రమును స్మరింపలేదని చెప్పనగును. ఉపరిచర వసువృత్తాంతము మహాభారతమున నున్నదేకాని వసుచరిత్ర కారుఁడు క్రొత్తగా సృజించినదిగాదు. దానినే రామకృష్ణకవి స్మరించె ననవచ్చును. లేదా డెబ్బది యేండ్లు పైఁబడిన కాలమున రామకృష్ణుఁడీ కావ్యమును రచించెనని చెప్పవలెను. అక్కాలము నందలి జనుల యాయురారోగ్యములను పురస్క రించుకొని చూచినచో నయ్యది యసాధ్యమనఁ జాలము కాని యసాధారణమని చెప్పక తప్పదు.

ఇట్లే రామకృష్ణుఁడు గురుభీతమతికి నాముక్తమాల్యదకు నెనయగుచున్ అను పద్యపాదమున ఆముక్తమాల్యదను గూడ స్మరించి యున్నాఁడు.

## ఘటికాచల మాహాత్మ్యము

ఇది మూఁడాశ్వాసముల ప్రబంధము. రామకృష్ణకవి యీ గ్రంథమును రచించి, కృత్యాదిని వ్రాయకయే చనిపోయి యుండును. అందులకే యాతని మనుమఁడు, ఖాండోజీయను వానికి యీ గ్రంథము నిచ్చియున్నాఁడు. ఖాండోజీ ప్రభువు తన యాస్థానకవి యగు వేంకటగిరిచేత నీ గ్రంథమునకు కృత్యాది పద్యములను వ్రాయించి యున్నాఁడు. రామకృష్ణకవి మఱికొన్ని గ్రంథములు రచించినట్లు ప్రబంధ రత్నావళ్యాది గ్రంథములను బట్టి తెలియుచున్నది. కందర్పకేతు విలాసము, హరిలీలా విలాసము, లింగ పురాణము, మొదలగునవి యాతని యితర గ్రంథములని యొక ప్రతీతి. ఈ గ్రంథము లిప్పుడు గానరావు.

# పింగళి సూరన

రాయల యాస్థానము నలంకరించిన యష్టదిగ్గజములలో నీతఁడు గూడ నొకఁడను జనశ్రుతిగలదు. జనశ్రుతియేగాక కొన్ని పుక్కిటిపురాణపు కథలును గలవు. ఈతఁడు బహు గ్రంథములను రచించినవాఁడు. అందు ముఖ్యములు గరుడపురాణము, రాఘవపాండవీయమను ద్వ్యర్థికావ్యము, కళాపూర్ణోదయము, ప్రభావతీ ప్రద్యుమ్నము. ఈ గ్రంథములేకాక మఱియు ననేక కృతుల రచించి నట్లు ప్రభావతీ ప్రద్యుమ్నము నందలి యీ క్రింది పద్యమును బట్టి తెలియు చున్నది.

జనముల్ మెచ్చగ మున్ రచించితి నుదంచద్వైఖరింగారుడం
బును శ్రీరాఘవపాండవీయముఁ గళాపూర్ణోదయంబున్ మఱిన్
దెనుఁగుం గబ్బము లెన్నియేనియును మత్పిత్రాది వంశాభివ
ర్ణనలేమిం బరితుష్టినాకవి యొనర్పం జాలవత్యంతమున్.

రాఘవపాండ వీయము నందలి యీ క్రింది పద్యమును బట్టి కవి కుల గోత్రాదులు తెలియుచున్నవి :

శోభితాపస్తంబ సూత్రు గౌతమ గోత్రు
సుచరిత్రుఁ బింగళి సూరసుకవి
పౌత్రు నన్నవసతి భావన దౌహిత్రు
నమరధీమణికి నబ్బమకుఁ బుత్రు
నను జన్మలైనట్టి యమలన యెఱ్ఱనా
ర్యులు భక్తి సేవింప నలరు వాని
సత్కావ్యరచనా విశారదుండగువాని
సూరన నామ విశ్రుతుని నన్ను
బ్రియము సంధిలంగ బిలిపించి భూషణాది
బహువస్త్ర దానముల గరంబు
సంతసంబొనర్చి యెంతయు గారవ
మెసఁగ మధుర ఫణితి నిట్టులనియె.

దీనినిబట్టి యీతఁడు ఆపస్తంబ సూత్రుఁడు, గౌతమ గోత్రుఁడు, అమరనామాత్యునకును అబ్బమకును పుత్రుఁడునని తెలియుచున్నది. కవి చెప్పిన యితర విషయములను బట్టి చూచినచో నీతఁడు నియోగి బ్రాహ్మణుం డనియు నిర్ణయింపనగును. తన వంశమును గూర్చి విపులముగాఁ జెప్పిన కవులలో నీతఁడొకఁడు.

ఈ పింగళి వంశమునకు మూలపురుషుఁడు బోకనామాత్యుఁడని యీతని రచనలను బట్టి తెలియుచున్నది. ఈ బోకనామాత్యుఁడు పేకి యను నొక గాంధర్విని దాసిగ నేలినాఁడట. అతని వంశమువారే పలనాటను, పాకనాటను, కృష్ణా గౌతమీ తీరములందు ప్రసిద్ధులై వెలసిరట.

## రాఘవపాండవీయము

సూరన రచించిన గ్రంథములలో లబ్ధములగుచున్న వానియందు మొదటిది రాఘవపాండవీయము. ఇది ద్వ్యర్థి కావ్యము. రామాయణ భారతార్థములను జోడించి కవి యీ గ్రంథమును చెప్పినాఁడు. ఆంధ్ర వాఙ్మయము నందలి ద్వ్యర్థి కావ్యములలో నిదియే మొట్టమొదటిది. కృతి ప్రేరకుఁడగు పెదవేంకటాద్రి విభుఁడు రాఘవపాండవీయమును రచించి ఆకువీటి యందలి శ్రీ విరూపాక్ష స్వామి కంకితము సేయుమని కవిని గోరినట్లీ క్రింది పద్యములనుబట్టి తెలియుచున్నది.

చాటు ప్రబంధ రచనా
పాటవ కలితుఁడవు శబ్దపరిచితి యందున్
మేటివి దీనిం దెనుఁగున
బాటించి రచింప నీవ ప్రౌఢుఁడ వరయన్.

దక్షత యింతగల్మి విశదంబుగఁ గాంచియు నీ మదిన్ ఫలా
పేక్ష ఘనంబుగామి నిదియిట్టన గొంకెద నీకు నో లలా
టేక్షణ భక్తిశీల! రచియించుట యిష్టమకాదె శ్రీ విరూ
పాక్షున కంకితంబుగ శుభార్థము రాఘవపాండవీయమున్.

ఈ పెదవేంకటాద్రి క్షత్రియుఁడనియుఁ, గౌండిన్య గోత్రుఁడనియు, ఆకువీఁడు పట్టణ ప్రభువనియు, రాఘవపాండవీయమునఁ జెప్పఁబడియున్నది.

ఈ పెదవేంకటాద్రికి, చినవేంకటాద్రియను తమ్ముఁడు గలఁడు. వీరు విజయనగర పట్టణమున మేటి దొరలయి యున్నట్లు రాఘవపాండవీయమునఁ జెప్పఁబడి యున్నది. ఈ చినవేంకటాద్రియే కుమార ధూర్జటికృత కృష్ణరాయ విజయము నంకితముఁ గొనెనని కొందఱు వ్రాసియున్నారు: అది కేవలము భ్రాంతి మూలకమగు సిద్ధాంతము. అతఁ డారవీటి చినవేంకటాద్రిగాని ఆకువీడు చినవేంకటాద్రి కాఁడు. మహాకవి ధూర్జటిని గూర్చి వ్రాయుచు నీ విషయము స్పష్టముగఁ జెప్పియున్నాఁడను.

ఆకువీటి ప్రభువులు కర్ణాటరాజ సామంతులయి యుద్ధ సమయములందు వారికి సాహాయ్యముగావించుచున్నట్లు పెక్కునిదర్శనములు గలవు. పెదవేంకటాద్రికిఁ బితామహుఁడయిన ఇమ్మరాజు రాజమహేంద్రపరయుద్ధమునఁ బాల్గొని

నట్లొక పద్యమున చెప్పఁబడి యున్నది. శ్రీకృష్ణదేవరాయలు క్రీ. శ. 1515వ సంవత్సరమున రాజమహేంద్రవరమును గజపతుల నుండి గైకొనెను. ఆ యుద్ధముననే ఇమ్మరాజు రాయలకు సాహాయ్యము గావించి యుండును. ఇమ్మరాజు మనుమఁడగు పెదవేంకటాద్రి యీ కృతి ప్రేరకుఁడు గావున నీ గ్రంథము క్రీ.శ. 1545 ప్రాంతమున రచింపఁబడి యుండును.

రాఘవపాండవీయము ద్వ్యర్థి కావ్యమయ్యు, బహు రసవంతమగు కావ్యము.

దజుండెవ్వాఁడిల రామభారత కథల్ జోడింప భాషాకృతిన్.

అని యీ గ్రంథమున కవి సగర్వముగాఁ జెప్పికొని యున్నాఁడు. ఇంతటి ప్రౌఢకావ్యమును రచించిన మహాకవి యట్లు చెప్పికొనుటలో తేలికదన మెద్ది యును లేదు.

## కళాపూర్ణోదయము

ఈతఁడు రచించిన మహాప్రబంధము కళాపూర్ణోదయము. కథాకల్ప నము నందును, పాత్రచిత్రణము నందును యత్యద్భుత సన్నివేశ సంఘటనము లందును దనకుఁగల నేర్పును గవి యిందుఁ బ్రదర్శించి యున్నాఁడు.

ఇందలి గాథ కేవలము కవి కల్పితమనియే చెప్పవలెను. తుంబురు నారద వివాద ఘట్టము మాత్రము లింగపురాణమునందు గలదని యొకరు వ్రాసి యున్నారు. నంద్యాల ప్రభువగు కృష్ణమరాజునకీ గ్రంథ మంకితము చేయఁ బడినది.

నంద్యాలవారి వంశమునకు మూలపురుషుఁడు ఆరవీటి బుక్కరాజు. వీరు చంద్రవంశపు క్షత్రియులని చెప్పఁబడుచున్నారు. ఈ బుక్కరాజునకు అబ్బ లమ్మ, బల్లాంకిక అను నిరుపురు భార్యలు కలరు. అబ్బలమ్మ యందీతనికి సింగరాజు, రామరాజు, అహోబలరాజు అను మువ్వురు పుత్రులు గలిగిరి. ఇందు సింగరాజునకు నరసింహరాజు, నారపరాజు, తిమ్మరాజు అను మువ్వురు పుత్రులు గలిగిరి. ఇందుఁ బెద్దయగు నరసింహరాజు నంద్యాల పురాధిపతియై వన్నెకెక్కెను. అప్పటినుండి యాతని వంశమునకు నంద్యాల వారను పేరు వచ్చినది. ఈ విషయము కళాపూర్ణోదయము నందు స్పష్టముగాఁ జెప్పఁబడి యున్నది :

ప్రాలినకీర్తిఁ బెంపెసఁగి వారలలో నరసింహరాజు నం
ద్యాల పురాధిపత్య విభవాతిశయంబు వహించి మించె సు
ద్వేల నిరూఢి నెల్లెడల విశ్రుతమై తనవంశమెల్ల నం
ద్యాల పదప్రసిద్ధిఁ దనరారుచు నెంతయుఁ దేజరిల్లఁగన్.

ఈ నరసింహ రాజున కైదుగురు పుత్రులు కలరు. అందు రెండవ వాఁడగు నారపరాజునకు నరసింహరాజను తనయుఁడు గలఁడు. ఈ నరసింహ రాజునకు చినకొండమ యను భార్యయందు కృష్ణమరాజను పుత్రుఁడు జనించెను. ఈ కృష్ణమరాజే కళాపూర్ణోదయ కృతిపతి. కృతిపతియగు కృష్ణమరాజు పితామహుఁడు నారపరాజు కొండవీటి దరిని కుతుబనమల్కుతో జరిగిన యుద్ధమున పాల్గొనినట్లు కళాపూర్ణోదయమునందలి యీ క్రింది పద్యమునుబట్టి తెలియుచున్నది :

వదలక యుత్కళేంద్రుని సవాయి బిరీదునడంచు దుర్జయున్
గుదుపసమల్కుఁ దల్లడిలఁగొట్టె మహోద్భుత సంగరంబులో
నెదిరిచి కొండవీటికడ నెవ్వరు సాటి విచిత్రశౌర్య సం
పదవస నారసింహ విభు పట్టికి నారనృపాల మౌళికిన్.

క్రీ. శ. 1515 లో శ్రీకృష్ణదేవరాయలు కొండవీటికడ కుతుబనమల్కును జయించెనని చరిత్రకారు లభిప్రాయ పడుచున్నారు. నంద్యాల నారపరాజా యుద్ధమునసే రాయలకు సాహాయ్యము గావించియుండును. మఱియు నంద్యాల నారపరాజు వేయించిన శాసనమొకటి నేడు లభించినది. శాసనకాలము క్రీ. శ. 1548 వ సంవత్సరము. దానకాలమునాటికి నారపరాజు వృద్ధుఁడయి యుండును. కొండవీటి యుద్ధకాలమున కాతనికి ముప్పదియేండ్ల ప్రాయమని తలంచినచో నాతని జన్మకాలము క్రీ. శ. 1485 ప్రాంతమగును. ఆతని తనయుఁడగు నరసింహరాజు జననము క్రీ. శ. 1510 ప్రాంతమగును. ఆతని తనయుఁడగు కృష్ణమరాజు జననము క్రీ. శ. 1535 ప్రాంతమగును. ఆతనికి ముప్పదేండ్ల వయసున కళాపూర్ణోదయ కృతిప్రదానము జరిగెనని యూహించినచో, కళాపూర్ణోదయ రచనాకాలము క్రీ. శ. 1565 ప్రాంతమగును. కృతి రచనా కాలమునకు సూరనార్యున కించుమించుగా నలుబది సంవత్సరములని నిర్ణయించితిమేని, సూరనార్యుని జననకాలము క్రీ. శ. 1505 ప్రాంతమగును.

దీనినిబట్టి జూచినచో నీ కవికిఁగూడ కృష్ణరాయల యాస్థాన ప్రవేశమున కర్హత లేకపోలేదు. అప్పటికీతఁడు కేవలము బాలుఁడని చెప్పఁజాలము. అష్టదిగ్గజములలో నొకఁడగునా కాదా యను విషయము సంశయాస్పదము.

## ప్రభావతీ ప్రద్యుమ్నము

ప్రభావతీ ప్రద్యుమ్న మీతని తుదిరచన యని చెప్పవచ్చును. ఈ గ్రంథమును తన తండ్రియగు నమర నామాత్యున కంకితము గావించియున్నాఁడు. రంగ రాట్ఛందము నుదాహృతమగు నొక పద్యమునుబట్టి యీతఁడు గిరిజా కళ్యాణమను నొక గ్రంథమును రచించి నట్లూహింపనగును.

# రామరాజ భూషణుఁడు

ఆంధ్ర ప్రబంధ వాఙ్మయమున వసుచరిత్రకు గల ప్రభావ మనుపమాన మైనది. అమ్మహా ప్రబంధమును రచించిన కవితల్లజుఁడే రామరాజ భూషణుఁడు. ఇదియేగాక హరిశ్చంద్ర నలోపాఖ్యానమను ద్వ్యర్థి కావ్యమును గూడ నితఁడు రచించెను. నరస భూపాలీయమను నామాంతరముగల కావ్యాలంకార సంగ్రహమునుగూడ నీతఁడే రచించెనని కొందఱి యభిప్రాయము. తద్గ్రంథకర్త వేఱనువారును కొందఱు గలరు.

ఈతని యింటిపేరు ప్రబంధాంకము వారు. ఈతఁడు భట్టు కులజుఁడు. ఈతని తండ్రి సూరపరాజు ; తాత తిమ్మరాజు ; ముత్తాత సింగరాజు. రామరాజ భూషణుఁడనునది యీతని బిరుదునామమే కాని అసలుపేరు కాదనుట స్పష్టము. ఈ బిరుదమునుబట్టి యీతఁడు రామరాయల కాలమున ప్రసిద్ధుఁడయి యుండెననుటయు స్పష్టమే. రామరాయల తమ్ముఁడగు తిరుమలరాయలకే యీతని వసుచరిత్ర మంకితము గావింపఁబడినది.

వసుచరిత్రము నందలి కృత్యాది పద్యములనుబట్టి పరిశీలించినచో తత్కృతిప్రదాన కాలమునను తిరుమలరాయఁడు పట్టాభిషిక్తుఁడయి కర్ణాట సామ్రాజ్యమును బరిపాలించుచున్నట్లు తెలియుచున్నది. మఱియుఁ జీర్ణ కర్ణాట లక్ష్మి నాతఁడు పునరుద్ధరించెననిగూడ స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. కావున వసుచరిత్రము తల్లికోట యుద్ధానంతరము అనఁగా క్రీ. శ. 1565 తరువాత, తిరుమలరాయఁడు కర్ణాట సామ్రాజ్యమును బాలించుచున్నప్పుడు యీ గ్రంథ మాతని కంకితము చేయఁబడెనని నిస్సంశయముగా చెప్పవచ్చును.

మఱియు నీ కృత్యవతారికయందు తిరుమలరాయనికి పెనుగొండకడ తురకలతో సంభవించిన యుద్ధముగూడ వర్ణింపఁబడియున్నది. ఈ యంశముల నన్నిఁటిని గమనించి చూచినచో వసుచరిత్ర మించుమించుగా క్రీ. శ. 1575 ప్రాంతమున రచింపఁబడెనని చెప్పవచ్చును.

ఈ చారిత్రకాంశములను వ్యక్తము సేయు పద్యముల నీ క్రింద నిచ్చుచున్నాఁడను :

వసుమతీ భార ధూర్వహత నెవ్వని యుర్వ
    రా వరాహాంక మర్థము వహించు
గరిగతచక్ర విక్రమశక్తి నెవ్వాని
    రామానుజత్వంబు రమణ కెక్కె

జీర్ణ కర్ణాట లక్ష్మీ పునస్సృష్టి నె
వ్వాని లోకేశ్వరత్వము పొసంగుఁ
జటుల శార్వరమగ్న సర్వ వర్ణోద్ధార
పటిమ నెవ్వని రాజభావ మెసఁగు

నతఁడు వీరప్రతాప రాజాధిరాజ
రాజ పరమేశ్వ రాష్టదిగ్రాజకుల మ
నో భయంకర బిరుదసన్నుత జయాభి
రామ గుణహారి తిరుమల రాయ శౌరి.

ఘనసీధు 'రక్తలోచనయుక్తిఁ గడ నుండు
మాతంగతతి నంటు మలినమెల్ల
గరదుఁడై వెస నధోగతిఁ బడ్డ యమ్మహా
హీనుని నెనసిన యేవ మెల్ల
నరకహేతు హిరణ్యహరణ వృత్తిఁ జలించు
కొమ్మకాని భజించు కొదవలెల్ల
రౌరవాధార ఘోర ప్రపాతకులైన
విషమ గోత్రులనంటు వృజినమెల్లఁ
గడిగికొనియె వసుంధరా కమలనయన
యౌర ! వీరప్రతాప రాజాధిరాజ
రాజ దేవేంద్ర తిరుమలరాయ చంద్ర
సాంద్ర పట్టాభిషేకాంబు సముదయమున.

తిరుమలరాయ శేఖరుని ధీరచమూభట రాజి యాజి భీ
కర యవనేశ్వర ప్రహితఖాన బలంబులఁ జిక్కుసేయ స
ద్దిరఁ బెనుకొండ కొండలు మదద్విప చర్మకపాల మారికా
పరికర భూషితంబులయి బల్విడఁగాంచె గిరీశభావమున్.

ఈతఁడు కృష్ణదేవరాయల యాస్థానమునందలి యష్ట దిగ్గజములలో నొకఁడను ప్రతీతి లోకమునఁ గలదు. మీఁది యంశములనుబట్టి పరిశీలించి నచో నీతఁ డష్ట దిగ్గజములలో నొకఁడయి యుండుటకెట్టి యవకాశమునులేదు.

వసుచరిత్రవంటి మహాప్రబంధమును రచించుటకు కవి కించుమించుగా నలుబది సంవత్సరముల వయస్సైన నుండవలయును. ఒకవేళ ఏబది సంవత్సర వయసున నతఁడు వసుచరిత్రను రచించెనని చెప్పినను, ఈతని జనన కాల మించుమించుగా క్రీ. శ. 1525 వ సంవత్సర మగుచున్నది. ఏది యెట్లయినను రాయలు దివంగతుఁడగుసరి కీతఁడు బాలుఁడయి యుండును. విద్యార్థి దశను గూడ పూర్తిచేసి యుండజాలఁడు.

ఈతని కాల విషయమున వివాదగ్రస్తమగు విషయములు లేవు. రామరాజ భూషణుఁడును, మూర్తికవియు నొక్కఁడగునా కాదా యను విషయము మాత్రమే వివాదగ్రస్తమయి యున్నది. ఈ వివాద విషయములను బరిశీలించుటకుఁ బూర్వము తత్తద్గ్రంథములయం దేమి చెప్పఁబడియున్నదో తెలిసికొందము.

నరసభూపాలీయమున కృత్యవతారికయం దిట్లు చెప్పఁబడియున్నది :

శతలేఖినీ పద్య సంధానధౌరేయు
ఘటికా శతగ్రంథ కరణధుర్యు
నాశు ప్రబంధ బంధాభిజ్ఞు నోష్ఠ్య ని
రోష్ఠ్యజ్ఞు నచల జిహ్వోక్తి నిపుణుఁ
దత్సమ భాషా వితానజ్ఞు బహుపద్య
సాధిత వ్యస్తాక్షరీ ధురీణ
నేక సంధోచితశ్లోక భాషాకృత
చతురునోష్ఠ్య నిరోష్ఠ్య సంకరజ్ఞు
నమిత యమకాళుధీ ప్రబంధాంకసింగ
రాజసుత తిమ్మరాజపుత్త్ర ప్రసిద్ధ
నరసవేంకటరాయ భూషణసుపుత్త్రు
నను బుధవిధేయు శుభమూర్తి నామధేయు.

గద్యము :

ఇది శ్రీ హనుమత్ప్రసాదలబ్ధ కవితాసార సారస్వతాలంకార నిరంకుశ ప్రతిభా బంధుర ప్రబంధ పఠన రచనా ధురంధర ప్రబంధాంక వేంకటరాయ భూషణ సుపుత్త్ర తిమ్మరాజ పౌత్ర సకల భాషావిశేష నిరుపమావధాన శారదామూర్తి మూర్తిప్రణీతంబైన కావ్యాలంకార సంగ్రహం బను మహాప్రబంధంబు. —నరసభూపాలీయము.

వసు చరిత్రమునం దీ క్రింది విధముగాఁ జెప్పఁబడినది :

నను శ్రీరామ పదారవింద భజనానందున్ జగత్ప్రాణనం
దన కారుణ్య కటాక్షలబ్ధ కవితాధారా సుధారాశి సం
జనితైకైక దినప్రబంధ ఘటికాసద్యశ్శతగ్రంథ క
ల్పను సంగీతకళారహస్య నిధిఁ బిల్పించి పల్కెం గృపన్.
శ్రీరామక్షితిపున్మదగ్రజు జయశ్రీలోలు నానాకళా
పారీణున్ బహు సంస్కృతాంధ్ర కృతులం బల్మాఱు మెప్పించి త
త్కారుణ్యంబున రత్నహార హయవేదండాగ్రహారాది స
త్కారం బందితి రామభూషణకవీ ! ధన్యుండ వీవన్నిటన్.

గద్యము :

ఇది శ్రీరామచంద్ర చరణారవింద వందన పవననందన ప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్ర భాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితా నిర్వాహక సాహిత్య రసపోషణ రామరాజభూషణ ప్రణీతంబైన వసుచరిత్రంబు. —వసుచరిత్రము.

హరిశ్చంద్ర నలోపాఖ్యానమునం దీ క్రింది విధముగాఁ జెప్పఁబడినది :

వనధి లంఘన కృపావర్ధితోభయ కవి
తా కళారత్న రత్నాకరుఁడ
సకల కర్ణాట రక్షాధురంధర రామ
విభుదత్త శుభచిహ్న విభవయుతుఁడ
వసుచరిత్రాదికావ్య ప్రీత బహునృప
ప్రాపితానేక రత్న ప్లవుండ
శాశ్వత శ్రీ వేంకటేశ్వరానుగ్రహ
నిరుపాధి నైశ్వర్య నిత్య యశుఁడ
శ్రీకర మహాప్రబంధాంక సింగరాజ
తిమ్మరాజ ప్రియతనూజ ధీరసూర
పాపాత్ముఁడ రామనృపభూషణాఖ్యసుకవి
నంకిత మొనర్తు నీ కావ్య మనఘశక్తి.

గద్యము :

ఇది శ్రీమద్రామచంద్ర చరణారవింద వందన పవననందన ప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్ర భాషా సామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితా నిర్వాహక సాహిత్య రసపోషణ రామరాజభూషణ ప్రణీతంబైన హరిశ్చంద్ర నలోపాఖ్యానంబను మహాప్రబంధంబు.

—హరిశ్చంద్ర నలోపాఖ్యానము.

స్పష్ట ప్రతిపాదనమునకై మీఁది గద్యపద్యము లుదాహరింపఁబడినవి.

వసుచరిత్రమునందు తన తాతతండ్రుల పేర్లు చెప్పకపోయినను, హరిశ్చంద్ర నలోపాఖ్యానమున నవ్విషయములన్నియు చెప్పుటయేకాక తాను వసుచరిత్రమునుగూడ రచించినట్లు చెప్పికొని యున్నాఁడు. దీనినిబట్టి వసుచరిత్రయు, హరిశ్చంద్ర నలోపాఖ్యానమును రచించిన కవి ఒక్కఁడే యనియు, నాతఁడు రామరాజభూషణుఁడే యనియు స్పష్టమగుచున్నది. రెండిటియందును గద్యకూడ నొకేవిధముగ నున్నది. మఱియు వసుచరిత్ర రచనానంతరమే హరిశ్చంద్ర నలోపాఖ్యానము రచింపఁబడినదనియు స్పష్టమగుచున్నది.

ఇఁక నరసభూపాలీయ కర్తయు, వసుచరిత్ర హరిశ్చంద్ర నలోపాఖ్యాన కర్తయు నొక్కఁడా? భిన్నవ్యక్తులా? అను విషయము విమర్శనీయము.

ఇందు సమానాంశములు :

౧. ఈ యిరువురి పేళ్లను ప్రబంధాంకమువారే.

౨. ఇరువురకును ప్రపితామహుఁడు సింగరాజే.

౩. పితామహుఁడు తిమ్మరాజే.

వీరిర్వురకును తండ్రులు మాత్రము భిన్నులుగా గన్పట్టుచున్నారు. మూర్తికవి (నరసభూపాలీయకర్త) తండ్రి వేంకటరాయభూషణుఁడని చెప్పఁబడి యున్నాఁడు. రామరాజభూషణుని తండ్రి సూరపరాజని కలదు. ఈ సూరప రాజును, వేంకటరాయ భూషణుఁడును భిన్నవ్యక్తులయినచో, వీరిర్వురకును తిమ్మరాజే తండ్రిగావున వీరు సోదరులు కావలయును. అట్లయినచో మూర్తి కవియు, రామరాజభూషణుఁడును అన్నదమ్ముల బిడ్డలగుదురు.

ఇందు వాదవిషయము రెండు విధములుగా నున్నది :

సూరపరాజును, వేంకటరాయభూషణుఁడును నొక్కరేయని యొక వాదము. మూర్తి రామరాజభూషణు లొక్కరేయని యింకొక వాదము.

ఒక విధముగ నీ వాదము లన్యోన్యాశ్రయములు. మూర్తి రామరాజ భూషణు లొక్కరేయని తేలినప్పుడు, సూరప రాజవేంకటరాయభూషణు లొక్కరేయని వేఱుగా నిరూపింప నావశ్యకములేదు. ఇక సూరపరాజ వేంకట రాయ భూషణులు భిన్నవ్యక్తులు కారని నిరూపింపఁబడినప్పుడుకూడ, మూర్తి రామరాజ భూషణ కవులు భిన్నులై యుండుట కవకాశము కలదు. అప్పుడు వీరు సోదరులు కావచ్చును. సూరపరాజ, వేంకటరాయ భూషణులు భిన్నులై, మూర్తి రామరాజ భూషణులుగూడ భిన్నవ్యక్తులయినప్పుడు ఈ యిర్వురు కవులును అన్నదమ్ముల బిడ్డలగుదురు.

ఒక వ్యక్తికి రెండు పేర్లుండుటలో నాశ్చర్యకరమగు విషయమేమియును లేదు. అందొకటి ముద్దు పేరును, ఇంకొకటి తలిదండ్రులు పెట్టిన పేరును కావచ్చును. లేదా తలిదండ్రులు పెట్టిన పేరొకటి యుండగా, స్వార్జితమగు బిరుదనామ మొకటి యుండవచ్చును. నిజనామ బిరుద నామముల భేదమును గుర్తించుటయుఁ గష్టసాధ్యమగు విషయము కాదు.

ఇఁక సూరపరాజ వేంకటరాయ భూషణ నామములలో, సూరపరాజను నదియే నిజనామ మనియు, వేంకటరాయ భూషణ నామము బిరుదనామ మనియు చెప్పవచ్చును. అట్లే మూర్తి యనునది నిజనామమును, రామరాజ భూషణుఁ

డనునది బిరుదనామము నై యుండును. తలిదండ్రులే రామరాజ భూషణుఁడను పేరు పెట్టిరనుట అంత సంభావ్యమగు విషయముగాఁ గన్పట్టదు. మూర్తి కవియే రామరాజ భూషణుఁ డయినచో, నీ కావ్యత్రయమును (నరస భూపాలీయ, వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానము) రచించిన కవి యొక్కఁడే యగుచున్నాఁడు. అట్లుకాక మూర్తి రామరాజ భూషణులు భిన్నవ్యక్తులని తలంచినపుడు, వసుచరిత్ర హరిశ్చంద్ర నలోపాఖ్యానముల రచించిన కవిపేరు మనకు తెలియదని చెప్పవలసి వచ్చును. లేదా రామరాజ భూషణ నామమే తల్లిదండ్రు లుంచిన పేరని చెప్పవలసి వచ్చును.

తమ గ్రంథముల యందు బిరుద నామమును మాత్రమే చెప్పుకొనిన కవులు లేకపోలేదు. చింతలపూడి యెల్లనార్యునకు రాధామాధవ బిరుదమును శ్రీకృష్ణదేవరాయ లొసంగి యున్నాఁడు. గ్రంథనామము గూడ రాధామాధవమే. రసికుఁడగు రాయలు గ్రంథనామమునే బిరుదనామముగా చేసి, గ్రంథమునకును, కవికిని గల అవినాభావ సంబంధమును రాయలు సూచించినాఁడు. రాధామాధవ గ్రంథ రచనానంతరము తాను రచించిన గ్రంథములందు, ఎల్లనార్యుఁడు తన అసలుపేరు వీడి, బిరుదనామమునే జెప్పికొని యున్నాఁడు.

రాధామాధవుఁడు సుకవి రత్నము చెప్పెన్.

ఇట్లే గద్యమునందుఁ గూడ

చింతలపూడి కామయప్రభు సుపుత్ర శుద్ధ సారస్వత విభవ రాధామాధవ ప్రణీతంబైన

అని బిరుద నామమును మాత్రమే చెప్పినాఁడు.

అట్లే మూర్తికవి తన ప్రథమ గ్రంథమగు నరసభూపాలీయమున తన నిజనామమును జెప్పి, తరువాతి గ్రంథములలో తన బిరుద నామమునే చెప్పికొని నాఁడని యూహించుట సంభావ్యము.

మూర్తికవి రచించిన గ్రంథములలో ప్రప్రథమము నరసభూపాలీయ మనుట కాధారము లనేకములు గలవు. నరసభూపాలీయ రచనా కాలమునకు కర్ణాట రాజ్యలక్ష్మి కలకలలాడుచున్నది. రామరాయలు సజీవుఁడయి యున్నాఁడు. తిరుమల రాయలు కర్ణాట రాజ్యలక్ష్మిని చేపట్టలేదు. వసుచరిత్ర రచనా కాలమునకు కర్ణాటము జీర్ణకర్ణాట మయినది. జీర్ణకర్ణాట సామ్రాజ్యమును తిరుమల రాయుఁడు పునరుద్ధరించినాఁడు. ఆ నాటికి రామరాయలు లేఁడు. నరసభూపాలీయము, తల్లికోట యుద్ధమునకు పూర్వము రచింపఁబడినదనియు, వసుచరిత్రము ఆ యుద్ధమునకుఁ దరువాత రచింపఁబడినదనియు నిస్సంశయముగా చెప్ప వచ్చును.

కావున నరసభూపాలీయము తరువాతనే వసుచరిత్రము రచింపఁబడినది. మూర్తికవియే రామరాజభూషణుఁడు. ఇఁక సూరపరాజే వేంకటరాయ భూషణుఁడను విషయము వేఱ చెప్పనక్కఱలేదు.

మూర్తియే రామరాజ భూషణుఁడనుటకు మఱికొన్ని నిదర్శనములు :

(1) వసుచరిత్రమును రచించినకవి భట్టుమూర్తియే యని జనశ్రుతి వేనోళ్ల చెప్పుచున్నది.

(2) వసుచరిత్ర వ్యాఖ్యాత యగు సోమనాథ కవి వసుచరిత్రము మూర్తికవి విరచితమని స్పష్టముగా చెప్పియున్నాఁడు. ఈ క్రింది పద్యమును దిలకింపుఁడు :

> వారణ జన్ముఁడై కవినికాయము మెచ్చగఁ గావ్య కర్తయై
> భూరి కళాకలాపుఁడయి పొల్పు వహించెడి భట్టు మూర్తిచే
> నీరితమై సుభార్థపదహీన పదాస్పదమైన యా వసు
> క్ష్మారమణ ప్రవృత్తము సుసాధముగాదు తలంచి చూడగన్.

(3) లక్షణ దీపిక యించు మించుగా రామరాజ భూషణుని కాలముననే రచింపఁబడినది. అందు మంజీర శబ్దమునకు భట్టుమూర్తి వసుచరిత్ర మొదటి పద్యము ప్రథమ చరణము హల్లునకుఁ (2) యోగము అని చెప్పఁబడి—'శ్రీ భూపుత్రి వివాహవేళ నిజమంజీరాగ్ర రత్నస్వ లీలేత్యాది'—పద్యము కూడ నుదాహరింపఁబడి యున్నది. సరికాలము వారుకూడ భ్రమకులోనైరనుట హాస్యాస్పదమగు విషయము.

ఇఁక సూరపరాజు వేంకటరాయభూషణుల విషయమున మఱొక వాదము కూడ గలదు. రామరాజ భూషణునకు సూరపరాజు జనక పితయనియు, వేంకటరాయ భూషణుఁడు పాలక పితయనియు కొందరు చెప్పుచున్నారు. కాని యది కేవల నీరసవాదము.

# కందుకూరి రుద్రయ

ఈ కవి విశ్వబ్రాహ్మణ కులమునకుఁ జెందినవాఁడు. ఈతఁడు బహు గ్రంథకర్త. నిరంకుశోపాఖ్యానమను పేరు గల మహాప్రబంధమును రచించి, కందుకూరి సోమేశ్వరస్వామి కంకితము గావించెను. సుగ్రీవ విజయమను యక్షగానమును గూడ నీతఁడు రచించి, కందుకూరి జనార్దనస్వామి కంకితము గావించెను. కందుకూరి జనార్దనస్వామిపేర నీతఁడొక యష్టకమును గూడ చెప్పియున్నాఁడు.

బలవదరీ దరీకుహరా భాస్వదరీ యదరీ దరీహరీ

అను మకుటముతో నీతఁడొక శతకమును రచించెనని, శతక కవుల చరిత్ర కారులు చెప్పుచున్నారు. ఆ శతకమిప్పుడు లభించుటలేదు. నిరంకుశోపాఖ్యాన గ్రంథాంత గద్యనుబట్టి యీ కవినిగూర్చి క్రింది విషయములు తెలియుచున్నవి—

(1) ఈతఁడు కాళీ భక్తుఁడు.

(2) పెదలింగ నార్యుని కుమారుఁడు.

(3) గురువరాచార్యుని శిష్యుఁడు.

ఈ కవి నివాసము నెల్లూరు మండలములోని కందుకూరు. ఈ కవి కాలమును గూర్చి విమర్శక లోకమున నభిప్రాయ భేదములు కలవు. అష్టదిగ్గజములలో నీతఁడొకఁడను ప్రతీతియుఁ గలదు. రాయల యాస్థానమున ఈశాన్య దిక్కున నుండెడు సింహాసనము నీతఁడధిష్ఠించెడు వాఁడని కొందఱు చెప్పుచున్నారు.

మల్కిభరాము పాదుషా చింతగుంట పాలెమను గ్రామమును రుద్రకవికి దానమిచ్చినట్లు ఒక దాన శాసనము వలన తెలియుచున్నది. శాసన కాలము క్రీ.శ. 1558. ఈ శాసన విషయము నిజమయ్యేనేని, రుద్రయ రాయల యాస్థానమందుండెననుట కెట్టి యభ్యంతరములేదు. శాసనమున శాసనకాలము మాత్రమే కలదుగాని రుద్రయ వయసు చెప్పఁబడలేదు గదా! మఱొక్క విషయము.

రుద్రయ రాయల యాస్థానమున నుండెననుట కితరాధారము లేమియు కానరావు. కొన్ని పుక్కిటి పురాణపు గాథలుమాత్రము గలవు. వానినంతగా విశ్వసించుటకు వీలులేదు. ఇప్పటికి లభించిన యక్షగానములలో రుద్రకవి విరచితమగు సుగ్రీవవిజయమే మొదటిది.

# చింతలపూడి ఎల్లనార్యుఁడు (రాధామాధవ కవి)

ఈతఁడు రాధామాధవము, తారక బ్రహ్మరాజీయము అను రెండు గ్రంథములను రచించి యున్నాఁడు. ఈతఁడు రాయల యాస్థానకవికాఁడు కాని రాయలచే సన్మానింపఁబడినవాఁడు. రాయల యాస్థాన వైభవమును కన్నులారఁజూచి యానందించినవాఁడు. ఈతనికి రాయలు రాధామాధవ బిరుదమిచ్చినట్లు ఈ క్రింది పద్యము చెప్పుచున్నది :

రాధామాధవ మన్యతాంకితముగ బ్రౌఢక్రియం జెప్పి త
న్మాధుర్యంబునఁ గృష్ణరాయవిభు గర్ణాటేశు మెప్పించి నా
నా ధాత్రృ ప్రతిమాన సత్కృపులలోనన్ భూషణశ్రేణితో
రాధామాధవ నామమొందితి జగత్ప్రఖ్యాత చారిత్రుఁడన్.

ఇందు ధాత్రృ ప్రతిమాన శబ్దమున ఆంధ్రకవితా పితామహ బిరుదాంకితుఁడగు అల్లసాని పెద్దన సూచింపఁబడెనని చెప్పవచ్చును.

నగరు, తగరు, తొగరు, పగరు అను పదములను ప్రాసస్థానములందుంచి, రామాయణ, భారత, భాగవత పరములుగా పద్యములు చెప్పుమని యీ కవిని రాయల యాస్థానమందలి కొందఱు పండితులు కోరిరట. పెద్దనయే యట్లు కోరెనని కొందఱి మతము. ఆ సమస్యల నీ క్రిందివిధముగా యెల్లనార్యుఁడు పూరించెనట :

నగరు పగాయెనింక విపినంబుల కేఁగుఁడు రాజ్యకాంక్షికుం
దగరు కుమారులార ! యని తల్లి వగల్మిగులంగఁ దోఁపఁగాఁ
దొగరున రత్నగట్టి మదిఁ దోఁపక గద్గద ఖిన్నకంఠయై
పగరుచుచున్నఁ జూచి రఘువంశ వరేణ్యుఁడు తల్లి కిట్లనున్.

పగరుపుమాత్రమే పరుఁడు వశ్యుఁడుకాఁడు సఖీ సఖిత్వ మె
న్న గరుడవాహనుండు మమునాఁడటు డించుటయెల్ల నుద్ధవా !
తగరని కాక మోహపు లతాతనులైన విడంగఁ జూతురే !
తొగరుచి యోషధీశునకుఁ దోఁపఁగఁ జేయునె పీడనాడగన్.

తొగరుచి కన్నుదోయిఁ గడుఁ దోఁపఁగఁ గర్ణుఁడు భీమసేనుపైఁ
దగరు ధరాధరంబుపయిఁ దాఁకిన భంగిని దాఁకి నొచ్చి తా
పగరుచుచున్ వెసం బరుగువాఱిన నచ్చటి రాజలోకముల్
నగరు సుయోధనాజ్ఞ మది నాటుటఁజేసి ధరాతలేశ్వరా !

ఈతఁడు తన రాధామాధవ కావ్యమును మదన గోపాలస్వామికిఁ గృతి యిచ్చియున్నాఁడు.

కవి రచించిన రెండవ గ్రంథమగు తారక బ్రహ్మరాజీయమును శ్రీరామ చంద్రున కంకిత మొసంగియున్నాఁడు. అచ్యుతరాయలకడ కందాచారమును (Military Accounts) వ్రాయు 'నంజయ్య తిమ్మరుసు' కృతిరచనాప్రేరకుఁడు.

ఎల్లనార్యుఁడు విష్ణుమాయా నాటకమను నొక గ్రంథమును రచించినట్లు విష్ణుమాయా నాటక ముద్రిత ప్రతులనుబట్టి తెలియుచున్నది. కాని యా గ్రంథ మును రాధామాధవ కవి రచింపలేదనియు, మడికి సింగన సోదరుఁడగు 'అనంతయ్య' యనునాతఁడు రచించెననియు కొందఱి వాదము.

ఈ వాద స్థాపకులలో ముఖ్యులగు శ్రీ చాగంటి శేషయ్యగారు తమ యుపపత్తుల నన్నిఁటిని క్రోడీకరించి యీ క్రింది వాక్యములలో చెప్పియున్నారు:

> రాజమహేంద్రపరమున శుకబ్రహ్మచే స్థాపితుఁడైన గోపాలస్వామి యుండెననియు, నా స్వామికిఁ గాటయవేముఁడు కుమారగిరి రెడ్డితోఁ జెప్పి యనపర్తి గ్రామము నిప్పించెననియు ననపర్తి శాసనమువలనఁ దెలియుచున్నది. విష్ణుమాయా నాటకమునఁ బలుతావుల శుకబ్రహ్మయని పేర్కొనుటనుబట్టియు, నా గ్రంథమును గోపాలస్వామి కంకితము చేయుటనుబట్టియు నా కృతికర్త మడికి యనంతయ్యయని నిర్ణయించు టలో నా విశ్వాసము మఱింత దృఢమైనది. అనంతయ్య తండ్రియైన యయ్యల మంత్రి రాజమహేంద్రపురి కధిపతియైన తొయ్యేటి యనవోత భూపాలునికడ మంత్రిగా నుండినట్లు వాసిష్ఠ రామాయణ కృత్యాదియందు సింగనకవి చెప్పియున్నాఁడు. అనంతయ్య తన కృతిని రాజమహేంద్ర పరమందు శుకబ్రహ్మచే స్థాపితుఁడైన గోపాలస్వామి కంకితము చేసె నని నిశ్చయింపవచ్చును.[1]

చింతలపూడి యెల్లనార్యుఁడు విష్ణుమాయా నాటకమును వ్రాయలేదని చెప్పుటయే సంభావ్యముగాఁ గన్పట్టుచున్నయది.

ఈ కవి కాలము క్రీ. శ. 1480–1550 అని తలంచుట సమంజసము.

---

1. ఆంధ్రకవి తరంగిణి. ౭వ సంపుటి. ౧౮౮వ పుట.

# సంకుసాల నృసింహకవి

ఈ కవి కవికర్ణరసాయనమను మహా ప్రబంధమును రచించి, శ్రీరంగ మందలి రంగనాథస్వామి కంకితము చేసియున్నాఁడు. ఈతఁడు రాయల యాస్థానమునఁ బ్రవేశించుటకయి యత్నించెననియు, ఈతని కవితాశక్తికి భయపడి పెద్దనార్యుఁడీతని కాస్థానప్రవేశముఁ గలుగకుండ వారించెననియు, అప్పుడీతఁడు ప్రభువులను, వారి యాస్థాన మర్యాదలను రోసి జగన్నాథుఁడగు శ్రీరంగనాథునకు తన గ్రంథ మంకితమిచ్చెననియు నొక్క కింవదంతి కలదు. దారిద్ర్య భారమును భరింపలేక యీతఁడు తన పద్యముల నమ్ముకొనుచుండె ననియు, కృష్ణదేవరాయల తనయ మోహనాంగి యనునామె అందొక పద్య మును నాల్గువేల వరాలిచ్చి కొనెననియు, నెత్తమాడు సమయమున నామె యా పద్యపాదమును జదువగా, రాయలామెను పద్యమంతయుఁ జదువుమని కోరె ననియు, ఆమె యట్లు పద్యమంతయుఁ జదువగా నాతఁ డందలి సరస కవితా మాధుర్యమున కచ్చెరువొంది, ఆ పద్యమును రచించిన కవి పేరుగూడ తెలిసి కొని యట్టి మహాకవి నిరాశ్రయుఁడయి తిరిగి పోయినందులకు మిక్కుటముగ విచారించెననియు నొక గాథ కలదు.

మోహనాంగి చదివెనని చెప్పఁబడుచున్న పద్యమిది :

ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తిఁ జూచి
తరుణి తను మధ్య మెచటికో దలఁగిపోయె
నుండెనేనియుఁ గనఁబడకున్నె ! యహహ !
యుద్ధతుల మధ్యమునఁ బేదలకుండతరమె ?

రాయలకు మోహనాంగి యను కూఁతురే లేదు గావున యీ కథ కేవ లము కట్టుకథ యని చెప్పనగును. గజపతి కూఁతురుపేరు మోహనాంగియని కొన్ని గ్రంథములయందు చెప్పఁబడియున్నది. ఈ కథయందు చెప్పఁబడిన మోహనాంగి యామె యగునేమో ! ఈ కథ నిజమైనను గాకున్నను నృసింహ కవి గ్రంథమున రాజదూషణము మిక్కుటముగఁ జేయఁబడియున్నది. దానిని బట్టి నృసింహకవికి రాజాస్థాన ప్రవేశ సందర్భమున గొంత నిరాకృతి కలిగి యుండునని మన మూహింపవచ్చును. ఈతఁడు తన గ్రంథమున తన్నుగూర్చి యేమియును జెప్పికొనలేదు. గద్యలో మాత్ర మిట్లున్నది :

ఇది శ్రీ మద్భట్ట పరాశర దేశికేంద్ర చరణ సరసీరుహ సేవకోపసేవక నరసింహ నామధేయ ప్రణీతంబైన కవికర్ణరసాయనంబు.

గ్రంథాంతమున తన పేరును, గ్రంథ నామమును మాత్రము చెప్పి యున్నాఁడు :

కవితా విచక్షణతఁ గల
కవి కంఠ విభూషణముగ గైకొన వలయున్
గవివర నృసింహ విరచిత
కవి కర్ణ రసాయనమను కావ్యము దీనిన్.

కవిస్తుతియందుఁ గూడ పూర్వకవుల నెవ్వరిని పేరువెట్టి స్తుతింపలేదు. కావున నీ కవి కాలనిర్ణయమునకు రెండే యాధారములు గలవు :

1. ముందు చెప్పఁబడిన కట్టుకథ; 2. భట్టపరాశర గురుత్వము.

ఈతని గురువు భట్టపరాశరుఁడని గద్యములో స్పష్టముగా నున్నది. పదునారవ శతాబ్దిలో భట్టపరాశరుఁడను నొక దేశికుఁడున్నట్లు తిరుపతి దేవాలయ మందలి యొక శాసనమును బట్టి తెలియుచున్నది :

> శ్రీ మన్మహారాజాధిరాజ రాజ పరమేశ్వర శ్రీ వీరప్రతాప శ్రీ వీర అచ్యుతరాయ మహారాయలు రాజ్యము చేయుచుండగ శక సంవత్సరములు 1457 అగు మన్మథ సంవత్సర మీనమాస పూర్ణిమనాడు ఉత్తరా నక్షత్రయుక్త సోమవారమున హారితస గోత్రుఁడయిన భట్టపరాశరుని శిష్యుఁడగు మట్ల మల్లయ కుమారుడు రామయ్య యను నాతడు శ్రీ వేంకటేశ్వర స్వామివారికి నాల్గు పందల పణములు సమర్పించి....

అని గలదు. శాసన కాలము క్రీ.శ. 1536. దీనిని బట్టి చూచినచో భట్టపరాశరుఁ డొకఁడు రాయల కాలమున నుండెననుట నిర్వివాదమగు విషయము. ఈతఁడే నృసింహకవి గురువై యుండవచ్చును. మఱియు మీఁద చెప్పఁబడిన కథ యందుఁ గూడఁ గొంత సత్యము కలదని విశ్వసింపవచ్చును.

# సారంగు తమ్మయ

ఈతఁడు వైజయంతీ విలాసము ప్రబంధమును రచించి శ్రీరామచంద్రున కంకిత మిచ్చెను. ఈతని వంశమునకు మూలపురుషుఁడు సారంగధరుఁడను పేరుగల వాఁడఁట. ఆతని పేరిటనే వీరి గృహనామము సారంగు వారైనారు. ఈతఁడు గోలుకొండ కరణముగఁ బనిచేసినట్లీ క్రింది పద్యమును బట్టి తెలియు చున్నది :

ఇన సమతేజులౌ నృపులనెల్ల మహమ్మదుశాహి యేలు నీ
యెనుబదినాల్గు దుర్గముల నేలిన యేలిక గోలకొండఁ ద
ద్ఘన నగరీస్థలిన్ గరణికం బొనరించెడుఁ దమ్మమంత్రి యా
జనపతి రమ్మ పొమ్మనఁ బ్రజల్ జయవెట్ట గృహస్థులౌనన్.

కందాళ అప్పయాచార్యులు తన గురువని యీతఁడు ఈ క్రింది పద్యమునఁ జెప్పికొని యున్నాఁడు :

వందారు దాన జనతా
మందారున్ వేదశాస్త్ర మహిత ప్రజ్ఞా
బృందారక గురు సద్గురు
గందాళప్పల గురున్ జగద్ధితు గొల్తున్.

శ్రీ వీరేశలింగం పంతులుగారు తమ కవుల చరిత్రలో నీ కవి కాల మించు మించుగా పదునారవ శతాబ్ది తుది భాగమును పదునేడవ శతాబ్ది ప్రథమ భాగమునై యుండునని నిర్ణయించి యున్నారు. ఈ నిర్ణయమునకు వారు వచ్చుటకు కారణము మహమ్మదు శాహి కాలము.

మహమ్మదు శాహి యనఁగా 'మహమ్మదు ఖులీ కుతుబ్షా' అని వారు భ్రాంతిపడినారు. ఖులీ కుతుబ్షా కాలమే యించుమించుగా కవి కాలమై యుండునని వారి నిర్ణయము. కాని యీ నిర్ణయమంత సహేతుకముగాఁ గన్పట్టదు.

తమ్మయ తన గురువు కందాళ అప్పలాచార్యులని కృత్యాదియందు చెప్పి యున్నాఁడు కదా! అప్పలాచార్యులు వైష్ణవ మతగురువు. ఈతని శిష్యులలో కృతికర్తలును, కృతిభర్తలును గూడ కలరు. చిత్రభారత కృతిపతియగు యెనుమలపల్లి పెద్దయామాత్యుని తండ్రియుఁ బెదతండ్రియు (మాదయ నారయలు) కందాళ అప్పలాచార్యుల శిష్యులే.

ధర్మనకవి తన చిత్ర భారతము నించుమించుగా క్రీ. శ. 1510 ప్రాంతమున వ్రాసియున్నాఁడు. అప్పలాచార్యులుగూడ పదునారవ శతాబ్ది ప్రారంభమున

నున్నట్లు తిరుపతి దేవస్థానమువారు ప్రకటించిన శాసనములను బట్టి తెలియు చున్నది.[1]

మహమ్మదు శాహి కాలమును ముందే వివరించి యుంటిని. పదునారవ శతాబ్ది ప్రథమ భాగమున నున్న అప్పలాచార్యుల శిష్యుఁడగు సారంగు తమ్మయ మహమ్మదు శాహి కాలమున నుండుననుట కవకాశము లేదు. ఉండినను అతని కానాటి కెనుబది తొంబది యేండ్లుండును. అట్టి వయసున నాతఁడీ ప్రబంధమును నిర్మించెనని చెప్పుటయు సంగతము కాదు. కావున శ్రీ వీరేశలింగం పంతు లూహించిన విషయము సరికాదని చెప్పవచ్చును.

ఇఁక నీ మహమ్మదు శాహి యెవ్వరను ప్రశ్న మిగిలి యున్నది :

ఈతఁడు రెండవ మహమ్మదు షాహ అని సామాన్యముగాఁ జెప్పఁబడు బహమనీ మహమ్మదు షాహ యై యుండును. ఈతఁడు క్రీ.శ. 1481 లో సింహాసనమెక్కి క్రీ.శ. 1518 లోఁ జనిపోయెను. ఈతనికే మీఁది పద్యమునఁ జెప్పఁబడిన యెనుబదినాలుగు దుర్గములపై నధికారముకలదు. ఈతని పరిపాలన కాలముననే తమ్మయకవి గోలుకొండకు కరణముగా నుండి యీ గ్రంథమును రచించి యుండును. మఱొక విషయము.

ఈ మహమ్మదు షానే శ్రీకృష్ణదేవరాయలు చెఱనుండి విడిపించి యున్నాఁడు. మహమ్మదు కులీకుతుబ్షా, కులీకుతుబ్షా మనుమఁడు. ఈ కులీకుతుబ్షా యను నాతఁడు రెండవ మహమ్మదు షా వద్ద సేవకుఁడుగా నుండి తరువాత స్వతంత్రుఁడై వ్యవహరించినాఁడు. బహమనీ రాజ్య మైదు భాగములుగా చీలిన తరువాత యందొక భాగమునకు మాత్ర మీతఁడు ప్రభువయ్యెను. కావున నీతని మనుమఁడగు మహమ్మదు కులీకుతుబ్షా యెనుబది నాలుగు దుర్గములపై నధికారము గలవాఁడనుట సత్యదూరమగు విషయము.

కావున పై పద్యము నందలి మహమ్మదు శాహి రెండవ మహమ్మదు షాయే. ఈతని కాలముననే కందాళ అప్పలాచార్యుఁడును గలఁడు. అతని శిష్యుఁడగు సారంగు తమ్మనయు నీ కాలముననే యుండెననుట సమంజసము.

1. తి. దే. శా. సం. ౪ పుట ౬౫ సంపుటము ౫ పుట ౧౧౫ ; ౩౦౮ ; ౧౧౮

# ఎడపాటి ఎఱ్ఱన

ఈతఁడు మల్హణ చరిత్ర మను శృంగార ప్రబంధమును వ్రాసి చండి కాళయ మంత్రి కంకితము గావించి యున్నాఁడు. కృత్యవతారికను బట్టి యీతఁడు 'ఎడపాడు' అను గ్రామమునకు కరణమైయున్నట్లు తెలియుచున్నది. 'పాటిగలట్టి మేటి యెడపాటి పురాధిప యెఱ్ఱనార్య' అని కృతిపతి యీతనిని సంబోధించి యున్నాఁడు. ఆశ్వాసాంత గద్యమునుబట్టి యీతని తండ్రి పేరు సోమయామాత్యుఁడని తెలియుచున్నది. ఈతఁడు కుమార నైషధమను మఱి యొక ప్రబంధమును రచించినట్లు ప్రబంధరత్నాకరమున జగన్నాథ కవి యిచ్చిన యుదాహరణలను బట్టి తెలియుచున్నది. కాని యా గ్రంథ మిప్పుడు లభించుటలేదు. ఈ కవి మల్హణచరిత్రమును దొలుత కృష్ణరాయల కంకిత మీయఁ దలంచినట్లును, తరువాత నెక్కారణముననో తన మనసు మార్చుకొని చండి కాళయ మంత్రికి గ్రంథము నంకిత మిచ్చినట్లును గృత్యవతారిక యందలి యీ క్రింది పద్యమును బట్టి తెలియుచున్నది :

ఇట్టి మహాప్రధాన పరమేశ్వర మూర్తివి గాన నీవు చే
పట్టితి, మేలు, చండిపురిపాలక ! కాళన మంత్రి చంద్ర ! మున్
గట్టిగఁ గృష్ణరాయజనకాంతున కీయక దాఁచినట్టి యా
రట్టడి యైన యెఱ్ఱకవిరాజిత మల్హణ కావ్యకన్యకన్.

ఈ పద్యమునఁ జెప్పఁబడిన కృష్ణరాయలు సాహితీ సమరాంగణ సార్వ భౌమ బిరుదాంచితుఁడగు శ్రీకృష్ణదేవరాయలే యైనచో నీతఁడు నిస్సంశయ ముగ పదునారవ శతాబ్ది ప్రథమ భాగమున నున్నాఁడని నిర్ణయింప వచ్చును. మల్హణ చరిత్ర పీఠికాకారులీ పద్యమునఁ జెప్పఁబడిన కృష్ణరాయలు నంద్యాల కృష్ణమ రాజగునేమో యని కొంత సందియమును వెలిబుచ్చినారు. నంద్యాల కృష్ణమరాజు లిరువురు గలరు. వారిరువురునుగూడ పదునారవ శతాబ్దివారే (క్రీ. శ. 1500-1560). కావున మీఁది పద్యమందలి కృష్ణరాయలు కృష్ణమ రాజైనను గవి కాలమునఁ బెద్దమార్పు రాదు. మఱొకవిషయము.

శ్రీ ప్రభాకర శాస్త్రిగారు ప్రబంధ రత్నాకరకర్త క్రీ.శ. 1570 ప్రాంతము వాఁడని సోపపత్తికముగ నిరూపించి యున్నారు. అతఁ డెఱ్ఱనకవి గ్రంథముల నుండి పెక్కు పద్యముల నుదాహరించి యున్నాడు. కావున యెఱ్ఱనకవి అంతకుఁ బూర్వుఁడై యుండును గాని తరువాతి వాఁడై యుండుట కవకాశము లేదు. ఎట్లు చూచినను యెఱ్ఱనకవి పదునారవ శతాబ్దికి చెందిన వాఁడనియే తోచుచున్నది.

# తఱిగొండ ధర్మన

ఈతఁడు చిత్రభారతమను ప్రబంధమును రచించినాఁడు. ఈ గ్రంథ కృతిభర్త యెనుములపల్లి పెద్దయామాత్యుఁడు. ఈ పెద్దయామాత్యుఁడు 'చిత్తాంబుఖాను' అను వానికడ మంత్రిగా నున్నట్లు

> మించి చిత్తాంబుఖాన భూమీ మహేంద్ర సకల సామ్రాజ్య లక్ష్మీ
> విశారదుండు

అను కృత్యవతారిక యందలి వాక్యమునుబట్టి తెలియుచున్నది. ఈ చిత్తాంబుఖాను కాలమును దెలిసికొన్నచో కృతిభర్త కాలమును, దానినిబట్టి కృతికర్త కాలమును దెలియగలవు. ఈతని గూర్చి మూఁడు కైఫీయతులలో వ్రాయఁబడి యున్నది. మొదటిది కిమ్మూరు కైఫీయతు. రెండవది యేకశిలానగర కైఫీయతు. మూఁడవదాని కెట్టి పేరునులేదు. ఈ మూఁడు కైఫీయతుల యందును చెప్పఁబడిన విషయములు పరస్పర విరుద్ధములుగ నున్నవి. కావున నిందలి విషయములన్నియు యథార్థములని నమ్ముటకు వీలులేదు. ఇతరాధారములుగూడ వీనితో సమ్మతించినప్పుడు మాత్రమే వీనిని సత్యములని యంగీకరింపనగును.

ఒకటి రెండు విషయములందు మాత్రము కైఫీయతులు మూఁడును నేకీభవించుచున్నవి. చితాబుఖానుఁడు హీనకుల జాతుఁడు. చిన్నతనమందు "అవసరాల పెద్దిరాజు' అను వానివద్ద పసులకాపరిగా నుండెడివాఁడు. అప్పుడు వీనిపేరు సీతఁడు. పొలములో నిద్రించుచున్న సీతనిపయి సూర్యరశ్మి సోకకుండ పాము పడగవిప్పి యాడుచుండుట ఒకనాడు పెద్దిరాజు కంటఁబడెను. దానినిబట్టి సీతని భావిభాగ్యోదయము పెద్దిరాజూహించి, వానికి చదువుసాములు నేర్పెను. సీతఁడు పెరిగి పెద్దవాఁడై క్రమక్రమముగా దుర్గాధ్యక్షుఁడయ్యెను. ఒక కైఫీయత్తున చితాబుఖాను మహమ్మదీయ మతమును గైకొనినట్లు వ్రాయఁబడి యున్నది. కాని యది యంగీకరింపవలసిన విషయముకాదు. చిత్రభారతమున చితాబుఖానుని గూర్చి వ్రాయఁబడిన పద్యములనుబట్టి యాతఁడాజన్మాంతము హైందవ మతావలంబియే యని స్పష్టముగా తెలియుచున్నది.

> ఇందు శేఖర పాదారవింద యుగళ భావనాపరుఁడు

అని చితాబుఖానుఁడిందు కీర్తింపఁబడి యున్నాఁడు. మహమ్మదీయ మతావలంబియే యైనచో శివునియెడ భక్తిప్రపత్తు లుండవుగదా ! ఇందే యాతని గూర్చి "భోగివంశాబ్ధి చంద్రుఁ" డనియుఁ, "భోగివంశపయః పారావారరాకా సుధాకరుఁ" డనియుఁ జెప్పఁబడియున్నది. కావున సీతని యింటిపేరు భోగివారై

యుండును. కిమ్మూరు కైఫీయతులో నీతఁడు బోయికులమున జన్మించినట్లు గలదు.

శ్రీకృష్ణదేవరాయలు కళింగ దేశముపయి దండెత్తి పోవునపుడు గోదావరీతీర కాంతారములందీ చితాబుఖానుఁడే రాయల నడ్డగించి, ఘోర యుద్ధము గావించి తుదకు పరాజితుఁ డయినాఁడు. ఈ విషయము కృష్ణరాయవిజయమున నీ క్రింది పద్యములలో చెప్పఁబడి యున్నది :

చనుచోఁ జితాపుఖానుం
డనువాఁడు ధరాధరాంతరాంతరసీమన్
గనుమలలో నఱువదివేల్
ఘనశార్ఙ్గధరుల్ చెలంగఁ గలహ మొనర్పన్.

నాలుగుదిక్కులం గినిసి నట్టడవిం జరియించు నచ్చు మూ
పాళి గలంగ బల్లెముల బాణములన్ మెఱుగీటె గుంపులన్
రాలఁ దుపాకులం బలుఫిరంగుల భంగము నొందఁజేసి గ
గ్గోలు పడం గడంగి యెలగోలు బలంబు చలం బెలర్పఁగన్.

ఈ పద్యములనుబట్టి చితాబుఖానుఁడు గోదావరీ మండల ప్రాంతమందలి మన్నెదేశముల నేలుచు గజపతులకు సామంతుఁడయి యుండెనని నిశ్చయింప నగును.

చితాబుఖానుఁడు ఏకశిలా నగరమువఱకుగల దేశమంతయు జయించి నట్లొక శాసనమునుబట్టి తెలియుచున్నది. డాక్టరు హీరానంద శాస్త్రిగారు యుపోద్ఘాతముతో నా శాసనమును హైదరాబాదు శాసన శాఖవారు ప్రకటించిరి. శాసనమంతయు సంస్కృతమున వ్రాయఁబడియున్నది. శాసనకాలముమాత్రము తెలుఁగునఁ గలదు. క్రీ. శ. 1503 శాసనకాలము (శక వర్షములు 1425). శ్రీకృష్ణదేవరాయలు గజపతిని జయించి, పొట్నూరుకడ జయస్తంభమును స్థాపించిన కాలము క్రీ. శ. 1516 అని చరిత్రకారులు పలువు రంగీకరించి యున్నారు. కావున యీ రెండు విషయములును పరీక్షించి చూచినచో, చితాబుఖానుఁడు రాయలకాలమున నుండెనని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఏకశిలా నగరమున జయస్తంభము నాటుసరికి చితాబుఖానున కించుమించుగ నలుబదియైదేండ్లుండునని యెంచినచో, రాయలపై దాడి వెడలునాటి కించుమించుగ నఱువదియేండ్ల యీడువాఁడగును. ఆనాటివారి శరీర పాటవమునుబట్టి పరిశీలించినచో నదియొక పెద్ద యీడు కాదు.

ఈ శాసనమున చితాబుఖానునిగూర్చి మఱికొన్ని విషయములు తెలియుచున్నవి. ఈతని తాత పేరు నాగయ. నాగయ కుమారుఁడు మానయ. మానయకు

గౌరాంబయను భార్యయందు చితాబుఖానుఁడు జనించెను. చితాబుఖానున కిరువురు భార్యలు గలరు. మొదటియామెపేరు దేవాంబిక. రెండవ యామె పేరు అనుమాంబ. దేవాంబికయందు చితాబుఖానున కిరువురు కుమారులు జన్మించిరి. మొదటివాఁడు అవధూతఖాను. రెండవవాఁడు పురాంతకుఁడు. అనుమాంబ యందీతనికి అమరయ్య, భోగయ్య, రామయ్య అను మువ్వురు కుమారులు కలిగిరి. అవధూతఖానుఁడు శాసనకాలమునకుఁ బూర్వమే రణ రంగమున నిహతుఁడయ్యెను.

అద్దంకి గంగాధర కవి రచించిన తపతీసంవరణోపాఖ్యానమున గూడ చితాబుఖానునకు సంబంధించిన కొన్ని విషయములు గలవు. గ్రంథ కృతిపతి యైన ఇబ్రహిం పాదుషా తండ్రి యగు కులీకుతుబ్షా చితాబుఖానుని జయించినట్లా గ్రంథమునఁ జెప్పఁబడి యున్నది. కులీకుతుబ్షా క్రీ.శ. 1512 వ సంవత్సరము నుండి 1543 వఱకును గోలుకొండ నవాబుగా రాజ్యమేలెను. ఈ విషయములను బట్టి చూచినను చితాబుఖానుఁడు రాయల కాలమున నుండెననుట నిర్వివాదమగు విషయము.

చితాబుఖానుఁ డోరుగల్లును జయించి, అందు మహోన్నత పదవియం దున్నప్పుడే, చిత్రభారతము రచింపఁబడెనని చెప్పవచ్చును. శ్రీకృష్ణదేవరాయలు క్రీ.శ. 1515 వ సంవత్సరమున గజపతులను జయించి, కొండపల్లి దుర్గమును కంభముమెట్టను తన స్వాధీనము చేసికొనినట్లు తిరుపతి శాసనమునఁ జెప్పఁబడి యున్నది. కావున నాటికి ఓరుగల్లును, తత్పరిసర ప్రాంతములును చితాబు ఖానుని స్వాధీనమున లేవని నిర్ణయింపవచ్చును.

పై చర్చవలన తేలిన సారాంశమిది :

చితాబుఖానుఁ డోరుగల్లున వైభవోపేతుఁడయి యున్నప్పుడే చిత్రభార తము రచింపఁబడెను. ఆకాలము ఇంచుమించుగా క్రీ. శ. 1503 వ సంవత్స రము నుండి 1512 వఱకునై యుండును. ఈకాలము కృతిపతి తండ్రియైన మాదయకు గురువగు కందాళ అప్పలాచార్యుని కాలముతో గూడ సరిపోవు చున్నది.•

• వివాదగ్రస్తములగు కవికాలాదులు మాత్రమే యిందుఁ జూపఁబడినవి. ఇది కవుల చరిత్ర కాదు. కావున నిందుఁ బేర్కొనఁబడిన కవులందఱినిగూర్చియు వ్రాయలేదు.

# ఉదాహృత గ్రంథములు


| గ్రంథము పేరు | గ్రంథకర్త పేరు |
| --- | --- |
| అగ్నిపురాణము | |
| అచలాత్మజా పరిణయము | తిరుమల వేంకటాచార్యులు |
| అచ్యుత రాయాభ్యుదయము | రఘునాథ నాయకుఁడు |
| అప్పకవీయము | కాకునూరి అప్పకవి |
| అభిజ్ఞాన శాకుంతల వ్యాఖ్య | శ్రీనివాసాచార్యులు |
| ఆంధ్ర కవుల చరిత్ర | కందుకూరి వీరేశలింగము పంతులుగారు |
| ఆంధ్ర మహాభాగవతము | బమ్మెర పోతనామాత్యుఁడు |
| ఆంధ్ర మహాభారతము | కవిత్రయము |
| ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలు | |
| ఆముక్తమాల్యద | శ్రీ కృష్ణదేవరాయలు |
| ఉత్తరరామాయణము | కంకంటి పాపరాజు |
| ఉత్తర హరివంశము | నాచన సోమన |
| ఉద్భటారాధ్య చరిత్ర | తెనాలి రామకృష్ణకవి |
| ఎపిగ్రాఫికా ఇండికా సంపుటములు | |
| కకుత్స్థ విజయము | మట్ల అనంతభూపాలుఁడు |
| కర్పూరమంజరి | రాజశేఖరుఁడు |
| కవికర్ణ రసాయనము | సంకుసాల నృసింహకవి |
| కవిజనరంజనము | అడిదము సూరకవి |
| కవిజీవితములు | గురుజాడ శ్రీరామమూర్తిగారు |
| కవిరాజ మనోరంజనము | కనుపర్తి అబ్బయామాత్యుఁడు |
| కళాపూర్ణోదయము | పింగళి సూరనార్యుఁడు |
| కృష్ణరాయ విజయము | కుమార ధూర్జటి |
| కావ్యప్రకాశము | మమ్మటుఁడు |
| కావ్యమీమాంస | రాజశేఖరుఁడు |
| కావ్యాదర్శము | దండి |
| కావ్యాలంకార చూడామణి | విన్నకోట పెద్దన |
| కావ్యాలంకారసార సంగ్రహము | ఉద్భటుఁడు |
| కావ్యాలంకార సూత్రవృత్తి | వామనుఁడు |
| కాశీఖండము | శ్రీనాథుఁడు |

| గ్రంథము పేరు | గ్రంథకర్త పేరు |
|---|---|
| కాళహస్తి మాహాత్మ్యము | ధూర్జటికవి |
| కాళహస్తి మాహాత్మ్యము | లింగరాజకవి |
| క్రీడాభిరామము | శ్రీనాథుఁడు |
| కుమారసంభవము | నన్నెచోడుఁడు |
| కుచేలోపాఖ్యానము | గట్టు ప్రభువు |
| కువలయాశ్వ చరిత్రము | నవరము చిననారాయణనాయకుఁడు |
| కేయూరబాహు చరిత్ర | మంచన |
| కౌసల్యా పరిణయము | వావిలకొలను సుబ్బారావుగారు |
| ఘుటికాచల మాహాత్మ్యము | తెనాలి రామకృష్ణకవి |
| చంద్రభాను చరిత్రము | తరిగొప్పుల మల్లన |
| చిత్ర భారతము | తఱిగొండ ధర్మన |
| జైమిని భారతము | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు |
| తపతీ సంవరణోపాఖ్యానము | అద్దంకి గంగాధరకవి |
| తారాశశాంకము | శేషము వేంకటపతి |
| తిరుపతి దేవస్థానమువారి శాసన సంపుటములు | |
| తుక్కా పంచకము | తుక్కాదేవి |
| దశకుమార చరిత్ర | కేతన |
| దశరూపకము | ధనంజయుఁడు |
| దక్షిణ హిందూదేశ శాసన సంపుటములు | |
| దేవవ్రత చరిత్రము | మేదేపల్లి వేంకటరమణాచార్యులుగారు |
| ధ్వన్యాలోకము | ఆనందవర్ధనుఁడు |
| ధ్వన్యాలోకలోచనము | అభినవగుప్తుఁడు |
| నరసభూపాలీయము | రామరాజభూషణుఁడు |
| నవనాథ చరిత్ర | గౌరన |
| నృసింహ పురాణము | ఎఱ్ఱాప్రెగ్గడ |
| నాగర ఖండము | తురగా రామకవి — అయ్యంకి బాలసరస్వతి |
| నాట్యశాస్త్రము | భరతుఁడు |
| నాసికేతోపాఖ్యానము | దగ్గుబల్లి దుగ్గన |
| నిరంకుశోపాఖ్యానము | కందుకూరి రుద్రయ |
| నిర్వచనోత్తర రామాయణము | తిక్కన |

| గ్రంథము పేరు | గ్రంథకర్త పేరు |
| --- | --- |
| నిరోష్ఠ్య నిర్వచన నైషధము | కందుకూరి వీరేశలింగముగారు |
| నైషధము | శ్రీహర్షుడు |
| పంచతంత్రము | దూబగుంట నారాయణకవి |
| పండితారాధ్య చరిత్ర | పాల్కురికి సోమనాథుడు |
| పలనాటి వీరచరితము | వీరభద్రకవి |
| పాండురంగ మాహాత్మ్యము | తెనాలి రామకృష్ణుడు |
| పాణిగృహీత | తిరుపతి వేంకటేశ్వరకవులు |
| పారిజాతాపహరణము | ముక్కు తిమ్మన |
| ప్రతాపరుద్రీయము | విద్యానాథుడు |
| ప్రబోధ చంద్రోదయము | నంది మల్లన – ఘంట సింగయ |
| ప్రబోధ చంద్రోదయ వ్యాఖ్య-చంద్రిక | నాదెండ్ల గోపనమంత్రి |
| ప్రభావతీప్రద్యుమ్నము | పింగళి సూరనార్యుడు |
| ప్రభాస శాప విమోచనము | సెట్టి లక్ష్మీనరసింహముగారు |
| బహుళాశ్వ చరిత్రము | దామెర్ల వెంగళనాయకుడు |
| బిల్వేశ్వరీయము | కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు |
| బేతాళ పంచ వింశతి | పోతరాజు |
| బ్రహ్మవైవర్త పురాణము | వేంకటకవి |
| భరతాభ్యుదయము | మాడభూషి వేంకటాచార్యులుగారు |
| భామహాలంకారము | భామహుడు |
| భారతి సంపుటములు | |
| భీమేశ్వర పురాణము | శ్రీనాథుడు |
| భోజరాజీయము | అనంతామాత్యుడు |
| మనుచరిత్రము | అల్లసాని పెద్దన |
| మహమ్మదీయ మహాయుగము | కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు |
| మార్కండేయ పురాణము | మారనకవి |
| మైసూరు వంశావళి | స్యూయెల్ పండితుడు |
| మొల్ల రామాయణము | (కుమ్మరి) ఆతుకూరి మొల్ల |
| యయాతి చరిత్ర | పొన్నగంటి తెలగనార్యుడు |
| యాదవరాఘవ పాండవీయము | ఎలకూచి బాలసరస్వతి |
| యాదవరాఘవ పాండవీయము | అయ్యగారి వీరభద్రకవి |
| రఘునాథాభ్యుదయము (ద్విపద) | విజయరాఘవనాయకుడు |
| రంగరాయ చరిత్రము | దిట్టకవి నారాయణకవి |

| గ్రంథము పేరు | గ్రంథకర్త పేరు |
|---|---|
| రత్నావళీ పరిణయము | వేంకటపతి |
| రసగంగాధరము | జగన్నాథపండితుఁడు |
| రసతరంగిణి | భానుదత్తుఁడు |
| రసికజనమనోభిరామము | కూచిమంచి తిమ్మకవి |
| రసికజనమనోరంజనము | కందుకూరి వీరేశలింగముగారు |
| రాఘవ పాండవీయము | పింగళి సూరనార్యుఁడు |
| రాజశేఖర చరిత్రము | మాదయగారి మల్లన |
| రాధాకృష్ణ సంవాదము | మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు |
| రాధామాధవము | చింతలపూడి ఎల్లనార్యుఁడు |
| రాధికా సాంత్వనము | ముద్దుపళని |
| రామకృష్ణార్జునరూప నారాయణీయము | ఓరుగంటి సోమశేఖరకవి |
| రామరాజీయము | అందుగుల వెంకయ్య |
| రామాభ్యుదయము | అయ్యలరాజు రామభద్రుఁడు |
| రాయవాచకము | విశ్వనాథరాయనిస్థానాపతి |
| రావణదమ్మీయము | పిండిప్రోలు లక్ష్మణకవి |
| రుద్రటాలంకారము | రుద్రటుఁడు |
| రెట్టమతశాస్త్రము | అయ్యల భాస్కర కవులు |
| వక్రోక్తి జీవితము | కుంతకుఁడు |
| వరాహ పురాణము | నంది మల్లన - ఘంట సింగయ |
| వసుచరిత్రము | రామరాజభూషణుఁడు |
| వాల్మీకి చరిత్ర | రఘునాథరాయలు |
| విక్రమార్క చరిత్ర | జక్కన |
| విజయనగర సామ్రాజ్యమందలి యాంధ్ర వాఙ్మయ చరిత్రము | చేకుమళ్ల అచ్యుతరావుగారు |
| విజయవిలాసము | చేమకూర వేంకటకవి |
| విప్రనారాయణ చరిత్రము | చెదలువాడ మల్లన |
| విష్ణుపురాణము | వెన్నెలకంటి సూరనార్యుఁడు |
| వీరసింహుఁడు | వఝుల చినసీతారామస్వామిశాస్త్రిగారు |
| వైజయంతీ విలాసము | సారంగు తమ్మయ |
| శృంగార నైషధము | శ్రీనాథుఁడు |
| శృంగార నైషధ పారిజాతము | కృష్ణాధ్వరి |
| శృంగార మల్హణ చరిత్రము | ఎడపాటి ఎఱ్ఱన |
| శృంగారరాధామాధవము | వెలిదిండ్ల వేంకటపతి |

| గ్రంథము పేరు | గ్రంథకర్త పేరు |
| --- | --- |
| శృంగార శాకుంతలము | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు |
| శృంగార సావిత్రి | రఘునాథరాయలు |
| శ్రవణానందము | తిరుపతి వేంకటేశ్వర కవులు |
| శివరహస్య సంగ్రహము | |
| సకల కథాసార సంగ్రహము | రామభద్రకవి |
| సత్యభామా సాంత్వనము | లింగనమఖి కామేశ్వరకవి |
| సమీరకుమార విజయము | పుష్పగిరి తిమ్మన |
| స్కాంద పురాణము | కోడూరు వేంకటాచలకవి |
| సారంగధర చరిత్రము | చేమకూర వేంకటకవి |
| సాహిత్య దర్పణము | విశ్వనాథుఁడు |
| సౌందరనందము | లక్ష్మీకాంత వేంకటేశ్వర కవులు |
| హంస వింశతి | నారాయణామాత్యుఁడు |
| హరవిలాసము | శ్రీనాథుఁడు |
| హరివంశము | ఎఱ్ఱా ప్రెగ్గడ |
| హరిశ్చంద్ర నలోపాఖ్యానము | రామరాజభూషణుఁడు |
| హరిశ్చంద్రోపాఖ్యానము | గౌరన |
| హరిశ్చంద్రోపాఖ్యానము | శంకరకవి |
| హైదరాబాదు శాసనములు | |
| Further Sources of Vijayanagara Empire | Dr. N. Venkataramanayya, Prof. K. A. Nilakantasastry |